# అర్ధశతాబ్ది - ఆంధ్రనా

ప్రథమార్ధం

పద్మశ్రీ
డాక్టర్ నటరాజ రామకృష్ణ

# అర్ధశతాబ్ది - ఆంధ్రనా

ప్రథమార్ధం

పద్మశ్రీ

డాక్టర్ నటరాజ రామకృష్ణ

ప్రథమ ముద్రణ : ఆగస్టు 1993

ప్రతులు : 1000

హక్కులు : రచయితవి

మూల్యం : రూ. 200/-

విదేశాలకు : 60 Dollars

ముద్రణ :

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
1.1.517/బి/1, న్యూ బాకారం
గాంధీనగర్, హైద్రాబాద్ - 500 380
ఫోన్ : 7611413

# శ్రీ వేమూరి సుందరరామయ్యగారు
## చైర్మన్, వేణుగోపాలస్వామి దేవస్థానం ట్రస్టు బోర్డు, మొవ్వ

కృష్ణా జిల్లా మొవ్వపురి వాస్తవ్యులైన పుణ్యదంపతులు శ్రీ వేమూరి వేంకటరామయ్య, కోటమ్మగార్ల ద్వితీయ పుత్రుడుగా శ్రీ సుందరరామయ్యగారు తే 5-8-1939 దీన శుభ గడియలలో జన్మించారు.

శ్రీ సుందరరామయ్యగారు ఎస్.ఎస్.ఎల్.సి.లో ఉత్తీర్ణులై, గుంటూరు జిల్లా, సత్తెనపల్లెలోని భూమి తనఖా బ్యాంక్‌లో కో ఆపరేటివ్ సూపర్‌వైజర్‌గా ఆరు సంవత్సరాలు పనిచేశారు. తర్వాత జీవిత భీమా సంస్థలో డెవెలెప్‌మెంటు అధికారిగా కొన్నాళ్ళు పనిచేసిన తర్వాత తమ దృష్టిని వ్యాపారం మీదకు మళ్ళించారు.

శ్రీ సుందరరామయ్యగారు ప్రగతి ట్రాన్స్‌పోర్టు కంపెనీని మణుగూరులో నెలకొల్పి, ఆంధ్రప్రదేశ్ లోని హైదరాబాదు, విశాఖపట్నం, విజయవాడ, రాజమండ్రి, పాలవంచ, కొత్తగూడెం, ఇల్లెందు, మేదరమెట్ల, ఒంగోలు, టంగుటూరు, చీమకుర్తి, ద్రోణాచలం, పులివెందల మొదలైన పట్నాలలోనే కాక కర్ణాటక రాష్ట్రం లోని హుబ్లీ మొదలైన కేంద్రాలలోనూ ఈ సంస్థకు శాఖలు నెలకొల్పారు.

మణుగూరులో వెలసిన పరమ శివుని దయవల్ల వీరి వ్యాపారం అభివృద్ధి చెందినందుకు ఆ దేవునికి కానుకగా కాకతీయులనాటి ఆ శివాలయంలో ధ్వజస్థంభాన్ని ప్రతిష్ఠించడమేకాక కల్యాణ మంటపాన్ని గూడ శ్రీ సుందరరామయ్యగారు నిర్మించారు.

తమ జన్మస్థలమైన మొవ్వపురిలోని శివాలయంలో గూడ ధ్వజ స్థంభాన్ని పునఃప్రతిష్ఠించి, అక్కడి మొవ్వగోపాలునికి అంకితంగా ఒక కల్యాణ మంటపాన్ని నిర్మించడానికి స్థలాన్ని సేకరించారు.

అనేక పుణ్య కార్యాలను నిర్వహిస్తూ, అనేకులకు అనేక విధాలుగా సహాయపడుతున్న మానవతా మూర్తులైన శ్రీ సుందరరామయ్యగారు, వారి అర్ధాంగి శ్రీమతి ప్రమీలారాణిగారు ధన్యులు.

వీరివలెనే వీరి కుమార్తెలు శ్రీమతులు వీరమాచనేని రాజ్యలక్ష్మి, నార్ల విజయలక్ష్మి; అల్లుళ్ళు శ్రీయుతులు వీరమాచనేని అచ్యుతరావు, నార్ల వేంకటేశ్వరరావుగార్లు దైవభక్తులు, ధర్మదాతలు.






మొవ్వలో 4-2-1990న శివాలయ ధ్వజ స్తంభ ప్రతిష్ట సమయంలో శ్రీ వి. సుందరరామయ్య దంపతుల పూజ కార్యక్రమం

# ప్రారంభం

గత కొన్ని సంవత్సరాలుగా నా మిత్రులు, హితులు, సన్నిహితులు, అభిమానులు, ఆత్మీయులు నా జీవితచరిత్ర వ్రాయమని కోరుతూవచ్చారు. నా జీవితం 'ఆంధ్ర నాట్యం'తో ముడివడి యున్నందున 'ఆంధ్ర నాట్య' కళా చరిత్రనే వ్రాయాలని సంకల్పించుకొన్నాను.

గత 45 సంవత్సరాలలో నేను పర్యటించిన ప్రాంతాలు, ప్రదేశాలు, నేను కలుసుకొన్న కళాకారులు, కవులు, పండితులు, శాస్త్రవేత్తలు, వారిద్వారా నేను తెలుసుకొన్న విషయాలు, నేర్చుకొన్న పాఠాలు, అనుభవాలు, అనుభూతులు మొదలైనవన్నీ చేర్చితే 'ఆంధ్ర నాట్యం' చరిత్ర; అదే నా జీవిత చరిత్ర.

అర్ధశతాబ్ది క్రితంనాటి మన దేశం వేరు, ఈనాటి మన దేశం వేరు. మానవునిలో మాధవుణ్ణి దర్శించాలని, లోకంలో మంచినే చూడాలని నేను నా చిన్నతనంలో రామకృష్ణ మఠంలో నేర్చుకొన్నాను. అందువల్ల నాకు ఎక్కడ, ఏం చూసినా మంచే కనిపించింది.

నృత్యకళ పవిత్రమైనదని భావించాను. ఆంధ్రుల నృత్యకళ చాలా ఉన్నతమైనదని గ్రహించాను. కళాకారుల హృదయాలను, ఆదర్శాలను అర్థం చేసుకొన్నాను.

మన దేశంలో నృత్యాన్ని చూడ్డం పెద్ద తప్పుగా, నృత్యం చేయడం మహా పాపంగా భావిస్తూండిన రోజుల్లో నేను నృత్య కళ పైని ఉపన్యాసాలు ఇచ్చాను. అభినయ పూర్వక ప్రసంగాలు చేశాను. పత్రికల్లో వ్యాసాలు వ్రాశాను. ఈ కళ యొక్క పవిత్రతను చాటి చెప్పాను. మన జాతి సంస్కృతిలో నాట్య కళకు గల విశిష్ట స్థానం గురించి ప్రజలకు తెలియ చేశాను. విశ్వవిద్యాలయాలలో, కళాశాలలలో, పాఠశాలల్లో, సాధారణ సభలలో, పండిత సభలలో, మహిళా సభలలో, లైన్స్ క్లబ్బులలో, రోటరీ క్లబ్బులలో - ఇలా ఇక్కడా, అక్కడా అంటూ లేకుండా ఎవరు ఆహ్వానిస్తే అక్కడ నాట్యకళను ప్రచారం చేశాను.

ఆంధ్రుల నృత్యకళకు మళ్ళీ పూర్వవైభవం చేకూర్చాలని తపించాను. అందుకోసం తపస్సు చేశాను. తుదకు నా తపస్సు ఫలించిందని, నేను తరించానని విశ్వసిస్తున్నాను. ఒకరి మెప్పుకోసం నేను ఈ కార్యం చేయలేదు. ఆంధ్రుడనై పుట్టినందుకు ఆంధ్ర నృత్య సరస్వతికి సేవ చేయాలన్న సంకల్పంతోనే ఈ కార్యం చేపట్టాను. ఆనాడు నా ఉపన్యాసాలు విన్నవారు, నా అభినయ ప్రదర్శనలు చూసినవారు నేడు వారి అప్పటి అనుభూతుల్ని నా వద్ద ముచ్చటిస్తూంటే నా కృషి ఫలించిందన్న ఆత్మతృప్తి నాకు కలుగుతూ ఉంటుంది. గడిచిన అర్ధశతాబ్ది కాలంలో పదివేలకు పైగా నేను అభినయ పూర్వక ప్రసంగాలు నాట్యకళ పైని చేశాను. పదిలక్షల మందైనా వాటిని విని ఉంటారు. ఒక లక్షమందైనా నాట్యం నేర్చుకొని ఉంటారు. ఇది చాలు - నా జన్మ ధన్యమైందని నేను తృప్తిచెందడానికి.

గత అర్ధశతాబ్ది కాలంలో ఈ నృత్యకళ ద్వారా ఎంతో సంపాదించాను. అంతా ఆ కళకోసమే వెచ్చించాను. నేనేమీ మిగుల్చుకోలేదు, కూడబెట్టలేదు. ఎవరికోసం, ఎందుకోసం కూడబెట్టాలి? ఏ నృత్య సరస్వతి నన్ను కరుణించి, నాకు సర్వాన్ని సమకూర్చిందో ఆ నృత్య సరస్వతికే నా సర్వస్వాన్ని ఇచ్చివేయదలచుకొన్నాను. అనాథలకు అన్నవస్త్రాల నిచ్చాను. పేద బాల బాలికలను చేరదీసి, అన్నవస్త్రాలిచ్చి ఉచితంగా నాట్యవిద్య నేర్పాను. చిందు హరిజన కళాకారుల పిల్లలకేకాక, ఛాందస

వైదిక బ్రాహ్మణ కుటుంబాల బాలబాలికలకే కాక, ముస్లిం, క్రైస్తవ బాలబాలికలకు, ఫ్రాన్స్, ఇంగ్లండ్, అమెరికా మొదలైన విదేశాలకు చెందిన బాలబాలికలకు గూడ విచక్షణారహితంగా నాట్యవిద్య చెప్పాను. మొదటి గిరిజన బంజార యువకునకు, మొదటి హరిజన యువతికి ఉచితంగా నాట్యం నేర్పి, విదేశపర్యటనకు వారికి అవకాశం కల్పించాను. ఇది నా స్వభావమే కాదు, నా జీవిత ధర్మంగా భావించాను.

ఈ ప్రథమార్థంలో స్త్రీ కళామూర్తులు ప్రదర్శించిన లాస్యనర్తనం గురించి మాత్రమే వ్రాశాను. పురుష కళామూర్తులు ప్రదర్శించిన తాండవం గురించి, ముఖ్యంగా అపురూపమైన సాంప్రదాయ వ్యాఖ్యానం గురించి ద్వితీయార్థంలో వ్రాయదలచాను. దీనితో ఆంధ్రుల సంపూర్ణ నృత్యకళ గురించి లోకానికి తెలుస్తుంది. మన నృత్యకళా చరిత్రలో మనం గుర్తుంచుకోవలసి విషయం ఒకటుంది. ఆలయాల్లో లాస్య నర్తనం నిషేధింపబడిన తర్వాత భరత శాస్త్రానుసారం లాస్యవర్తనాన్ని అభ్యసించి, ప్రదర్శించిన తొలి బాల నర్తకి కుమారి నాళం అమృతం. ఆమె ఉన్నత కుటుంబానికి చెందినవారు.

గత అర్ధశతాబ్ది కాలంనుండి మన నృత్యకళ చరిత్ర వ్రాస్తూ వచ్చాను. దానిలో కొంత నా యితర రచనల్లో చోటు చేసుకొంది, కొంత చౌర్యమయింది. అందువల్ల మళ్ళీ వ్రాయడానికి ఉపక్రమించాను. వ్రాస్తుంటే ఇది యొక చిన్న గ్రంథంగా ముగించలేనని తెలుసుకొన్నాను కనుక, ఈ గ్రంథాన్ని మొదటి భాగంగా ముగించాను.

నా దగ్గర ఇంకా ఎన్నో ఛాయా చిత్రా లున్నాయి, రేఖా చిత్రా లున్నాయి. వీటన్నింటిని కలిపి సంప్రదాయ వ్యాఖ్యానం వ్రాయాలన్న సంకల్పం నాలో ఉంది. త్వరలోనే వ్రాసి, ప్రకటించగలనన్న ఆశా ఉంది. ఇది చాలా వ్యయంతో కూడుకొన్న కార్యం. అందువల్ల ఏ విశ్వవిద్యాలయంవారైనా కోరితే వారికి వ్రాసి ఇవ్వగలను.

శ్రీ మండవ నాగేశ్వరావుగారి ద్వారా మొవ్వపురివాసి, నృత్యకళాపిపాసి, శ్రీ వి. సుందరరామయ్యగారు నాకు పరిచయమయ్యారు. వారు మాటల సందర్భంలో నాకు ఒక చెక్కు వ్రాసిచ్చి, మన జాతి చరిత్రకు సంబంధించిన నృత్యకళా చరిత్రను వ్రాయమని కోరారు. చరిత్రకారులు, శాసన పరిశోధకులు, నా మిత్రులు శ్రీ బి. ఎన్. శాస్త్రిగారు నేను ఏదైనా ఒక మంచి గ్రంథం వ్రాస్తే దాన్ని అచ్చువేయిస్తామన్నారు. ఈ రెండు సంఘటనలు కాకతాళీయంగా జరిగాయి. వాటి ఫలితమే ఈ గ్రంథరచన - ప్రచురణ.

శ్రీ రమణం శ్రీరాములుగారి, ప్రోత్సాహం నాకెప్పుడూ ఉండనే ఉంది. ఇంకా మరెందరో ఈ రచనను ప్రోత్సహించారు. వీరందరికి నా కృతజ్ఞతాంజలులు.

ఎందరో కళాకారులు, కళామతల్లులు వారి నృత్య అనుభవాలను నాకు చెప్పారు. సందర్భానుసారంగా వాటిని ఈ గ్రంథంలో ఉటంకించాను. వారందరికి నా హృదయపూర్వక నృత్యకుసుమాంజలులు.

ఆంధ్ర నాట్యం చరిత్రలో, అంటే నా జీవితచరిత్రలో ఇది మొదటి భాగం. ఇంక రెండవ భాగం పూర్తిచేస్తే సంపూర్ణ ఆంధ్రనాట్యకళా చరిత్రను లోకానికి అందజేయకలుగుతాను. అందచేయాలన్నదే నా ఆశయం.

ఈ గ్రంథాన్ని ముద్రించిన శ్రీ పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ యజమాని శ్రీ శ్రీనివాస్‌గారికి; ఈ గ్రంథ రచన, ప్రచురణలలో తోడ్పడిన శ్రీ గిడుగు రామమూర్తిగారికి నా ధన్యవాదాలు.

అశోక్‌నగర్
హైదరాబాద్
15.8.1995

తల్లి, నృత్యసరస్వతి సేవలో
మీ
**నటరాజ రామకృష్ణ**

# మా పరిచయం

సమస్త జీవకోటికీ జీవాధారమైన పంచభూతాలను ఇతర మానవులలాగే ఆంధ్రులు గూడా ఆరాధిస్తూండేవారు. ఆ యారాధనలో నాట్యం గూడా ఒక భాగంగా ఉండేది. తర్వాత మన జాతి సంస్కృతికి నిలయాలైన దేవాలయాలు నిర్మింప బడిన నాటినుండి అనగా సుమారు రెండు వేల సంవత్సరాల పూర్వం నుండి ఇతర హిందువుల్లాగే ఆంధ్రులు గూడ తమ ఇష్ట దైవాలను తమ నాట్యంతో ఆరాధిస్తూ వచ్చారు. ఆ తర్వాత కొంతకాలానికి కొంతమంది స్త్రీ కళావేత్తలు ఈ నృత్య పూజకు ప్రత్యేకంగా అంకితమవుతూ వచ్చారు. ఆ దేవాలయాలలోని వీరి లాస్య నర్తనం ఆగమాది శాస్త్రాలనుసారం వికసిస్తూవచ్చింది.

తేనెకంటే తీయనైన తెలుగు భాష సోయగాన్ని, మాధుర్యాన్ని తమ కుసుమకోమల నాట్యరీతులలో వీరు ప్రతి బింబింపజేసినదే లాస్య నర్తనం. ఒకే స్త్రీ ప్రదర్శించే లాస్యనర్తనాన్ని ఏకపాత్ర కేళిక అన్నారు. దీనిని నట్టువమేళం అని గూడా పూర్వం అనేవారు. ఆ తర్వాత దర్బారు ఆట, కచ్చేరీ ఆట, చిన్న మేళం మొదలైన పేర్లను గూడా దీనికి పెట్టారు.

దేవునికి అంకితమైన ఈ స్త్రీ కళామూర్తులు ఆలయాలలోని పూజలో ఒక భాగంగా ఆగమాది శాస్త్రాలనుసారం ప్రదర్శిస్తూ వచ్చిన నృత్యాలకు ఆరాధనా నృత్యాలన్న పేరు వచ్చింది. ఆలయప్రాంగణంలోని కల్యాణ మంటపం వద్ద దేవుని సన్నిధిలో ప్రదర్శిస్తూ వచ్చిన కేళికలను దర్బారు ఆట లేక కచ్చేరి ఆట అనేవారు.

గర్భగుడిలోని దేవుణ్ణి ఆరాధిస్తూ చేసిన నృత్యాలను చూడడానికి అందరికీ వీలుండేది కాదు. కాని, కచ్చేరి లేక దర్బారు ఆటను ఆ దేవాలయాలను పోషించిన రాజులు, వారి కొలువులో నుండిన కవులు, పండితులు, శాస్త్రవేత్తలు ఇంకా ఇతర పెద్దలు చూసి ఆనందించేవారు. అయితే, ఈ రెండింటిని చూసే అవకాశం సామాన్య ప్రజల కుండేది కాదు.

పూర్వం తమను పాలించే ప్రభువును ప్రజలు దైవసమానుడుగా భావించేవారు. కనుక, దేవుని దర్బారులో జరిగినట్టే ఆ దేశ ప్రభువు దర్బారులో గూడ నృత్యకేళికలు జరిగేవి. అయితే, ఆగమ శాస్త్రానుసారం దేవుని పూజలో సమర్పింపబడిన ఆరాధనా నృత్యకుసుమాలు వేరు; ఆలయ, రాజ దర్బారుల్లో భరత శాస్త్రానుసారం ప్రదర్శించే వినోద నాట్యాలు వేరు.

మన మతం, పురాణాలు, సంస్కృతి, ఆచారవ్యవహారాలు మొదలైన వాటిని సామాన్య ప్రజలకు తెలియజేయడానికి కొంతమంది ప్రత్యేక స్త్రీ నాట్యకళాకారులు ప్రబంధరీతి నృత్యాలను ఆలయం వెలుపల ప్రదర్శించేవారు.

ఆలయ గర్భగుడిలోని ఆరాధనా నృత్యాలు, దర్బారులోని కేళికా నృత్యాలు, ప్రజాకూటాలలోని ప్రబంధ నృత్యాలు - ఈ మూడింటి సమ్మేళనమే నేటి ఆంధ్ర నాట్యం. అంటే సశాస్త్రీయమైన స్త్రీల లాస్యనర్తనమే ఆంధ్ర నాట్యం.

ఈ ఆంధ్ర నాట్యానికి రెండు వేల సంవత్సరాల చరిత్ర ఉందని అమరావతిలోని బౌద్ధ ఆరామ శిల్పాల, ఇతర ప్రాంతాలలోని ప్రాచీన దేవాలయాల శిల్పాల, శాసనాల ఆధారంగా మనం చెప్పవచ్చును.

ఆగమాది శాస్త్రాలలో నిష్ణాతులైన స్త్రీ కళామూర్తులు కన్యలుగా ఉండినప్పుడే దేవాలయాలలోని దేవుళ్ళకు అంకిత మయ్యేవారు. ఇలా అంకితమైన ఈ దేవగణికలు మరింక మానవమాత్రులను వివాహమాడడానికి వీలుండేదికాదు. వీరు వైవాహిక జీవితానికి నిషేధింపబడేవారు. వీరు నిష్ఠాపరులు గనుక వీరికి సంఘంలో మంచి గౌరవ ముండేది. ఆ దేవాలయాలను పోషించిన రాజులే వీరికి మాన్యాలు ఇచ్చి, ప్రత్యేక సౌకర్యాలు కల్పించేవారు.

భరత, సంగీత, వ్యాకరణాది శాస్త్రాలలోనే గాక పంచకావ్యాలు అధ్యయనంచేసి, ఆంధ్ర గీర్వాణభాషలలో నిష్ణాతులైన స్త్రీ కళామూర్తులకే ఆలయ, రాజదర్బారులలో కేళికలుచేసే అర్హత ఉండేది. ఈ యర్హత పొందడానికి వీరు అనేక పరీక్షలకు లోనయ్యేవారు. ఈ గణికలను గూడ రాజులు ఆదరించి పోషించేవారు. వీరికి సంఘంలో మంచి గౌరవ ముండేది.

ఆంధ్రదేశానికి ఉత్తరాన ముఖలింగ క్షేత్రంనుండి దక్షిణాన శ్రీకాళహస్తి పుణ్యక్షేత్రంవరకు గల శ్రీకూర్మం, అరసవల్లి, సింహాచలం, పిఠాపురం, ద్రాక్షారామం, కోరుకొండ, శ్రీకాకుళం, బాపట్ల, అమరావతి, నెల్లూరు, జొన్నాద, అలంపురం, బాసర, వేములవాడ మొదలైన పుణ్యక్షేత్రాలలోని ఆలయాల చరిత్రలను పరిశీలిస్తే ఆ యాలయాలలో నృత్యపూజ యుండినట్లు విశదమౌతుంది. ఈ యాలయాలను పోషించిన శాతవాహనులు, చాళుక్యులు, పల్లవులు, విష్ణుకుండినులు, కాకతీయులు, విజయనగర సమ్రాట్టులు, నాయకప్రభువులు, గజపతులు, జగపతులు, వెలమప్రభువులు, రెడ్డిరాజులు మొదలగు రాజులు, రారాజులు నాట్యకళను ఆదరించి, పోషించారని చారిత్రకంగా స్పష్టమౌతుంది

ఆలయ దైవారాధనలో కుంభహారతి, పుష్పాంజలి, వినాయక కౌతం, కైవారం మొదలైన నృత్యపుష్పాలు ఆగమ శాస్త్రానుసారం పూర్వం దేవునికి సమర్పింపబడుతూండేవి.

దర్బారులలోని కేళికలలో అలరింపు, శబ్దం, జతిస్వరం, వర్ణం, పదం, పదవర్ణం, జావళీ, శ్లోకం, పద్యం, తిల్లానా మొదలైన నాట్యాంశాలు భరతశాస్త్రానుసారం ప్రదర్శింపబడేవి.

ఆలయం వెలుపల ప్రజాకూటాలలో యక్షగానాలు, భాగవతాలు, పారిజాతాలు మొదలైనవి ప్రజారంజకంగా ప్రదర్శింపబడేవి.

ఆంధ్రదేశమంతటా పై అంశాలు ప్రదర్శింపబడుతూండినా ఆంధ్రదేశం చాలా విశాలమైనది గనుక ఆయా ప్రాంతాలనుబట్టి ఈ నృత్యప్రదర్శనలలో వేర్వేరు బాణీలు రూపొందుతూ వచ్చాయి. ఈ బాణీలలో వైవిధ్యమున్నా వైరుధ్యం లేదు. ఈ వైవిధ్యాలను దృష్టిలో పెట్టుకొనే ఆంధ్ర నాట్యం రూపొందించబడింది.

దేశకాలమాన పరిస్థితులవల్ల సంఘంలో కొన్నిమార్పులు రావడంవల్ల, నాట్యం చేస్తూండిన స్త్రీ కళామూర్తులకు కొంత కళంకం వచ్చింది. దీనివలన దేవాలయాలలోని నృత్యపూజలను, నట్టువమేళాలను సుమారు అర్ధశతాబ్దిక్రితం ప్రభుత్వం నిషేధించింది. ఈ నిషేధంవలన చాలామంది గణికులు ఉపాధి కోల్పోయారు, నిరాశ్రయులయ్యారు, నిరాశా నిస్పృహలకు లోనయ్యారు, భరత విద్యపట్ల విముఖులయ్యారు.

అయితే సశాస్త్రీయమైన ఈ నృత్యకళ అంతరించిపోకూడదన్న తలంపుతో మదరాసులోని స్వర్గీయ రుక్మిణి అరుండేల్, డాక్టర్ రాఘవన్, ఇ. కృష్ణయ్యర్ వంటి కొందరు ప్రముఖులు దీనిని ఒక రంగస్థల ప్రక్రియగా రూపొందించి, భావ, రాగ, తాళాలలోని ప్రథమాక్షరాల కలయికతో దీనికి "భరత"నాట్యం అన్న పేరు పెట్టారు. అప్పుడు ఆంధ్ర ప్రాంతం గూడ మదరాసు రాష్ట్రంలో ఉండినందువల్ల ఆంధ్రుల లాస్య నర్తనం గూడ "భరతనాట్యం"లో ఒక భాగ మయింది.

1955లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. 1956లో ఆంధ్రప్రదేశ్ రూపొందింది. తమిళ ప్రాంతం మదరాసు రాష్ట్రంగా (తమిళనాడుగా) మిగిలిపోయింది. భరతనాట్యం తమిళుల సొత్తు అయింది.

ఆంధ్రుల లలితకళల వికాసానికి ప్రత్యేకంగా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ స్వర్గీయ ఆర్.బి. రామకృష్ణం రాజుగారి అధ్యక్షత ఏర్పడింది. ఆంధ్రదేశంలోని వివిధ నాట్యాల పునరుద్ధరణకు సంగీత నాటక అకాడమీ పూనుకొంది. కూచిపూడి నాట్యం సశాస్త్రీయమైనదని ఢిల్లీ పెద్దలకు తెలియజేయడానికి కూచిపూడి సదస్సు నాక దానిని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ నిర్వహించవలసివచ్చింది. భరత విద్యలో నిష్ణాతులైన చాల మంది ఆంధ్ర కళావేత్తలను ఆ సదస్సుకు అకాడమీ ఆహ్వానించింది. ఆ సదస్సులో కూచిపూడి ఔన్నత్యాన్ని ఢిల్లీ పెద్దలకు చూపించాలి. అది శాస్త్రీయమైనదని నిరూపించాలి. అందువల్ల కూచిపూడి భాగవత ప్రదర్శనలనే కాక, గొల్ల కలాపం మీద అభినయపూర్వక ఉపన్యాసాన్ని గూడ ఆ సదస్సులో అకాడమీ ఏర్పాటు చేసింది. అందులోని సంస్కృత శ్లోకాలకు సంస్కృతంలోనే వ్యాఖ్యానం చెప్పించాలని అకాడమీ నిర్ణయించింది. కాని, అంతటి సమర్థులు ఆనాడు కూచిపూడి కళాకారులలో ఎవ్వరూ లేకపోయారు. అందువలన మారంపల్లి సోదరీమణులు శ్రీమతులు వైదేహీ ఇందువదనలను అకాడమీ ప్రత్యేకంగా ఆహ్వానించింది. వీరిద్దరూ ఆంధ్రుల గౌరవాన్ని ప్రత్యేకంగా కూచిపూడి వారి ప్రతిష్ఠను ఆనాడు కాపాడారు.

మరి కొన్నాళ్ళకు శ్రీమతి అన్నాబత్తుల బులి వేంకటరత్నంగారు అకాడమీ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. కోనసీమ లాస్య కళాకారులలో ఈమె కడు ప్రసిద్ధురాలు, భరతశాస్త్రంలో గొప్ప పండితురాలు, లాస్య నర్తనంలో మాణిక్యాంబ, చెల్లవ్వ, మాచల్‌దేవి, లకుమాదేవి, కుప్పాయి, ముద్దు చంద్రరేఖ, రూపవతి, శశిరేఖ, లోకనాయకి, కీరవాణి, చంపకవల్లి మొదలైన స్త్రీ కళామూర్తుల కోవకు చెందినవారు. అందుకే వీరికి అకాడమీవారు ''భరత కళాప్రపూర్ణ'' బిరుదు నిచ్చి, సత్కరించారు. అయితే, ఆనాడు ఆమె ఆ బిరుదును స్వీకరిస్తూ, "కొన ఊపిరితో నున్న మన ఆంధ్ర లాస్య నర్తనాన్ని మన అకాడమీ పునరుజ్జీవింప జేసినాడే ఈ సమ్మానానికి నేను సంతోషించగలను, సంపూర్ణ ఆనందాన్ని పొందగలను. నేను స్త్రీని, అందునా వృద్ధాప్యంలో ఉన్న దానిని, కనుక నేనేం చేయగలను?" అంటూ ఆమె తన హృదయావేదనను వెలిబుచ్చారు. ఆ యావేదనకు శ్రీ నటరాజ రామకృష్ణగారు చలించి, ఆంధ్రుల లాస్య నర్తన వికాసానికి కంకణం కట్టుకొన్నారు.

అప్పుడు అకాడమీకి అధ్యక్షులుగా నుండిన శ్రీ వసల సూర్యచంద్రరావుగారిని, ఇతర కార్యవర్గ సభ్యుల్ని ఒప్పించి, తాను సంధానకర్తగా ఉండి, 1970 ఆగస్టు 22, 23 తేదీలలో రాజమండ్రిలోని నవభారత గురుకులంలో అకాడమీ ఆధ్వర్యంలో అభినయ సదస్సును డాక్టర్ నటరాజరామకృష్ణ నిర్వహించారు.

చాలామంది వృద్ధ లాస్య నర్తకీమణులు ఆంధ్రదేశంలో ఇంకా ఆనాటికి ఉన్నారు. "రాజమహేంద్రవరంలో అభినయ సదస్సును నిర్వహించబోతున్నాం. అందులో మీరు పాల్గొని ఆంధ్రుల లాస్య నర్తన పునరుద్ధరణకు తోడ్పండి" అంటూ అనేక మంది కళాకారులను స్వయంగాను, లేఖలద్వారాను ఆయన ఆహ్వానించారు. వారిలో చాలా మంది నిరాశా నిస్పృహలకులోనై

యుండినందున ఆ సదస్సులో పాల్గొనడానికి నిరాకరించారు. తుదకు సుమారు ముప్పయి మంది వృద్ధ కళాకారులు సమ్మతించి, ఆ సదస్సులో పాల్గొన్నారు. ఆ సదస్సులో పాల్గొన్న ఆ వృద్ధ కళాకారులు ప్రత్యేకంగా సమావేశమై, సుదీర్ఘమైన చర్చలు జరిపి, శ్రీమతి అన్నాబత్తుల బులి వేంకటరత్నంగారి సూచన మేరకు వారి లాస్య వర్తనానికి "ఆంధ్ర నాట్యం" అన్న పేరు పెట్టుకొన్నారు. ఇది యొక వ్యక్తి పెట్టిన పేరు కాదు. ఆ లాస్య నర్తకీమణులే సమష్టిగా ఆలోచించి, చర్చించి, ఏకగ్రీవంగా సమ్మతించి పెట్టుకొన్న పేరు ఇది. ఆంధ్రుల నాట్యకళలో సశాస్త్రీయమైన ఇతర నాట్యాలు, జానపద, గిరిజన నర్తనాలు మొదలైనవి అనేక మున్నా, 'ఆంధ్ర నాట్యం' అంటే స్త్రీల లాస్య నర్తనం మాత్రమేనన్న భావంతో వారు ఈ పేరు పెట్టు కొన్నారు. ఇదొక సంజ్ఞా వాచకం.

దురదృష్టవశాత్తు ఈ యభినయ సదస్సు జరిగిన కొద్దికాలానికే భరతకళాప్రపూర్ణ అన్నాబత్తుల బులి వేంకట రత్నమ్మగారు స్వర్గస్థులయ్యారు. అందువల్ల ఈ "ఆంధ్ర నాట్యం" ప్రచారానికి ఆనాడు శ్రీ నటరాజ రామకృష్ణగారు తప్ప ఇంకెవ్వరూ లేకపోయారు.

నాట్యం నేర్చుకొనడం ఒక గొప్ప తప్పుగా, నాట్యం చేయడం మహాపాపంగా భావింపబడుతూండిన రోజులలోనే- అంటే, సుమారు 45 సంవత్సరాల క్రితమే నాట్యం యెడల బాలబాలికలకు అసక్తి కలుగజేయడానికి శాస్త్రీయ నృత్యకళను తమ అభినయపూర్వక ప్రసంగాల ద్వారా ఆంధ్రదేశంలో ప్రచారం చేసిన డాక్టర్ నటరాజ రామకృష్ణగారు ఈ "ఆంధ్ర నాట్యం" ప్రచారానికి పూనుకొనక తప్పలేదు. ఈ కార్యం ఒకరి వల్ల నెరవేరేది కాదని ఆయనకు తెలియనిది కాదు. కాని, ప్రభుత్వంవారి అండదండలు లభించగలవన్న ఆశతో ఆయన ఆంధ్ర నాట్య ప్రచారానికి నడుం బిగించారు. వారనుకొన్న విధంగా ప్రభుత్వ ఆర్థిక సహాయం ఆయనకు లభించలేదు. అయినా వారి కార్యదీక్ష సడలలేదు. వారికున్న ధనమంతా ఈ ఆంధ్రనాట్య ప్రచారానికే వెచ్చించారు.

శ్రీకాళహస్తీశ్వరాలయంలో దేవగణికగా నృత్యపూజలు చేసి విరమించుకొన్న స్వర్గీయ నాయుడుపేట రాజమ్మగారి వద్ద ఆగమాది శాస్త్రానుసారం ఆలయ నృత్యాలను, భరత శాస్త్రానుసారం ఆస్థాన కేళికలను, పిఠాపురం వాస్తవ్యులైన స్వర్గీయ పెండేల సత్యభామగారి వద్ద స్త్రీలు ప్రదర్శించే నవ జనార్దన పారిజాతాన్ని అభ్యసించిన డాక్టర్ నటరాజ రామకృష్ణ గారు పై వాటి సంక్షిప్త రూపమైన ఆంధ్ర నాట్యాన్ని ప్రచారం చేయడం మొదలుపెట్టారు. ఈ కృషిలో వీరు అనేక మంది వృద్ధ కళాకారుల్ని సంప్రదించారు. ఆంధ్ర దేశంలోని వివిధ ప్రాంతాలలో ప్రచారమం దుండిన వివిధ నాట్యరీతులను, అభి రుచులను తెలుసుకొని, వాటికి అనుగుణంగా ఆంధ్ర నాట్యానికి ఈయన మెరుగులు దిద్ది, నేటి రంగస్థలానికి సరిపోయేటట్టు రూపొందించారు.

ఆలయ నృత్యరీతుల్లో శ్రీమతి సరిదె మాణిక్యమ్మగారివంటి దేవగణికలను, ఆస్థానరీతిలో పేరుగాంచిన స్వర్గీయ గడ్డిభుక్త జీవరత్నమ్మగారివంటి గణికలను, ప్రబంధరీతిలో శ్రీయుతులు వైదేహి, ఇందువదనలను వీరు సంప్రదించారు.

రాజమహేంద్రవరం సదస్సులో పదిమంది లాస్య కళాకారిణులు ఆంధ్ర నాట్యానికి ఒక పాఠ్యప్రణాళికను రూపొం దించారు. అయితే, అధునిక విద్యావిధానానికి సరిపోయేటట్టు దీనికి ఒక తుదిరూపం ఇవ్వడానికి 1982 లో ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ భరతకళాప్రపూర్ణ శ్రీ కోరాడ నరసింహారావుగారి అధ్వర్యంలో ఒక కమిటీని నియమించింది. దీనిలో శ్రీయుతులు సరిదె మాణిక్యమ్మ, దుగ్గిరాల జగదాంబ, చింతా చిన గనిరాజు, జంపా ముత్యం సభ్యులుగా వ్యవహరించారు. ఆ కమిటీ

"ఆంధ్ర నాట్యం" పేరును ధృవీకరిస్తూ, ఆంధ్ర నాట్యం సిలబస్ పునర్వీక్షించి, ఆమోదించింది. ఇంతలో అకాడమీలన్నీ తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమయ్యాయి. ఈ విశ్వవిద్యాలయం మరొక నిపుణుల కమిటీని నియమించి, ఈ సిలబసును పరిశీలించి, ఆమోదించింది 1994 లో ఈ సిలబసును తెలుగు విశ్వవిద్యాలయం సెనేటు ఆమోదించింది. తదనుసారం 1995 జనవరి 23 వ తేదీని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆంధ్రనాట్యాన్ని గుర్తిస్తూ, ఆంధ్ర నాట్యంలో సర్టిఫికెట్, డిప్లమా పరీక్షలు జరపడానికి, హైదరాబాదులోని సంగీత నృత్యకళాశాలలో ఆంధ్రనాట్యం తరగతులను నిర్వహించడానికి అంగీకరిస్తూ ఆదేశాలు జారీ చేసింది.

అయితే, ఈ మధ్యకాలంలో కొందరు డాక్టర్ నటరాజ రామకృష్ణగారి కృషిని, నాట్యశాస్త్ర విజ్ఞానాన్ని తమ స్వలాభం కొరకు ఉపయోగించుకొనడానికి ప్రయత్నిస్తూ వచ్చారు. వేరే పేరు పెట్టాలని వారు వాంఛించారు. 1994 జూలైలో శ్రీమతి శారదా రామకృష్ణగారు విజయవాడలో రెండవ "ఆంధ్ర నాట్యం" సదస్సును నిర్వహించారు. 'ఆంధ్రనాట్యం' సశాస్త్రీయమైనదని బెజవాడ సదస్సులో ఆమోదించిన ప్రముఖ సినీకవి డాక్టర్ ఆరుద్ర, శ్రీయుతులు స్వప్నసుందరి, మేజువాని నర్తకి మద్దుల లక్ష్మీనారాయణలతో కలిసి, హైదరాబాదులో "మేజువాణి" సదస్సును నిర్వహించారు. ఆ సదస్సులో ఆంధ్రుల లాస్య నర్తనానికి వారే మూడు పేర్లను ప్రతిపాదించి, వాటిలో ఏదో ఒకదానిని ఎంపిక చేయమని కొంతమంది పండితులను కోరారు. ఆ మూడు పేర్లు పండితులకు నచ్చకపోయినా, ఏదో ఒక పేరును సూచించాలి గనుక వారిలో కొందరు "విలాసినీ నాట్యం" అన్న పేరును సూచించారు. ఈ సూచనను వారి ఆమోదంగా శ్రీమతి స్వప్నసుందరి పరిగణించి, ఉభయగోదావరి జిల్లాలను పర్యటించి, కొంతమంది వృద్ధ లాస్య కళాకారులను కలుసుకొని, వారికి వృద్ధాప్య వేతనాలు ఇచ్చేటట్లు మధ్యపెట్టి, ఒక తెల్ల కాగితం మీద వారి సంతకాలను అందు నిమిత్తమై తీసికొని, ఆ తర్వాత వారి సంతకాలను తన అఫిడవిట్‌లో ఉపయోగించుకొని "ఆంధ్ర నాట్యం" పేరు చెల్లదని, దానికి ప్రత్యామ్నాయంగా "విలాసినీ నాట్యం" అన్న పేరును ఆంధ్రుల లాస్య నర్తనానికి పెట్టాలని ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో వ్యాజ్యం వేశారు. తమ పలుకుబడినంతా ఉపయోగించి, మే 18వ తేదీన ప్రారంభం కావలసిన ఆంధ్రనాట్యం పరీక్షలను వాయిదా వేయించగలిగారు. అయితే ఈ పరీక్షలకు హాజరు కావలసిన అభ్యర్థులు ఒక రిట్ పిటిషన్ను హైకోర్టులో వేయగా, ఆ పరీక్షలను జూన్ మాసాంతములోగా నిర్వహించాలని హైకోర్టు తెలుగు విశ్వవిద్యాలయాన్ని ఆదేశించింది. తదనుసారం 1995, జూలై 28, 29, 30 తేదీలలో ఆ పరీక్షలు నిర్వహింపబడ్డాయి.

ఆనాటి వృద్ధ కళామూర్తుల తపః ఫలంగా ఆంధ్ర నాట్యం అమరత్వం పొంది, ఆంధ్రదేశం ఉన్నంత కాలం ఉండగలదని ఆశిస్తున్నాను, అభిలషిస్తున్నాను.

డాక్టర్ నటరాజరామకృష్ణగారు భరత శాస్త్రాన్ని క్షుణ్ణంగా అభ్యసించారు. అనేక నాట్యప్రదర్శనలిచ్చారు. లెక్కకు మించినన్ని అభినయపూర్వక ప్రసంగాలు చేశారు. కొన్నివేల వ్యాసాలు, ఏభైకి పైగా గ్రంథాలు నాట్యకళపైని వ్రాశారు. భరతశాస్త్రం, సంప్రదాయం, ప్రదర్శనా విధానం బాగా తెలిసినవారు నాకు తెలిసినంతవరకు ఆంధ్రదేశంలో ఈయనతప్ప వేరొకరులేరు. ఇటువంటి అపూర్వమైన వ్యక్తియొక్క సేవలను వినియోగించుకొని, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంగాని ఆంధ్రదేశంలోని విశ్వవిద్యాలయాలు గాని, భరతశాస్త్ర గ్రంథాలకు సాంప్రదాయక వ్యాఖ్యానాలు వ్రాయించుకోవచ్చును. కాని, వారికి ఇటువంటి ఆలోచన రాకపోవడం శోచనీయం, ఆంధ్రుల దురదృష్టం.

డాక్టర్ నటరాజరామకృష్ణగారు నాగపూరులో చదువుకొంటున్న రోజులలో మా తండ్రిగారు, స్వర్గీయ డాక్టర్ గిడుగు వేంకట సీతాపతిగారు సైన్సు కాంగ్రెసుకు నాగపూరు వెళ్ళారు అప్పుడు వారిద్దరికి పరిచయమయింది. వారిద్దరు

ఆంధ్రుల లలిత కళల గురించి చర్చించుకొన్నారు. యువకుడైన ఒక గొప్ప నాట్యకళాకారుని నాగపూరులో కలుసుకొన్నట్లు మా తండ్రిగారు శ్రీ నటరాజు రామకృష్ణగారి గురించి నాతో చెప్పి, ఎంతో ఆనందించారు. ఆ తర్వాత మరి కొన్నాళ్ళకే ఆంధ్ర దేశంలో స్థిరపడిన ఆ నటరాజును విశాఖపట్నంలో నేను కలుసుకొన్నాను. బాగా పరిచితులమయ్యాం. మరికొన్ని సంవత్సరాల తర్వాత 1959 లో నా కుమార్తె చిరంజీవి విశాలాక్షి నటరాజుగారి శిష్యురాలైంది. మా పరిచయం స్నేహంగా మారింది. డాక్టర్ నటరాజ రామకృష్ణగారి ఆశీస్సులతోనే ఆమె హైదరాబాద్‌లో 'నృత్యాంజలి' అనే నాట్య సంస్థను నడుపుతూంది.

డాక్టర్ నటరాజ రామకృష్ణగారు వ్రాసిన అనేక గ్రంథాలను ప్రచురించడంలో ఆయనకు నేను సహకరిస్తూ వచ్చినందువల్ల, వారి మనోభావాలు నాకు బాగా తెలుసును గనుక ఈ "మా పరిచయం'' వ్రాయడానికి సాహసించాను. ఈ గ్రంథం వారి జీవిత చరిత్రలో ఒక భాగమేకాదు, ఆయన గతకాల స్మృతులకు దర్పణం.

ఈ 'మా పరిచయం' వ్రాసే అవకాశం నాకు ఇచ్చినందుకు వారికి నా కృతజ్ఞతలు.

హైదరాబాదు

16.8.1995

ఇట్లు

గిడుగు రామమూర్తి



ఈ గ్రంథ రచనకు స్ఫూర్తినిచ్చిన అమరావతి స్థూపం

# మొవ్వపురి గోపాలుడు - మువ్వ గోపాలుడు

ఈ దేవుని అసలు పేరు వేణుగోపాలుడు. మొవ్వపురిలో వెలిశాడు గనుక మొవ్వగోపాలుడు, మువ్వగోపాలుడు అయ్యాడు. కవి, గాయకుడు, నర్తకుడు అయినటువంటి వరదయ్య ఈ గోపాలుని భక్తుడు. ఈ వరదయ్య భక్తిపారవశ్యంతో మైమరచి వందలాది పదాలను రచించి, తన పదకవితతో మువ్వగోపాలునికి, మొవ్వ గ్రామానికి అమరత్వం చేకూర్చాడు. ఎన్ని పుణ్యక్షేత్రాలు సందర్శించినా, ఎందరి దేవుళ్ళను ఆరాధించినా ఆ యందరిలోను ఆ మొవ్వగోపాలుణ్ణే వరదయ్య చూశాడు. అందుకే వరదయ్యను అందరూ విస్మరించి ఆయన్ను క్షేత్రయ్యగా కొనియాడుతున్నారు. అనేక దివ్యక్షేత్రాలను, గోలుకొండ పాదుషాల దర్బారును, తంజావూరు, మధుర నాయక రాజుల ఆస్థానాలను సందర్శించడమేకాక రామేశ్వరం వరకు గూడ క్షేత్రయ్య పర్యటించి, తన పదకవితతో రాజులను, మహారాజులను, పండితులను, కవులను, విద్వాంసులను, సంగీతజ్ఞులను, నర్తకులను, నాట్యాచార్యులను సమ్మోహితులను చేశాడు. దక్షిణాపథంలో సాత్వికాభినయ కళను ఒక ప్రత్యేక ప్రక్రియగా రూపొందించాడు.

భక్తి ప్రబోధ సంకీర్తనా సంప్రదాయం అన్నమయ్యద్వారా, యక్షగాన సంగీత సంప్రదాయం నారాయణ తీర్థుల ద్వారా, పాట కచ్చేరీ సంగీత సంప్రదాయం త్యాగయ్యద్వారా ప్రచారంలోకి రాగా - మధుర భక్తి అభినయ సంగీతం క్షేత్రయ్య ద్వారా ప్రచారంలోకి వచ్చింది.

ఈ క్షేత్రయ్య జన్మించిన గ్రామంలోనే శ్రీ వేమూరి సుందరరామయ్యగారు పుట్టడం ఎంతో గొప్ప విషయం. ఈ మువ్వగోపాలుని ఆరాధన వారిలో ఎంతో ఆత్మ వికాసాన్ని కలిగించింది. అందువల్లనే వారు సాంస్కృతికాభివృద్ధికి ఎంతో తోడ్పడుతున్నారు. ఇట్టి అమృత హృదయునికి ఆంధ్రుల నృత్యకళా చరిత్రలోని ఈ ప్రథమ భాగాన్ని ఈ మువ్వగోపాలుని సమక్షంలో సమర్పించి, నేను ధన్యుణ్ణయ్యాను.

ఈ గ్రంథ ప్రచురణలో నాకు ఎంతగానో సహాయపడిన ప్రఖ్యాత చారిత్రక పరిశోధకులైన శ్రీ బి.ఎన్. శాస్త్రిగారికి, చిరకాల మిత్రులు శ్రీ మండవ నాగేశ్వరరావు గారికి నా ధన్యవాదాలు.

నృత్య సరస్వతి కరుణిస్తే త్వరలోనే మిగిలిన నాల్గు భాగాలు కళాలోకాని కందించగలనని ఆశిస్తున్నాను

— నటరాజ రామకృష్ణ



# ముందు ముచ్చట

అన్న శ్యామసుందరుడు అతి సుందరరూపుడు. పేరు శ్యామసుందరుడే అయినా అతని మేను మేలిమి బంగారం. ఉంగరాలు తిరిగిన నల్లని జుత్తు, విశాలమైన నుదురు, కమల రేకులవంటి కన్నులు, మొనదేరిన సూటి ముక్కు, ఒడ్డూ, పొడుగూ గల విగ్రహం. బౌద్ధ యుగంలో ఆంధ్ర శిల్పులు చెక్కిన పాలరాతి విగ్రహం. ఆ విగ్రహం ఎప్పుడూ నా కళ్ల ముందు కదలాడుతూనే ఉంటుంది.

అప్పుడు నా వయస్సు పది సంవత్సరాలు. ఆయన నాకన్న పదేళ్ళు పెద్ద. అయినా ఆ వయస్సులోనే ఆయనకు సన్నిహితుణ్ణయ్యాను. దానికి కారణం ఆనాటి మా యింటి పరిస్థితులు.

ఆ వయస్సుకే ఆయన కాలేజీ చదువుతోబాటు, తెలుగు, ఇంగ్లీషు భాషల్లోనే కాక సంస్కృతం, ఉర్దూ, పారశీక భాషల్లో గూడ మంచి పాండిత్యం సంపాదించుకొని కవిత లల్లేవాడు. హిందూస్థానీ, కర్ణాటక సంగీతాలను బాగా అభ్యసించాడు. చక్కని బొమ్మలు వేయగల చేయి తిరిగిన చిత్రలేఖకుడు. శిల్పశాస్త్రంలో ప్రత్యేక కృషి చేసినవాడు.

అతడే మరి కొన్నాళ్లు జీవించి ఉంటే ఆంధ్రదేశంలో మరొక స్వాతి తిరునాళ్ళలా రూపొందేవాడు. ఆయన శిల్ప శాస్త్ర పరిశోధనే నా నాట్యాభ్యాసానికి మూలం. ''ప్రతి శిల్పంలోను ఒక భావ ముంది, లయ విన్యాస ముంది, కదలిక ఉంది, సందేశ ముంది'' అంటూ ఆయన వివరించుకొంటూ పోతూంటే నాకు అర్థమయ్యేది కాదు. అయోమయంగా ఉండేది. ''వాటి భాష నేర్చుకొనాలి. వాటి భావం తెలిసి కొనాలి. అప్పుడు ఆ శిల్పాలు కరిగి, కదిలి, చైతన్యవంతమై నీతో మాట్లాడతాయి. వాటి మాటలే సుందర కావ్యాలుగా ప్రచురితమౌతాయి,'' అంటూ ఈ విధంగా భావోద్రేకంతో చెప్పుకొంటూ పోయేవాడు.

''అవి ఎలా కరుగుతాయి? ఎలా కదులుతాయి? చైతన్యవంతమై వాటి కథలను ఎలా చెబుతాయి? ఎలా పాడతాయి, ఎలా ఆడతాయి? ఏ వాయిద్యాలను ఎలా వాయిస్తాయి?'' నాకు తెలియలేదు. వాటిని నేను తెలిసి కొనాలనే ఆయన నాచేత నృత్యాభ్యాసం చేయించాడు.

అదొక ఎల్లోరా గుహలోని కైలాస మందిరం. సాయం సంధ్య. అస్తమిస్తున్న అరుణుని కిరణ కాంతిలో మెరసిపోతున్న పార్వతీ పరమేశ్వరుల సన్నిధిని నా నాట్య సాధన ఆరంభమయింది.

ఆ శిలామూర్తులను చూస్తూ అలా నిల్చోడానికి ప్రయత్నించాను. ఆ విగ్రహాల కాళ్ళూ, చేతులూ ఎలా ఉన్నాయో చూసి ఆ భంగిమలలో నిల్చున్నాను. చేతులతో ముద్రలు పట్టాను. ఆ మందిరంలోని శిల్పమూర్తులను అనుసరించి నాట్య భంగిమలలో నిలబడడానికి ప్రయత్నించాను. ఇదే నా తొలి పాఠం.

భంగిమ పట్టేను కాని దానిలోని భావం? దీనికి గురు ముఖ సాధన అవసరం. అక్కడ మే మున్న కొద్ది రోజులు తెలిసీ తెలియని జ్ఞానంతో ఆ భంగిమల నన్నింటిని ప్రయత్నించాను. అయితే ఒక భంగిమ నుండి వేరొక భంగిమ లోకి మారడం ఎలా? మా యిద్దరికి తెలియదు. ఆ శిల్పాలను నేను అనుకరిస్తుంటే "ఓహో! ఆహా!" అంటూ ఆయన ఆనందించి మెచ్చుకొనేవాడే గాని, వాటిలోని భావాన్ని నాకు బోధించినా అర్థమయ్యేదిగాదు. తన చిట్టి తమ్ముడు చేసిన పిచ్చి పనులను ఆయన ఆనందిస్తున్నాడన్న భావం నాకు కలిగింది. అయితే, ఆయనతో తర్కించే వయస్సు కాదు నాది. ఆయన్ని అడిగే ధైర్యం నాకు లేదు.

ఆయన ఆ శిల్పాలన్నింటిని నా కోసం చిత్రించి జాగ్రత్త పెట్టాడు.

అక్కడ నుండి అజంతాకు వెళ్ళాలి. ఆనాడు నా కొక దివ్యానుభూతి కలిగింది. ఎన్నటికీ మరువలేని అనుభూతి అది.

కొన్నాళ్ళు ఆ కళాక్షేత్రంతో ఒంటరిగా గడిపినందు వల్ల నాకు అక్కడి శిల్పాలతో సన్నిహిత పరిచయం ఏర్పడింది. ఆ శిల్పాల భాష నాకు తెలియకపోయినా ఆ మూగ శిల్పాలు ఏవో భావాలను వ్యక్తం చేస్తాయని నాకు కొద్దిగా అనిపించింది. ఆ మందిరంలో ఏ శిల్పం ఎక్కడ ఉందో నాకు బాగా గుర్తుండిపోయింది.

ఆనాడు ఎల్లోరా క్షేత్రాన్ని విడిచి వెళ్ళేరోజు. ఆ సాయంత్రం నే నుండిన మందిరంముందు మా కారు సిద్ధంగా ఉంది. 'మరి నే వెళ్తా' అంటూ ఆ శిల్పాలను చూసి కారు వైపు బయలుదేరాను. ఎవరో వెనుక నుంచి సన్నగా పిల్చి నట్టయింది. వెనక్కి తిరిగి చూశాను. "మమ్మల్ని విడిచి వెళ్తున్నావా, రామకృష్ణా!" అని ఆ శిల్పాలు అన్నట్టు అన్పించింది. ఏమిటో ఈ అనుబంధం అనుకొంటూ మళ్ళీ ముందుకు సాగాను. "మళ్ళా ఎప్పుడు వస్తావో! అప్పటికి నీవు మారిపోవచ్చుగాని, మేం ఇలాగే ఉంటాం" అని ఆ శిల్పాలు అంటున్నట్టు నాకు అనిపించింది.

నీలి ఆకాశాన్ని చూశాను. ఆ ఎల్లోరా గుహలను కలియజూశాను. కళ్లు మూసుకొన్నాను. అవి చెమర్చాయి. నాలో నేను నవ్వుకొన్నాను. "ఏమిటి?" అంటూ ఆశ్చర్యంగా ఆత్రుతతో అడిగాడు అన్నయ్య. ఆ దివ్యానుభూతిని ఎవరికీ చెప్పాలనిపించలేదు. దాన్ని నా చిన్న హృదయంలో అద్దిపెట్టుకొని "ఏం లే" దన్నాను.

ఈనాటివరకు ఆ అనుభూతి నాలోనే ఉండిపోయింది. ఈనాడు మీకు చెప్పాలని అనిపించి చెప్పాను.

అక్కడనుండి బయలుదేరి అజంతా చేరుకొన్నాం. అదొక కళాస్వప్నం. ఇక్కడి చిత్రాలను అర్థం చేసికొనడం నాకేం అంత కష్టం అనిపించలేదు. ఆ చిత్రాల్లోని ప్రతి బొమ్మ నాతో మాట్లాడేది, ఆట్లాడేది, కోపగించుకొనేది, వెక్కిరించేది, భయపెట్టేది, ఓదరించుకొనేది, దీనంగా నావైపు చూసేది, కన్నీరు కార్చేది. ఈ విధంగా ఆ చిత్రాల్లోని ప్రతి బొమ్మా నాతో మాట్లాడుతున్నట్టే అనిపించేది. ఈ లోకం హృదయానికి సంబంధించిన రసానుభూతిని కలిగించేది. ఎల్లోరా లోకం మనస్సుకు సంబంధించి ఆలోచనలను రేకెత్తించేది. ఆ చిన్న వయస్సులో నేను చూసిన ఆ చిత్రాల్లోని భావ వికాసం నేటికీ నా కనులముందు కదలాడుతూ కనుల పండుగను కలిగిస్తూనే ఉంటుంది.

ఈ కళాఖండాల సందర్శనం వల్ల, సౌందర్యోపాసన వల్ల నాలో ఎంతో మార్పు వచ్చింది. ఎప్పుడూ వాటిని తలచుకొంటూ ఆ ఊహాలోకంలో విహరిస్తూ ఉండేవాణ్ణి. ఒంటరిగా కూర్చుండే వాణ్ణి - ఆ మృదంగనాదం, ఆ వేణుగానం, ఆ వీణావాద్యగోష్ఠి నా చెవులకు వినిపిస్తూ ఉంటుంది. ఆ శిల్పమూర్తులు, ఆ చిత్రమూర్తులు నా కనులముందు కదలాడుతూనే ఉంటాయి. ఆ ఆనందాన్ని అనుభవించడానికి ఎప్పుడూ ఒంటరిగా కూర్చునేవాణ్ణి. ఒంటరిగా కూర్చోడం అలవాటయిపోయింది. ఏదో నా ఊహాలోకంలో నేను విహరిస్తూండేవాణ్ణి.

అది వేసవి కాలం. మధ్యాహ్న సమయం. మా తోటలోకి వెళ్ళి దిగుడు బావిలో కూర్చున్నాను.

ఆ రోజుల్లో శ్రీమంతుల తోటల్లో దిగుడు బావులుండేవి. ఆ బావిలో చక్కని హాలుండేవి. వేసవి సమయాల్లో రాత్రిగాని, పగలుగాని ఆ హాలులో కవితాగోష్ఠులు, సంగీత సభలు జరుగుతూ ఉండేవి.

మా పెద్దలు నిర్మించిన మా దిగుడు బావిలో ఒక పెద్ద హాలు, రెండు గదులు ఉండేవి. పాలగచ్చుతో వాటిని నిర్మించారు. ఆ గచ్చు మన ప్రతిబింబం కనబడేటంత నున్నగా, కాంతివంతంగా ఉండేది. బావిలోని నీళ్ళలో తాబేళ్లు, రంగు రంగుల చేపలు కదలాడుతూ ఉండేవి. నేను అక్కడ తీరిగ్గా కూర్చుని, అవి పోటీ పడుతూ ఈదుతూ ఉండే వాటిని చూస్తూ కాలక్షేపం చేసేవాణ్ణి.

ఏకాంతంగా గడపడానికి ఆ దిగుడు బావి నాకెంతో అనువుగా ఉండేది. నా ఊహాలోకాల్లో నేను విహరించడానికి నాకు ఏ అడ్డూ ఉండేది కాదు.

ఒకనాటి మధ్యాహ్నం ఆ దిగుడు బావి హాలులో కూర్చుని నా ఊహా లోకంలో నేను విహరిస్తున్నాను. నా ఆలోచనలు అలా అలా పరుగెడుతున్నాయి. నా చిన్నప్పుడు మా దాయి నన్ను నిద్రపుచ్చుతూ ఒకనాడు పాడిన పాట నా చెవుల్లో మధురంగా వినిపించింది: "శివుడు తాండవము చేయుచుండెను కైలాసమందున" - ఆ తాండవం ఎలాంటిదో నేను చూడలేదు, నేను వినలేదు, నేను ఊహించలేను. హిమాలయాలు ఎలా ఉంటాయో, వాటిపైని కైలాసం ఎలా ఉంటుందో నా ఊహకి అందని విషయం.

అప్పుడు నాకు ఎల్లోరా గుర్తుకు వచ్చింది. అక్కడ కైలాస గుహాలయం చూశాను ఆ సందర్శనం, అక్కడి నా అనుభూతులు నా మనస్సులో కదలాడాయి. శివుని సంధ్యా నాట్యం, శివ పార్వతుల దివ్యనాట్యం నా ఊహాపథంలోకి వచ్చాయి.

ఆ శివ పార్వతు లిద్దరూ నాట్యం మొదలుపెట్టారు. వాద్యాలు మారుమ్రోగుతున్నాయి. గాయకులు పాడుతున్నారు. అప్సరసలు, గంధర్వులు ఆనందంతో నాట్యాన్ని చూస్తున్నారు. తన్మయుణ్ణయి నేనూ ప్రేక్షకుడిగా చూస్తున్నాను.ఇంతలో నా భుజంమీద ఒక చెయ్యిపడింది."రామా!" అన్న పిలుపు వినబడింది. ఆ సంధ్యామూర్తిని గురించే ఇంకా నేను ఆలోచిస్తున్నాను. నా స్వాప్నిక అవస్థనుండి నేను తేరుకొని యధార్థ లోకంలోకి నేను వచ్చేసరికి నా ఎదురుగా నా అన్న శ్యామసుందరుడూ, ఆయన ప్రక్కన ఒక వృద్ధపండితుడూ ఉన్నారు. అంతవరకు నాలో ఆ పండితుడు ఏమి చూశాడో గాని ఆయన నన్ను చిరునవ్వుతో పలకరించి, "బాబూ! ఈ విద్యను విడిచిపెట్టకు" అని మాత్రం అన్నాడు.

నా అన్న నాకు సంస్కృతం నేర్పించాడు, సంగీతం నేర్పించాడు. నా కళాభ్యాసానికి చక్కని పునాదులు వేశాడు. భారతదేశంలోని వివిధ దేవాలయాలను, రాజమందిరాలను చూపించాడు. అక్కడ అనేక శిల్పాలను చూశాను, అనేక నాట్యకళామూర్తుల వివిధ నాట్య భంగిమలను చూసి ఆనందించి, వాటిని నా మనస్సులో ముద్రించి భద్రపరచుకొన్నాను.

నన్ను తర్వాత పందనల్లూరు తీసికొని వెళ్ళి, భరత విద్య నభ్యసింపజేశాడు. తర్వాత నన్ను విదేశాలకు పంపిస్తానన్నాడు. నా గురించి ఆయన ఎన్నో కలలు కన్నాడు. నా మీద ఎన్నో ఆశలు పెట్టుకొన్నాడు.

అప్పుడు నేను నాగపూర్‌లో చదువుకొంటున్నాను. ఒకనాటి మధ్యాహ్నం నాకు టెలిగ్రాం వచ్చింది. విప్పి చూశాను. నా అన్న శ్యామసుందరునికి జబ్బుగా ఉంది, రమ్మనమని అందులో ఉంది. ఆ సాయంత్రం మా వూరికి బయలుదేరడానికి తయారవుతున్నాను. ఇంతలో మరొక టెలిగ్రాం వచ్చింది - వెంటనే బయలుదేరమని. వెంటనే బయలుదేరాను.

మరునాటి ఉదయానికి మా వూరు చేరాను. మా బంగళా గేటు తెరచి లోపలికి వెళ్లాను. అంతా నిశ్శబ్దంగా ఉంది. తిన్నగా అన్న గదికి వెళ్ళాను గది తలుపులు వారగా వేసి ఉన్నాయి. "అన్నా!"అంటూ లోపలకు ప్రవేశించాను. నా పిలుపుకు నా అన్న పలకలేదు. మా దాయి లేచి నాకు ఎదురు వచ్చింది. ఆమె కళ్ళు తుడుచుకొంటూంది. ఆ గదిలో భరించరాని నిశ్శబ్దం. ఆ గదిలో ఒక వారగా నా అన్న పడుకొని ఉన్నాడు, తెల్లటి గుడ్డ కప్పుకొని. తల వైపు చిన్న దీపం వెలుగుతోంది. దగ్గరగా వెళ్ళి చూశాను. ఆ పసిడి వన్నెమూర్తి నల్లరాతి మూర్తిగా మారిపోయాడు. శాశ్వతంగా నిద్రపోతున్నాడు.

నా గురించి ఇంక కలలు కనవలసిన పనిలేకుండా నిద్ర పోతున్నాడు. ఆ శరీరచ్ఛాయ, ఆ ముఖ సౌందర్యం, ఆ కన్నుల్లోని తళుకు, ఆ కంఠంలోని తీయని పలుకు ఏమయిపోయాయో! చూస్తూ ఉండగానే ఆ శరీరం మరింత నల్లబడిపోయింది. మానవ జీవితం అంతా ఇంతేగదా! అనిపించింది. నా కళ్ళ ముందు అంతా చీకటి అయిపోయింది.

నా కంతా శూన్యంగా తోచింది. మనస్సు ఆలోచించిడం మానేసింది. నా కళ్లు చెమర్చనైనా లేదు.

ఆనాటితో నా జీవిత గతే మారింది. నా కళారాధన మలుపు తిరిగింది. ఆయన అకాలమరణం పొందకుండా ఉంటే నా జీవితం ఎలా ఉండేదో నాకు మరో ఇరవై యేళ్ళ తర్వాతగాని తెలియలేదు. నా అన్న డైరీలు ఒకనాడు చూసే అవకాశం ఇరవై ఏళ్ళ తర్వాత కలిగింది. నన్నొక ఉత్తమ కళాకారునిగా రూపొందించడానికి ఆయన వేసిన పథకాలు నాకు వాటిలో కనబడ్డాయి. ఎంతో ఉత్తము డైన అన్న నాకు లేకుండా పోయాడని ఆనాడు కన్నీరు కార్చి విలపించాను. కన్నీరు మనస్సుకు ఊరట కలిగిస్తుందే కాని పోయినవారిని తీసుకొనిరాలేదు కదా! అందుకని నా కర్తవ్యం ఏమిటో ఆలోచించాను. మనస్సుని దిటవు చేసి కొన్నాను. నా జీవితాన్ని నృత్యకళకు అంకితం చేసికొన్నాను. నృత్య కళా సంపదను సేకరించడానికే కృత నిశ్చయుణ్ణి అయ్యాను.

ఆంధ్రుల నృత కళా కథనంలో నా అన్న శ్యామ సుందరుని సంస్మరణ ఎందుకని మీరు నన్ను అడగకండి. ఆయనే నాకు లేకపోతే నాకీ కళాజీవితమే లభ్యమయేదికాదు. ఈ రచనకు అవకాశమే లేదు.

అందుకే శ్యామసుందరుని సంస్మరణ!





# నా కళా జీవితం

బొంబాయి ఎక్స్‌ప్రెస్ హైదరాబాద్ నుండి బొంబాయి వైపు పడమటి కనుమల్ని దూసుకొంటూ పోతూంది. ఫస్ట్ క్లాస్ కంపార్ట్‌మెంటు ద్వారం వద్ద తలుపు తీసి నేను నిలబడ్డాను. ఆకాశం నిండా నల్లటి మేఘాలు అలుముకొన్నాయి. వర్షం బాగానే పడుతోంది. కదలి పోతున్న కారుమేఘాల్ని చూస్తూంటే కాలం ఎలా గడిచి పోయిందో నాకే తెలియలేదు. నా ప్రక్కని ఎవరో కదలి నట్టయితే అటు చూశాను. నడి వయస్సులో నున్న ఒక వ్యక్తి నా ప్రక్కన నిలబడి ఉన్నాడు. అతడు ఎప్పుడు వచ్చాడో కూడా నాకు తెలీదు. కాని, అతడు నన్నే చూస్తు న్నాడు. నే నతన్ని చూడ్డంతో ''మీరు కవులా?'' అని నా కళ్ళలోకి చూస్తూ మందహాసం చేశాడు.

నేను అతని ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఒక చిరునవ్వు నవ్వి చేతి రుమాలుతో ముఖం తుడుచుకొన్నాను.

''క్షమించాలి. మీ ఆనందానికి అడ్డువచ్చినట్టున్నాను" అన్నాడు మరొక చిన్న నవ్వు నవ్వి.

''నా ఆనందంలో మీరూ పాలు పంచుకోండి అప్పుడు నాకు మరింత ఆనందంగా ఉంటుంది.''

''మీ చేయి చూడాలని ఉంది. ఒక్క అయిదు నిమిషాలు మీరు నాతో గడపగలరా?'' అని కుతూహలంగా ఆయన అడిగాడు.

ఇద్దరం కలిసి ఆయన కంపార్టుమెంటులోకి వెళ్లాం.

''ఇంతకూ మీరు నా ప్రశ్నకు సమాధానం చెప్పనే లేదు,'' అంటూనే నా చేతిని తన చేతిలోకి తీసికొని మృదువుగా నా అరచేతిని తన చేత్తో రాస్తూ అడిగాడు. నేను మళ్ళా మరొక చిరునవ్వు విసిరాను, 'చెయ్యి చూసి నువ్వే చెప్పుకో' అన్నట్టు.

''మీరు నాట్యం చేస్తారా?'' అంటూ నా కళ్ళలోకి సూటిగా చూశాడు.

''నా చేతిలో అలా రాసుందా?'' అని ఆయన కళ్ళ లోకి నేను చూశాను.

''మీ చేతిలో అలా లేదుగాని, మీ కళ్లు అలా చెప్తు న్నాయి. ఇంతటి కాంతివంతమైన అందమైన కళ్ళను అరుదుగా చూస్తాం. ఇంతవరకూ మీ కళ్ళే మీ కన్నా ఎక్కువగా మాట్లాడాయి. ఇంక అవి అభినయిస్తే ఇంకా ఎంత ముచ్చటైన భావాలను అవి పలకగలవో! మిమ్మల్ని చూస్తూంటే నా కెందుకో అసూయగా ఉంది'' అని మనసారా నా కళ్ళలోకి చూసి నవ్వేశాడు.

నేనూ నవ్వేను. ఆనంద పారవశ్యంలో అతని కళ్ళు చెమ్మగిల్లాయి.

"మీరు చైతన్య ప్రభువు చరిత్ర చదివే ఉంటారు" అంటూ తన కళ్ళను తుడుచుకొన్నాడు.

''ఆయన దివ్య చరిత్ర చదవడమే కాదు. మమ్మల్ని చిన్నప్పుడు పెంచిన దాయితో కలిసి ఆ చైతన్య ప్రభువు యొక్క పవిత్రమొందిన ప్రతి ప్రదేశం సందర్శించాను. కృష్ణ సంకీర్తనం విన్నాను, ఆ నర్తనం చూశాను. నన్ను పెంచిన దాయి గొప్ప వైష్ణవ భక్తురాలు'' అన్నాను. అతడు నా చేతిలోని రేఖల్ని కాస్సేపు చూసి మీ ముఖం చూస్తుంటే ఆ చైతన్య ప్రభువు జ్ఞప్తికి వచ్చారు. ఒక్క అష్టపది పాడి అభినయించి చూపించరా?'' అంటూ ప్రాధేయపూర్వకంగా అడిగాడు. ఆయన కంఠస్వరంలో ఆప్యాయత ఉట్టిపడింది.

''నాథ హరే! జగన్నాథ హరే!

సీదతి రాధా! వాస గృహే!

పశ్యతి దిశిదిశి రహసి భవంతం
త్వ దధర మధుర మధూనిపిబంతం' అనే అష్టపదిని పాడుతూ అభినయించి చూపించాను. అతడు ఆనందాశ్రువులను జలజల రాల్చాడు. ఓఢ్రదేశ కళాభిమాని అతడు. అతడు ఆధునిక పద్ధతిలో బట్టలు వేసికొన్నా అతడొక కృష్ణ భక్తుడని అతని మెడలోని తులసి పూసలు చెప్పాయి.



''నేను మీ కేం ఇవ్వగలను? మీరు నాకన్నా చిన్న వారైనా ఈ రెండు చేతులూ ఎత్తి నమస్కరించగలను,'' అంటూనే నాకు నమస్కారం పెట్టాడు అతడు.

''మీరు పెద్దవారు. మీరు నమస్కరించడం బాగు లేదు. నా జీవితం భారత దేశ కళకు పూర్తిగా ఉపయోగ పడేలా దీవించండి'' అంటూ తల వంచాను.

''కళావాన్! నేను నమస్కరించిది నీకు కాదయ్యా! నీలో నేను దర్శించిన ఆ కళా సరస్వతికి నమస్కరించాను,'' అంటూ ఆయన నవ్వేడు.

మేం ఇలా ఇష్టాగోష్ఠిలో ఉండగానే పూనా స్టేషన్లో రైలు ఆగింది. నా వద్ద భరతవిద్య నభ్యసించిన శ్రీమతి సుచేతా జోషీ నేనున్న బోగీ వద్దకు వచ్చి నిల్చున్నారు. నేను ప్లాట్ ఫారంమీదకు దిగగానే నాకామె పాదాభివందనం చేసింది. అక్కడ ఉన్నవారంతా ఆశ్చర్యపోయి మమ్మల్నిద్దర్నీ చూస్తూ నిల్చున్నారు. ఆమె రిటైర్డు కలనల్ జోషీ గారి భార్య. ఆమె వయస్సు యాభై ఉండవచ్చు. ఆమె కొంతకాలం కథక్ నర్తనం అభ్యసించి, భరతనాట్యం నేర్చుకొనడానికి మద్రాసు వెళ్ళాలనుకొన్నారు. కాని, మద్రాసు వెళ్ళేముందు ఆమె హైదరాబాదు రావడం జరిగింది. అప్పుడామె మా నృత్యనికేతనానికి వచ్చి నన్ను కలుసుకొన్నారు. మా నాట్య సంప్రదాయం ఆమెను ఆకర్షించింది. దాంతో ఆమె మద్రాసు వెళ్ళకుండా నా వద్ద నాట్యం అభ్యసించారు. నా మాతృమూర్తి జీవించి ఉంటే, అమెకు ఈమె వయస్సు ఉంటుంది. ఆమె నాకు పాదాభివందనం చేయడం, అందరూ ఆశ్చర్యపోవడం, ఆ సంఘటనను నే నెన్నడు మరచిపోలేను.

ఆమె నా వద్ద నాట్యం నేర్చుకొంటానన్నప్పుడు నేను వెంటనే మాట ఇవ్వడానికి జంకేను. ఆమె నా మనస్సులోని భావాలను గ్రహించి, "గురూజీ! నేను వయస్సులో మీకన్నా పెద్దదాన్నే అయినా నాట్య విద్యలో, కళా విజ్ఞానంలో మీ ముందు నే నొక పసిదాన్ని. మీరు నాకు విద్యాదానం చేయండి. మీ నిబంధనలన్నింటికి కట్టుబడి, మీ వద్ద మీ పద్ధతిలో నాట్యం నేర్చుకొంటాను మీరు సంశయించకుండా అంగీకరించండి" అని తన మనస్సును విప్పిచెప్పింది. ఆమె క్రమ పద్ధతిలో నా వద్ద నాట్యం నేర్చుకొని, హైదరాబాద్‌లో ప్రదర్శన నిచ్చి పూనా వెళ్ళిపోయారు. ఆమెలోని ఆ ఉత్సాహం, ఆ దీక్ష నేటి యువతరంలో కానరాదంటే అతిశయోక్తి కాదు.

అయితే నేనామెను ఒకటి కోరాను. "ఆంధ్రుల నర్తన విద్యకు విశేష ప్రచారం లేదు. అది పరిపూర్ణమైన దయినా ప్రచారం లేకపోవడంవల్ల ఆ యపూర్వ కళారీతి మరుగువడి ఉంది. మా ఆంధ్రుల నర్తన రీతిని మీరు మీ విద్యార్థులద్వారా మహారాష్ట్రంలో ప్రచారం చేయాలి." అందుకామె అంగీకరించింది. పూనాలో ఆమె ఒక నాట్య విద్యాలయాన్ని నెలకొల్పి,

మన ఆంధ్ర నాట్యరీతులను బోధిస్తూ తమ వాగ్దానాన్ని నిలబెట్టుకొన్నారు.

శ్రీమతి జోషి ఫలహారం తెచ్చి యిచ్చారు. రైలు కదిలేవరకూ నేను, ఆమె, ఆమె భర్త, నాతోటి ప్రయాణికులు కలిసి యిష్టాగోష్ఠిగా నృత్యకళను గురించి చర్చించాం.

ఆ సంవత్సరం క్షేత్రజ్ఞుని త్రిశత జయంతిని భారీ యెత్తున భారత ప్రభుత్వం చేసింది. ఆ సందర్భంలో బొంబాయిలోని ఆంధ్రసభవారు క్షేత్రయ్యను గురించి ఉపన్యసించి, క్షేత్రయ్య పదాలను పాడి అభినయించగల కళాకారుని పంపించవలసిందిగా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారిని కోరారు. ఆ కోర్కెను పురస్కరించు కొని అకాడమీ వారు నన్ను పంపారు. ఆనాటిదే ఈ రైలు ప్రయాణం.

"కళాకారుని జీవితం చాలా పవిత్రమైంది. ఆ పవిత్ర తను కళాకారులు అర్థం చేసికొని తమ జీవితాన్ని వారు సార్థకం చేసికోవాలి. దైవసాన్నిధ్యానికి ఉత్తమమైన, సులభ మైన, దగ్గర మార్గం సంగీతం. కళాకారుడు ఉన్నత కళా స్థాయిని చేరుకోగల్గినప్పుడు దాని పరమార్థాన్ని గూడా తెలిసి కొనడానికి అతడు ప్రయత్నించాలి,....'' ఈ విధంగా ఆ వృద్ధ కళాభిమాని చెప్పుకొనిపోతున్నాడు. నేను దీక్షగా ఆయన ప్రసంగం వింటున్నాను.

"రామకృష్ణా! నీకు భగవంతుడు విద్యా, బుద్ధీ, మధురమైన కంఠం, శరీర సౌష్ఠవం అన్నీ ఇచ్చాడు. కేవలం మానవ మాత్రులను ఆనందపరచడంలోనే నీ కళను వ్యయపరచక పరమాత్మని సాన్నిధ్యం కోసం ప్రయత్నించు. అప్పుడే నీ కళ సార్థక మవుతుంది. ఆర్థికావసరాల కోసమే కాక పరమార్థంకోసం కళను ఆరాధించి జన్మను తరింప జేసికో. చైతన్యప్రభువు, విద్యాపతి, మీరాబాయి, సూరదాసు మొదలైన వారంతా ఇలాంటివారే.

"మానవ హృదయంలోని పవిత్రతను చూడగల్గినవాడే ఉత్తమోత్తమమైన కళారాధనను జేయగల్గుతాడు. అలాంటి వారి వల్లనే సంఘానికి, దేశానికి, లోకానికి కొద్దిగానైనా మేలు కలుగుతుంది. కాసులకు కళ నమ్ముకొన్నవారు లోకానికి ఏ విధంగా ఉపయోగపడతారు?

"తనలోని తనను సాక్షాత్కరింప జేసుకొన్నవాడే అత్యుత్తమ కళాజీవి, ఆ కళాకారుడే లోకానికి శాశ్వత కళాఖండాలను కొన్నిటినైనా అందివ్వగల్గుతాడు. జీవితంలో దీనినే ఆదర్శంగా పెట్టుకో.''

నేను శ్రద్ధగా వింటూ కూర్చున్నాను. ఇంతలో మా బండి మాకు తెలియకుండానే బొంబాయి చేరింది. ఆంధ్రసభ సభ్యులు కొందరు వచ్చి నన్ను కలుసుకొన్నారు. ఆ కళాభి మాని, నేను విడిపోక తప్పలేదు. కాని ఆయన చెప్పిన ప్రతి మాట నా మనస్సును విడిచిపోలేదు. శ్రీమతి జోషి నా యెడలచూపిన గురుభక్తి నా హృదయంలో మెదలుతూనే ఉంది.



బొంబాయి ఆంధ్ర సభవారి ఉత్సవాల్లో 'క్షేత్రయ్య పదాలు - అభినయం' అన్న విషయం గురించి నేను ఉపన్య సించాను. దక్షిణాది నృత్యకళలో అభినయ విద్యకు ఒక ప్రత్యేక విశిష్టతను చేకూర్చిన మహాపురుషుడు క్షేత్రయ్య. కృష్ణాజిల్లాలోని కూచిపూడికి దాపుననున్న మొవ్వకు ఇతడు

చెందినవాడైనా ఉత్తర అర్కాట్ జిల్లావాడని, చిత్తూరుజిల్లా వాడని పలువిధాలుగా కొందరు చరిత్రకారులు ఇతని గురించి వ్రాస్తూ వచ్చారు. ప్రభుత్వంవారి సంగీత పరీక్షా గ్రంథాల్లో గూడ ఈ విధంగా రచింపబడడంవల్ల ఆతని యదార్థచరిత్ర మరుగుపడిపోయింది. ఆయన వాస్తవ చరిత్రను వెలికి తీసి లోకానికి ఎరుకపరచినవారు కీ.శే. విస్సా అప్పారావుగారు. క్షేత్రయ్య మొవ్వపురి వాసి అని ఆయన రుజువు చేశారు. వారి వంశీయులను కలిసి, వారి వంశ చరిత్రను సేకరించి కళా లోకానికి అందించిన వారు అప్పారావుగారు. మొవ్వ గోపాల స్వామి ఆలయం వద్ద ఉత్సవాలను ప్రత్యేకంగా ఏర్పాటుచేసి ప్రఖ్యాత దాక్షిణాత్య సంగీత విద్వాంసురాండ్రైన శ్రీమతులు బృంద, ముక్త, అభిరామ సుందరి మొదలైన వారిని ఆహ్వానించి కచ్చేరీలు చేయించారు. క్షేత్రయ్య ఆరాధించిన మువ్వ గోపాలుని సేవించి, క్షేత్రయ్య పదాల ప్రచారానికి ఎంతో సేవ ఆయన చేశారు. విశాఖపట్నంలో నే నుండిన కాలంలో 'క్షేత్రయ్య పదాభినయ ప్రచార సమితి' నొకదానిని ఆయన స్థాపించి, క్షేత్రయ్య పదాల అభినయ ప్రచారానికి దోహద కారులైనారు.

రస నిలయాలు క్షేత్రయ పదాలు. వీటిని మించి అభినయానికి అంతటి అనుకూలమైన ఉత్తమ రచనలు వేరొక భాషలో లేవనిచెప్తే సాహసం అనిపించుకోదు. క్షేత్రయ 4500 పదాలు రచించినట్లు తెలుస్తున్నది. కాని, మనకు సుమారు 400 పదాలు మాత్రమే లభ్యమైనాయి. వాటిలో ఒక వంద పదాల వరకు మాత్రమే ప్రచారంలో ఉన్నాయి. మా గురువుగారు శ్రీమతి రాజమ్మగారు 300ల క్షేత్రయ పదాలను అభినయించేవారు. వ్యాఖ్యానంతోగూడ ఆమె ఆ పదాలను వ్రాసి పెట్టుకొన్నారు. ఈ పదాల అభినయ ప్రచారంలో నే నొక ముఖ్య కళాకారుణ్ణి గనుక, వాటిని పాడే తీరు, అభినయించే తీరు వాఖ్యాన సహితంగా నేను ప్రచారం చేస్తూ ఉండడం వల్ల ఆ పద సాహిత్యంతో నాకు సన్నిహిత సంబంధ ముంది. ఆ పదాల అభినయం గురించి నేనొక చిన్న గ్రంథం గూడ వ్రాశాను.

ఆలిండియా రేడియో డైరెక్టర్‌గా ఉండిన శ్రీ ఎస్. ఎన్. మూర్తి గారింటివద్ద కొంత మంది మిత్రులం ఒక రోజున సమావేశమైనప్పుడు కొంతమంది మిత్రులు క్షేత్రయ పదాలను అభినయించి చూపించమని కోరగా నేను అభినయిస్తున్నాను. ఆ సమయంలోనే ప్రఖ్యాత కళాకారుడు హరీంద్ర నాథ చట్టోపాధ్యాయగారు అక్కడికి వచ్చారు. వారితో నాకంతకు ముందు ఎక్కువ పరిచయం లేదు. ఆయన కూడా నా అభినయం చూసి ఎంతో ముచ్చట పడ్డారు.

"ఎందుకు వచ్చేను కోప
మెవ రే మన్నారు?
అందు కిందుకు సరి
ఆయెరా మువ్వగోపాలా!" అన్న పదానికి నా అభినయం ముగియగానే "మీరు హిందూస్థానీ ఠుమ్రీలనుగూడా అభినయిస్తారా? ఠుమ్రీ పదమంత ప్రసిద్ధమైంది కాక పోవచ్చు గాని దాని భావాన్ని దక్షిణాది అభినయరీతిలో మీవంటివారు అభినయిస్తే దానికొక విశిష్టత చేకూరుతుందని అనుకొంటున్నాను" అన్నా రాయన.

"సాచికహే ముసే బతియా
కహా గమాయీ సారే రతియా" అనే ఖండిత నాయిక ఠుమ్రీని,

"యాహి మాధవ! యాహి కేశవ
మావద కైతన వాదం
తామనుసర సరసీరుహలోచన
యాతన హరతి విషాదం" అనే జయదేవుని ఖండిత అష్టపదిని,

"ఇందెందు వచ్చితివిరా
అలదాని ఇల్లు
ఈ వీధిగాదు పోపోరా!
మందరగిరి ధరుడైన
మా మువ్వగోపాలా!
కుందరదన మది కోరి
ఇందు వచ్చితివా" అనే సామాన్య, ఖండిత క్షేత్రయ పదాన్ని (ఇది కస్తూరి రంగని పదమని కొందరంటారు గాని మేం మువ్వగోపాల ముద్రతోనే నేర్చుకొన్నాం.)-

"ముందటి వలె నాపై
నెన రున్నదా స్వామీ?
ముచ్చట లిక నేలరా?
ఎందుకు ముఖ మిచ్చకపు
మాట లాడేవు?
ఏరా! మా మువ్వగోపాల
మేరగాదురా!" అనే స్వీయ నాయిక ఖండిత క్షేత్రయ్య పదాన్ని అభినయించి ప్రదర్శించాను.

భావ మంతా ఒక్కటే, అనుభూతి ఒక్కటే, కాని భాషనుబట్టి, సంగీత బాణీనిబట్టి భావ విన్యాసంలో తేడా లుంటాయి. భావ విన్యాసం అంటే పాద హస్త విన్యాసాలు, సాత్విక వికాసం. ఉత్తరాదిలో కంటే దక్షిణాదిలో సాత్వికాభినయం, సంచారుల విన్యాసం విశిష్టరీతిలో రూపొందాయి గనుక ఆ విద్యలో శాస్త్రీయత ఎక్కువగా గోచరిస్తుంది. ఆ భాష నుడికారం, జాతీయత తెలిస్తే ఉత్తమీలను దక్షిణాది కళాకారులు అతి రమ్యంగా అభినయించవచ్చును. నేను కొంతకాలం ఉత్తరాది బాణీలో అభినయాన్ని అభ్యసించాను. అందువల్ల ఈ విషయాన్ని నేను గ్రహించగలిగాను. పైని చెప్పిన నాలుగు పదాలను వెనువెంటనే నభినయించగానే ఆయన పరమానందభరితుడై నన్ను కౌగిలించుకొని, "చాలా బాగుంది నీ అభినయం చిరంజీవి! నీ కళ చిరకాలం వర్ధిల్లాలి. రెండు బాణీలను చక్కగా అభినయించి చూపించావు. ఇది చాలా అసాధారణమైన విషయం. నేను మరికొద్ది సేపట్లో ఢిల్లీకి బయలుదేరాలి. లేకపోతే ఈ రోజంతా నీతో గడిపి నీ అభినయాన్ని మరింత చూసేవాణ్ణి!" అంటూ ఆయన వెళ్ళిపోయారు.

హరీంద్రుని బహుముఖ ప్రజ్ఞని తెలియనివారు మన దేశంలో లేరు. స్వర్గీయ సరోజినీదేవికి ఈయన సోదరుడు. ఈయన కవి, గాయకుడు, నటుడు, నర్తకుడు. ఇదీ అదీ అని ఏమిటి- కళ లన్నింటిలోను ఆయనకు ప్రవేశముంది. అంతటి ప్రజ్ఞాశాలి నన్ను ఆశీర్వదించి మెచ్చుకొన్నందుకు నేనెంతో సంతోషించాను.

విలంబితలయలో రక్తి రాగాలలో పాడుతూ, సంచారీ భావాలను అభినయించడానికి అనువైనవి క్షేత్రయ పదాలు.

క్షేత్రయకు పూర్వం దక్షిణాది ఆట కచ్చేరీలో అభినయం ఒక ప్రత్యేక కళగా - అంటే శుద్ధ సాత్వికాభినయ ప్రాధాన్యత కలిగినదిగా రూపొందలేనని చెప్పవచ్చును. శ్లోకాలను, కొన్ని దరువులను, గీతాలను అభినయించేవారే గాని నాయికాభినయంలో ఒక ప్రత్యేక కళగా అది వికసించలేదు. ఆ కళా సృష్టికి కారకుడు క్షేత్రయ్యే. ఆనాటినుండి నేటివరకు ఇంతవరూ అటువంటి సాహిత్య సంపదను సృష్టించలేదు. ఇంక ముందు ఎవరూ సృష్టించలేరు. ఈ పదాలు విలంబిత తాళ లయాశ్రితాలై, నృత్యానికి ఉపకరించవు. క్షేత్రయ పదాలకు నృత్యమాడేవారు నర్తకులు కారనే చెప్పవచ్చును.



ప్రతి పదానికి ఒక్కొక్క ప్రత్యేక రాగాన్ని అతడెన్నుకొన్నాడు. ఆ పదాలలో వివిధ నాయికల అనుభూతుల్ని చక్కగా పొందుపరిచాడు. తగిన రాగం, ఆ రాగంలో భావాన్ని ముచ్చటగా పొందుపరచి కవిత నల్లడం అతని ప్రత్యేకత, అది అతని సొమ్ము. అతని పదాలు చాలావరకు విలంబిత లయలో నడిచే త్రిపుట తాళంలో ఉంటాయి. అభినయానికి అనుకూలమైంది ఈ తాళం. ఆంగికం, వాచికం, ఆహార్యం, సాత్వికం అనే నాలుగు విధాలైన అభినయాల్లో వాచికం, సాత్వికం పదాభినయానికి ప్రాముఖ్యమైనవి. పదాల్ని అభినయించడం ఎంత కష్టమో దానిలోని రసాన్ని ప్రేక్షకులకు అందించేలా పాడడం కూడా అంత కష్టం. సంగీతాన్ని సాధన చేసినంత మాత్రాన పదాలను రసవంతంగా పాడడం సులభం కాదు. ఈ పదాభినయం దక్షిణాదిలోని స్త్రీ కళామూర్తుల సొత్తు దక్షిణాది అంటే నేటి ఆంధ్ర తమిళ కర్ణాటక ప్రాంతాలు. కూచిపూడి భాగవతానికి లేక మరే ఇతర దక్షిణాది భాగవతానికి ఈ అభినయ విద్యకు ఎటువంటి సంబంధం లేదు. భాగవత పాట పద్ధతి, కేళికారీతి 'దేశి' సంప్రదాయానికి చెందినవి.

పదాభినయం ముఖ్యంగా రెండు విధాలైనది:

1. ఒక పదాన్ని అభినయించే నర్తకి ఆ పదంలోని నాయికను అభినయించి చూపించాలి.

2. తానే ఆ నాయికై, ఆ యనుభూతుల్ని ప్రేక్షకులకు నర్తకి పంచిపెట్టాలి.

ఈ రెండింటిలో రెండవది చాలా కష్టమైన పద్ధతి, శ్రేష్టమైన పద్ధతి. సహజ సౌందర్యంతో నాయిక ప్రేక్షకుల ముందు ఈ పద్ధతిలో ప్రత్యక్షమౌతుంది. అయితే, ఈ పద్ధతి ఆట ఏ కొద్దిమందికో గాని అలవడదు. శాస్త్రపఠనం, గ్రంథ పరిశోధన, పరిశీలన, శాస్త్రీయమైన శిక్షణ దీనికి చాలా అవసరం. నర్తకి తానే ఒక పదాన్ని పాడుతూ అభినయించ గల్గితే అది మరింత శ్రేష్టమైన పద్ధతి. దానిని పరాకాష్ట నందిన విద్యగా పరిగణించ వచ్చును. ఇలాంటివారు దేశంలో అరుదై పోతున్నారు. అభినయం నానాటికి మరుగుపడి పోతూంటే కేవలం నృత్త నృత్యాలతో సంతృప్తి చెందుతూ, వాటినే భారతీయ నర్తన విద్యగా భావించే దశకు మన నర్తకులు దిగజారిపోతున్నారు. ఈ యభినయ విద్యను మళ్ళా ప్రచారంలోకి తీసుకొని రావడం ఎంతైనా అవసరం. ఈ యభినయ విద్యలో ప్రఖ్యాతులైనవారు పూర్వం ఎందరో ఉండేవారు. వారు పదాభినయాన్ని తప్పితే వేరొక దానిని ప్రదర్శించేవారు కారు. నేడు పదానికి, జావళికి, కీర్తనకు తేడా తెలియని గురువులు నాట్యాచార్యులుగా చెప్పుకొంటున్నారు. వారి శిష్యులచేత ప్రదర్శన లిప్పిస్తున్నారు. నర్తన విద్య తెలియని విమర్శకులు ఆ ప్రదర్శనలను మెచ్చుకొని పొగుడుతున్నారు. వీనివల్ల అత్యుత్తమైన కళారీతి అంతరించి పోయే ప్రమాదం ఆసన్నమౌతున్నది. అభినయ విద్యను ఈ ప్రమాదంనుండి కాపాడ వలసిన బాధ్యత మన యువ కళాకారులపైనే ఉంది.

క్షేత్రయ్య పదాలను పాడుతూ, అభినయిస్తూ పైని చెప్పిన అంశాలను ముచ్చటిస్తూ బొంబాయి ఆంధ్రసభలో ప్రసంగించాను.

నా తిరుగు ప్రయాణంలో పూనాలో దిగాను. పూనాకు చేరువలో నున్న కొండల్లో పార్వతీదేవి ఆలయ ముంది. ఆ దేవిని సందర్శించడానికి ఒక సాయంకాలం పూట వెళ్ళాను. సూర్యుడు కొండల చాటుకు పడిపోతున్నాడు. ఒంటరిగా ఆలయపు మెట్లమీద కూర్చుని ఆలోచిస్తున్నా. "తనలో తనను సాక్షాత్కరింపచేసుకొన్నవాడే ఉత్తమ కళాకారుడు!'' ఎంత చక్కగా చెప్పాడా ఉగ్ర కళాభిమాని!

కాళహస్తిలో నా నర్తన శిక్షణను ముగించి నేను వెళ్ళిపోయేముందు మా గురువుగారు కూడా అలాగే చెప్పారు. ''నీలో నన్ను నున్న సాక్షాత్కరింప చేసికో గల్గినవాడు నీవు కళల పరమార్థాన్ని సాధించ గలుగుతావు. అది కళోపాసనగా పరిణమిస్తే నీవు ఉత్తమ కళాకారుడిగా వెలుగొంద గలవు. దానిని నీవు ఆధ్యాత్మిక దృష్టితో సాధన చేస్తే నీవు భగవత్ సాన్నిధ్యాన్ని పొందుకొంటావు'' అని అన్నా రామె.

''తనలోని తనను చూసుకోవడమంటే తనలో దైవత్వాన్ని ప్రతిబింబింపచేసికొనడమన్నమాట! యోగులు, ఋషులు ఈ ఆత్మ సాక్షాత్కారాన్ని ఎంతటి కఠిన తపస్సు చేసి సాధించవలసి ఉంటుందో గాని, నర్తన కళాకారులు కడు సులభంగా ఈ మార్గాన్ని అనుసరించి సాధించవచ్చును.'' ఈ విధంగా నా ఆలోచనలు పరుగులు తీశాయి.

వాస్తవానికి సంఘంలో కళాకారునికి ఎంతటి ఉన్నత స్థాన ముందో తెలియజేసే మరి కొన్ని సంఘటనలు జ్ఞప్తికి వచ్చాయి.

నేను వృత్తి కళాకారుడిగా ప్రదర్శనలిస్తూండే కాలంలో ఒకసారి మధురలోని ఒక కృష్ణ మందిరంలో నృత్య కేళిక చేశాను. కృష్ణుని వేషం ధరించి, నారాయణ తీర్థులవారి తరంగాలకు నృత్యం, వ్రజ భాషలోని కొన్ని కృష్ణ గీతాలకు అభినయం ఆ కేళికలో ప్రదర్శించాను. ఒక శతవృద్ధుడు ఆ కేళిక ముగిసిన వెంటనే నా దగ్గరకు త్వరత్వరగా వచ్చి కృష్ణుని వేషంలో ఉన్న నాకు పాదాభివందనం చేశాడు. ''బాబూ! నీలో ఆ గోపాల్‌జీని దర్శించుకో గలిగాను!'' అంటూ ఆనంద బాష్పాలను రాల్చారు.

కొన్ని సంవత్సరాల క్రితం ఒక వృద్ధ కళాభిమాని మా నృత్యనికేతనానికి వచ్చారు. ఆమె ప్రపంచమంతా పర్యటించారు. భారతీయ, పాశ్చాత్య నర్తక నర్తకీమణుల నాట్యాల నెన్నిటినో చూశారు. ఆమె మా విద్యార్థుల శిక్షణను, ప్రదర్శనలను గూడ చూసి, ''మధురానగరిలో....''

అన్న పాటను ప్రత్యేకంగా పాడి, అభినయించి, చూపించమని కోరారు. దీని కోసం ప్రత్యేకంగా మరోసారి వారి కుటుంబ సభ్యులంతా వచ్చారు.

''మధురానగరిలో చల్లనమ్మ బోదూ
దారి విడుము కృష్ణా, కృష్ణా....''
''మావల్ల గాదమ్మా దేవీ యశోదా!
నీ సుతు దుడుకులు మాటి మాటికి తెల్ప'' అనే ఈ రెండు జావళీలను అభినయించి చూపించాను. ఆ తర్వాత వారి కుటుంబ సభ్యుల్లో కొందరు జానపద గీతాలను ప్రదర్శించమని కోరారు.

'అంత గొప్ప కళా ఖండాలను సందర్శించాం. ఆ ఆనందానుభూతిలో విహరిస్తూ జానపద గేయాలను అభినయించమని కోరడం భావ్యం కాదు' అని ఆమె వారిని వారించి, నాకు ధన్యవాదాలు అర్పించి, నాకు యాభై రూపాయలు బహూకరించి నా పాదాలకు నమస్కరించి, ''నాయనా! శ్రీకృష్ణుని బాల్యక్రీడలు నా కళ్ళకు కట్టినట్లు అభినయించావు. ఆ పరమాత్ముని లీలల నారాధిస్తూ జన్మను తరింపజేసికొంటున్నావు. నీవు ధన్యుడివి!'' అంటూ ఆమె వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళింది.

కళారాధకుని జీవిత లక్ష్యమేమిటి? ఎంతటి ఉన్నత పవిత్ర భావాలతో, ఉత్తమ ఆదర్శాలతో అతడు జీవించాలి? తనలోని దైవత్వాన్ని ప్రేక్షకులకు సాక్షాత్కరింప జేయాలి. ఒక్కసారైనా ఆ దైవసాన్నిధ్యాన్ని, ఆ దివ్యానుభూతిని చవి చూడాలి. ఆనాడే ఆతని జన్మ సార్థకమవుతుంది. అందువల్లనేమో కళోపాసకులను ఋషులతో పోల్చారు మన ప్రాచీనులు.

కళాకారుడు తన సాధన సంపత్తి, పాండితీ ప్రతిభల చేతనే సామాజికులకు దివ్యలోక సందర్శన గావిస్తున్నాడు. తాను స్వయంగా ఆ దివ్యలోకానుభూతిని పొంది, తర్వాత ఇతరులకు సందర్శింపజేసినప్పుడు వా రింకెంతటి ఉన్నత శిఖరాలను చేరగలరో!

దైవంలో లీనమవడమే భారతీయ కళల గమ్యస్థానమని మన పూర్వు లన్నారు. ఈ విధంగా ఆలోచనలు సాగుతూండగా చీకటి పడింది.

''మాష్టర్ జీ! చీకటి పడింది. మళ్లా ఏదైనా ఒక కొత్త గ్రంథాన్ని రాస్తున్నారా?'' అంటూ శ్రీమతి జోషి నా ఆలోచనల నుండి నన్ను మేల్కొలిపారు.

''నన్ను నేను తెలిసికొనడానికి ప్రయత్నిస్తున్నాను'' అంటూ స్వాప్నిక జగత్తునుండి ఈ లోకానికి వచ్చి, ఆమెతో కలిసి వారి గృహానికి చేరుకొన్నాను.

ఇటువంటి సహృదయ కళాకారుల సాంగత్యం నా జీవితాన్ని సరిదిద్దడానికి ఎంతో సహాయ పడింది. నన్నొక ఆదర్శ కళోపాసకునిగా తీర్చిదిద్దింది. అయితే, కళాకారుని జీవితం ఒక పూల పాన్పు కాదని చెప్పడానికి ఒకటి రెండు సంఘటనలను, అవసరం గనుక, తెలియజేస్తున్నాను.

సుమారు పది సంవత్సరాలు నా వద్ద నృత్యకళ నభ్యసించి, ప్రభుత్వ నృత్య పోటీలలో ప్రథమ బహుమతులను అందుకొని, ఎన్నో బహిరంగ ప్రదర్శనలను ఇచ్చి, పండితుల ప్రశంసలను అందుకొని, భారత ప్రభుత్వంవారి స్కాలర్ షిప్‌లను సంపాదించుకొని, ఆ తర్వాత - గురువుగారు ఏమీ నేర్పలేదు, నేర్పడం లేదు. తప్పులు చెప్పారు అంటూ నా శిష్యులలో ఒకరు నాపైని దుష్ప్రచారం చేసి ఇతరుల వద్దకు వెళ్ళారు. అందులో వింత ఏమీ లేదు. అది సామాన్య మానవుల లక్షణం. అయితే, మరొక వ్యక్తి తన పిల్లలకు నా వద్దనే నృత్య శిక్షణ ఇప్పిస్తూ, నాకు ఆఖరి రోజు వరకు తెలియకుండా ఆ శిష్య కళాకారిణికి వేరొక గురువు వద్ద శిక్షణను ఏర్పాటు చేయడంలో సంపూర్ణ సహకారాన్ని అందజేయడం నాకు అమిత ఆశ్చర్యాన్ని కలుగజేసింది. అంత అపకారం నాకు చేసినా నేనా వ్యక్తితో ఆ విషయాన్ని ప్రస్తావించలేదు. ఆతని పిల్లలకు నాట్యం నేర్పుతూనే వచ్చాను. ఆఖరికి తన తప్పుకు తానే బాధ పడ్డాడేమో - తన పిల్లల్ని గూడా నా వద్దకు పంపడం మానుకొన్నాడు. మొదట్లో ఈ సంఘటన నన్ను బాధించినా - రాను రాను ఇటువంటి వాటికి అలవాటు పడిపోయాను.

నాకు ఆప్తులైన వృద్ధ దంపతులు ఒక రున్నారు. వారికి లలితకళ లందే చాలా ప్రీతి. మా ప్రతి ప్రదర్శనానికి వారు వస్తూ ఉంటారు. ముసలివారు గనుక వారికి ఆధ్యాత్మిక చింతన ఉండడం సహజం. స్వాములవారిని, సంత్, మహంత్

లను సందర్శించడం, తీర్థయాత్రలు చేయడం, పుణ్యస్థలాలను సేవించడం వారికి అలవాటు. ఎవరైనా పెద్దలు ఊళ్ళోకి వస్తే వారిని ప్రత్యేకంగా వారింటికి ఆహ్వానించేవారు.

నీలగిరి ప్రాంతం నుండి వచ్చిన ఒక వృద్ధస్వాముల వారిని వారొకనాడు మా నృత్యనికేతనానికి తీసికొనివచ్చారు. ఆ స్వామీజీకి నృత్య, సంగీత కళలంటే చాలా ప్రీతి. వారి పూర్వాశ్రమంలో సంగీతం పాడేవారట. వారు చూస్తానంటే ఒక గంటసేపు నేను నర్తనమాడేను. వారు చాలా ఆనందించారు, ఆశీర్వదించారు. ఒక వద రూపాయల నోటును నాకు బహూకరించారు. నేను ఎప్పుడు పెద్దలను దర్శించినా ఏవో కొన్ని ఫలాలను సమర్పించుకొనడం నాకు అలవాటు. అట్టిది వారు నన్ను సత్కరించడం, ఇదే ప్రథమం. అందువల్ల నాకు ఆశ్చర్యం కలిగింది.

"స్వామీజీ ప్రసన్నులయ్యారు. ఈ కానుకను పుచ్చుకోండి, మీకు మేలు కలుగుతుంది" అని వారితో గూడా వచ్చిన ఒక శిష్యుడు అన్నారు. స్వామివారు వెళ్ళిన తర్వాత ఆయన మహత్తును గురించి ఆ శిష్యుడు వేనోళ్ళ కీర్తించాడు.

ఇంతవరకూ బాగానే ఉంది. అయితే, కొన్ని నెలల అనంతరం వేరొక ప్రసంగంలో ఆ స్వాములవారి పేరెత్తినప్పుడు ఆ శిష్యుడే ఆ స్వాములవారిదంతా మోసం, ఆయనలో ఏ మహత్తూ లేదని నిందించడం నాకు చిత్రంగా తోచింది, ఎంతో బాధ కలిగింది.

ఇంతకూ అసలు విషయం ఏమిటంటే, మహాత్ములు ఎవరైనా వచ్చినప్పుడు, జన సామాన్యంలోని అనేకమంది భక్తులు ఆధ్యాత్మిక దృష్టితో గాక తమ సాంసారిక ఇబ్బందులను, సమస్యలను పరిష్కరించమని వారిని కోరతారు. తమ కోరికలు ఫలించాలని తహతహ లాడుతూ ఎదురు చూస్తారు. బ్రహ్మచారైన స్వాముల వారిని బిడ్డలను ప్రసాదించమని కోరడంలో సారస్యం ఏమిటో నాకు బోధపడదు, హనుమంతుని గుడిచుట్టూ బిడ్డల నిమ్మని ప్రదక్షిణ చేసినట్టు. ఇటువంటి కోరిక నెరవేరక నిరాశ చెందినవారు ఆ మహాత్ముల గురించి దుష్ప్రచారం ప్రారంభిస్తారు. అదే నీలగిరి స్వాముల వారికి జరిగింది. ఆయనను తమ ఇంటికి ఆహ్వానించిన వారే వారిని దూషించడం ఘోరం.

మానవునిలోని స్వార్థం ఎంత నీచానికైనా దిగజారుస్తుందని చెప్పడానికి మరొక చిత్రమైన సంఘటనను ఇక్కడ తెలియజేస్తాను.

ఒక రోజున ఒక మిత్రుడు మా యింటికి వచ్చాడు. అతడు ఒక కుంకుడు కాయంత రవ్వ తెచ్చి, "రామకృష్ణా! ఇది చాలా ఖరీదయిన రాయి. కొన్నాళ్ళ పాటు నీ దగ్గర జాగ్రత్తగా దాచి ఉంచు" అన్నాడు.

అంత ఖరీదైన రాయిని తన దగ్గరే ఉంచుకోక నా వద్ద ఎందుకు ఉంచమంటున్నాడు? అతని ఇంట్లో కన్నా నా యింట్లో చాలా భద్రంగా ఉంటుందనా? దాని విలువ వారికంటె నాకెక్కువ తెలియదే! ఇటువంటి ఆలోచనలు నాకు రాలేదు. మిత్రుని మాట కాదనలేక సహృదయంతో దాన్ని నేను నా గాడ్రేజ్ అల్మారాలో దాచిపెట్టాను.

ఆ రాయిని అతడిచ్చిన వేళా విశేషమో, దాని దోష కారణమో, లేక నా శని రోజులో కాని, అది నాదగ్గరకు వచ్చిన మరికొన్ని నెలలోనే విశేష కీర్తిని ఆర్జించిన మా బాలె ట్రూపుకు విశేషమైన నష్టం కలిగింది. దాంతో దాన్ని మూసివేశాము. చివరకు మా నృత్య నికేతనం కోసం ప్రత్యేకంగా కట్టిన భవనాన్ని కూడ అమ్మివేశాం. అయినా, ఇదంతా ఆ రవ్వ ప్రభావమై యుండవచ్చునన్న సందేహం నాకు ఇసుమంతయినా కలగలేదు.

మా భవనాన్ని అమ్మిన తర్వాత వేరొక అద్దె ఇంట్లోకి నేను మారిన మరునాడు ఆ మిత్రుడు నన్ను చూడ్డానికి వచ్చాడు. కుశల ప్రశ్నల అనంతరం 'రామకృష్ణా! ఆ రవ్వని ఏం చేశావు? అందులో ఏదో గొప్ప దోషముంది. ఆ విషయం తెలియక మా నాన్నగారు దానిని కొన్నారు. దాన్ని కొన్న తర్వాత మా కుటుంబానికి ఎన్నో కష్టనష్టాలు వచ్చాయి. దానిని ఒక నిపుణుడు చూసి, దానిని వేరొకనికి దాని విషయం చెప్పకుండా ఇస్తే దాని దోషం పోతుందని చెప్పాడు. అందుకే నేను నీ వద్ద దాచిపెట్టాను'' అని ముసి ముసి నవ్వులు నవ్వుతూ అమాయకుడిలా చెప్పాడు.

నాకు నవ్వాలో, ఏడ్వాలో తెలియలేదు. దాని దోషం నన్ను కొట్టడంవల్లనే కాబోలు కొన్ని లక్షల ఆస్తి నష్టం

నాకు కలిగింది. ఏమయితేనేం; దానిని తిరిగి తీసికొని వెళ్ళ మని అతనితో చెప్పాను.

''నేనేం చేసుకోను? ఇంకెవరికైనా ఇచ్చేయి'' అన్నా డతడు.

తెలిసి, తెలిసి, ఇంకొకర్ని నాశనం చేసే రాయిని వేరొకరికి ఇవ్వాలంటే నాకు మనస్కరించలేదు. ''అయితే దాన్ని చెరువులో పారేయనా?'' అని అడిగాను.

''దానివల్ల లాభంలేదు. ఈ దోషం విషయం చెప్ప కుండా నీవు ఇంకొకరికి ఇస్తేగాని దాని ప్రభావం నుండి నీకు విమోచనం కలగదు'' అంటూ హితోపదేశం చేశాడు.

కొన్ని నెలలుగా అది నా యింట్లో ఉంటున్నా అది నాకు బరువు అనిపించలేదు. విషయం తెలిసిన తర్వాత ప్రతి నిమిషం నేనెంతో బరువును మోస్తున్నట్టు అనిపించ సాగింది. రాత్రీ పగలూ దాన్ని ఎలా వదుల్చుకొనడమా అన్ని ఆలోచనతో నిమిషం ఒక యుగంగా గడుపుతూ వచ్చాను. ఏం చేయాలో తోచలేదు. నా స్వార్థంకోసం తెలిసి తెలిసి ఇంకొకర్ని కష్టాలు పాలు చేయడం మానవత్వం కాదని నా అంతరాత్మ నన్ను హెచ్చరించింది. ఆలోచించగా, ఆలోచించగా ''సృష్టికర్తయిన ఆ భగవంతుడు మంచికీ, చెడుకీ అన్నింటికీ మూలకారకుడు. దేనినైనా భరించే శక్తి ఆయనకే ఉంది. ఆ రవ్వకూడా ఆయన సృష్టే. దాని మంచి చెడ్డలను భరించే శక్తి ఆయనకే ఉంది" అని నాకు తోచింది. ఒకనాటి ఉదయమే ఒక ఆలయానికి వెళ్ళి, దానిని ఆ భగవం తునికి అర్పించుకొన్నాను. ఆ రవ్వ ఇంకెవ్వరినీ బాధించలే దన్న దృఢ విశ్వాసంతో హాయిగా గాలిపీల్చుకొన్నాను. నా తలమీద భారం పోయింది.

ఈనాడు కూడా ఆ మిత్రుడు నన్ను తరచు కలుసు కొంటూ ఉంటాడు. తనవల్ల నాకెంతో నష్టం వాటిల్లినదన్న విషయం అతనికి తోచకపోవడం ఒక విచిత్రమైన విష యంగా నాకు అనిపిస్తూ ఉంటుంది. ఈ విషయం ఒక శ్రేయోభిలాషితో నేను చెప్పగా ''స్వార్థం ఇంతకంటే గొప్ప ఘోర కృత్యాలను చేయిస్తుంది. అందుకే పూర్వం దానం స్వీకరించేవారు ఒకటికి రెండుసార్లు ఆలోచించి మరీ దానం పట్టేవారు," అని ఆయన అన్నాడు. ఇటువంటి సంఘటనలు సామాన్యంగా అందరికీ జరుగుతాయా లేక కళాకారులకే జరుగుతూ ఉంటాయా?

కళను వ్యాపారంగా చేసుకొని దాన్ని బజారులో రూపాయలుగా మార్చుకొని జీవించే వారికి తప్ప కళను కళగా స్వీకరించి దాని గురించి మాత్రమే జీవించే వారి హృదయాలు బహుసున్నితంగా స్ఫటికలాగ స్వచ్ఛంగా ఉంటాయి. ఇతరుల్లో చెడును శంకించే శక్తి వారికి ఉండదు. అసలు చెడును గురించి యోచించే బుద్ధే వారి కుండదు. మానవునిలోని మంచిని గురించి మాత్రమే వారు ఆలోచిస్తూ ఉంటారు. అందువల్లనే వారు ఇతరులకంటే బహుసులభంగా మోసగింపబడుతూ ఉంటారు. అందువల్లనే నిజమైన కళాకా రులలో బహుకొద్ది మంది మాత్రమే వారి జీవితంలో ప్రాపంచిక సుఖాలను అనుభవించగల్గుతారు. వారు అనేక కష్టాలకు లోనయి, కళారాధననే వారి జీవిత పరమవధిగా తృప్తిచెంది తరించారు. బ్రతకనేర్చిన వారెందరో ఇలాంటి కళాకారులను తను స్వప్రయోజనాలకు ఉపయోగించుకొని బాగుపడ్డారు. ప్రపంచంలోని అనేకమంది ఉత్తమ కళాకారుల జీవితాలు ఈ విధంగానే గడచినట్లు వారి జీవిత చరిత్రలు మనకు తెలియజేస్తున్నాయి.



ఒక్క మానవునిలోనే కాక సృష్టిలోని ప్రతి చిన్న జీవిలో గూడ దైవత్వాన్ని సాక్షాత్కరింప చేసికొనడమే ఉత్తమ సంస్కారం. అదే ఉత్తమ సంస్కృతి. తోటి జీవులను గౌరవించలేనివాడు ఎంతటి విద్యావంతుడైనప్పటికి ఏంలాభం?

ఎంత వేదాంతి అయితే మాత్రం ఏం ప్రయోజనం? ప్రతి జీవిలోను దైవమున్నాడు. ప్రతి వ్యక్తిని మనం గౌరవించాలి.

ఈ విధంగానే మా చిన్నప్పుడు మా దాయి మాకు బోధించింది, ఆ చిన్న వయస్సులో దైవము, మానవత్వము, సమానత్వం వంటి పదాలకు మాకు అర్థం తెలియకపోయినా తోటి మానవుల యెడల గౌరవ భావ ముండాలి, వారిలో దైవాన్ని చూడాలన్న ప్రేరణతో పెద్దలకు నమస్కారం పెట్టేవాళ్ళం. కొందరు సంతోషంతో మా నమస్కారాలను స్వీకరించేవారు, కొందరు ఆశ్చర్యపోయి ఆనందపడేవారు. మాకు ఎంతో తృప్తిగా ఉండేది.

"అసత్య మాడరాదు. నిజం చెప్పగలిగే ధైర్యం లేని వాడు అసలు తప్పే చేయకూడదు" అని ఆమె మరొక నీతిని బోధించింది. ఈ ప్రవచనాలను ఆనాటి నుండి మేం ఆచరణలో పెడ్తూ వచ్చాం. అయితే, అది కొన్ని సమయాలలో మమ్మల్ని ఎన్నో కష్టనష్టాలకు గురిచేసింది. అయినా, నేను అసత్య మాడలేదన్న సంతృప్తి, సంతోషం నాకు కలుగుతూనే ఉన్నాయి.

నేను నాగపూర్ రామకృష్ణ మిషన్‌లో విద్యార్థిగా ఉన్నప్పుడు జరిగిన ఒక సంఘటనను ఇక్కడ ముచ్చటిస్తాను.

మేం అక్కడ కాలేజీలో చదువుకొంటునప్పుడు హాస్టల్లో ఉండే వాళ్ళం. మాలో కొందరు ఉచితంగా ఉండేవారు. వారి భోజన వసతి ఖర్చులను మిషన్ వారే భరించేవారు. వారిలో ఇద్దరు మహారాష్ట్ర విద్యార్థు లుండేవారు. ఆశ్రమంలోని పూజా మందిరాన్ని తుడవడం, లైబ్రరీలో పని చేయడం మా నిత్యకృత్యాలు. అయినా ఆ యిద్దరూ ఆ పనులు చేయకుండా తప్పించుకొని తిరిగేవారు. ఆ పనులను చేయడం వారికి నామోషీగా ఉండేది.

ఒకసారి స్వామి వివేకానందులవారి జన్మదినోత్సవాలు వచ్చాయి. ఒకానొక గొప్ప తత్వవేత్తను ఉపన్యసించవలసినదిగా కలకత్తానుండి మిషన్‌వారు ఆహ్వానించారు. దీన్ని పురస్కరించుకొని ఆహ్వాన పత్రికలను స్థానికంగా పంచడానికి మమ్మల్ని నియోగించారు.

మేం దన్‌తోలీలో ఉండే వాళ్ళం. సీతాబల్దీలో ఆహ్వాన పత్రికలను పంచవలసి వచ్చింది. ఈ రెండింటికి మధ్య ఒక చిన్న నది ఉంది. మేం పంచుతూ ఆ నదిమీద ఉన్న బ్రిడ్జి వద్దకు వచ్చాం. పత్రికలను ఇంకా పంచడం మాకు చిరాకనిపించింది. అందువల్ల ఆలోచిస్తూ ఆ వంతెన మీద నిలబడ్డాం. క్రింద నదిలో నీరు వడిగా పారుతూ ఉంది. కదిలిపోతున్న మా ప్రతిబింబాల్ని ఆ నీటిలో చూస్తూ నిలబడ్డాం. ఇంతలో ఆ మహారాష్ట్ర మిత్రులకు ఆహ్వాన పత్రికలను సులువుగా వదిలించుకొనే ఆలోచనవచ్చింది. వారిలో ఒకడు "రామకృష్ణా! ఇలా ఎంతసేపని తిరుగుతాం? వీటిని చింపేసి నీళ్ళలో పడేద్దాం. అవి ఎవరికీ కనిపించకుండా కొట్టుకుపోతాయి. స్వామీజీ అడిగితే పంచామని చెబ్దాం" అంటూ ఒక సలహా చెప్పినా చేతిలోని కొన్ని ఆహ్వాన పత్రికలను తీసికొని, చింపేసి నీళ్ళలోకి గిరాటు వేశాడు. అవి నీళ్ళలో తేలుతూ పయనించాయి. నేను మిగిలినవి చింపేసి నదిలో వదిలిపెట్టాను. మా శ్రమ తొలగిపోయినందుకు సంతోషిస్తూ మా హాస్టలికి వెళ్ళిపోయాం. అప్పుడు నాకేమీ అనిపించలేదు. కాని సాయంత్రానికి నాకెందుకో భయం వేసింది. ఇతర మిత్రులు సరదాగానే తిరుగుతున్నారు. అందరం గురుమహారాజ్ మందిరంవద్ద కూర్చొని ప్రార్థన చేస్తూ ఉండగా నా యెదుటనున్న రామకృష్ణ పరమహంస చిత్రపటాన్ని నిశ్చలంగా నేను చూడలేకపోయాను. నేనేదో తప్పుచేశానని పరమహంసకు ద్రోహం చేశానని నాకు అనిపించింది, నాలో ఆందోళన రేకెత్తింది. ఇంతలో స్వామిజీ అడిగారు- ఆహ్వానాలు పంచడమయిందా అని. నోటితో చెప్పడానికి సాహసించలేక నేను అయిందన్నట్లు తల ఆడించాను.

ఆ రాత్రి నేను ఒంటరిగా ఉన్నప్పుడు నాలో ఏదో చెప్పలేని ఆందోళన కలిగింది చేసింది ఒక తప్పు, ఆ తప్పును కప్పి పుచ్చుకోడానికి ఒక అబద్ధం ఆడాను. దానిని సమర్థించుకొనడానికి వేరొక అబద్ధం ఆడాలి. ఇక ఈ అబద్ధాలకు అంతెక్కడో తోచలేదు. ఈ ఆలోచనలతో మనస్సు అల్లకల్లోలమైంది. నిద్ర రాలేదు. చదవబోతే దృష్టి దానిమీద నిలవలేదు. చివరకు ఒక నిశ్చయానికి వచ్చాను. ఉదయమే చేసిన తప్పును స్వామీజీకి చెప్పివేయాలి. దీన్ని మించిన పరిష్కారం మరింక లేదని నాకు అనిపించింది.

వేకువజామునే స్వామీజీ గదికి వెళ్ళాను. ఆయన ఒంటరిగా కూర్చుని ధ్యానం చేసికొంటున్నారు. నేను వెళ్ళి వారగా నిలబడ్డాను. వారిని చూస్తుంటే నాకు దుఃఖం ఆగలేదు. పవిత్రులైన వారి మధ్య, పవిత్ర వాతావరణంలో నాన్నగారు నన్నుంచారు. ఉత్తమ జీవిత మార్గాలను నేను అలవరచుకొంటానని వారు ఆశించారు. అయితే, నేనిప్పుడు చేసిందేమిటి? ఆయన ఆశయాన్ని నేను పూర్తిగా నెరవేర్చలేకపోయినా కనీసం నిజాయితీగానైనా నేను బ్రతకడం నేర్చుకొనలేకపోతే వారికి నేనెంతటి ద్రోహం చేసినవాడి నవుతాను? ఈ ఆలోచన రావడంవల్లనే నాలో దుఃఖం పొర్లి పొర్లి వచ్చింది స్వామీజి నన్ను చూసి ఆశ్చర్యపోయారు.



నన్ను పిల్చి తమ ప్రక్కన కూర్చోమన్నారు. ఆయన ఆదరం నన్ను మరింత బాధపెట్టింది. అంతటి తపస్సంపన్నులు, త్యాగశీలురు-నన్నింతగా ఆదరిస్తున్న వారియెడల నేను ప్రవర్తించిన తీరు ఇదా? అన్న ఆలోచనతో నానోటంట మాట రాలేదు స్వామీజీ నెమ్మదిగా నా దుఃఖానికి కారణం అడిగారు. ఆయన బుజ్జగింపుకు నాకు ఊరట కలిగి, ఏమీ దాచకుండా చేసినదంతా చెప్పేశాను. ఆయన అంతా ప్రశాంతంగా విని, "రాముడా! నిన్ను చూసి నేను గర్విస్తున్నాను. నిజం చెప్పే ధైర్యం నీలో ఉంది" అని ప్రసన్న వదనంతో నావైపు చూశారు.

అంతవరకు ఎంతో బరువుగా ఉండిన నా హృదయం తేలిక పడింది.

ఆ ఉత్సవాలలో జరిగిన మరొక ముచ్చట. నాగపూర్ సంత్రాలకు - అంటే కమలాఫలాలకు ప్రసిద్ధి. ప్రసాదంగా నలుగురికీ పంచడానికని స్వామీజీ మా మిత్రులను వాటిని తెమ్మనమని పంపారు. ఆ మిత్రులు సగం మంచివి, సగం కుళ్ళినవి తెచ్చారు. వలిచినతర్వాత వాటిని చూసి బ్రహ్మచారీ మహారాజులు చాలా బాధ పడ్డారు.

"రామకృష్ణా! ఇలాంటివి తెస్తే మళ్ళా మమ్మల్ని ఎప్పుడూ బజారుకు పంపరు. ఎంత ఉచిత భోజనం పెట్టినా ఎప్పుడు మమ్మల్ని ఇలా తిప్పుతూంటే మేము చదువుకొనేదెప్పుడు? అందుకే మేం ఇలాంటి పళ్లు తెచ్చాం" అని తమ ప్రతాపాన్ని నా మిత్రులు తెలియజేశారు.

బ్రహ్మచారులవారు ఈ విషయాన్ని స్వామీజీకి చెప్పారు. స్వామీజీ అంతా విని ఊరుకొన్నారే గాని ఎవర్నీ ఏమీ అనలేదు. ఆ రోజునుండి ఏ పనీ చెప్పనందుకు మా మిత్రులు మిక్కిలి సంతోషించారు.

మా పరీక్షలయిపోయాయి. నాగపూర్ ఎండలు చాలా తీవ్రంగా ఉన్నాయి. ఊటీ, సిమ్లాలలాగ మధ్యప్రదేశ్ పచ్చమరి వేసవిలో చల్లగా ఉంటుంది. నాగపూర్‌వారు చాలా మంది వేసవిలో అక్కడకు వెళ్తూ ఉంటారు. స్వామీజీ అక్కడకు వెళ్ళి ఎండలు తగ్గిన తర్వాత తిరిగి వచ్చారు. మళ్లా కాలేజీ తెరిచారు. మా మరాఠీ మిత్రులకు కాలేజీలో సీట్లు దొరక్కపోతే స్వామీజీ ప్రత్యేకంగా ప్రయత్నించి వారికి సీట్లు ఇప్పించారు. కాని, హాస్టల్లో భోజనవసతులను నిరాకరించారు. కొన్నాళ్ళ తర్వాత నేను అడిగితే "వీరవారికి సహాయపడాలన్న ఉద్దేశ్యంతో వారికి కాలేజీలో సీట్లు ఇప్పించాను. కాని, వారి దుష్ట స్వభావం యొక్క ప్రభావం ఇతర విద్యార్థులపైన పడితే వారుకూడా చెడిపోతారు. అందువల్ల వారిద్దర్నీ మీ అందరికీ దూరంగా ఉంచదలచాను" అన్నారు ఆయన.

నా బాల్యంలోని మరికొన్ని సంఘటనలను ఇక్కడ తెలియజేయదలచాను. నా జీవితంలో వాటి ప్రభావం మిక్కుటంగా ఉండడంవల్ల వాటిని తెలియజేయడం భావ్యం.

''ప్రతి మానవునిలోను దేవు డున్నాడు, ప్రతి జీవిలోను దేవుడున్నాడు. మనల్ని పరీక్షించడానికి ఆయన ఏ రూపంతో వస్తాడో మనకు తెలియదు గనుక ప్రతి మనిషిని, ప్రతి జీవిని మనం ప్రేమించి, గౌరవించాలి'' అని మా దాయి ప్రతి రోజూ చెప్పేది.

''అసలు దేవు డన్నవాడు మనల్ని ఎందుకు పరీక్షిస్తాడు? ఆయనకు ఆ హక్కు ఎందుకుంది?'' ఇటువంటి ఆలోచన్లు ఆ వయస్సులో మాకు రాలేదు గనుక ఆమె చెప్పినవన్నీ ఏ సందేహం లేకుండా మేం నమ్మేవాళ్ళం. ఆమె అబద్ధం చెప్పేది కాదని మా విశ్వాసం. ఈ సందర్భంలో ఆమెను గురించి మీకు కొంత చెప్పడం అవసరం.

మా చిన్ననాటికే ఆమె పండు ముసలి. ఆమె వయస్సు సుమారు వందేళ్ళు ఉండవచ్చును. పసుపు పచ్చని శరీరచ్ఛాయ. ఆమె జుత్తు తెల్లని ముగ్గుబుట్ట. విశాలమైన నుదురు. అయినా నడ్డి వంగలేదు. నిటారుగా నిలిచే నడిచేది. మాటలో వణుకు లేదు, గంభీరమైన కంఠం. స్వచ్ఛమైన ఉచ్చారణ. తెల్లని బట్టలతో తళతళలాడుతూ ఉండేది. ఉభయ భాషా ప్రవీణురాలు. ఆమె విష్ణు భక్తురాలు.

ఆమె మా అమ్మమ్మను పెంచింది. తర్వాత మా అమ్మను పెంచింది. ఆ తర్వాత మమ్మల్ని పెంచింది. మా అందర్నీ తీర్చిదిద్దిన వ్యక్తి ఆమే. అందువల్ల మా యింట్లో ఆమెకు ఎదురు చెప్పేవారు ఎవరూ లేరు. ఆమె మా కుటుంబానికి బంధువు కాకపోయినా మా కుటుంబానికి పెద్ద. మా కుటుంబంలో అందరికీ ఆమె యెడల ఎంతో గౌరవ భావముండేది. మా కుటుంబంలో ఆమె మాటకున్న విలువ మరెవ్వరికీ ఉండేది కాదు.

ఆమెకు స్వార్థం తెలియదు. పరోపకారం ఆమె ధ్యేయం. ఆమె త్యాగశీలి. అందువల్ల అందరూ ఆమె నెంతో గౌరవించేవారు.

ఆమె వేకువనే లేచి, శిరఃస్నానం చేసి, ధవళవస్త్రాలు ధరించి, పూజా మందిరంలో భగవద్గీత పారాయణం చేస్తూ ఉండే ఆమెలో మన ప్రాచీన సంస్కృతి మూర్తీభవించినట్లు మాకు తోచేది. ఆమె మా కొక దేవతా స్వరూపిణి. ఆమె ఏమి చెప్పితే అది జరిగితీరేది.

"దేవుడు ఎలా ఉంటాడు దాయీ?" అని మేమడిగితే "నీవు ఎలా కావాలనుకొంటే ఆయన అలాగే ఉంటాడు" అని ఆమె సమాధానం చెప్పేది. ఆ సమాధానం మాకు అర్థంకాక "అంటే?" అని మరొక ప్రశ్న వేసేవారం.

"ఒక పండు ముసలి దేవుణ్ణి చూడాలనుకొంది. చాలా రోజులు పూజలు చేసింది. ఒకనాడు ఆమె పెంచిన దూడ చనిపోయింది. ఆమె దానిని తలచుకొని ఏడుస్తూంటే దేవుడు ఆ దూడ రూపంలో ఆమెకు కనబడి ఓదార్చాడు. అంటే నీవు ఏ రూపంలో దేవుణ్ణి తలచుకొంటే ఆ రూపంలోనే ఆయన నీకు కనబడతాడు. దేవునికి ఒక రూపమంటూ లేదు. బీద వృద్ధునిగా కనిపించవచ్చును. మన పెంపుడు పిల్లిలా కనిపించవచ్చును. ఒక పోలీసు జవానుగా కనిపించవచ్చును. అన్ని జీవులలోను ఆయన ఉన్నాడు. అందువల్ల మనం ఏ జీవినీ బాధించకూడదు...." ఈ విధంగా మా వయస్సుకు తగినట్టుగా దేవుని గురించి తెలియజేసేది.

పిల్లి అనగానే నాకు మరొక విషయం ఇక్కడ జ్ఞప్తికి వచ్చింది. మా యింట్లో ఒక పెద్ద కుక్క, ఒక తెల్లని పిల్లి ఉండేవి. మా దాయి వాటిని ఎంతో ప్రేమతో చూసేది. మధ్యాహ్న సమయంలో ఆ కుక్క పడుకొని వుంటే, పిల్లి వచ్చి దాని పడిలో దూరేది. దానితో ఆడుకొనేది. కుక్క దానిని లాలించేది. ఆ రెండింటి ఆప్యాయత చూడముచ్చటగా ఉండేది. ఒకసారి ఆ కుక్క కూనల్ని పెట్టింది. దాని వద్దకు ఎవరువెళ్ళినా భయంకరంగా అరిచి తరిమివేసేది కాని, ఆ పిల్లి వెళితే తన పిల్లలతో సమానంగా దానికి పాలిచ్చేది. మా దాయి పెంపకంలో శత్రువులు గూడా మిత్రులుగా మారి పోయేవారు

''దేవుడన్నవాడు ఉన్నాడా- లేడా?'' అని అంటే కొందరు ఉన్నాడని, కొందరు లేడని అంటారు. ఎవరికి తోచినట్టు వారు తీవ్రంగా వాదిస్తారు. దేవుని పేర ఈ ప్రపంచంలో అనేక యుద్ధాలు గూడా జరిగాయి. మతం పేరిట తోటి మానవుల్ని క్రూరంగా హింసించడం మనం ఎరగని విషయంకాదు. నేను చరిత్రలో చదవడమే కాదు- ప్రత్యక్షంగా మత కలహాలను నా చిన్నతనంలో చూశాను. ఈ విషయం ఎలా ఉన్నా మా దాయి చెప్పిన సూక్తులు నా వంటబట్టాయి.

'తోటి మానవుల్ని మనం ప్రేమించాలి. ఎవరికీ అపకారం చేయరాదు. దేవుడు ఏ రూపంలో నైనా మన వద్దకు రావచ్చు. కనుక అందర్నీ గౌరవించాలి.' పసితనంలో ఈ సూక్తులకు మాకు పూర్తిగా అర్థం తెలియక పోయినా మా అనుభవ పూర్వకమైన కొన్ని ప్రయోగాలను ఇక్కడ తెలియజేస్తాను.

ఒకనాడు ఉదయమే ఒక పండు ముసలివాడు మా యింటికి ముష్టికి వచ్చాడు. మా పని కుర్రవాడు ఆ ముష్టి వాణ్ణి పొమ్మంటున్నాడు. దేవుడే ఆ రూపంలో వచ్చాడన్న భ్రాంతి నాకు కలిగింది. నేను వెంటనే అతనికి ఒక అణా ఇచ్చి నమస్కారం చేసి ఇంట్లోకి వచ్చాను. నేను దానం చేసినందుకు మా బాబాయి నన్నేమీ అనలేదు. కాని, వాడికి నమస్కారం చేసినందుకు నా వీపుమీద ఒకటి వడ్డించాడు. అయితే, అందులో నా తప్పేమిటో నాకు బోధపడలేదు. ఆయన్ను అడిగి తెలుసుకొనే ధైర్యం లేక దుఃఖాన్ని దిగ మింగి ఊరుకొన్నాను.

ఈ సందర్భంలో మా బాబాయి గురించి చెప్పాలి. ఆయన చిన్న జమీందారు. ఆయన కొన్ని గ్రామాలకు అధిపతి. శిస్తు వసూలుకు ఒక్కొక్కసారి ఆయన స్వయంగా రైతులవద్దకు వెళ్తూ ఉండేవాడు. ఒకసారి ఆయనతో కలిసి ఒక గ్రామానికి నేనూ వెళ్ళాను. ఆ గ్రామ వీధుల్లో గుమస్తా శిస్తు వసూళ్ళ లెక్కలు వివరిస్తూంటే ఆయన ఠీవిగా నడుస్తున్నాడు. ఆ గ్రామస్తులు దుమ్ముకొట్టుకు పోయిన ఆయన పాదాలకు నమస్కరించారు. ఆయన వారిని చూసీ చూడ నట్టుగా ఒక చిరునవ్వు విసిరేస్తూ, రైతుల తాహతునుబట్టి తలను వంకిస్తూ వారి నమస్కారాలను అందు కొన్నాడు. ఆయన వెనుకగా నడుస్తున్న మా వంక హుందాగా చూశాడు. ఇదంతా ఏదో విచిత్రంగా నాకు కనబడింది. అందుకనే ఆ తర్వాత ఆయనతో ఎన్నో మార్లు గ్రామాలకు వెళ్ళాను.

ఒకసారి ఒక ముసలి రైతు ఆ సంవత్సరం శిస్తు చెల్లించలేనంటూ మా బాబాయి కాళ్ళమీద పడ్డాడు. "వెధవా! నీవెప్పుడూ ఇలాగే ఏడుస్తూంటావు. ఈసారి ఇంక నిన్ను విడిచి పెట్టను," అంటూ ఆ బక్కచిక్కిన పేద ముసలివాణ్ణి తన కాలితో పక్కకు నెట్టి ముందుకు నడిచాడు మా బాబాయి.

"తోటి మానవుణ్ణి మనిషిగా గౌరవించడం ఈ బాబాయికి తెలియదు. ఛీ ఛీ, ఇక మీదట ఈ బాబాయితో ఇంకెక్కడికీ రాకూడదు" అని నాలో నేను ఒక నిశ్చయానికి వచ్చాను. ఆ ముసలి రైతును చూసినప్పుడే నా కెందుకో చాలా జాలి కలిగింది. బాబాయి అతన్ని తన్నినప్పుడు నా ప్రాణం గిలగిలకొట్టుకొంది కాని, నేనేం చేయలేదు. కనీసం ఒక జాలిమాట అందామన్నా కొద్ది రోజుల క్రిందట మా బాబాయి నాకు చేసిన సన్మానం నా నోరు నొక్కేసింది.

మా వూళ్ళో ఒక పోలీస్ జవాను ఉండేవాడు. అతడు తెల్లవారగానే మా యింటికి వచ్చి మా బాబాయికి సెలాం కొట్టేవాడు. అంతేకాదు, మేం పిల్లలం కనబడ్డా మాకూ ఒక

సలాం కొట్టేవాడు. మేం ఎన్నిసార్లు కనబడితే అన్నిసార్లు ఎటెన్షన్‌లో నిలబడి సలాం పెట్టేవాడు. కాకీబట్టలు కట్టుకొని, ఎర్రటోపీ పెట్టుకొన్న ఆ పెద్ద ఆకారం మాకు అలా సలాం పెడుతూ ఉంటే అదొక వేడుకగా ఉండేది. అందువల్ల వీలయినప్పుడల్లా అతని ముందునుంచి వెళ్ళేవాళ్ళం.

అయితే, మా దాయి చేసిన ప్రబోధంతో ఒకనాడు అతనికి నేనే ముందుగా సలాం చేశాను. అతడు ఆశ్చర్యపోయి, నోటమాట రాక నిశ్చేష్టుడై పోయాడు. తర్వాత కొన్ని క్షణాలకు అతడు తేరుకొని "బాబూ! మీరెప్పుడూ నాకు సలాం చేయకండి. నేను మీకు సలాం చేయాలికాని మీరు సలాం పెట్టకూడదు. మీ బాబాయిగారు చూశారంటే...." అని అతడు ఇంకా చెప్పబోతూండగా మా బాబాయి వచ్చాడు. ఆ జవాను ఎటెన్షన్ నిలబడి మా బాబాయికి సలాం చేశాడు.

అయితే, తోటి మానవుల్ని గౌరవించవలసిన పద్ధతి ఇది కాదేమో నన్న అనుమానం నాకు వచ్చి ఆ పద్ధతిని నేను వదిలిపెట్టినా మా దాయి ప్రబోధాల ప్రభావం నన్ను నేటి వరకూ విడిచిపెట్ట లేదు.

ఈ సందర్భంలో మద్రాసులో జరిగిన నా చిన్ననాటి ముచ్చట జ్ఞాపకం వచ్చింది. ఒకనాడు నేను హైకోర్టువద్ద నిలబడి చూస్తున్నాను. నాముందు నుంచి ఒక లాగుడు రిక్షా వెళ్తూంది. ఒక్కటేమిటి-చాలా వెళుతున్నాయి. అయితే, అన్ని రిక్షాల్లోను మనుష్యులున్నారు, కాని, ఆ రిక్షాలో ఎవరూ లేరు. ఆ రిక్షాని ఒక ముసలివాడు లాగుతున్నాడు. అది మిట్ట మధ్యాహ్నం. తన రిక్షాలో ఎవరూ ఎక్కలేదని ఆ ముసలివాడు చాలా బాధగా, కాళ్ళీడ్చుకొంటూ మెల్లగా వెళ్తున్నాడు. ముడతలు పడ్డ అతని ముఖంలో విషాద రేఖలు గోచరిస్తున్నాయి. అతన్ని చూడగానే నా కేదో అనిపించింది. అంతవరకూ నేనెప్పుడూ లాగుడు రిక్షా ఎక్కలేదు. అలాంటి రిక్షాలో వెళితే ఎలా ఉంటుందో చూడా లనిపించింది. ఆ రిక్షావాణ్ణి పిలిచాను. ఆశతో అతడు నా వద్దకు వచ్చాడు. ప్రభాత్ టాకీస్‌కు వస్తావా అని అతణ్ణి అడిగాను. అర్ధరూపాయి ఇమ్మన్నాడు.

లేవగానే ఏ అమ్మ ముఖం చూశాడో గాని ప్రొద్దుట నుంచి అతనికి బోణీ కాలేదుట. నాదే బోణీ. అందువల్ల మరి నేను బేరం ఆడలేదు. వెంటనే రిక్షా ఎక్కి కూర్చున్నాను. రిక్షావాడు పరుగు ప్రారంభించాడు. ఆ నూతన అనుభవం నాకు ఒక నిమిషం పాటు ఆనందాన్ని కలుగజేసింది.

ఆ మధ్యాహ్నపు ఎండకు అతని శరీరం చేమటపట్టి ధారలు కార్చడం మొదలెట్టింది. నా హృదయం ద్రవించింది. పట్టెడన్నం కోసం ఆ మండుటెండలో ఆ ముసలి నన్ను మోసుకొని వెళ్తున్నాడు. నాలో ఏదో చెప్పరాని ఆవేదన! ఎందుకో చెప్పలేను. నాకు తెలియకుండానే "ఆపు" అని అరిచాను.

"సామీ! ఆకలివల్ల మెల్లగా పరుగెడుతున్నాను. అయినా మిమ్మల్ని వేళమించి పోకుండా సినిమాకి తీసికొని వెళ్తాను...." అంటూనే పరుగువేగం హెచ్చించాడు.

"ఇంక చాల్లే, ఆపు" అని గద్దించాను. రిక్షా తాత బిత్తరపోయి రిక్షా ఆపాడు. నేను రిక్షా దిగాను. అతడు నా ముఖం వైపు దీనంగా చూశాడు.

"నీ రిక్షా వద్దు, నేను నడిచి వెళ్తాను" అన్నాను. "బాబూ! బీదవాణ్ణి, ముసలివాణ్ణి, పొద్దుట్నుంచి వస్తున్నాను. కోపగించకండి........" అతని లోతయిన కండ్లు ఎరుపెక్కి చెమర్చాయి. అతని మాటలు నాకు వినబడుతున్నా నా తల కెక్కడం లేదు. నాలో ఏదో ఆవేదన. జేబులో చేయి పెట్టాను. చేతికి ఒక కవరు దొరికింది. విప్పి చూశాను, అందులో పది రూపాయల నోటు, కొంత చిల్లర ఉన్నాయి. దాన్ని అతని చేతిలో పెట్టి, ముందుకు సాగిపోతున్నాను. ఆ ముసలివాడు దాన్ని చూసి షాక్ తిన్నాడు. ఆ షాక్ నుండి తేరుకొని "సామీ, సామీ" అంటూ నా వెనుక పరుగెత్తుకు వచ్చాడు. నా ఎదుటకు వచ్చి "సామీ! పొరపాటున నాకు ఎక్కువ డబ్బిచ్చారు" అన్నాడు.

"అందులో పొరపాటు ఏం లేదు. నీ కివ్వాలనే ఇచ్చాను తీసికో" అన్నాను, అతని నిజాయితీని లోలోన అభినందిస్తూ. అతడు నా పాదాలకు నమస్కరించి తన

కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. అతని అశ్రువులు నా పాదాలను తడిపాయి.

నా మనస్సు ఆనాడంతా అదోలా ఉంది. మా పెద్దలకు అవసరం లేకపోయినా నాలుగు కార్లు, ఒక గుర్రపు బగ్గీ, దానికోసం నాలుగు మంచి గుర్రాలు....ఆరు నెలలకొకసారి అవసర మున్నా లేకపోయినా క్రొత్త బట్టలు కొంటూంటారు. ఆరునెలల తర్వాత వాటిని మళ్లా ధరించడం వారికి చిన్నతనం. మా వూరిలో సగం ప్రాంతం మా బంగ్లా ఆక్రమించుకొని ఉంటుంది. దాని నిండా నౌకర్లు, చాకర్లు. వీరికి ఒకరంటే ఒకరికి కిట్టదు. మా బాబాయి అనుగ్రహం కోసం ఒకరి మీద ఒకరు ఆయనకు చాడీలు చెప్తూంటారు, ఆయన విడిచేసిన బట్టలు సంపాదించుకొనడానికి - ఆ బట్టల కోసం వారిలో వారు రామరావణ యుద్ధము కూడా కొనసాగిస్తూంటారు. అప్పుడు ఇదంతా నాకేం సరిగ్గా తెలిసేది కాదు.

ఆవేళ సాయంత్రం మా నాన్నగారు, బాబాయికూర్చుని ఏదో మాట్లాడు కొంటున్నారు. మధ్యాహ్నం ఆ బీదవానికి నేను చేసిన సహాయాన్ని గొప్పగా వారికి చెప్పాను. వారెంతో సంతోషిస్తారని అనుకొన్నాను.

"చాలా మంచిపని చేశావు. ఆ ముసలి పీనుగును కూర్చోమని నువ్వు రిక్షాను లాగలేక పోయావూ? చాలా బాగుంది. చాలా సంతోషంగా ఉంది. అన్నయ్యా! మనింట్లో ఓ బుద్ధ భగవానుడు అవతరించాడు" అంటూ హేళనగా పకాలున మా బాబాయి నవ్వాడు.

మా నాన్నగారు కొద్ది నిమిషాలు మౌనంగా ఉండిపోయారు. ''రామా! డబ్బులిచ్చావు - బాగానే ఉంది. వాడికి ఎంత కూలి ఇవ్వాలో అంతే ఇవ్వాలి గాని, జేబులో ఉన్నదంతా దానం చేస్తావా? లోకాన్ని నీవు మరమ్మత్తు చేయగలవా?'' అని నాన్న నన్ను మందలించిచారు. ఆయన లోన ఏమనుకొన్నారో నాకు తెలీదు.

"నీవంటి మహాత్ములు అవతరిస్తే ఇక సోమరిపోతులకు లోకంలో కరువుండదు. వళ్ళువంచి కష్టపడే అవసరం వారికి ఇంక ఉండదు,'' అన్నాడు బాబాయి.

''నేను ఆ డబ్బుల్ని కష్టపడి సంపాదించానా బాబాయి?'' అన్నాను.

మా బాబాయి గట్టిగా నవ్వి, "మునింజీ! మావాడు కష్టపడి సంపాదిస్తాడట! రేపు వీడికి ఒక నాగలి చేతికిచ్చి పొలానికి పంపండి,'' అన్నాడు అక్కడే ఉన్న మా మునింజీతో.

"మా బాబుకేం ఖర్మ? మా బాబు మహారాజు!'' అన్నాడు మునింజీ.

"లోపలికి వెళ్ళి ఆడుకో" అన్నారు నాన్నగారు. అంతటితో ఆ సంఘటన ముగిసింది. కాని, బీదవారు, కష్టజీవులు నా హృదయంలో నిలిచిపోయారు. బీద. గొప్ప తారతమ్యాలు ఎందుకు ఏర్పడ్డాయో, ఎలా ఏర్పడ్డయో నాకా వయస్సులో అర్థం కాలేదు.

మా చిన్నతనంలో ఏ సందేహంకలిగినా మా దాయిని అడిగి తెలుసుకొనడం మా కలవాటు. అలాగే ఈ విషయాన్నీ ఆమెను అడిగాను. "పూర్వజన్మ సుకృతం, ఖర్మ పలం, పాపం, పుణ్యం" అంటూ ఆమె ఏమేమో చెప్పింది. పూర్వ జన్మలో చేసిన పాపానికి ఈ జన్మలో మానవుడు పలితం అనుభవిస్తాడట! ఈ జన్మలో మంచి పనులు చేస్తే వచ్చే జన్మలో సుఖం అనుభవించ వచ్చునట. జన్మ, పునర్జన్మ- ఇవేవీ అప్పుడు నాకర్థం కాలేదు. కాని, ఒక విషయం మాత్రం నా హృదయంలో నాటుకుపోయింది. ఆపదలో నున్న తోడి మానవులను ఆదుకోవాలి. మన కున్న దానిలో ఇతరులకు కొంచమైనా ఇవ్వాలి. నాన్నగారు చెప్పినట్లు లోకాన్ని మనం మరమ్మత్తు చేయలేం గాని వీలయినంత వరకు మనం ఇతరులకు సహాయపడవచ్చును అన్న భావం ఆనాడే నాకు కలిగింది.

ఈ సందర్భంలో నాకు మరొక విషయం జ్ఞప్తికి వస్తూంది. నాతో కలిసి చదువుకొన్న ఇద్దరు బీద విద్యార్థులకు ధన సహాయం చేశాను. నా ఖర్చులకోసం కావలసినంత డబ్బు మా మునింజీని అడిగి తీసికొనేవాడిని. అతడి కొడుకు పుస్తకాలకు, బట్టలకు కావలసిన డబ్బును నా ఖర్చులోనే వ్రాసుకొని తీసికొంటూ ఉండేవాడు. నా హృదయం

అతనికి తెలుసు గనుక డబ్బు విషయంలో నాకే చిక్కూ ఉండేది కాదు. కాని, నాకు బట్టల దగ్గరే చిక్కు వచ్చేది.

నేను నాగపూర్‌లో చదువుకొంటున్నప్పుడు, ఇంటికి వచ్చినప్పుడల్లా బజారుకు వెళ్ళి మంచి ఖరీదైన బట్టలు కుట్టించుకొనేవాణ్ణి. అయితే, నాగపూర్ వెళ్ళిన తర్వాత మరి అవి నా వద్ద ఉండేవి కావు. నాతో చదువుకొనే ఆ యిద్దరు స్నేహితులు అడిగితే వాటిని ఆలోచించకుండా పంచి పెట్టేవాణ్ణి. వారు వేసుకొన్నవి మరి నేను వేసుకొనే వాణ్ణి కాను. అందువల్ల నేను ఎన్ని బట్టలు కుట్టించుకొన్నా నాకు బట్టలకు కొరతగానే ఉండేది. ఈ విషయం మా నాన్న గారికి తెలిసినా ఆయన ఏమీ పట్టించుకొనేవారుకారు. ఆ స్నేహితులిద్దరూ బాగా చదువుకొని మంచి ఉద్యోగాల్లోనే స్థిరపడ్డారు. కాని, ఆ తర్వాత ఆ యిద్దరు తమ గత జీవి తాలను విస్మరించారు. డబ్బు సంపాదించడమే వారి ధ్యేయం ఇప్పుడు. ఇంకొకరికి సహాయం చేయడం వారు నేర్చుకోలేదు. ఇద్దరూ స్వార్థాన్నే పెంచుకొన్నారు. మంచిని మరచిపోయారు. వారిలో ఒకాయన ఎం.పి. కూడా అయ్యాడు. అతడు ఒక బంగ్లా కట్టించాడు. రెండు కార్లు కొన్నాడు. పెద్ద కంపెనీలతో ఆయనకు వాటాలున్నాయి. ఇంకా ఎన్నో ఎన్నో ఉన్నాయి. ఆయనగార్ని చూసినప్పు డల్లా లోకం అంటే ఇదే గదా అనిపిస్తుంది నాకు.

ఒకసారి కాలేజీ సెలవులకు ఇంటికి వచ్చాను. వచ్చిన మర్నాడే మునింజీని పిలిచి బట్టలు కొనమన్నాను. పోయిన సారి నేను నాగ్‌పూర్ వెళ్ళేముందు ఆయన ఎన్నో ఖరీ దైన బట్టలు కొని నాకు కుట్టించి ఇచ్చాడు. అందువల్ల ఆయన నా పెట్టె తెరిచి చూశాడు. అందులో ఏమీ లేవు. "బట్టలన్నీ ఏం చేశారు బాబూ?" అని ఆయన నన్ను అడి గాడు. అదే సమయంలో మా నాన్నగారుకూడ వచ్చారు.

"నాతో చదువుకొనే బీద కుర్రవాళ్ళకు బట్టలు లేక పోతే వాటిని వారికి పంచిపెట్టాను'' అన్నాను.

నా సమాధానం విన్న మా నాన్నగారి కళ్ళు ఎర్ర బడ్డాయి. నా వంక తీక్షణంగా చూశారు.

"నేను మళ్ళీ కుట్టించుకొంటాను గదా నాన్నా?" అన్నాను. అంతే. ఆయనకు అకస్మాత్తుగా కోపం వచ్చి, నా చెంపను ఛెళ్ళుమనిపించారు.

నా చిన్నప్పుడే మా అమ్మ చనిపోవడంవల్ల మా నాన్న నన్ను అల్లారుముద్దుగా పెంచారు. నా పైని కోప గించుకోవడం గాని, నన్ను కొట్టడం గాని ఆయన చేసేవారు కారు. కనీసం కఠినంగా కూడ మాట్లాడేవారు కారు. లోగడ ఎప్పుడో ఒకసారి ఒక చిన్న దెబ్బ కొట్టారు. నా జీవితంలో ఇది రెండో సారి ఆయన నన్ను కొట్టడం.

అప్పుడు నేను కాలేజీలో చదువుతున్నందువల్ల కాస్త పెద్దవాణ్ణన్న భావన నాలో ఉండేది. వయస్సు చిన్నదే అయినా కాలేజీలో చదువుతున్నానన్న అహంతో ఆయన ముఖంలోకి జంకకుండా చూసి ''నాన్నగారూ! నేను కాలేజీలో చదువుకొంటున్నాను. నేను పెద్దవాణ్ణయ్యాను'' అన్నాను. ఆయన స్తంభించిపోయారు. ఒక్క నిమిషం నా ముఖంలోకి చూసి వెళ్ళిపోయారు.

ఆనాటి నుండి నా యెడల మా నాన్నగారి ప్రవర్తన మారిపోయింది. నన్నొక కొడుకుగా గాక ఒక స్నేహితునిగా చూడ్డం మొదలుపెట్టారు. కాని, ఆయన సంపూర్ణానురాగాన్ని చవిచూసే అదృష్టం నాకు కరువైపోయింది.

నాకు ఊహ తెలియని అతి చిన్న వయస్సులోనే మా అమ్మ ఈ లోకాన్ని విడిచిపోయింది. ఒక సంవత్సరా నికి మించి మా అమ్మ ప్రేమను నేను అనుభవించలేదు. మాతృప్రేమకు నోచుకోని నేను పెద్దవాణ్ణయిన తర్వాత పితృప్రేమకూ్కడా దూరమయ్యాను.

బ్రతికియుండిన మా నాన్నగారి ఆత్మీయతకు నేను దూరం కావలసివచ్చింది. మావి విభిన్న దృక్పథాలైనాయి. మా ఆదర్శాలు వేరైనాయి. జీవిత విధానాలు మారాయి. ఆ జీవితాన్ని తలచుకొంటేనే హృదయం బరువెక్కి బాధగా ఉంటుంది. కాని, తప్పని సరైంది.

ప్రాచీన సంప్రదాయాలను, కుటుంబ మర్యాదలను, వంశ ప్రతిష్ఠలను ఎక్కువ పట్టుదలతో పాటించే వ్యక్తి మా నాన్నగారు.

ఆయనకూ నాకూ ముఖ్యంగా నా నృత్య కళారాధనా విషయంలో పట్టింపులు వచ్చాయి. మా మధ్య అభిప్రాయ భేదాలు ఏర్పడ్డాయి. ఆయన బాగా చదువుకొన్నవారు. ప్రాచీన కళలంటే ఆయనకు అభిమానం మెండుగా ఉండేది. అయితే, వారి దృష్టిలో మా వంశం కళలను పోషించాలేగాని కళాకారులుగా వాటిని ఆరాధించకూడదని వారి అభిప్రాయం. కళలను అభిమానించి, ఆదరించగా లేనిది ఆరాధించడంతో ఏం తప్పుందో నాకు అర్థం కాలేదు. అయితే, నేను నృత్య కళను అభ్యసించిన ఆ కాలంలో దానిపైని ప్రజలకుండిన అభిప్రాయం సంకుచితంగా ఉండేది. నృత్య ప్రదర్శనను చూడ్డం కూడా పాపం అన్న అభిప్రాయం కలవారు కొందరుండేవారు. వంశ గౌరవానికి నా కళారాధన భంగకరమని ఆనాడు ఆయన అనుకొనడం సహజమే అయుండవచ్చును. అటువంటి అభిప్రాయం గల ఆయన నా "దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్రకు"కు ప్రభుత్వం వారి ప్రథమ బహుమతి లభించినప్పుడు, ఆ బహుమతిని ఆనాటి రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాద్‌గారు నాకు అందజేశారన్న వార్త విని వారు వారి అభిప్రాయాన్ని మార్చుకొని, ఆనందించి నన్ను అభినందిస్తారని ఆశించాను. ఆ వార్తను వారి ఆప్తమిత్రులతో ఒకరి ద్వారా పంపించాను. "ఆ కళమీద వ్రాసిన గ్రంథానికేనా ఈ బహుమతి?" అని మాత్రం అన్నారట. అంటే- నాట్యకళమీదుండిన వారి అభిప్రాయం సడలలేదన్నమాట! నా ఆశ నిరాశ అయింది.

మా వంశంలోని వారందరూ కళాభిమానులే. మా మాతృశ్రీ చక్కగా సంగీతాన్ని అభ్యసించారట. వీణ వాయించేవారట. తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, పారశీ, తమిళ భాషలలో చెప్పుకోదగిన పాండిత్యముండేదట. మా తాతగారు ఉత్తమ సంస్కారం గలవారు. కవులను, పండితులను, గాయకులను, కళాకారులను ఆదరించేవారు. మా ఆలయాలకు మాన్యాలు ఉండేవి. నర్తకీమణులు మా ఆలయాలలో నాట్యం చేసేవారు. ఇన్ని ఉన్నా నేను ముఖానికి రంగు వేసికొని, రంగస్థలంమీద నాట్యం చేయడం వారికి తప్పుగా తోచింది. అయితే, ఆ తప్పు ఏమిటో ఈనాటికీ నాకు అర్థం కాలేదు.



# లోకం పోకడ

మా అన్న శ్యాంసుందర్ వద్ద నేను నాట్యశాస్త్రం చదువుకొన్నాను. ఎవరో పెద్దలు మా యింటికి వస్తే ముచ్చటగా కొన్ని శ్లోకాలు వారికి వినిపించాను.

"అబ్బే! కేవలం శాస్త్రం చదివితే ఏం లాభం? సాంప్రదాయకంగా విద్యను నేర్చుకొనాలి" అన్నారు వారు.

"సరే" నని ఆ సంప్రదాయాన్ని ఆరాధించాను. అంతటితో అయిపోలేదు. "కేవలం ఆడే కాదు, ఆటను అర్థం చేసికొని రసికలోకానికి తెలియ జెప్పటం విద్య" అన్నారు మరి కొందరు.

"సరే" నని దానిని కూడా నేర్చుకొన్నాను.

"సంస్కృత శ్లోకాలను వల్లి వేయడం విద్యకాదు, సంస్కృత భాషను క్షుణ్ణంగా అలవరచుకొనాలి" అన్నారు ఇంకొందరు.

''సరే''నని పంచకావ్యాలను పారాయణ చేశాను.

''సంగీతం వచ్చా?'' అని ఒకరు ప్రశ్నించారు. దాంతో సంగీతం నేర్చుకొన్నాను.

''కనీసం నాలుగైదు భాషల్లోని నాట్యశాస్త్ర గ్రంథాలనైనా చదివి, అర్థం చేసికొనా''లన్నారు వేరొకరు. ఆ పనీ చేశాను.

ఆటా, పాటా, అందుకు తగిన సంగీతం, శాస్త్రం అభ్యసించి, పాండిత్యం సంపాదించి, పరిశోధనలు చేసి, అన్నీ చేశానని తృప్తి చెందాను. ఇక పండితలోకం హర్షిస్తుందని సంబరపడ్డాను.

కాని, ''రకరకాల నాట్య సంప్రదాయాలను తెలిసికొనా" లంది పండితలోకం. ఇంత నేర్చినవాణ్ణి ఆ మాత్రం చేయలేనా అని అదీ చేశాను. అయితే, నాకు ఆఖరికి ఆశ్చర్యమే మిగిలింది.

"అన్నిట్లోను ఉన్నావు పదేలా
నీ కన్నెట్లా పోయింది పదేలా? అన్నట్లుంది. "ఏదో ఒక దానిమీద నీ మనస్సు లగ్నం చేసి దానిలో దిట్టవనిపించుకొనాలి" అనేవారు అంతా.

ఈ లోకం పోకడకి అప్పుడు నేను నవ్వుకొని నవ్వేశాను. నరంలేని నాలుక దాని ఇష్టానుసారం వాగుతుంది.



**40** సంవత్సరముల క్రిందటి నాటినుండి నేటివరకు ప్రాచీన గ్రంథముల పఠన సశేష పరిశోధన

లోకు లాడే ప్రతి మాటకు విలువ నిస్తే మనం బాగుపడ్డట్టే! అయితే, లోకులాడిన మాట విని నా జీవితం వృధా అయిందే మోనని భయపడ్డాను. నన్ను నేను విమర్శించుకొన్నాను. లోకులు పలుగాకులు. వారి మాట లెలా ఉన్నా నాకు అబ్బిన క్రమశిక్షణ వల్ల నేను అరాధించే నాట్యకళలోని లోతుల్లోకి వెళ్ళి సంపూర్ణంగా తెలిసికోగలిగాను. శాస్త్ర సంప్రదాయా లను అభ్యసించి నూతన కళాసృష్టి చేయగలిగే శక్తి సామర్థ్యా లను సంపాదించాను. కళారీతులను గ్రహించి కేళిక చేసి ప్రేక్షకులను రంజింపజేసే విజ్ఞానాన్ని పెంపొందించు కొన్నాను. కాని, ఇంకా ఈ కళలో నేను నేర్చుకోవలసింది మిగిలిపోయిందని గ్రహించాను. నూతన విషయాలను ఇంకా నేర్చుకోవాలనే తృష్ణ నాలో పెరుగుతూనే ఉంది.

ఆదిలో నా కంతా వచ్చేసినట్టే అనిపించింది. కాని, పోను పోను, నాకు వచ్చిందెంత? అన్న సందేహం కలిగింది. అటుపైని ఇంకా ఎంతో వుందన్న అనుమానం వచ్చింది. చివరకు నాకు తెలిసింది అత్యల్పం అనిపించింది.



# నవ్వుల రమణయ్య

నాల్గు దశాబ్దుల క్రిందట నృత్యకళా ప్రచారనిమిత్తం నాగపూరు నుండి నెల్లూరు వచ్చాను. ప్రఖ్యాత దేశభక్తురాలు శ్రీమతి పొణకా కనకమ్మగారు, సినీమా హాస్యనటుడు తిక్కవరపు రమణారెడ్డి గారు నా రాకకు ముఖ్యంగా కారకులు. అప్పుడు నాకుకూడా చిన్న వయస్సే. ఆనాటి విషయాలు కొన్ని ముచ్చటగా ఇక్కడ ముచ్చటించాను.

నవ్వులు, పువ్వులు -
మాటల మతాబులు -
మల్లెమొగ్గల్లాంటి నవ్వులు
మల్లె పువ్వుల్లాంటి నవ్వులు
మందారాల్లాంటి నవ్వులు
గురివింద పూ గుత్తుల్లాంటి నవ్వులు.
గచ్చపొదల్లో గలగల్లాడే నవ్వులు
వేప పూ గుత్తుల్లా చేద్చేదు నవ్వులు
గులాబీల్లా సువాసనలు వెదచల్లే నవ్వులు.
కిచకిచలాడే నవ్వులు
కిలకిలలాడే నవ్వులు
మెరుపుతీగల్లాంటి నవ్వులు
మేఘగర్జన లాంటి నవ్వులు.
ఇతరులను నవ్వించడానికి నవ్వే నవ్వులు
ఇతరులచే నవ్వింపజేసికొనాలని నవ్వే నవ్వులు
ఇతరులను ఏడ్పించడానికి నవ్వే నవ్వులు
ఏడవలేక నవ్వే నవ్వులు
నవ్వుతూ ఏడ్చే నవ్వులు
ఏడుస్తూ నవ్వే నవ్వులు
వికవికలాడే నవ్వులు
ఏడ్పించే నవ్వులు
ఉబ్బించే నవ్వులు
నొప్పించే నవ్వులు
చిలుకలా పలికే నవ్వులు
కోయిల్లా కూసే నవ్వులు
వీణలా పాడే నవ్వులు
మతాబుల్లా వెలిగే నవ్వులు
తారాజువ్వల్లా దూసుకుపోయే నవ్వులు
అవుట్లలా 'ఢాం' అని పేలే నవ్వులు
నక్షత్రాల్లా మిణుక్కుమని మెరిసే నవ్వులు
విషాన్ని కక్కించే నవ్వులు
అమృతాన్ని వర్షించే నవ్వులు—

ఇంకా ఎన్నో, ఇంకెన్నెన్నెన్నో రకాల, రకరకాల నవ్వులు. అయితే "ఈ నవ్వుల్ని ఎప్పుడు నవ్వాలి?" అని మీరు నన్నడగవచ్చు. అదంతా మీకు చెప్తూ రాస్తే అదొక పెద్ద గ్రంథ మవుతుంది. చదివే ఓపిక మీకున్నా రాసే ఓపిక నాకు ఉండొద్దూ? కనుక మీరు నవ్వుతాలుగా నవ్వుల రమణయ్య కథను చదవండి. ఆ తర్వాత ఈ నవ్వులన్నిటిని మీరే నవ్వొచ్చు.

సుమారు నాల్గుదశాబ్దుల క్రితం ఒకరోజు సాయంత్రం "ఏమండోయ్! స్టేషన్ వచ్చేసిందండోయ్!" అని నన్ను తీసికెళ్తున్న జి. టి. ఎక్స్‌ప్రెస్‌కు తగిలించిన ఇంజన్ ఒక హెచ్చరికలా కూతపెడుతూ నెల్లూరు ప్లాట్‌ఫారం చేరుకొంది. ఈ చివరినుండి ఆ చివరవరకు రైలుపెట్టెలు ప్లాట్‌ఫారాన్ని ఆక్రమించుకొన్నాయి.

ఎక్కే మనుష్యులు దిగే మనుష్యుల్ని దిగనివ్వకుండా తోసుకొని, రాసుకొని ఎక్కుతున్నారు. ఇటు అటు.

పరుగెత్తేవారు, నెమ్మదిగా నడిచేవారు. చేతులూపుతూ ఆపేవారు, కేకలు పెడ్తూ పిలిచేవారు, ఈ సందడిలో జేబుల్లో చేతులు పెట్టేవారు, వాళ్ళజేబులు కొట్టేవారు, గబగబ వెళ్ళేవారు, లబలబలాడేవారు - ఎక్స్‌ప్రెస్ కొద్ది నిమిషాలే ఆగినా ఇన్ని చిత్రవిచిత్రాలు ఒక్కమారు జరిగిపోయేయి. ఒక ఊరునుండి ఇంకో ఊరుకి మకాం ఎత్తేసిన సర్కస్ కంపెనీలా మళ్ళీ ఒక కూత పెట్టి "రామకృష్ణా- టా! టా!" అంటూ ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫారం వదిలి వెళ్ళిపోయింది.

రైలుదిగిన వాళ్ళంతా వారివారి సామాన్లు జాగ్రత్తగా చూసుకొంటూ కూలీలతోబాటు బైటకు వెళ్తున్నారు. నేను నా సామానుతోబాటు ప్లాట్‌ఫారంమీదే ఉండిపోయాను.

అతడు ఎలా ఉంటాడో వర్ణించి రాయమంటే, "అక్కర్లేదు, అతడే మిమ్మల్ని గుర్తుపడ్తా"డంటూ మిత్రుడు తిక్కవరపు కోదండరామరెడ్డి సమాధానం వ్రాశాడు. నిజంగా అలాగే జరిగింది. అతడే నన్ను గుర్తుపట్టేడు. అంతమంది మనుష్యుల్లో నన్ను గుర్తుపట్టేసి, తిన్నగా నా దగ్గరకే వచ్చేశాడు. నన్ను చూసి నవ్వేశాడు. అతన్ని చూడగానే ఎందుకో నాకూ హృదయం విప్పి నవ్వాలని పించింది. నేనూ నవ్వేశా.

"ప్రయాణం హాయిగా జరిగిందా? బండి కాస్త లేటయి నట్టుంది. వెళ్దాంరండి" అంటూ కూలీకి నా సామాను అప్పజెప్పి బయటకు అతడు దారి తీశాడు. బండెక్కి మా యిల్లు, అదే లెండి మా బస చేరాం. వస్తూ వస్తూ దార్లోనే టిఫిన్ తినేసి, కాఫీ తాగేశాం.

రావడమే హడావిడిగా వచ్చాం. వచ్చిం దగ్గరనుంచి మరీ హడావిడి. "ఇవాళ సాయంత్రం టౌన్‌హాల్లో 'పరివర్తన' నాటకం ఉంది. మీరు స్నానం చేసి కాస్త విశ్రాంతి తీసుకొండి. పెద్దబ్బాయి తర్వాత వచ్చి మిమ్మల్ని హాలుకు తీసుకువస్తాడు," అంటూ హడావిడిగా అతడు వెళ్ళిపోయాడు

సంధ్యాసమయంలో మసకచీకటి. తెల్లని పైజమా, షర్టూ వేసుకొన్న నల్లని ఉంగరాల జుత్తు అబ్బాయి నవ్వుతూ వచ్చి, నన్ను ఆహ్వానించాడు. అతడు నవ్వినప్పుడు అతని తెల్లని పళ్ళన్నీ నాకు మిలమిల మెరిసిపోతూ కన్పించాయి. "ఇతడే అతని పెద్దబ్బాయి" అని అనుకొని అతని వెంట హాలుకి వెళ్లాను. మొదటి వరుసలో శ్రీ రేబాల పట్టాభిరామరెడ్డిగారి ప్రక్కనే కుర్చీలో కూర్చున్నాను. అతడు నన్నాయనకు పరిచయం చేశాడు. నా గురించి అంతకు ముందే ఆయన విని ఉండడం వల్ల నమస్కారం, ప్రతి నమస్కారం చేసుకొన్నాం. ఆయన ఒక జమీందారు. అందువల్ల ఆయన చాలా హుందాగా నవ్వేడు. నేను కళాకారునిలా మల్లెపువ్వులా నవ్వేను.

నాలుగు దశాబ్దుల క్రితం చూసిన ఆ పరివర్తన నాటకమంతా ఈనాడు జ్ఞాపకం లేదుగాని మరుపురాని ఒక దృశ్యం, నేటికీ మార్చిపోలేని దృశ్యం అందులో ఒకటి ఉంది. సమ్మె చేస్తున్న కార్మికుల్ని "తాగుబోతువెధవలు....' అని తిడుతూనే మిల్లు యజమాని ఎర్రని విదేశీ సారాను గడగడా తాగేశాడు. ప్రేక్షకులు కడుపుబ్బేటట్లు నవ్వేరు. ఆ మిల్లు యజమాని వేషం అతడు వేశాడు.

నాటకం ముగియగానే ఆ తెల్లపళ్ల నల్లబ్బాయి నన్ను కోమలా విలాస్‌కి తీసికొని వెళ్లాడు. అక్కడ నేను భోం చేసిన తర్వాత నన్ను నా బస వద్ద దిగబెట్టి, ఒక గుడ్‌నైట్ నవ్వు నా మీద చిలకరించి వెళ్ళిపోయాడు.

ఆ గదిలో ఒక మంచం ఉంది. దాని పక్కనే నా బెడ్డింగ్ పరచుకొని, కాలక్షేపానికి ఒక పుస్తకం చదువుతూ దానిమీద పడుకొన్నాను. మరొక గంట తర్వాత అతడు వచ్చాడు. వస్తూనే "అయ్యయ్యో! కింద పడుకొన్నారా? మంచం మీద పడుకోలేకపోయారా?" అని అంటూనే లోపలకు వెళ్ళి బట్టలు మార్చుకొని వచ్చి, మంచం మీద కూర్చున్నాడు.

"మా నాటకం ఎలా ఉందండి? మహారాష్ట్ర దేశంలో మీరు ఇంతకన్నా చాలా మంచి నాటకాలు అనేకం చూసుంటారు. బాల గంధర్వ నాటకాలేమైనా చూశారా? ప్రొఫెసర్ అత్రే నాటకాలు చాల హాస్యరస ప్రాధాన్యంతో ఉంటాయట. గదా? మన తెలుగు ఆత్రేయగారు సాంఘిక నాటకాలు రాయ

దంలో సిద్ధహస్తులు, వారిని మీకు పరిచయం చేయాలి...." అని మాట్లాడుతూ, ఉన్నటుండి కడుపును గట్టిగా నొక్కు-కొంటూ ఉండిపోయారు. నోరు మూగవోయింది. నవ్వు ముఖం ముడుచుకొని పోయింది. అయినా, నాకోసం అన్నట్టు ఆ ముకుళించుకొని పోయిన ముఖంలో సన్నని చిరునవ్వు చిందుతూనే ఉంది. ఆయన ముఖం చూసేసరికి నాకు కంగారు వేసింది. గ్లాసుతో మంచి నీళ్ళు తెచ్చి ఇచ్చాను.

''ఆ మందు కాస్త ఈ నీళ్ళలో కలిపి ఇస్తారూ? మీకు పని చెప్తున్నందుకు మీరు నన్ను క్షమించాలి" అని చిన్న నవ్వు తెచ్చి పెట్టుకొంటూ అతడు మంచం మీద వాలి పోయాడు. నేను మందు కలిపి ఇచ్చా. ఆయన ఆ మందు తాగి, కాస్సేపు కడుపు నొప్పితో మెలికలు తిరిగిపోయి, పడుకొన్నాడు. మళ్ళా అంతలోనే ఆయన తేరుకొన్నాడు.

"మీరేం కంగారు పడకండి. నాకు కాస్త గాస్ట్రిక్ ట్రబుల్ ఉంది. అప్పుడప్పుడు ఇలా అది నన్ను బాధ పెడుతూ ఉంటుంది. మందు తాగితే సర్దుకొంటుంది. చాలా రాత్రయింది, ఇంక పడుకొండి....'' అంటూనే అతడు నిద్రలోకి జారిపోయాడు. నేను లేచి అతని ముఖం ఒకసారి చూశాను. నిద్రలోగూడ అతని ముఖం నవ్వుతూనే ఉంది.

అత డెవరో కాదు - రమణారెడ్డి! అతడికీ నాకూ నాలుగు దశాబ్దుల క్రితం ఆ విధంగా తొలి పరిచయం అయింది.

నేనే అతని కన్నా పెద్దవాణ్ణయి యుంటే, "రమణా రెడ్డి చాలా పెద్ద వాడవుతాడు. అందర్నీ నవ్విస్తాడు" అని ఆనాడే నా డయిరీలో రాసి ఆశీర్వదించేవాణ్ణి.

మా పరిచయం స్నేహంగా పరిణమించి, ఆత్మీయతగా వర్ధిల్లింది. సంవత్సరాలు గడుస్తున్న కొద్దీ మాకు తెలియకుండానే మా యిద్దరి మధ్యా ఆత్మీయతతో పాటు పరస్పర గౌరవం పెంపొందింది.

అందుకే ఎప్పుడైనా ఏ సభలో నైనా మేమిద్దరం కలుసుకొన్నప్పుడు మా రమణయ్యకు హృదయపూర్వకంగా కృతజ్ఞతలు చెప్తూ ఉండేవాణ్ణి. ''అతడే లేకపోతే నేను ఆంధ్రదేశం వచ్చేవాణ్ణి కాను. తెలుగు నృత్యకళా సరస్వతిని ఆరాధించే అవకాశం నాకు కలిగి ఉండేది కాదు'' అని నేను అనేవాణ్ణి.

''మా రామకృష్ణయ్య అలాగే అంటూ ఉంటాడు లెండి, నా మీదున్న అభిమానంతో. నేను నిమిత్త మాత్రుణ్ణి. అంతా ఆ భగవంతుని దయ'' అని అత డనేవాడు.

అది ఒక విధంగా నిజం. తనను సేవించడానికే నృత్యకళా సరస్వతి నన్ను రమణారెడ్డి ద్వారా పిలిపించింది.

నా నెల్లూరు జీవితంలో ఆ రాత్రి నేను నిద్రపోయి వేకువనే లేచి తయారయేలోగా రమణయ్య కూడా నిద్రలేచాడు. ఆ తర్వాత ఇద్దరం కలిసి ఊళ్ళోని పెద్దల్ని కలుసుకొనడానికి బయలుదేరాం. మొట్టమొదట డాక్టర్ శ్రీమతి మాత్యూస్ ఇంటికి వెళ్ళాం. ఆ నల్లని లావుపాటి విగ్రహాన్ని చూడ్డానికి భయం వేసింది. అయితే, ఆమె నవ్వుతూ మమల్ని ఆహ్వానించింది. ఆమె హృదయం చాలా మంచిదని రమణయ్య నాకు ముందే చెప్పాడు.

అక్కడనుండి కస్తూరిదేవి విద్యాలయానికి వెళ్ళాం. అక్కడ పొణకా కనకమ్మగార్ని కలుసుకొన్నాం. భారత దేశ రాజకీయాల్లో ఆనాడు శ్రీమతి సరోజినీదేవి నాయుడు ఎంత గొప్ప రాజకీయావేత్తో నెల్లూరు జిల్లా రాజకీయల్లో కన కమ్మగారు అంత గొప్ప రాజకీయవేత్త. రైతులకొరకు వేంకటగిరి జమిందారులతో తగవులాడి రైతుల హక్కులను కాపాడిన దిట్ట ఆమె. ఆమెకు రాజకీయాల్లో ఎంత మక్కువ ఉందో అంత ఇష్టం లలితకళల్లో కూడా ఉండేది. ఆమె దేశ భక్తురాలు, అసలునిసలైన క్రాంగెసు సేవకురాలు.

వస్తూ, వస్తూ డాక్టర్ లక్ష్మిగార్ని కలిశాం. ఆమె భక్త మీరాలా ఉంది. ఆమె జీవితంగూడ మీరా జీవితంలాగే అయిపోయింది.

ఆనాటి మధ్యాహ్నం శ్రీ రేబాల పట్టాభిరామరెడ్డి గార్ని, వారి సోదరుడు లక్ష్మీ నరసారెడ్డిగార్ని కలిశాం. ఆ యిద్దరు సోదరులు ఇరుగుపొరుగు బంగ్లాలలో ఉన్నారు. ఒకరింట్లో ప్రాచీన జమీందారీ సంప్రదాయం గోచరిస్తే

ఇంకొక రింట్లో పాశ్చాత్య నవ్య నాగరికత గోచరించింది. వారు సహోదరులే అయినా సంస్కారాలు వేరు. ఎవరి అభిరుచులు వారివి, ఎవరి ఆదరణ వారిది, ఎవరి కళాపోషణ వారిది.

తెలుగు దేశంలో వివిధ తరగతులవారిని, రకరకాల ప్రజల్ని, అనేక అంతస్థులవారిని కలుసుకొనడం నాకదే ప్రథమం. మహారాష్ట్ర, హిందూస్థానీ దేశాల్లోని నా అనుభవాలు వేరు, ఈ అనుభవాలు వేరు. ఈ అనుభూతులు ఒక అవ్యక్తానందాన్ని నాకు కలిగించాయి.

నేనుండిన బసగురించి ముందుగా మీకు చెప్పాలి. అది ముమ్ముందు మీకు చాలా ఉపయోగపడుతుంది.

ఇంటి గుమ్మంలోకి వచ్చి రోడ్డును చూస్తూ నిలబడితే ఎడమ ప్రక్క ఇంట్లో ఒక రైతు కుటుంబం ఉంది. కుడి ప్రక్క చిన్న కుటుంబం. అంటే దంపతులు మాత్రమే ఉన్నారు. ఎదురింట్లో ఒక నర్తకుల కుటుంబానికి చెందిన ఒక నటి, ఆమె యింటివెనుక ఇంకొక నటి కాపుర మున్నారు. అయితే, అన్నిళ్ళకీ చుట్టూ కాంపౌండ్ గోడ లున్నాయి. ఎవరికి వారే.

ఆ రాత్రి భోజనం చేసి బస చేరేటప్పటికి కాస్త ఆలస్య మయింది. మా కుడిప్రక్క ఇంట్లోని భార్యా భర్తలు గట్టిగా అరుస్తూ, కొట్లాడు కొంటున్నారు. ఏమిటా అని నేను వింటున్నాను.

"ఏమీ లేదు లెండి. కొండమీద కొట్లాట ఏమిటంటే కోమట్ల రహస్యం అన్నట్టు, అది అంతే. వారు భోజనాలు చేసి తీరిగ్గా కూర్చుని రాజకీయాలు చర్చించు కొంటున్నారు. మనం పడుకొందాం రండి'' అన్నాడు మా రమణయ్య.

ఆ కుడి ఇంటామె కొద్ది రోజుల్లోనే నాకు రక్షాబంధన్ కట్టినట్టు సోదరై పోయింది. ఆమెది దైవ చింతన, ఆతనిది కమ్యూనిజం.

"చూడండన్నయ్యా! నేను దైవపూజ చేసుకొంటే ఆయన తిడుతున్నారు. ఆయన రాజకీయాల్లో నేను కలుగ జేసుకొంటున్నానా?'' అని జాలిగా నన్ను అడిగేది.

"పరవా లేదమ్మా, నీ పూజలో నిజంగా శక్తి ఉంటే ఆయన ఏనాడో ఒకనాడు నీ సిద్ధాంతాల వైపు మొగ్గక మానడులే'' అని ఆమెను వోదార్చేవాణ్ణి.

చివరికి నేనన్నట్టే జరిగింది. నేను మరి కొన్నాళ్ళకు నెల్లూరు వెళ్ళినప్పుడు ఆమె కలిసి చెప్పింది. ఆమెది శక్తివంతమైన ఆరాధనట. అతడు సంవత్సరానికి కనీసం నాల్గుసార్లయినా తిరుపతి వెళ్ళి వస్తున్నాడట. అంతేకాదు, వెళ్ళినప్పుడల్లా కేశ కళ్యాణం చేయించుకొని వస్తున్నాడట. ఎంత మార్పు!

నేను నెల్లూరు వెళ్ళిన కొన్నాళ్ళ తర్వాత నృత్యనికేతనం ప్రారంభించాను. అందువల్ల ఉదయం, సాయంత్రం నృత్యాభ్యాసం చేయడం, ఇతర సమయాల్లో తీరిగ్గా మా ఇద్దరి పిచ్చాపాటీ. ఒకనాడు మా కబుర్లలో ఒక ముచ్చటైన విషయాన్ని అతడు తమాషాగా చెప్పాడు.

ఒకసారి అతడు హెల్త్ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగం కోసం మ్యునిసిపాలిటీకి దరఖాస్తు పెట్టాడుట. ఇంటర్వ్యూకి బెజవాడ వెళ్ళాడట. అవి బ్రిటీష్‌వారు ఇంకా మన దేశాన్ని పరిపాలిస్తున్న రోజులు. అందువల్ల అప్పుడది బెజవాడే గాని ఇంకా విజయవాడ కాలేదు. హెల్త్ ఆఫీసర్ని ఆయన కలిశాడు. ఆయన ఈయన్ని ఎగాదిగా చూసి తనలో తాను నవ్వుకొని, తన ప్రక్కన కుర్చీలో కూర్చోమన్నాడుట. నిలబడే ఓపిక ఈయనకు ఉందో లేదో అన్న సందేహం కలిగి, ఆయన జాలిపడి ఉంటాడు.

ఆ హెల్త్ ఇన్‌స్పెక్టర్ రెండే రెండు ప్రశ్నలు వేశాడుట:

''మురికి కాలువల్ని ఎవరు శుభ్రం చేస్తారు?"

''సూర్యుడు.'' రమణయ్య సమాధానం.

''రోడ్ల ప్రక్కన మనుష్యులు విసర్జించిన మలాన్ని ఎవరు శుభ్రం చేస్తారు?"

''పందులు.''

ఈ రెండు సమాధానాలకు ఆ ఆఫీసర్ నిశ్చేష్టుడై పోయాడుట. అంతలోనే ఆయన తేరుకుని పకాలున నవ్వేడట.

"అయ్యా, నేను బెజవాడ వచ్చినప్పటినుండ చూస్తున్నా, మీరడిగిన రెండు పనులూ నే చెప్పినవారే చేస్తున్నారు,'' అన్నాడట రమణయ్య.

ఆ సమాధానానికి ఆ ఆఫీసర్ తృప్తి చెందాడుట. తనను మళ్ళీ అతడు తేరిపార చూసి రమణయ్య హెల్తుకు మెచ్చి కాబోలు వెంటనే ''ఇన్‌స్పెక్టరు ఉద్యోగం ఇచ్చాను, వెళ్ళు'' అన్నాడట!

అతడు అందర్నీ నవ్విస్తే అతని ఆరోగ్యం అతన్ని తరచు ఏడిపిస్తూ ఉండేది.

చాలా కాలం తర్వాత ఆయన నన్నొకసారి కలిసినప్పుడు ''ఏమండోయ్, కాస్త వళ్ళు చేశారే!'' అని సంతోషంతో నన్ను పలకరించాడు.

"మరి మీరు నాటినుండి నేటివరకూ అలాగే ఉన్నారే!" అని నేనూ నవ్వుతూనే పలకరించాను.

''ఏం చేయమంటారు చెప్పండి? లావెక్కడానికి ఎవరేది చెప్తే అది చేశాను. ఆఖరికి ఒకాయన బీరు తాగితే లావెక్కుతా నన్నాడు, పీపాలాంటి తన శరీరాన్ని చూపిస్తూ. లావెక్కాలన్న ఆశతో చివరకు అది కూడా సేవించా, కటకరేణి, అక్కలక్కర కషాయంలా. అదలవాటయిందే గాని అర పౌను కూడా నేను బరువెక్కలేదు. నిజం! మీరు ఎంత ఒట్టంటే అంత ఒట్టు!'' అంటూ నవ్వడం మొదలు పెట్టాడు.

నేను నెల్లూరులో నృత్యనికేతనం స్థాపించిన తర్వాత అక్కడ ప్రతి ఆడపిల్లకూ నాట్యం నేర్చుకొనాలనే ఉత్సాహం కలిగింది. నాట్యంమీద నా ఉపన్యాసాలు విన్నాక ప్రతి ఆడపిల్ల తల్లీ, తండ్రీ తమ పిల్లలకు నాట్యం నేర్పించాలని సంతోషపడ్డారు. నా బసకు ఎదురుగా ఉండిన నటి కూడా నాట్యం నేర్చుకొనాలని మనసుపడినట్టుంది. నేను రోజూ ఉదయం, సాయంత్రం క్లాసుకు వెళ్లే టైముకు అలా అలా గేటు దగ్గర నిలబడి నావంక ఆదోలా చూసేది. మా గురువుగారు నాకు అభినయమైతే చెప్పారు గాని, ఆదోలా చూసే భాషను అర్థంచేసికొనడం చెప్పలేదు. అందుకే ఆమె భాష నాకు అర్థం కాలేదు. నాకు అర్థం కాలేదని ఆమె అర్థం చేసికొన్నట్టుంది అందుకే ఆఖరికి ఆమె తెగించి వచ్చి మా రమణయ్యను అడిగేసింది- తనకు నేర్చుకోవాలని ఉందని, నేను ఆమెకు నాట్యం నేర్పించే బాధ్యతను అతన్ని స్వీకరించమని.

''అంగట్లో సరుకుంది, మీ ఇనస్పెక్టైలో డబ్బుంది, మధ్య నాదే ముంది? అలాగే, తప్పకుండాను'' అని ఆమెతో చెప్పి, ఆమెకు నాట్యం నేర్పమని నాతో చెప్పాడు రమణయ్య.

నేను అదిరిపోయాను, నా గుండె బెదిరిపోయింది. నా మనస్సు చెదిరిపోయింది. "నావల్ల కాదు బాబోయ్! మీరు తప్పదంటే నేను వచ్చిన దారినే మళ్లా జి.టి. ఎక్కి నాగపూర్ వెళ్ళిపోతా" నన్నాను.

ఆయన నా గాబరా చూసి మెల్ల మెల్లగా, ఆగాగి నవ్వేడు. ''అలా బెదరిపోతా వెందుకయ్యా? నీ దాదస్తం చల్లగుండా! కొత్త ఒక వింత. అదొక సరదా. కాదనక నాలుగురోజులు చెప్పి చూడండి. ఆమె కష్టపడి నేర్చుకొనా లనుకొన్నా ఆమె శరీరం వినవద్దూ?....'' అన్నాడాయన.

బితుకు బితుకు మంటున్న గుండెల్ని చేత్తో పట్టుకొని ఎదురింటికి వెళ్ళి వారంరోజులు ఆమెకు నాట్యం నేర్పాను. ఆమెకు కాళ్ళు పట్టేశాయట. అందువల్ల ఆమె నాట్యాభ్యాసం మానేసి, నేను కుర్చీలో కూర్చుంటే ఆమె పాటలు పాడి, కథలు వినిపిస్తూండేది. ఒక రోజున ఈ మాటా ఆ మాటా మాట్లాడి ''మేష్టారూ! మీ వయస్సెంత?'' అని మెల్లగా అడిగింది.

''ఇరవై'' అన్నాను.

నా సమాధానం విని, కాస్సేపు ఆలోచించింది. తల వాలుగా వంచి, క్రీగంట నన్ను చూస్తూ, వళ్ళు సగం కనబడేలా కొద్దిగా నోరు విప్పి, ముసిముసి నవ్వులు నవ్వుతూ, తీయని ద్రాక్షల్లా ''అయితే, మీరు నాకన్నా అయిదేళ్ళేనా చిన్న?!'' అంది.

అదిరిపోయాను నేను. మా అమ్మ బతికి ఉంటే ఈమె వయస్సుండవచ్చు అనుకొంటూ ఉండేవాణ్ణి. ఆమె

మాటలు వింటూ నోరు తెరచి అలా ఆమెను చూస్తూ ఉండి పోయాను. తన మాటలు నేను నమ్మలేదని ఆమె గ్రహించి, ''ఎవరూ నమ్మరు లెండి, నా శరీర తత్వమే అంత!'' అంటూ చటుక్కున లేచి వెళ్ళి నెస్‌కాఫీ కలిపి తెచ్చి యిచ్చింది.

ఆ ఆశ్చర్యం నా ముఖంలో అలాగే నిలిచిపోయింది. అలాగే నా బస చేరుకొన్నా. ఎదురుగా రమణయ్య. ''ఏమిటండీ, మీ ముఖంమీద ఏదో ఆశ్చర్యం నాట్యం చేస్తూంది?'' అంటూ నవ్వుతూ ఆయన అడిగాడు. గుక్క తిప్పుకోకుండా అంతా ఒకటనితో చెప్పా.

"అవును, ఆమె చెప్పింది నిజమే! నేను పదేళ్ళుగా ఆమెను చూస్తున్నా. ఆమె అలాగే ఉంది. కళాకారులు దేవ అంశ గలవారు వారు. అమృతం సేవిస్తారు. అందువల్ల వారి వయస్సు నిలకడగానే ఉంటుంది. అది కదలదు మెదలదు దేవతల కనురెప్పల్లాగ" అంటూ సీరియస్‌గా నా వైపు చూసి,



"ఓయ్ రామకృష్ణా! సరైన వయస్సు చెప్పిన ఆడవాళ్ళని, తమ జీతం సరిగ్గా చెప్పిన మగాళ్ళనీ ఎక్కడైనా చూశావా?' అంటూ చిరునవ్వి నవ్వి, గట్టిగా నవ్వి, మరీ గట్టిగా నవ్వేడు. నవ్వాపుకోలేక నేనూ గట్టిగా నవ్వేశాను.

నే వచ్చి కొద్ది రోజులే అయినా నా మనస్సును ఆయన ఇట్టే చదివేశాడు.

"కళాకారులకి వారి కళతప్ప ఇంకొకటి తెలీదు. వారికి లోకానుభవం తక్కువ గనుక లౌకికజ్ఞానం గూడా తక్కువే. అందులో మీకు బొత్తిగా ఏమీ తెలీదు" అని చెప్పి తర్వాత నన్ను తనవెంట తీసికొని వెళ్ళి ఓపికతో నాకు లోకాన్ని చూపించాడు.

ఒకనాడు ఒక కళావతి ఇంటికి వెళ్ళాం. మేం వెళ్ళిన సమయానికి ఆమె ఒక కర్బూజాపండును కోయబోతోంది. మమ్మల్ని ఆమె ఒక కంట చూసింది. పండు చెక్కును తీయాలని ఆమె ఎన్నిసార్లు ప్రయత్నించినా కత్తి జారి పోతోంది గాని చెక్కు రావడం లేదు.

"ఏమమ్మా, మాకు పండు కోసి పెట్టవలసి వస్తుందనా అలా చేస్తున్నావు? చెక్కు తీయడానికి నీకు మనసు రావడం లేదా? నేననలే మొండివాణ్ణి. చీకటి పడ్డాసరే ఆ పండు ముక్కలు తిని మరీ కదుల్తా సుమా!'' అని నవ్వులాటగా నవ్వేడు, రమణయ్య.

''అయ్యా, అది కాదండీ! నాకు చెక్కు తీయడం చేతకాదు. నాకు మా మామయ్య పనులు నేర్పుతేగా?.... మామయ్యా! మామయ్యా! రమణయ్యొచ్చారు గాని, ఈ పండు కోసి పెట్టుమామా!" అని మామని పిలుస్తూ, నా ముఖం వైపు ముద్దుగా చూసి, లోపలకు చూసింది. ఒక వెక్కిరింపు నవ్వును రమణయ్య ఆమె పైని ప్రసరించాడు.

మామ్మ లోపలినుండి వచ్చి, పండు చెక్కుతీసి, ముక్కలు కోసి, పంచదార చల్లి మా ముందుంచాడు. మేం ఆరగించాం. ఇద్దరం ఇంటికి బయలుదేరాం.

''అమ్మ! దీని మామ క్రాపు మంగలాడు కత్తిరించా! ఎంత సహజంగా, ఎంత నేర్పుగా నాటకమాడింది? అసలు

నాటకంలో ఇంత సహజంగా నటిస్తే దీనికి తీరిక ఉండదే! బుకింగ్ మీద బుకింగులు వచ్చేవి కదూ!" అని నవ్వుతూ అన్నాడు.

"ఏమిటండీ, ఎప్పుడూ ఏదో ఒకటి చెప్పి నవ్విస్తూ ఉంటారు!'' అన్నాను నేను.

''అదిగదీ సంగతి. అందుకే మీకు లోకానుభవం శూన్యమన్నాను. కొద్ది రోజులు ఓపిక పట్టండి, మీకో తమాషా చూపిస్తాను'' అంటూ చిటికె వేసి, సవాలు చేస్తున్నట్టుగా చిన్నగా అతడు నవ్వేడు.

నిజంగా అతడన్నట్టే జరిగింది. నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. ఒక రోజున ఉదయాన్నే మేమూ యింటి దారిని వెళ్తున్నాం. అతడు మెల్లగా చిరునవ్వు నవ్వి ''చూడండి, చూడండి ఆ సుందర దృశ్యం!'' అంటూ ఒక సినిమా హాస్యనటుని పోజు పెట్టబోయాడు. కాని, మానే శాడు. అప్పటి కింకా ఆయన సినిమాల్లో చేరలేదు.

చూశాను. ఏమిటి చూశాను? చక్కగా పండు చెక్కు తీయలేని ఆ కోమలాంగి చీర ఎగేసి, గోచిపోసి, దొడ్డిలో గొడ్ల దగ్గర పేడ ఎత్తి శుభ్రం చేస్తూంది!

''ఇప్పుడైనా లోకాన్ని అర్థం చేసుకోండి!" అంటూ నా వైపు చూసి, విజయగర్వంతో నవ్వుల మతాబుల వెలుగును వెదచల్లాడు.

ఇలా అతనిగురించి చెప్పుకుపోతే ఎన్నో, ఇంకెన్నో....

ఒకే ఒక్క విషయం మీకు చెప్పి నవ్వించనా?

నేను నెల్లూరు వెళ్ళిన కొత్తలో మా ప్రాక్టీసుకోసం మా బసకు దగ్గరగా నున్న ఒక సభవారు కట్టించిన ఒక హాలును ఆయన అడిగాడు. ఆ హాలును వారు కళల అభివృద్ధికే కట్టించారు.

నాగపూర్‌లో నేను హిందీ, మరాఠీ కాలేజీలో చదువు కొన్నా తెలుగు, సంస్కృతం ఒక పండితుని వద్ద నేర్చు కొన్నాను. అందువల్ల నా భాష ప్రబంధశైలిలా స్వచ్ఛంగా, సరళంగా ఉండేది. ఆ సభవారు నాగురించి విని, నన్నుగూర్చి ఏదేదో ఊహించుకొని వారి హాలును నాకు ప్రాక్టీసుకివ్వారు.

మాటల సందర్భంలో ఒక రోజున మా రమణయ్య నాగురించి చెప్తూ వారనుకొన్న ఏదో, ఏదో నేను కానని; ఇంకేమిటో ఏమిటోనని చెప్పారట! ఇంటికి వచ్చి ఆ విషయం నాతో చెప్పి నవ్వేరు. అంతే. ఆ మరునాటినుండి ఆ హాలు మా ప్రాక్టీసుకి దొరికితే రమణయ్య మీద ఒట్టు. రమణయ్య మనస్సు చివుక్కుమంది.

"పోనిద్దురూ, వీరెంత? వీరి హాలెంత? వీరికి తగిన శాస్తి చేసి తీరాలి. వర్షాకాలంలో పెన్నానది వరదలొచ్చి పారినట్టు వీరిని ఏడ్పించి, వీరి కన్నీరు మున్నీరుగా పారేటట్టు చేయకపోతే ఒట్టు'' అంటూ తనకోపం నాకు కనబరచకుండా నవ్వుతూ దాని చాటున కోపాన్ని దాచిపెట్టారు.

ఆయన అనుకొన్నట్టే చేశారు. కొన్నాళ్ళ తర్వాత ''మా నెల్లూరు ముచ్చట్లు" అంటూ ఆయన ఒక పత్రికలో రాయడం మొదలు పెట్టారు. ఆ శీర్షికలో ఒకసారి ''మా ఊళ్ళో ఒక సభ ఉందిలెండి. కళలకోసం ఒక హాలు కట్టించారు. అయితే, ఇంతకూ అందులో కళలు లేవు. అది కొత్తగా కట్టిన ఒకసామాన్యమైన సిమ్మెంట్ బిల్డింగు.... "అంటూ చప్పచప్పగా కాకుండా మాటుమాటుగా ఆ సభవారిచేత బుద్ధిని



ఆంధ్రదేశం వచ్చిన క్రొత్తలో మొదటి సన్మానం
ఆంధ్ర నాట్యకళా పరిషత్తు తర్వాత
తెనాలి సభవారి సన్మానం 1954

తినిపించారు. దాంతో ఇహ చూసుకోండి, కొన్ని నెలలవరకూ ఆ సభవారు కడవలకొద్దీ కంటినీరు కుమ్మరించారు.

ద్రౌపతి కుంతలాలను ముడిచి, ప్రతిజ్ఞ నెరవేర్చుకొన్న భీమునిలా మనిషి అమాంతంగా పెరిగిపోతూ వీర శంఖం పూరించాడు ఆయన.

నేను నెల్లూరులో నృత్యనికేతనం స్థాపించి ఒక సంవత్సరం అయింది. నెల్లూరులో పెద్దింటి ఆడపిల్లలంతా నాట్యం నేర్చుకొనాలని మోజుపడ్డం మొదలుపెట్టారు. చాలా మంది నాట్యం నేర్చుకొనడం ప్రారంభించారు. అంతవరకు ఇత్తడి దుఖాణాల్లో చిలుంపట్టి నిదురపోయిన గజ్జెలకు గిరాకి పెరిగింది. బట్టల వర్తకులు కూడా సంతోషించారు. శాస్త్రీయ వాద్య సంగీత కళాకారులు సంబరపడ్డారు. రమణారెడ్డిని మెచ్చుకోనివారు లేరు. ఒకప్రక్క శుక్లపక్ష చంద్రునిలా మేం అన్ని విధాలా వెలిగిపోతున్నా మరో ప్రక్క మేం కృష్ణపక్షాన్నికూడా ఎదుర్కోవలసి వచ్చింది.

నేను నాగపూర్‌లో ఉండగా మత కల్లోలాలను చూశాను గాని, కుల కల్లోలాలను, శాఖ - అంతర్ శాఖల్లో దెబ్బలాటలను నేనెప్పుడూ ఊహించలేదు. మొట్టమొదటిసారి ఈ విషయం నాకు నెల్లూరులోనే తెలిసింది. ఆ విషయం నేను మా రమణయ్యతో అంటే, ''అసలు మీకు మీ నాట్యం తప్ప వేరేం తెలుసండి ఈ లోకంపోకళ్లు? నాకు తెలిక అడుగుతున్నా........'' అని నవ్వుతూ ఆయన తేల్చేశాడు.

నా గురించి ఏదేదో అనుకొన్నవారు నేను 'అది' కానని తెలిసికొన్నారుట! నిరాశ చెందారుట! దాంతో వారూరుకొన్నారూ? మా దారిని మమ్మల్ని నాట్యకళా ప్రచారాన్ని చేయనివ్వకూడదూ? అలా అయితే వారు ఆంధ్రులెందుకవుతారు? ఎవరి కర్మకు వారిని వదిలి వేసేవారు ఆంధ్రులు కారుగా?

మా ఉపన్యాసాలు, అభినయపూర్వక ఉపన్యాసాలు, ప్రదర్శనలు జమీన్ రైతు, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక మొదలైన పత్రికల్లో ప్రచురింపబడడంతో మా నృత్యకళ ప్రచారంలోకి వచ్చింది. నృత్యాన్ని ఒకానొక తెగవారే నేర్చుకొనాలన్న పురాతన దృష్టిలో కొంత మార్పు వచ్చింది. మంచిదే అనుకొన్నాం. కాని, నన్ను 'ఏదో' అనుకొన్నవారు, దానివల్ల నిరాశ చెందినవారు ఒక నూతన పథకం వేసి ఇంకెవర్నో తీసికొని వచ్చారు. ఆయన చాలా గొప్ప వాడని ప్రచారం చేశారు. నిజమేననుకొని నేను చాలా సంతోషించాను. కాని, అది నాకొక పోటీగా తయారు చేశారు వారు. పదమూడు రోజుల్లో భరతనాట్యం నేర్పేస్తా నన్నాడు ఆ కొత్త వ్యక్తి. అలాగే చెప్పి అతడు కొందరిచేత ప్రదర్శన లిప్పించాడు.

''ఆహా! నా స్వరూపం ఇదేనా?'' అంటూ నాట్య సరస్వతి విస్తుపోయి, కంగారుపడి, కంటనీరు పెట్టిందనుకోండి. దానిని గురించి వాళ్ళంతా పట్టించుకోలేదు. కాని,రమణయ్యతో బాటు నాకూ బాధనిపించింది.

కేవలం నాట్యకళా ప్రచారం కోసమే నన్ను ఉత్తరాది నుంచి పిలిపించిన అతనికి ఇదంతా చాలా బాధ అనిపించింది. నేనెప్పుడూ ఇలాంటి వాతావరణాన్ని చూడలేదు. నేను రాజుల ఆస్థానాలలో పెరిగా. విద్వాంసులు, పండితులు, కవులు మొదలైన వారిముందు ప్రదర్శన లిచ్చా. 'నువ్వా, నేనా' అన్నట్టు పోటీపడి పెద్ద కళాకారులను పోటీలలో ఢీ కొన్నా. అందువల్ల నాకు విసుగుతోబాటు విచారం పట్టుకొంది.

''రమణారెడ్డిగారూ! ఆంధ్రదేశంలో జరిగిన నాట్యకళా ప్రచారం చాలు, ఇంక నేను నా దేశం వెళ్ళిపోతా'' నన్నాను ఒక రోజున. నేను హాస్యానికి కాకుండా నిజంగానే ఆ మాటలు అంటున్నానని మా రమణయ్య గ్రహించి, నా ముఖంలోకి తీక్షణంగా చూసి, నా మాటల్ని తోసిపుచ్చాడు.

"రామకృష్ణా! స్వర్గానికి పోయినా సవతి పోరు నీకు తప్పదు. మన పుణ్య భారత దేశంలో కుల, మత, వర్గ పోరాటాలు, ఈర్ష్య అసూయలు ఇవన్నీ అనాది నుండి వస్తున్నవే. అందువల్లనే మనది బానిస దేశ మయింది. వివేకానందుడు ఏమన్నాడు? **'Jealosy is the birth right of a slave nation'** అని అన్నాడు. జీవితంలో మీరేం

చూశారు? ఏమీ చూడలేదు. జీవితంలో ఎదురయ్యే సమస్య లను, పోటీలను ఎదుర్కొనాలిగాని, భయపడి పరుగెత్తడం మీ వంటి బుద్ధిమంతుల లక్షణం కాదు. మీరు ధైర్యంగా నిలబడండి. ఇవాళ కాకపోతే రేపైనా లోకం మిమ్మల్నే మెచ్చుకొంటుంది'' అని ఆయన నాలో ధైర్యాన్ని, ఆత్మ స్థైర్యాన్ని నూరిపోశాడు.

ఆ మాటలతో ధైర్యం తెచ్చుకొన్నాను. మరి కొద్ది నెలల్లోనే ఆయనన్నట్టుగానే జరిగింది. అందుకే కాబోలు ''ప్రతి ఇంటిలో అనుభవంతో తలనెరిసిన పెద్ద తల ఒక టుండాలి'' అని మన పెద్దలు అన్నారు.

కుమారి శ్యామా కౌండిన్య మా నృత్య నికేతనంలో నాట్యం నేర్చుకొంది. నేర్చుకొనడమే కాదు - ప్రదర్శన లిచ్చింది. ఆమెది అందమైన విగ్రహం. నా పాటకు ఆమె ఆట రక్తి కట్టింది. లోకం మెచ్చింది, పొగిడింది, కొనియా డింది. దెబ్బతో మేం మద్రాసు నుండి శ్రీకాకుళం వరకూ సుడిగాలిలా చుట్టబెట్టి వచ్చాం.

"చూశారా, ఓర్పు ఎంత మంచిదో! సబర్ కే ఫల్ మిటా హోతాహై!'' అని నెల్లూరు ఉర్దూ భాషలో రమణయ్య అన్నాడు. ఆయన భాష నన్ను నవ్వించింది.

నన్ను ఆంధ్రదేశానికి ఆయన రప్పించింది నేను నృత్య కళను ప్రచారం చేయాలని. సుడిగాలి వంటి మా పర్య టన వల్ల నా పేరు ఆంధ్రదేశంలో చాలా వరకూ పాకింది. సహృదయులు సంతోషించారు. పెద్దలు ఆశీర్వదించారు. నన్ను 'ఏదో' అనుకొన్నవారు నా విజయానికి లోలోన కుళ్ళి పోయారు. మా ధాటికి వారు తట్టుకోలేక క్రుంగిపోయారు.

ఏడ్వలేక నవ్వినట్టు, ఎందుకైనా మంచిదన్నట్టు లోపల మండిపోతున్నా పైకి నవ్వుతూ మమ్మల్ని వారు అభి నందించారు.

ఈ మధ్య కాలంలో మా రమణయ్య మద్రాసు తర చుగా వెళ్ళి వస్తూండేవాడు. ఆయనకు సినిమాలో వేషం వేయాలన్న సంకల్పం కలిగింది. పూర్తిగా మద్రాసులోనే ఉండి పోవాలని ఆయనకి బుద్ధిపుట్టి, ఆ నిశ్చయానికి వచ్చే ముందు నన్నొక మహా నాట్యకళా శాస్త్రవేత్తకు పరిచయం చేశాడు. ఆయనే ఓంగోలు వేంకట రంగయ్యగారు.

వేంకట రంగయ్య గారంటే ఆచార్య మామిడిపూడి వేంకట రంగయ్యగారని మొదట అనుకొని భ్రమ పడ్డాను. మామిడిపూడి వారు గొప్ప చారిత్రక పరిశోధకులని నాకు తెలుసు. నా విద్యార్థి దశలో వారి చారిత్రక వ్యాసాలు ఎన్నో చదివాను. ఈయన ఆయన కారని తర్వాత తెలుసు కొన్నాను. ఓంగోలు వారు గొప్ప నాట్యశాస్త్ర పరిశోధకులు.

ఒకనాడు ఓంగోలు వారి ఇంటికి వెళ్ళాం. ఆయన నాట్యశాస్త్ర గ్రంథాల మధ్య కూర్చుని ఉన్నారు. వాల్మీకి మహర్షికి గెడ్డం తీసేసినా, ఏసుకి గెడ్డం తగిలించినా ఒకే లాగుంటారని నాకెందుకో అనిపించింది. వారిలోని తేజస్సు, జ్ఞానం, ఆదరణ, ఆత్మీయత నన్ను ఆకట్టుకొనడం వల్ల నా కలా అనిపించి ఉండవచ్చు.

నవ్వుల రమణారెడ్డి కథలో నా సొంతబాకా ఎందు కని మీరు అనుకోకండి. ముమ్ముందు ఎవరైనా మన ఆంధ్ర దేశ నాట్యకళా చరిత్రను వ్రాస్తున్నప్పుడు రమణయ్యకూ నాట్యకళాచరిత్రకూ సంబంధం లేదని ఆయన్ని విస్మరించ వచ్చును. ఆంధ్రదేశంలో నృత్యకళా ప్రపంచంలో ఆయన గావించిన కృషిని (నాసంగతివదిలేయండి, నాకు తప్పదుగా!) చారిత్రక పరిశోధకులు గుర్తించాలని ఇదంతా వ్రాస్తున్నా.

అయితే, ఒక్క మాటలో చెప్పాలంటే - ఆంధ్రలో మరుగుపడిపోయిన శాస్త్రీయ నృత్యకళకు చంద్రోదయం కలిగి మళ్ళా పునాది పడింది నెల్లూరు పట్నంలో; దానికి శంకు స్థాపనచేసినవారు "నవ్వుల నటుడు' తిక్కవరపు రమణా రెడ్డి. నేను ముద్దుగా రమణయ్య అంటాను.

"ఆరోగ్యానికి నవ్వు మంచి టానిక్." అసలు ఇండియాలో అందరూ బాగా నవ్వితే గవర్నమెంటుకు ఎంత డబ్బు మిగుల్తుందని! ఈ ఆస్పత్రుల్ను, ఈ డాకటేర్లు, ఈ నర్సమ్మలు, ఇంకా ఇంకా ఇందరి ఖర్చు ఉంటుందంటారా?



ఆలయం ప్రాంగణంలో కుంభ హారతితో
"దేవ నర్తకి"

# శిక్షణ - క్రమశిక్షణ

మా నాన్నగారు రామకృష్ణ పరమహంస శిష్యులు. అందువల్ల వీలయినప్పుడల్లా మమ్మల్ని కలకత్తాలోని బెలూరు మఠానికి గాని, వారణాసిలోని సేవాశ్రమానికి గాని తీసికొని వెళ్తూండేవారు. మాకు వారణాసిలో ఒక అంటుమామిడితోట ఉండేది. అది ఇప్పుడు చాల పెద్ద తోట అయి ఉండాలి. మా నాన్నగారు గొప్ప ధర్మదాత. వారణాసి, కలకత్తా వెళ్ళినప్పుడల్లా సాధువులకు సంతర్పణలు చేయించేవారు. మా అమ్మమ్మ చెప్పారని ఆయన ఒక బంగారు పిల్లిని చేయించి గంగానదిలో వదిలిపెట్టారు. దానధర్మాలంటే ఆయన చేతికి ఎముక ఉండేది కాదు.

ఒకసారి నేనూ, మా అక్కయ్య కలిసి మా తండ్రిగార్లతో కలకత్తా వెళ్తున్నాం. అది ఫస్ట్ క్లాస్ కంపార్టుమెంటు. చాలా విశాలంగా ఉండేది. ఎందువల్లంటే, అది ఆంగ్లేయుల కాలం!

మద్రాసు నుండి కలకత్తాకు మెయిల్లో వెళ్ళడానికి 48 గంటలకు పైగా పట్టేది. ముందుగా తెలియజేయడం వల్ల మధ్య మధ్య స్టేషన్లో మాకు తెలిసిన బంధువులు, స్నేహితులు కాఫీ, ఫలహారాలు, భోజనం తెచ్చి యిచ్చేవారు. వారిని మా నాన్నగారు ఉచితరీతిని సత్కరిస్తూండేవారు. మా ప్రయాణం సరదాగా గడిచేది.

ఒకసారి కలకత్తా వెళ్తున్నప్పుడు నాకు, మా అక్కయ్యకు ఒక చిన్న విషయమై చిన్న తగవు వచ్చింది. ఆమె కూర్చున్న సీటులో కిటికీ వద్ద నాకు కూర్చోవాలనిపించింది. ఆ సీటు కావాలని గొడవ చేశాను. మా అక్క నాకా సీటు ఇచ్చింది. మరి కాస్సేపటికి మళ్లా నా సీటు నాకు కావాలన్నాను. ఇలా గంట గంటను సీటుకోసం కావాలని ఆమెతో తగవు పెట్టుకొంటూ వచ్చాను. మా అన్నయ్య, మా నాన్నగారు ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారే గాని, నన్నేం అనలేదు ఇంతలో చీకటిపడింది. భోజనాలు పూర్తయ్యాయి. ట్రైన్ ఏదో స్టేషన్లో ఆగింది. మా అన్నయ్య నన్ను బోగీలో నుండి దింపి, జనంతో కిక్కిరిసిపోయిన ఒక 3 వ క్లాసు కంపార్టుమెంటులో ఎక్కించాడు. అక్కడ ఒక సిక్కు ప్రయాణికునితో మాట్లాడి, నన్ను ఆయనకు అప్పగించి, ఇప్పుడే వస్తానని నాతో చెప్పి, కంపార్టుమెంటు దిగి వెళ్ళిపోయాడు. ఎప్పటికీ మా అన్నయ్య తిరిగి రాలేదు. బాగా చీకటిపడింది. అందరు పడుకొనడానికి పక్కలు సర్దుకొంటున్నారు. నాకు నిద్ర వస్తోంది, అన్నయ్య రాలేదు. ఆకలి వేస్తోంది అన్నయ్య రాలేదు. ఆఖరికి నాకు ఏడుపు వచ్చింది. కాని, ఏడవడానికి చిన్నతనం అనిపించింది. నాలో నేనే ఏడుపును దిగమింగుకొని కూర్చున్నాను. నా అవస్థ కనిపెట్టినట్టున్నాడు ఆ సిక్కు మిత్రుడు. అతడు నాకొక రొట్టెముక్క ఇచ్చాడు. ఆ జనంలో, దగ్గరలో ఉన్న టాయ్‌లెట్ వాసనలో తినబుద్ధి కాలేదు. కాని, కడుపులో ఎలకలు పరుగెడుతున్నాయి. నిద్ర ముంచుకు వస్తోంది. ఎలాగో అతికష్టంమీద ఆ రొట్టె తిన్నాను. ఆకలి రుచి ఎరగదు. నిద్ర సుఖ మెరగదు. ఆ సిక్కు మిత్రుని పక్కనే ముడుచుకొని పడుకొన్నాను.

ట్రైన్ ఆగినప్పుడల్లా జనం ఎక్కుతున్నారు. దిగుతున్నారు. పడుకొన్నవారిని జాగా యిమ్మని లేపుతున్నారు. ఇవ్వని వారితో తగవులాడుతున్నారు. అరుపులు, కేకలు - వాటికితోడు టాయిలెట్ వాసన. ఆ 3 వ క్లాసు యమలోకంలా అనిపించింది. మరి నిద్రపట్టలేదు. ఇంతలో ఇద్దరి మధ్య

తగవు తీవ్రస్థాయికి చేరుకొంది. వారు మాట్లాడుకొన్న భాష చాలా వింతగా ఉంది. మా యింట్లో ఎప్పుడు నేను అలాంటి భాష వినలేదు. అది తిట్లభాష. తిట్టిన తిట్టు తిట్టకుండా యతి ప్రాసలతో వారు తిట్టుకొన్నారు. ఆ రాత్రి ఎలాగో గడిచింది. హాయిగా మొదటి తరగతి కంపార్టుమెంటులో పడుకొనవలసినవాణ్ణి ఈ యమలోకంలో పడుకోవలసి వచ్చిందని బాధపడ్డాను. ఇది మా నాన్నగారు విధించిన శిక్ష. ఆ శిక్ష నా కెన్నటికీ మరుపురాదు.

ఆ మర్నాడు తెల్లవారిన తర్వాత మా అన్నయ్య వచ్చి, ఆ సిక్కు మిత్రునికి ధన్యవాదాలు చెప్పి, నన్ను తీసుకొని వెళ్ళాడు. మా నాన్నగారుగాని, అక్కగాని, అన్నగాని, నా క్రితం రాత్రి అనుభవం గురించి అడగలేదు. కాని కష్టమంటే ఏమిటో నాకు ఆనాడు తెలిసివచ్చింది. కిటికీ దగ్గర, అక్కసీటులో కూర్చుంటానని మరి నేను పేచీ పెట్టలేదు. అది వారు నాకిచ్చిన శిక్షణ. అదీ వారి క్రమశిక్షణ.

మా నాన్నగారు మమ్మల్ని ఎంత గారాబంగా పెంచారో అంత కఠినంగా కూడా మాపట్ల ఉండేవారు.

నే నెప్పుడు ట్రైన్లో ప్రయాణం చేసినా నా కీ సంఘటన గుర్తువచ్చి, నాలో నేను నవ్వుకొంటూంటాను.

నా చిన్నప్పుడు మా యింట్లో ఇద్దరు స్త్రీలు ఉండేవారు. ఒకామె మా దాయి. ఈమె మా ఆలనాపాలనా చూచేది. ఇంకొక ఆమె పూజారిణి. ఈమె మా యింట్లోని పూజా పురస్కారాలు చూసేది. వారిద్దరూ మా యింట్లో చాలా ముఖ్యమైన వ్యక్తులే అయినా వారిద్దరి స్థాయిలు భిన్నంగా ఉండేవి. ప్రతి పండక్కి మా నాన్నగారు అందరికీ కొత్త బట్టలు కొనేవారు. మా దాయికి, మా పూజారిణికి కూడ కొత్త బట్టలు కొని యిచ్చేవారు. మా దాయికి మంచి సన్నని, నాజూకైన బట్టలు ఇచ్చేవారు. పూజారిణికి ముతక బట్టలు ఇచ్చేవారు. మా నాన్నగారు ఆ యిద్దరి మధ్య భేదం ఎందుకు చూపించేవారో నాకు అర్థం కాక, ఒకసారి మా పూజారిణిన్నే అడిగాను. "బాబూ! నాకు మొదట్నుంచి ముతక బట్టలు కట్టుకొనడమే అలవాటు. సన్నని బట్టలు కట్టుకోలేను" అని సమాధానం చెప్పింది. అయినా మా నాన్నగారు ఆమెను కొంచెం తక్కువగానే చూసేవారని నాకు ఇప్పటికీ అనిపిస్తుంది. ఎందుకంటే, ఒకసారి మేమంతా వారణాసి వెళ్ళాం, రామకృష్ణ సేవాశ్రమంలో బస చేశాం. స్త్రీ విభాగంలో నేను,మా అక్క, పూజారిణి ఉన్నాం. బరేమా ఆ విభాగానికి పెద్ద. ఆమె పూజారిణి పాటించిన మతవద్ధతుల్ని దైవభక్తిని చూసింది. వారిద్దరు ఒకనాటి రాత్రి వేదాంత విషయాలు చర్చించుకొన్నారు. పూజారిణిని ఆమె మా నాయనమ్మ అనుకొంది. ఆ మర్నాంటి ఉదయం ఆమె మా నాన్నగారితో మాట్లాడుతూ ఆ పూజారిణి ప్రస్తావన వచ్చినప్పుడు మా నాన్నగారితో "మీ అమ్మగారు...." అని ఉటంకించింది. "ఆమె నా తల్లి కాదు, ఆమె మా నౌకరు" అని ఆవేశంగా మా నాన్నగారు చెప్పారు. ఆ మాట నేను విన్నాను. మా నాన్నగారు ఆమె గురించి అలా చెప్పడం నాకు రుచించలేదు. ఈ విషయమై నేను చాలా రోజులు బాధపడ్డాను. "నాన్నగారు కూడా మానవ మాత్రులే గదా!" అని తర్వాత సరి పెట్టుకొన్నాను. ఇంతకీ ఈ పూజారిణి ఎవరో మీకు చెప్పాలి గదా!

1857 లో సిపాయిల తిరుగుబాటు ముగిసిన తర్వాత కొన్ని రెజిమెంటులను బ్రిటిష్‌వారు సికింద్రాబాద్‌లోని చిలకలగూడ వద్ద ఉంచారు. మరికొంత కాలానికి ఆ రెజిమెంటులను బ్రిటిష్‌వారు ఎత్తివేశారు. అయినా ఆ మిలటరీ వారు అక్కడే స్థిరపడ్డారు. వారిలో చాలమంది తమిళులు వారిలో కొందరు ధర్మరాజును, ద్రౌపదీదేవిని పూజించేవారు. వారు ద్రౌపదీ దేవికి ఒక గుడిగూడా నిర్మించారు. అదొక పెంకుటిల్లు. అది ఇప్పటికీ ఉంది.

ఆ మిలిటరీలోని ఒక సిపాయి ఒక గ్రామానికి ఏదో పనిమీద వెళ్ళాడు. ఒక అందమైన యువతి ఇతని కంటబడింది. ఆమె చాలా తెల్లగా ఉంది. పొడుగుకు తగ్గ లావుంది. నడకలో ఏదో ఠీవి ఉంది. జుత్తు చక్కగా దువ్వుకొని, నిగవేసుకొని, ఒక బంతి పువ్వు తురుముకొంది. పల్లెటూరు పద్ధతిలో ముతక చీర కట్టుకొని, రంగుల రవిక వేసుకొంది. చేత కొడవలి పట్టుకొని, వంటకోతకు వెళ్తూంది. ఆ సిపాయికి ఆమె ఒక రంభలా కనిపించింది. తొలి చూపు

లోనే ఆమెను అతడు వలచాడు. ఆమె యింటికి వెళ్ళి, ఆమె తల్లిదండ్రులతో మాట్లాడాడు. ఆమె సుఖపడుతుందన్న ధైర్యం వారికి కలిగి, ఆమెను అతనికిచ్చి పెళ్ళి చేశారు. అయితే, వారి కులాలు వేరు ఆ పల్లెటూరి వారికి అదొక పెద్ద ఆక్షేపణీయమైన విషయమైంది. అందువల్ల ఆమె అతనితో గూడ పట్నానుకు వచ్చివేసింది.

ఆ సిపాయి పట్నంలోని ద్రౌపదీదేవి గుడిలో పూజారిగా ఉండేవాడు. అతనికి తోడుగా ఆమె ఆ గుడి కార్యక్రమాల్లో పాల్గొంటూ వచ్చింది. ఆమెను అందరూ పూజారి పెళ్ళాం అనేవారు. అలా అలా ఆ పేరు 'పూజారిణి' అయింది. ఆ పేరుకు తగ్గట్టుగా ఆమె నడచుకొనేది.

ఆమెకు పిల్లలు కలిగారు గాని, చనిపోయారు. కొన్నాళ్ళకు ఆమె భర్త చనిపోయారు. ఆమె ధనంలో బీదదయినా గుణంలో చాలా గొప్పది. ఆమె నోట పరుషవాక్యం గాని, అసత్యమైన మాటగాని వచ్చేది కాదు. ఆమె నీతి నిజాయితీగల వ్యక్తి. ఆమెను అందరూ గౌరవించేవారు. ఆపదల్లో ఆమె సలహా తీసికొనేవారు. అనుకోకుండా ఆమె మా యింటికి వచ్చి, మా కుటుంబంలో ఒక సభ్యురాలైంది.

ఆ కాలంలో నాగపూర్‌లోని హిస్‌లాపు కాలేజీకి మంచి ప్రఖ్యాతి వుండేది. అదొక మిషనరీ కాలేజీ. ఆంధ్ర, తమిళ, కేరళ ప్రాంతాలకు చెందిన మంచి అధ్యాపకులు అందులో ఉండేవారు. అందువల్ల ఆ కాలేజీలో తమ పిల్లల్ని చేర్పించాలని అందరు తల్లి తండ్రులు ప్రయత్నిస్తూ ఉండేవారు. నేను మదరాసు నుండి అక్కడికి వెళ్ళి స్వామి భాస్కరేశ్వరానంద గారి ద్వారా అందులో చేరాను. శ్రీ అగస్టిన్ ఆ కాలేజీకి సూపరింటెండెంటు. అతడు చాలా క్రమశిక్షణ పాటించే వ్యక్తి. అతడు విద్యార్థి మార్కులు చూసి, అనేక ప్రశ్నలు వేసి, తృప్తి చెందిన తర్వాతనే ఆ కాలేజీలో సీటు ఇచ్చేవాడు. అతని వద్ద రికమెండేషన్లు పనిచేసేవి కావు. ఆయన నా మార్కులు చూశాడు. ఎన్నో ప్రశ్నలు వేశాడు. నా మార్కులు ఆయనకు నచ్చాయి. ఆయన ప్రశ్నలకు చక్కని ఉచ్చారణతో సమాధానాలు ఇంగ్లీషులో చెప్పాను. ఆయనకు నా ఆంగ్ల భాషా పరిజ్ఞానం నచ్చింది. నాకు సీటు ఇచ్చాడు. తర్వాత నేను తెలుగువాణ్ణి అని ఆయన తెలుసుకొన్నాడు. ఆయనా 16 అణాల తెలుగువాడు. అందువల్ల మేమిద్దరం సన్నిహితులమయ్యాం.

మా ఎకానామిక్స్ ప్రొఫెసర్ రాఘవయ్యగారు. ఆయనకు చాలా పేరు ఉండేది. ఆయన ఉపన్యాసాలు వినడానికి ఇతర కాలేజీల నుండి విద్యార్థులు వచ్చేవారు. ఆయన చాలా సరదా అయిన వ్యక్తి. కాని, తరగతిలో పాఠం చెప్పేటప్పుడు చాలా క్రమశిక్షణ పాటించేవారు. అందువల్ల ఆయనంటే క్లాసులో అందరికి హడలు. ఆయన కూడా తెలుగువాడే గనుక ఆయన నన్నెంతో ఆదరంగా చూసేవాడు. అప్పుడప్పుడు నన్ను ఆయన వారింటికి తీసుకొని వెళ్ళి, అల్లం పచ్చడి వేసి పెసరట్టు టిఫిన్ పెట్టేవాడు. మరాఠా దేశంలో అల్లం పెసరట్టు దొరికినందుకు నేను చాలా సంతోషించేవాణ్ణి. 'నాన్ వెజ్ తినవోయి! మా యింటి వంట నీకు తెలుస్తుంది' అని ఆయన నన్ను ప్రోత్సహించేవాడు. కాని, నేను శాకాహారిని కనుక మర్యాదపూర్వకంగా నిరాకరించేవాణ్ణి.

మా మేథమెటిక్స్ ప్రొఫెసర్ చాలా గొప్ప మేధావి. ఆయన ధనవంతుడే కాదు గొప్ప గుణవంతుడు. ప్రొఫెసర్లు అందరికన్నా చాల చిన్నవాడు. ఎవరితో గూడ ఎక్కువగా మాట్లాడేవాడు కాదు, కాని విద్యార్థుల యెడల చాలా ప్రేమగా ఉండేవాడు. ఆయన తన కారులో కాలేజీకి వస్తున్నప్పుడు తోవలో విద్యార్థులు కనబడితే వారిని కారు ఎక్కించి, తీసికొనివచ్చేవాడు.అందువల్ల ఆయనంటే మాకు ఎంతో గౌరవం ఉండేది. లెక్కలంటే భయపడే విద్యార్థులకు లెక్కల యెడల ఆసక్తి కలిగేటట్టు ఆయన పాఠం చెప్పేవాడు. ఆయనలో గొప్ప ఆకర్షణశక్తి ఉండేది. ఆయన వాక్కు మధురంగా ఉండేది.

ఇసాక్‌గారు మాకు ఇంగ్లీషు చెప్పేవారు. ఆయన మలయాళీ. ఆయన ఆరడుగుల ఎత్తుండేవాడు. మంచి విగ్రహం. అచ్చం మలయాళ సినిమా హీరోలా ఉండేవాడు. ఆ నడక, ఆ ఠీవి, ఆ చూపు, ఆ మాట తీరు, ఆ భావ ప్రకటన అంతా ఒక ప్రత్యేకత. ఆయన షేక్‌స్పియర్

నాటకాలను బోధిస్తూ, బోధిస్తూ, మధ్య మధ్య కొన్ని పాత్రలను నటించి చూపించేవాడు. ఒక్కొక్కసారి ఆ తరగతిని రంగస్థలంగా మార్చేసి, మమ్మల్ని ఆ యా నాటకాలలోని పాత్రలుగా నిలబెట్టి, మాతో కలిసి నటించేవాడు. మేము నటించేటట్టు చేసేవాడు. అందుకే ఆయనకు "హీరో" అని పేరు పెట్టాము. ఆయన దగ్గర చదువుకొన్న విద్యార్థులు ఎవరూ ఇంగ్లీషులో తప్పలేదు. "అపజయం" అన్న పదాన్ని మా నిఘంటువులో నుండి ఆయన తొలగించమన్నాడు. ఇదే ఆయన మాకు చెప్పిన తొలి పాఠం. ఈ సందర్భంలో ఒక విషయం తెలియజేస్తాను.

అప్పటి కింకా మనకు స్వాతంత్ర్యం రాలేదు. కాని వచ్చితీరుతుందన్న నమ్మకం అందరికి కలిగింది. అందువల్ల "భారతదేశ జాతీయభాష'' అనే విషయంపైని ఒక వ్యాసం వ్రాయమని ఆయన చెప్పాడు. విద్యార్థులమందరం రకరకాలుగా వ్రాశాం. వారి మాతృభాష జాతీయ భాష కావాలని చాలామంది వ్రాశారు. కొంతమంది అంతటితో ఊరుకొనక దక్షిణ భారతదేశంలో మదరాసీ భాష ఉంది అది ఉత్తరాది వారికి అర్థంకాదు అని వ్రాశారు. మా ప్రొఫెసర్‌గారు మా వ్యాసాలు చదివి, స్పెషల్ క్లాసు తీసుకొన్నారు.

"ఓ నా విద్యార్థులారా! ఎంత విచారకరం! మీరంతా భారతదేశ బావిపౌరులు. బి.ఏ. చదువుతున్నారు. మీలో కొందరు రాజ్యపాలకులు కావచ్చును. ఆఫీసర్లు కావచ్చును మన దేశానికి నాయకులు కావచ్చును. కాని, మీ కెన్నటికి మన దేశ చరిత్రే తెలియదు మీ జాతి గురించే మీకు తెలియదు. అందుకే మనం దాస్యంలో మగ్గుతున్నాం. మదరాసీ జాతి అంటూ ఏదీ లేదు. తెలుగు, అరవ, కన్నడ, మలయాళ అనే తెగలవారు ఉంటున్న నాలుగు ప్రాంతాలను చేర్చి, బ్రిటిష్‌వారు ఒక రాష్ట్రాన్ని ఏర్పరచారు. ఈ నాలుగు ప్రాంతాల్లోను నాలుగు రకాలైన ద్రావిడ భాషలను అక్కడి ప్రజలు మాట్లాడతారు. మీలో చాలామందికి వింధ్య పర్వతాలకు దక్షిణాన ఏ దేశ ముందో తెలియదు. ఆ దేశం గొప్పతనాన్ని తెలుసుకోరు. మీరెప్పుడు అశోకుడు, అక్బరు, ఔరంగజేబు, తాజమహల్ గురించే మాట్లాడుతారు గాని, శాతవాహనులు, కాకతీయులు, విజయనగర రాజుల గురించి తెలుసుకొనరు. ఈ సామ్రాజ్యాల వైభవం గురించి మీకు తెలియదు. మలయాళదేశ చక్రవర్తి స్వాతి తిరునాళ గురించి మీలో ఎవరికైనా తెలుసా?" అని ప్రశ్నించి, మా ప్రొఫెసర్ మావైపు కొంతసేపు చూశారు. మా విద్యార్థులలో ఎవ్వరూ మాట్లాడలేదు. "చాలా విచారకరం, చాలా విచారకరం...." అన్నారు మా ప్రొఫెసర్‌గారు. ఇంక నాకు ఊరుకొనాలనిపించలేదు. ''నేను చెప్తాను'' అంటూ లేచి నిలబడ్డాను. ''రా, ఇలారా! నా మేజావద్దకు వచ్చి మాట్లాడు" అంటూ ఆయన ఆహ్వానించారు.

నేను మదరాసు రామకృష్ణ మిషన్‌లో ఉండినప్పుడు శ్రీయుతులు సత్యమూర్తి, సాంబమూర్తి, ముత్తులక్ష్మి మొదలైన అనేకమంది ఉపన్యాసాలు విన్నాను. వారిలో సత్యమూర్తిగారి ఇంగ్లీషు బహు చక్కగా ఉండేది. వారిని ఆదర్శంగా పెట్టుకొని, వారిని అనుకరిస్తూ వచ్చాను. ఉపన్యాసాలు ఇవ్వడం మాకు రామకృష్ణ మిషన్లో నేర్పారు. నాకు ఉపన్యసించడం సరదాగా ఉండేది. అందువల్ల ఇక్కడ వచ్చిన అవకాశాన్ని వినియోగించదలచుకొని, మదరాసీ, మదరాసు రాష్ట్రం, ఆ రాష్ట్రంలో గల వివిధ భాషలు, ప్రాంతాలు, గుళ్ళు గోపురాలు, సంగీత సాహిత్యాలు, వివిధ కళలు మొదలైన విషయాలు ప్రస్తావిస్తూ ఒక గంట సేపు ఉపన్యసించాను. మా ప్రొఫెసర్ చాలా సంతోషించారు. నా తోటివిద్యార్థులు చప్పట్లు కొట్టారు. తర్వాత ఆయన తన గదికి రమ్మనమని పిలిచారు. ఆయన ఏమంటారో అని భయం వేసింది కాని ఆయన నన్ను సాదరంగా దగ్గరకు తీసికొని, "మన పరువు నిలబెట్టావు రామకృష్ణా! నీ ఉపన్యాసం చాలా బాగుంది" అన్నారు అనాటినుండి నేను ఆ కాలేజీలో ప్రధాన ఉపన్యాసకునిగా చెలామణీ అయ్యాను. కాని, కాలేజీ డిబేటుల్లో పాల్గొనేవాణ్ణికాను.

మా కాలేజి ప్రిన్స్‌పాల్ రెవరెండ్ గార్డనెర్. ఆయన స్కాట్‌లాండ్ దేశస్థుడు. ప్రతి సంవత్సరం కొత్తగా చేరిన విద్యార్థులను ఆయన తన బంగ్లాలో సమావేశపరిచి, ఎవరికి ఏ కళలో ప్రవేశముందో తెలుసుకొనేవాడు. వారిచేత పాటలు

పాడించేవాడు. నాట్యం చేయించేవాడు, పాత్ర పోషణ చేయించేవాడు, బొమ్మలు వేయించేవాడు, ఉపన్యాసాలు ఇప్పించేవాడు. కొందరికి సంఘ సేవలో ఆసక్తి ఉంటే వారిని ఆస్పత్రులకు తర్వాత పంపించి, బీద రోగులకు పళ్లూ, బట్టలు ఇప్పించేవాడు. ఈ విధంగా వారి కళను అభివృద్ధి చేసికొనడానికి తగిన అవకాశం కల్పిస్తూండేవాడు. ప్రతి శుక్రవారం కాలేజీలో ఒక సభ జరిగేది. ఈ సభలో నైతిక విషయాలను ఆయన బోధించేవాడు. విద్యార్థులు విసుగు చెందకుండా మధ్య మధ్య కొంత మంది చేత పాటలు పాడించేవాడు. నేను అక్కడ చదువుతున్నంతకాలం నేను పాటలు పాడుతూ ఉండేవాణ్ణి.

సంవత్సరాని కొకసారి పాత విద్యార్థుల సమావేశం జరిగేది. ఆ రోజున వృద్ధులైన పాత విద్యార్థులు, యువకులైన నూతన విద్యార్థులను అభినందించేవారు. అందరం ఆనందంగా ఆ రోజు గడిపేవారం. ఆ వృద్ధులు వారి అనుభవాల నెన్నింటినో మాకు చెప్పేవారు. ఇలాగే నేను కొన్నాళ్ళ తర్వాత నా అనుభవాలను చెప్పగలనని ఊహించుకొనేవాణ్ణి. ఆ కాలంలో రాగింగ్ లేదు.

ఒక సంవత్సరం తర్వాత గార్డ్‌నెర్‌గారు స్కాట్‌లాండ్ వెళ్ళిపోయారు. ఆయన స్థానంలో డాక్టర్ మోసెస్ వచ్చారు. ఈయన మలయాళ దేశస్థుడు. ఈయన పద్ధతులు వేరు. ఈయనకు టెన్నిస్ అంటే చాలా ఇష్టం. ఆయన ఆడుతూంటే చూస్తూ నిలబడేవాణ్ణి. కొన్నాళ్ళకు ఆయన ప్రోత్సాహంతో టెన్నిస్ ఆడ్డం మొదలుపెట్టాను. నాకు భరత నాట్యం వచ్చునని తెలిసి, వారు నన్ను నాట్యం సాధన చెయ్యమన్నారు. ఆయన ప్రోత్సాహంతో నేను కాలేజీలో గొప్ప నాట్య కళాకారుడుగా పేరు తెచ్చుకొన్నాను.

ఎందరో తమిళులు, మహారాష్ట్రులు వారి పిల్లలకు పాఠశాల ఉత్సవాలకు నాట్యం నేర్పమని నన్ను అడుగుతూ ఉండేవారు. కాని, అదేమి దురదృష్టమో-తెలుగువారు ఎవరూ అలా అడిగేవారు కారు. అయితే, వేమూరు సూర్యనారాయణ గారని ఒకరు నాగపూర్‌లో ఆ రోజుల్లో ఉండేవారు. ఆయన మాత్రం మన కళాభివృద్ధికి తోడ్పడుతూ ఉండేవారు.

అవి 'వందేమాతరం' రోజులు. హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 'వందేమాతరం' పాటను పాడ నివ్వలేదని కొంతమంది యువకులు వచ్చి, నాగపూర్ యూనివర్శిటీలో చేరారు. శ్రీయుతులు దేవులపల్లి రామానుజ రావు, ఆనం విశ్వనాథం, జి. సుధాకరరావు మొదలైన కొంతమందిని నేను తరచుగా కలుసుకొంటూ ఉండేవాణ్ణి. శ్రీ దేవులపల్లివారు హైదరాబాద్‌లో ఆంధ్ర సారస్వత పరిషత్తును స్థాపించి, ఆంధ్ర భాషాభివృద్ధికి తమ జీవితాన్ని అంకితం చేసిన గొప్ప వ్యక్తి. ఆనాడు నిజాం రాజ్యములో తెలుగు భాష కొరకు ప్రత్యేక శిక్షణా తరగతులను పెట్టి, పరీక్షలు నిర్వహించారు ఈయన. ఈనాడు హైదరాబాదులో అనేక ఆంధ్ర సాంస్కృతిక సంస్థలు వెలిశాయి. వెలుస్తున్నాయి గాని, ఆనాడు ఆయన ఆంధ్ర సారసత్వ పరిషత్తును నడపటం ఒక యజ్ఞమే. శ్రీ ఆనం విశ్వనాథంగారు ధనవంతులు. ఆయన కొన్నాళ్ళు సికింద్రాబాదు కార్పోరేషన్‌కు మేయరుగా ఉన్నారు. వారి బంధువుల అబ్బాయి తుంగ ధనంజయ నావద్ద నాట్యం నేర్చుకొని మా నృత్యనాటకాలలో పాల్గొన్నాడు. శ్రీ జి. సుధాకరరావు గొప్ప కాంగ్రెస్‌వాది. తర్వాత కొన్నాళ్ళు రాష్ట్ర ప్రభుత్వంలో మంత్రిగా పని చేశారు.

దోమకొండ సంస్థానానికి చెందిన గద్వాల యువరాజా శ్రీకృష్ణభూపాలదేవ నాగపూరులో చదువుకొన్నారు. వారితో నా కప్పుడు పరిచయం ఏర్పడింది. నేను హైదరాబాదులో స్థిరపడిన తర్వాత వారి సతీమణిని కలుసుకొన్నాను. ఆమె తమ కుమార్తెకు నాట్యం నేర్పమన్నారు. సరే అన్నాను. కాని, నన్ను వారింటికి వచ్చి నేర్పమన్నారు. అది నా పద్ధతి కాదు గనుక నేను నిరాకరించాను.

ఆ కాలంలో - అనగా సుమారు 30 సంవత్సరాల క్రితం శ్రీకృష్ణదేవరాయ భాషానిలయం ఆంధ్ర విద్యావేత్తలకు కాణాచిగా ఉండేది. సభలు, సమావేశాలు, పండిత గోష్ఠులు, కవిసమ్మేళనాలు అక్కడే తరచుగా జరిగేవి. నేను హైదరాబాదు వచ్చిన కొత్తలో అక్కడే నృత్యంపైని అభినయపూర్వక ఉపన్యాసం ఇచ్చాను. నేను, నా కళా

సోదరుడు స్వర్గీయ ఏ. ఆర్. కృష్ణ అక్కడ అనేక ప్రదర్శనలిచ్చాం.

హైదరాబాదుకు విమోచనం లభించిన తర్వాత నన్ను తొలిసారి ఆహ్వానించి, నా అభినయపూర్వక ఉపన్యాసాన్ని; నా శిష్యులు శివ, ఉమ, శ్యామా కౌండిన్యల నాట్యప్రదర్శనలను ఏర్పాటు చేసినవారు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు. వారికి నా యెడల చాలా గౌరవ ముండేది. ఆనాటి కాంగ్రెస్ ప్రభుత్వంలో వారికెంతో పలుకుబడి ఉండేది. ఎందరో ఆ పలుకుబడిని వినియోగించుకొన్నారు. కాని, నేనెప్పుడు ఆయన్ని ఈ విషయంలో ఉపయోగించుకొనలేదు. అందువల్ల ఆయన నన్నెంతో అభిమానిస్తూండేవారు. ఈ గౌరవ అభిమానాలను నేను చివరివరకు నిలబెట్టుకొన్నాను.

దక్షిణాంధ్ర చరిత్రను పరిశోధించిన మహాపండితులు డాక్టర్ కురుగంటి సీతారామభట్టాచార్యగారితో నాకు ఆ రోజుల్లో పరిచయమయింది. దక్షిణాది రాజ్యాల గురించి వారెన్నో ముఖ్య విషయాలు నాకు చెప్పారు. వారిద్వారా ఒకసారి మునగాల రాజావారిని కలుసుకొన్నాను. వారు గొప్ప సాహిత్య కళాపోషకులు. నేను వారి ఆర్థిక సహాయం కోసం వెళ్ళానని వారు భ్రమపడి, "నేను ప్రస్తుతం ఏమీ చేయలేను" అన్నట్టుగా వారి ప్రసంగం ధ్వనించింది. అప్పుడు భట్టాచార్యగారు, "ఆర్థిక సహాయంకోసం మీవద్దకు మేం రాలేదు, ఆంధ్రదేశంలో ఒక గొప్ప నాట్యకళాకారుడు రూపొందుతున్నాడని, ఆయన్ని మీకు పరిచయం చేయాలని మాత్రమే తీసికొని వచ్చాను. నాట్యశాస్త్రం, సంప్రదాయం రెండూ బాగా తెలిసినవారు దేశంలో చాల తక్కువ మంది ఉన్నారు. వారిలో ఈతడు ప్రథముడు" అన్నారు. తర్వాత మా మధ్య కొంత సాహిత్య చర్చ జరిగింది. చివరకు ఆయన "ఏముంది, దేశ చరిత్రలో మన గురించి ఒక వాక్యం వ్రాస్తే చాలు - మన జన్మ ధన్యమౌతుంది" అన్నారు. ఈ వాక్యంలో వారి నిస్సహాయత,నిస్పృహలు నాకు ధ్వనించాయి.

ఆ రోజుల్లో ఒకసారి దేవులపల్లివారి ఆహ్వానంపైని హైదరాబాదు వచ్చి, ఉస్మానియా విశ్వ విద్యాలయం, శ్రీ కృష్ణదేవరాయ భాషా నిలయం, మహబూబ్ కళాశాల, వేమన గ్రంథాలయం, నీజాం కాలేజి మొదలైన అనేకచోట్ల నేను అభినయ పూర్వక ఉపన్యాసాలు నాట్యంమీద ఇచ్చాను. అంతకు ముందెన్నడూ ఇటువంటి ఉపన్యాసాలను హైదరాబాదు ప్రజలు చూడనందున అనేక మంది పండితులు, కవులు, శాస్త్రవేత్తలు, అధ్యాపకులు, విద్యార్థులు తండోపతండాలుగా నా ఉపన్యాసాలు వినడానికి వస్తూ ఉండేవారు.

నేను కాంబ్రిడ్జి యూనివర్శిటి పరీక్షలకోసం చదువుతూ ఉండేవాణ్ణి. నాకు ఆంగ్ల భాషలో మంచి ప్రవేశముండేది. అప్పుడు ఎం. ఏ. చదువుతున్న మిత్రుడొకడు నాకుండేవాడు. ఒక్క ఆంగ్లంలో తప్ప ఇతర విషయాలలో చాలా తెలివైనవాడు. అతనికి షేక్స్పియర్ వ్రాసిన మేక్‌బెత్ నాటకం సరిగ్గా అర్థం కాక నన్ను చెప్పమన్నాడు. నేను కేవలం బి. ఏ. చదువుకొన్నాను. అతడు ఎం. ఏ. విద్యార్థి. కొందరు మిత్రులకు ఈ విషయం తెలిసి అతన్ని హేళన చేశారు. నన్ను ఆట పట్టించారు. నాకు రోషంతో పాటు పట్టుదల వచ్చింది. ఆ నాటకాన్ని పదే పదే చదివి, బాగా అర్థం చేసుకొని ఆ నాటకాన్ని అతనికి బోధించాను. అతడు ఎం. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. పట్టుదల ఉంటే ఏదీ అసాధ్యం కాదన్న విశ్వాసం నాకుండేది.

నాగపూరులో జస్టిస్ భవాని శంకర్ యోగి ఉండేవారు. ఆయన గురించి తెలియని వారు ఆ రోజుల్లో లేరు. ఆయన కరుణామయుడు, అమృత సాగరుడు, దానకర్ణుడు. ఆయన సహాయం పొందని సంస్థలు లేవు. ఆయన పోషణ పొందని అనాథలు లేరు. ఆయన న్యాయవాదిగా లక్షలు సంపాదించారు. అంతా దాన ధర్మాలకే వినియోగించారు. చివరకు ఆయన నివసిస్తూండిన దివ్యభవంతినికూడ నాగపూర్ విశ్వవిద్యాలయానికి దానం చేశారు.

నేను నాగపూర్‌లోని భండాడు సంస్థానంలో చేరకముందు ఆర్థిక ఇబ్బందుల్లో చిక్కుకొన్నాను. అందువల్ల ఒకనాడు ఉదయమే బయలుదేరి, నాలుగు మైళ్ళ దూరంలో ఉన్న ఆయన దివ్య భవంతికి నడిచివెళ్ళాను. ఆ సమయంలో వారు పూజ చేసుకొంటున్నారు. నేను కాస్సేపు వేచియుండి, వరండాలో కూర్చున్నాను. ఇంతలో నౌకరు వారికి చెప్పగా, వారు

స్వయంగా ఒక గ్లాసు పండ్లరసం పట్టుకొని వచ్చి ఇచ్చారు. అది తాగి సేద తీరాను. అంతకు ముందు వారికి నా ముఖ పరిచయ ముంది. ఆంధ్రా క్లబ్ కార్యక్రమాలలో నన్ను ఆయన చూశారు. నాకు దగ్గరగా కుర్చీలో కూర్చొని కుశల ప్రశ్నలు వేశారు. వారికి నా యిబ్బందుల గురించి వివరంగా చెప్పాను. వారు ప్రశాంతంగా విన్నారు.

"బాబూ! పెద్దింటి పిల్లవాడివి. ఈ కష్టాలు నీవు పడ లేవు. నీకు రైలు చార్జీలు ఇస్తాను. మీ ఊరు వెళ్ళిపో" అన్నారు. అప్పుడు నేను నా నృత్యకళారాధన గురించి ఆయనకు విన్నవించుకొన్నాను. "ఆశయం మంచిదే కాని, నాట్యం చాలా ఖరీదైన కళ. బాగా ఆలోచించుకో - నీకేం కావాలో!" అన్నారు. "నేను నాట్యం సాధన చెయ్యాలి. అందుకు మీ సహాయం కావాలి" అన్నాను. ఆయన వెంటనే లోపలకు వెళ్ళి, అయిదు పది రూపాయల నోట్లు తెచ్చి, నా చేతిలో పెట్టి, "ప్రస్తుతానికి ఇవి తీసుకో. నెల నెలా నీకు రూ 50/– లు ఇస్తాను. నాట్య సాధన చెయ్యి" అని చెప్పి కారులో నన్ను నా బసకు పంపించారు. ఆ రోజుల్లో రూ 50/- అంటే ఇప్పుడు 5 వేలతో సమానం! ఆ మహనీయుని రుణం తీర్చుకొనాలనుకొన్నాను. కాని, తీర్చుకోలేకపోయాను. మరి తీర్చుకోలేను.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక మధ్యప్రదేశ్‌లో డాక్టర్ ఖేర్‌గారి నాయకత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్ప డింది. కాని, అనతికాలంలోనే ముఠా రాజకీయాలవల్ల డాక్టర్ ఖేర్‌గారు తమ పదవికి రాజీనామా ఇవ్వడమే కాక, కాంగ్రెస్ పార్టీనుండి విడిపోయారు. తర్వాత శ్రీ రవిశంకర్ శుక్లా ముఖ్యమంత్రి అయ్యారు.

డాక్టర్ ఖేర్ శ్రీమంతులు, ప్రఖ్యాతులైన వైద్యులు, ధర్మబుద్ధి గలవారు ఆయన్ను ఎవరైనా ఒక సభకు ఆహ్వా నించి, పూలదండ వేస్తే, వెంటనే ఆయన రూ 25/ లు చెక్కు ఇచ్చి, ఆ సంస్థకు సహాయం చేసేవారు.

ఆయనతోపాటు మరికొందరు మంత్రులు కాంగ్రెస్ పార్టీని విడిచిపెట్టారు. వారిలో శ్రీమతి అనసూయాబాయి కాలే ఒకరు. గొప్ప దేశభక్తురాలు కాంగ్రెస్ పార్టీనుండి విడివడినా కాంగ్రెస్ ఆదర్శాలకు కట్టుబడి ఉండేవారు.

స్వాతంత్ర్య సమరకాలంలో మధ్యప్రదేశ్‌లోని చిమూరు, అష్టి ప్రాంతాలలో గొప్ప విప్లవం చెలరేగింది, ఆ విప్లవంలో ఎందరో యువతీయువకులు తమ ప్రాణాలను అర్పించారు, నలుగురు యువకులు కారాగారంలో బంధింప బడ్డారు. శ్రీమతి కాలే చాలా కష్టపడి వారిని విడుదల చేయించారు.

ఆ కాలంలో సంత్ తుకుడిజీ మహారాజ్ అనే ఒక మహాభక్తుడు నాగపూర్‌లో ఉండేవాడు. ఆయన 20 మంది శిష్యులతో కలిసి సంకీర్తనలు చేసేవాడు. ఆయన కంజీరా వాయిస్తూ పాడుతూంటే వినడానికి వేలాది మంది ప్రజలు వచ్చేవారు. చిమూరు, అష్టి విప్లవ వ్యవహారం ముగిసిన తర్వాత ఒక మహాసభ జరిగింది. ఆ సభకు మహారాజ్ తమ శిష్యబృందంతో వచ్చి సంకీర్తన చేశారు. నేనూ ఆ సభలో పాల్గొన్నాను. చిమూరు, అష్టి విప్లవం మీద ఒక నృత్య నాటకాన్ని రూపొందించ మని శ్రీమతి అనసూయాబాయికాలే నన్ను అంతకుముందు కోరారు, తయారుచేశాను.

అప్పుడు అక్కడ రెండు రంగస్థల బృందాలుండేవి. ఒకటి పీపుల్సు థియేటర్, రెండవది నేషనల్ థియేటర్. నేను రెండింటిలోను పాల్గొనేవాణ్ణి. అందువల్ల నన్ను కొందరు విమర్శిస్తూండేవారు, కాని, కళాకారుడుగా నాకు వాటి రాజకీయాలతో సంబంధముండేది కాదు. నా విమర్శకు లకు ఒక చక్కని ఉదాహరణ చెప్పేవాణ్ణి. ధర్మపేటలో ఒక ధనవంతుడుండేవాడు. ఆయన హిందూ మహాసభలో సభ్యుడు కొడుకు కాంగ్రెస్‌వాది, కూతురు కమ్యూనిస్టు. వారు ముగ్గురు ఒకే బంగ్లాలో కలిసి ఉండేవారు. ఎవరి రాజకీ యాలు వారివి, ఎవరి ఆదర్శాలు వారివి, ఎవరి భావాలు వారివి. అయినా సాంసారికంగా వారిలో విభేదా లుండేవి కావు. ఈ కుటుంబాన్నే నేను ఆదర్శంగా తీసికొన్నానని నా విమర్శ కులకు చెప్పేవాణ్ణి.

ఆనాటి సభలో ఆ నృత్యనాటికను ప్రదర్శించడానికి సిద్ధంగా ఉన్నాను. సంత్ తుకుడిజీ సన్యాసులు గనుక వారికి పుష్పాలు సమర్పించి, పాదాభివందనం చేయమని నా శిష్యు లకు చెప్పాను. అంతవరకు నా కార్యక్రమం ఆనందంగా

గడిచింది. అయితే, ఇంతలో ఆ సంత్‌గారి మనస్సుకు ఏమి తోచిందోగాని, "ఇదేమి చిత్రం! ఇది సంకీర్తన వేదిక. సన్యాసి ముందు ఈ నాట్యం ఏమిటి? ఈ గానాభిజానాలు ఏమిటి?" అని అన్నారు. వారు నా శిష్యుల్ని దీవిస్తారని ఆశించిన నాకు అశాభంగం కలిగింది. సంత్ ధ్యానేశ్వర్, తుకారామ్, నామదేవుల కోవకు వారు చెందినవారని నేను ఊహించడం పొరపాటని గ్రహించాను. మా నృత్యనాటిక ఆగిపోయింది. ఆయన భజన ప్రారంభమయింది. ఆయన సంకీర్తనలోని పాటలన్నీ హిందీ సినిమా పాటల అనుకరణలే. అందుకే అంతమంది జనం ఆయన సంకీర్తనలకు వస్తున్నారని అర్థమయింది. ఇది నాకు మన ఉగాది పచ్చడి లాంటి అనుభవం. భారతీయ నృత్యకళ యొక్క పరమార్థాన్ని ఆ సంత్‌గారు గ్రహించనందుకు అనసూయాబాయి గారు విచారించారు.

భారతదేశమంతటా చాలా శక్తివంతంగా పీపుల్సు థియేటర్ పనిచేసింది. నేషనల్ థియేటర్ కార్యక్రమాలు వేరుగా ఉండేవి. చాలా కాలం నేషనల్ థియేటర్ను శ్రీ దామూ జవేరి గారు బొంబాయిలో నిర్వహించారు. ఆంధ్రదేశంలోని ప్రజానాట్యమండలికి డాక్టర్ గరికిపాటి రాజారావు గారు జీవంపోసి, చైతన్యవంతంగా ఎన్నో కార్యక్రమాలను నిర్వహించారు. డాక్టర్ రాజారావుగారు ప్రదర్శించిన "మా భూమి" చాలా ఉదాత్తమైంది.

ఆ కాలంలో జవహర్లాల్ నెహ్రూ గారి డిస్కవరీ ఆఫ్ ఇండియా ఒక గొప్ప నృత్యనాటకంగా రూపొందింది. మా కాలేజీలోనే కాక నాగపూర్ నేషనల్ కాలేజీలోగూడ మంచి అధ్యాపకు లుండేవారు. అయితే, వారిలో కాంగ్రెస్ వాదులు ఎక్కువ మా కాలేజీలో రాజకీయాలను చర్చించే వారు కారు. అయినా మా కాలేజీ విద్యార్థులు కొందరు స్వాతంత్ర్య సమరంలో పాల్గొని కారాగార శిక్ష అనుభవించారు. మా అధ్యాపకులు చదువు విషయంలో ఎక్కువ శ్రద్ధ వహించేవారు. గాంధీజీని ఇక అవతార పురుషునిగా భావించినవారు నేషనల్ కాలేజీలో ఉండేవారు. వారు దేశంకోసం ప్రాణత్యాగం చేయడానికి గూడ సిద్ధంగా ఉండేవారు వారిలో కొందరు హిందూ మహాసభను అభిమానించేవారు.

డాక్టర్ ముంజీ ఒకనాటి కాంగ్రెసు భక్తుడు. కాని ఏవో విభేదాలు వచ్చి ఆయన హిందూ మహాసభలో చేరారు. ఆయన ఒకసారి నాగపూర్‌లో జరిగిన ఒక సమావేశానికి వచ్చారు. ఆయన్ని ఘనంగా సత్కరించారు. ఆయన గొప్ప వక్త. ఆయన ఉపన్యాసాన్ని మేము శ్రద్ధగా వింటున్నాం. ఇంతలో ఆయన దేశభక్తి ప్రబోధం నుండి గాంధీజీని దూషించడం మొదలుపెట్టారు. కొంతమంది విద్యార్థులు అభ్యంతరం చెప్పారు. కాని, ఆయన నిర్లక్ష్యంగా వారి ఉపన్యాసాన్ని కొనసాగిస్తూ మళ్ళీ గాంధీజీని తూలనాడేరు. మళ్ళీ విద్యార్థులు అభ్యంతరం చెప్పారు. అయినా వారి దూషణ ప్రవాహం ఆగలేదు. అప్పుడొక విద్యార్థి ఒక అగ్గిపుల్ల వెలిగించి ఆయన పొరుగుపాటి గెడ్డం మీదకు విసిరాడు. సభ ఆగిపోయింది ఇదొక వింత సంఘటన. దేశాభిమానం ఆనాడు అలా ఉండేది.

ధంతోళి సంఘం నదీ కానుకొని ఒక విశాలమైన మైదానం నాగపూర్‌లో ఉండేది. అక్కడ రాష్ట్రీయ స్వయం సేవక సంఘ సభ్యులు కవాతు చేసేవారు. వారి క్రమశిక్ష చాలా గొప్పది. దసరా రోజున ఆర్. ఎస్. ఎస్. శాఖల వారందరూ కలిసి ఆ మైదానంలో కవాతు చేస్తుంటే సైన్యాలు కవాతు చేస్తున్న అనుభూతి కలిగేది. గురూజీ గోల్‌వల్కర్ ఆ సంస్థకు పెద్ద. ఆయన బ్రహ్మచారి. తన జీవితాన్ని సంఘానికి అర్పించారు. హెగ్డేవారు గారు ఆ సంస్థను స్థాపించారు. గురూజీ ఆ సంస్థను అభివృద్ధి పరచారు. హిందూ సమాజాన్ని సంఘటిత పరచి, అభివృద్ధి చేయడానికి ఆయన కృషి చేశారు. యువకులను వీరులుగా తీర్చిదిద్దడానికి వారెంతో శ్రమించారు. గురూజీకి అమ్మగారుండేవారు. ఆ వృద్ధ మాతను సంఘ సందాలకులు దర్శించి పాదాభివందనం చేసేవారు.

రాష్ట్రీయ స్వయం సేవక సంఘంలో నాకు కొంతమంది మిత్రు లుండేవారు. వారిక్రమశిక్షణ నాకెంతో నచ్చింది. కాని, నా జీవితలక్ష్యం వేరు. అందువల్ల వారితో స్నేహంగా మాత్రమే ఉంటూ వచ్చాను. వారిలో శ్రీ జామ్‌దార్ నాకు ఆప్తమిత్రుడయ్యేడు. ఎన్నో అవసరాల్లో ఆయన నన్ను ఆదు

కొన్నాడు. పేరిణి శివతాండవాన్ని రూపొందించిన తర్వాత ఆ నృత్యాన్ని ఆ సంఘ సేవకులకు నేర్పించాలని ఎంతో ప్రయత్నించాను ఒకసారి బాలాసాహెబ్ గారు హైదరాబాదులో జరిగిన ఆర్. ఎస్ ఎస్. శిబిరానికి వచ్చారు. వారి సమక్షంలో వారి కార్యకర్తలకోసం పేరిణి శివతాండవాన్ని ప్రదర్శించాం ఆ కళ విశిష్టతను ఆయనతో చర్చించాను. అది కేవలం ఒక నృత్యం కాదు - శివసాక్షాత్కారం పొందడానికి అదొక సాధన అని వారు అంగీకరించారు. వారు పంపే కార్యకర్తలకు ఉచితంగా శిక్షణ ఇస్తానని వారికి నేను వాగ్దానంచేసి అన్ని ఏర్పాట్లు చేశాను. వారు ఈ కళను ఆరాధిస్తే ఈ కళ ఒక్క భారతదేశంలోనేకాక యావత్ప్రపంచంలో గూడ కీర్తింపబడగలదని ఆశించాను కాని, ఆ కోరిక ఇప్పటివరకు తీరలేదు.

నాగపూరు తెలుగువారిలో ముఖ్యులుగా పరిగణించబడాల్సిన వారు శ్రీ భుజంగరావు నాయుడు గారు. వారికి సుమారు 20, 25 మంది సంతానం.బిలబిలమని తిరిగే పిల్లలతో వారిల్లు ఎప్పుడు కలకలలాడుతూండేది. వారి సంతానంలాగే వారి హృదయం కూడా చాలా పెద్దది.

నా స్నేహితులు శ్రీ వేమూరి సూర్యనారాయణగారికి సంతానం లేదు. వారి శ్రీమతి సంతానంకోసం ఎంత మంది దేవతలను ప్రార్థించారో చెప్పడం కష్టం. వారి ప్రార్థనను ఏ దేవతా ఆలకించలేదు. అందువల్ల వారు మమ్మల్నే తమ బిడ్డలుగా చూసుకొనేవారు. నాగపూరు వస్తూండిన కవులు, గాయకులు, హరిదాసులు మున్నగువారిని ఆ దంపతులు ఆదరించేవారు.

ఆ రోజుల్లో నాగపూరులో నుండిన ఆంధ్ర ప్రముఖులు శ్రీయుతులు ఇ. రాఘవేంద్రరావు (తొలిభారతీయ గవర్నరు) కౌసలేంద్రరావు (వారి మేనల్లుడు), డాక్టర్ కృష్ణమూర్తి (సైన్స్ కాలేజీ ప్రిన్సిపాలు)-వీరితో నాకు పరిచయముండేది.

నాగపూరులో మా తెలుగు యువకులకు ఒక నాటకం వేయాలన్న బుద్ధి పుట్టింది. ''రాధా - కృష్ణ ' నాటకాన్ని ఎంపిక చేశాం. శ్రీ సూర్యనారాయణగారి సమక్షంలో రిహార్సిల్సు ప్రారంభించాం. హఠాత్తుగా "రిహార్సిల్సు ఆపండి" అన్నారు శ్రీ సూర్యనారాయణగారు. "ఏం తప్పు చేశామా" అని నిర్ఘాంతపోయి నిలబడ్డాం. "నాకో మంచి ఆలోచన వచ్చింది. నా యిల్లు చాలా చిన్నది. అయినా మన రాష్ట్ర స్పెషల్ సెక్రటరీ శ్రీ పి. ఎస్. రావుగారిని, శ్రీ కౌసలేంద్ర రావుగారిని, శ్రీ నియోగిగారిని, శ్రీ భుజంగరావుగారిని భోజనానికి ఆహ్వానిస్తున్నాను. నా సాహసం ఎలా ఉంది?'' అని ఆయన అడిగారు. వారి ఆలోచనలో మాకు ఏ గొప్ప విషయం గోచరించలేదు. అందువల్ల మేమేమీ మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయాం. ''ఈ చిన్న పెంకుటింటికి వారందరూ భోజనానికి వస్తే అదొక విశేషం కాదా?" అని ఆయన అడిగారు. ''రానీండి చూద్దాం'' అన్నాము. ఎంతో శ్రమించి ఆయన వారిని విందుకు ఆహ్వానించారు. వీరి మీదున్న గౌరవంకొద్దీ వారు రావడానికి అంగీకరించారు. ఇక విందుకు ఏర్పాట్లు ప్రారంభమయ్యాయి. ఏవేవో వంటలు, పలురకాల పిండివంటలకు ఏర్పాట్లు జరిగాయి. ఆ పెద్దలు ఎంత అదృష్టవంతులో అనుకొన్నాం. ''మనం కష్టపడి నాటకాలు తయారుచేసి, వేస్తూంటాం కాని మన జిహ్వలు ఇలాంటి పిండివంటలకు నోచుకొంటున్నాయా?'' అని మాలో ఒకరు మెల్లగా అన్నారు. ''వారు అదృష్టవంతులు గనుక వారికి ఈ మర్యాదలు జరుగుతున్నాయి. వారు క్రిందటి జన్మలో ఏ పుణ్యం చేసుకొన్నారో! మనం ఈ జన్మలో ఈ కళలను ఆరాధిస్తే వచ్చేజన్మలో మనకూ ఈ యదృష్టం పట్టవచ్చు'' అని మరొకరు అన్నారు. ఆ రోజు రానే వచ్చింది. ఆ పెద్దలు వచ్చి విందారగించి వెళ్లారు. వారితో వచ్చిన నౌకర్లుగూడ విందారగించారు. అందువల్ల ఆ పిండివంటలన్నీ రుచిచూసే అదృష్టం గూడ మాకు గలుగలేదు. వాటి వాసన మాత్రం మా నాసికా రంధ్రాల్లో నాట్యమాడుతూ ఉండిపోయింది. ''నా కోరిక సాధించానర్రా!'' అన్నారు సూర్యనారాయణగారు ఎంతో సంతోషంతో. మాకు మాత్రం ఎటువంటి ఆనందం కలుగలేదు. అది మా వయస్సు తప్పో, పిండివంటలు మాకు మిగలని తప్పో, మాకా విలువలు తెలియని తప్పో! ఆనాడు వారందర్నీ సూర్యనారాయణగారు నాటకానికి ఆహ్వానించారు. వారు అంగీకరించారు. అదే మాకు జరిగిన మేలు.

ఆ తర్వాత నాటక ప్రదర్శన రోజు రానే వచ్చింది. ఆ "రాధాకృష్ణ" నాటకంలో నేను రాధను, ప్రఖ్యాత నేషనల్ హెరాల్డ్ పత్రిక సంపాదకులు శ్రీ కోటంరాజు రామారావుగారి కుమారుడు ప్రతాప్ చంద్ర సత్యభామ. మరొక మిత్రుడు శ్రీకృష్ణుడు. మరికొందరు తెలుగు యువకులు మిగిలిన పాత్రలు ధరించారు. ఒక మిత్రుని ఇంట్లో తంజావూరు ముచ్చి బొమ్మ లున్నాయి. వాటిని తీసికొచ్చి, ఆ విధంగా మేము వేషధారణ చేసికొన్నాం.

సీను కొకటి చొప్పున సత్యభామ పది బనారసు పట్టు చీరలు మార్చింది. శ్రీకృష్ణుడు సీను కొక పూలమాల వేసుకొన్నాడు. రాధగా నేను మార్వాడీ లంగా, వోణితో ప్రారంభించి, సన్యాసిని వేషంలో కాషాయ వస్త్రాలతో ముగించి, తృప్తిపడ్డాను. నా చెలికత్తె మరాఠీ బాణీలో సీనుకొక చీర మార్చింది. వసంతుని వేషధారణ మారకపోయినా అతడు హాస్యంతో నాటకాన్ని ముంచెత్తాడు. శ్రీకృష్ణుని పాత్రధారుడు చక్కగా పాడాడు. సత్యభామ పాత్రధారునికి తెలుగు బాగా రాదు గనుక, తక్కువ సంభాషణలతో ఎక్కువ భంగిమలతో నాటకాన్ని రక్తి కట్టించాడు. అవేళే నారద పాత్రధారుడు పళ్ళు పీకించుకొన్నందువల్ల నేనే తెరవెనుక నుండి ప్లే బాక్ పాడాను. రాధగా నేను ఎక్కువగా నృత్యమాడి భేష్ అనిపించుకొన్నాను. మొత్తంమీద నాటకం రక్తి కట్టింది. ప్రేక్షకులు అద్భుతంగా ఉందన్నారు. నేను నటించిన మొదటి నాటకం, చివరి నాటకం అదే. కాని ఆ నాటక ప్రదర్శన ఈనాటికీ నా హృదయంలో నిలిచిపోయింది.

నేను ధంతోళిలో ఉండేవాణ్ణి. మా కాలేజీ మహల్లో ఉంది. అక్కడికి నేను వెళ్ళాలంటే ఎమ్ప్రెస్ మిల్లు (బట్టల మిల్లు) మీదుగా వెళ్ళాలి. కాలేజీకి వెళ్ళడానికి మాకు ప్రత్యేకంగా ఒక బస్సు ఉండేది. కాని, నేను నా మిత్రులతో కలిసి నడిచి వెళ్ళేవాణ్ణి. ఆ మిల్లు ఆఫీసుకు రోడ్డువైపు ఒక పెద్ద కిటికీ ఉండేది. ఆ కిటికీలోనుంచి ఒక వస్తాదు లాంటి వ్యక్తి మమ్మల్ని రోజూ చూస్తుండేవాడు. అతడు పలకరింపుగా మమ్మల్ని చూసి నవ్వుతూ ఉండేవాడు. నేనూ అందుకు సమాధానంగా చిన్న చిరునవ్వు చిందించేవాణ్ణి, అది అలవాటయిపోయింది. ఒకనాడు ఆ వస్తాదు మిల్లు గేటు వద్ద నిలబడి, "నీ పేరేమిటి?" అని మరాఠీలో అడిగాడు. "రామకృష్ణ" అన్నాను.

"నీవు తెలుగు వాడివా?" అని తెలుగులో అడిగాడు.

"ఔను" అన్నాను. ఆయన తెలుగు వాడని తెలిసి సంతోషించాను. ఆ సాయంత్రం ఆ మిల్లుకు ఎదురుగా నున్న తోటలో కలుసుకొన్నాం. అలా కలుసుకొనడం నా అదృష్టం. నేను ఆ రోజుల్లో హిందూస్తానీ సంగీతం సాధన చేస్తూండే వాణ్ణి. ఈ నూతన మిత్రుని పేరు రామస్వామి. అతని తమ్ముడు భీమారావు గొప్ప తబలా వాద్యకుడు. మధ్య ప్రదేశ్‌లో 'కవాలీ' గానానికి పేరు గాంచిన "కాలుకవాలీ"కి ఇతడు తబలా వాయించేవాడు. ప్రక్క వాయిద్యానికి ఇంతటి వాడు మరొకడు ఆ రోజుల్లో లేడు. ఇతడు తరచుగా పర్యటిస్తూండేవాడు. రామస్వామికి కూడా తబలా వాయించడం బాగా వచ్చు, పాటకూడా బాగా పాడేవాడు. ఇతడు వాటిని హాబీగా సాధన చేసేవాడు.

మా పరిచయం నాకూ, రామస్వామికీ గూడ ఎంతో ఆనందాన్ని కలిగించింది ఇద్దరం తనివితీరా తెలుగు మాట్లాడుకొనేవారం. నేను నాట్యం చేయగలనని చెప్పాను. ఆయన సంతోషించి, నాకు రోజూ ప్రాక్టీసు ఇస్తానన్నాడు. రోజూ సాయంత్రం అతని ఇంటివద్ద రహస్యంగా నాట్యం ప్రాక్టీసు చేస్తూండేవాణ్ణి. ఇంతలో అతని తమ్ముడు వివిధ ప్రాంతాలు పర్యటించి వచ్చాడు. నా నాట్యం చూసి, మెచ్చుకొన్నాడు. ఒక రోజు నా కోరికపైన అతడు తబలా వాయించాడు. ''కెహరవా'' తాళాన్ని అతడు వివిధ పద్ధతుల్లో వాయించాడు. ఆ వాయిద్యంలో ఎన్నో సొగసులు చూపించాడు. అది అందరికీ సాధ్యం కాదు. అదొక వరం. ఆయన కవాలీకి వాయిస్తూండగా వినాలనిపించింది. ఆ మాటే ఆయనతో అన్నాను. ''త్వరలోనే కాలుగారి కచ్చేరీ ఉంది. అది 'జవాబ్ - సవాల్'కు సంబంధించిన కచ్చేరి. ఇద్దరు పోటీగా తబలా వాయిస్తారు. దానికి రండి, తీసుకొని వెళ్తాను'' అన్నాడు. ఆ కచ్చేరీకి వెళ్ళాను. ఏం జనం వచ్చారు! హాలంతా నిండిపోయింది. భీమారావు ప్రక్కనే వేదిక పైన నేను కూర్చున్నాను. కాలుగారి పాట ప్రారంభ

మయింది. ఇద్దరు తబలా వాయిస్తున్నారు. ఆ వాయిద్యం, ఆ పాటా వినవలసిందే, వర్ణించడం సాధ్యం కాదు. పోను పోను ఆయన కంఠం చక్కగా విడింది. పాట తర్వాత పాట. వీరితో ఇంకొకరు పోటీపడి పాడారు. నారద తుంబురులు పోటీపడి పాడుతూంటే నంది, భృంగులు పోటీపడి తబలా వాయించినట్టు ఆ కచ్చేరీ సాగింది. ఎప్పుడు తెల్లవారిందో కూడ తెలియలేదు. కచ్చేరి ముగిసింది. ఒక నెలరోజులు ఆ కచ్చేరీ నా చెవికి వినబడుతూనే ఉంది. ఆ సోదరులు ధన్యులు. నా కళా జీవితం వారి మైత్రివల్ల ధన్యమైంది. "కేరవా" ఒక చిన్న తాళమే అయినా ఆ తాళానికి రకరకాలుగా నృత్యం చేయడం నేను అభ్యసించాను.

కెహరవ, ధుమాలి తాళగతులను పలికిస్తూ, పలు రకాల లగ్గీలు వాయిస్తూ, భీమారావు ''కెహరవ'' వాయిస్తూంటే నా మనస్సు పరిపరి విధాలుగా పరుగులెత్తేది. 'కెహరవ' కేవలం నాలుగు అక్షరాల తాళం. దానిని ఒక తాళంగా చాలామంది గుర్తించరు. కాని, అది భీమారావు చేతిలో జీవించేది. గంగానదిలా పరుగులెత్తేది. ఆయన అలా వాయిస్తూంటే నేను నాగనర్తనాన్ని సర్పగతుల్లో రూపొందించుకొన్నాను. సుమారు 50 రకాల సర్పగతుల్ని నేను సమకూర్చాను.

మా రాజావారి ఆస్థానంలో ఎందరో కథక్ కళాకారులు నాగనర్తనాన్ని ప్రదర్శించారు. నేను చూశాను కాని, నేను సమకూర్చిన నాగనర్తనం ప్రత్యేకమైంది. దీన్ని వారికి చూపించి, వారి మెప్పును పొందాలి అన్న ఆలోచన నాకు కలిగింది. అందరి సమక్షంలోగాక వారికి ప్రత్యేకంగా ఆ నాదం, ఆ శబ్దతరంగాలు, ఆ నడకలు, దాని వివిధ రూపాలు, వెలుగులు మొదలైనవన్నీ చూపించాలి. ఇలా ఎన్నో విషయాలు ఆలోచిస్తూ వచ్చాను. అవకాశంకోసం ఎదురు చూశాను.

ఒకనాడు ఆయన నన్ను భోజనానికి పిలిచారు. వారి భోజన పద్ధతులు కడు విచిత్రంగా ఉండేవి. అవి నాలుగు రకాలు. ఎవరైనా అత్యంత ప్రముఖులు వచ్చినప్పుడు చేసే విందు భోజనం ఒకటవ రకం. దివాణంలోని మునీములకు, ఉద్యోగులకు ఇచ్చే విందు రెండవ రకం. ఇంకా తక్కువ స్థాయి ఉద్యోగులకు ఇచ్చే విందు మూడవరకం. నౌకర్లకు యిచ్చే విందు నాల్గవరకం. ఈ నాలుగురకాల విందుల్లోను వంటలు వివిధ రకాలు ఉండేవి. నన్ను మొదటిరకం విందుకే పిలుస్తూండేవారు.

ఆరోజు నేనూ రాజావారు కలిసి భోంచేశాం. భోజనం ముగిశాక ఆయన మంచంమీద విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు నేను ప్రక్కన కుర్చీలో కూర్చొని, నా నాగనర్తనం గురించి చెప్పాను. "దాని దేముంది. రేపు దర్బారులో ప్రదర్శించు" అన్నారు. "అందరికీ కాదు, ప్రత్యేకంగా మీ ఒక్కరికోసమే ప్రదర్శించదలచాను" అన్నాను. ఆయన తమ అంతఃపురంలో నా నాట్యాన్ని ఆ మర్నాడు ఏర్పాటు చేశారు. భీమారావు "అల్‌గోజా" వాయిద్యంతో వచ్చారు. ఒక గంటసేపు నేను నాగ నర్తనాన్ని ప్రదర్శించాను. నా శరీరంలోని ప్రతి కండరమే కాదు, నా రక్తంలోని ప్రతి అణువూ నాట్యం చేసింది. ఆ ఒక్క గంట ఇట్టే గడిచిపోయింది. "రామకృష్ణా! 'కెహరవా'లో ఇంత శక్తి ఉందా? నే నెప్పుడూ ఊహించలేదు" అన్నారు రాజావారు. "ఆ శక్తి భీమారావు వేళ్ళలో ఉంది మహారాజా!" అన్నాను. మహారాజావారు అలా ఆలోచిస్తూ పడకకుర్చీలోనే నిద్రపోయారు. నేను, భీమారావు వెళ్ళిపోయాము.

ఆ మర్నాడు ఉదయమే నన్ను పిలిపించారు. నేను వెళ్ళాను. "రామకృష్ణా! నిన్నటి నాగ నర్తనాన్ని మా దర్బారులో అందరికీ ప్రదర్శించాలి" అన్నారు. "అది మీ ఒక్కరికే ప్రత్యేకం" అన్నాను. "మా సంస్థానంలో ఇంత గొప్ప కళాకారుడున్నాడని అందరికీ తెలియాలి" అన్నారు వారు. "మహారాజా! అది మీకు నేను సమర్పించుకొన్న పూజా ప్రసూనం. అది ఇతరులకోసం కాదు" అన్నాను. ఆయన ఆలోచిస్తూ, కొన్ని నిమిషాలు మౌనంగా ఉండిపోయారు. తర్వాత తేరుకొని, "రామకృష్ణా! ఆ తన్మయత్వంలో మైమరచి నిద్రపోయాను. మన దివాణానికి వచ్చిన ఏ కళాకారుణ్ణీ రిక్తహస్తాలతో పంపలేదు. నిన్న, తబలా వాయించిన కళాకారుడు భీమారావును సన్మానించలేదు. మరిచి

పోయాను. పొరపాటయింది. ఈ కవర్ ఆయనకు ఇవ్వండి" అంటూ పది వందరూపాయల నోట్లున్న కవరు నా చేతికి ఇచ్చారు. అంతటి ఉదార స్వభావులు, కళాపోషకులు తండారు సంస్థానాధీశులైన శ్రీ రాజా గజపతిరావు పాండ్యా వారు.

రామస్వామి, భీమారావుల తల్లిగారు నన్నెంతో ప్రేమతో చూసేవారు. "తల్లిలేని పిల్లవాడినని అనుకోకు. నేనే నీ తల్లిని. నీవు నా మూడో కుమారుడివి" అంటూ ఆమె లాలనతో భోజనం పెట్టేవారు. నేను రామస్వామి భార్యను "వదినమ్మా!" అని పిలిచేవాణ్ణి. ఆమె ఎంతో సంబర పడేది.

నేను నాగపూరు వదిలి వచ్చేముందురోజున నేనూ, రామస్వామి మా తొలి కలయిక గుర్తుగా అదే పార్కులో కూర్చున్నాం. "రామూ! నీ కే లోటూ ఉండదు. నావద్ద ఉండిపో.... మనం అన్నదమ్ముల్లా కలిసియుండి కళారాధన చేద్దాం'' అన్నాడు అన్న రామస్వామి.

"అన్నా! నేను మన ఆంధ్రదేశం వెళ్ళాలి. మన ప్రాచీన కళను అక్కడ ప్రచారం చెయ్యాలి. అదే నా ధ్యేయం నన్ను ఆశీర్వదించు'' అన్నాను. నా అన్న శ్యామసుందరుని తర్వాత నన్నంత ప్రేమతో చూసిన ఆ నూతన సోదరుని ప్రేమ లోతులను గురించి ఆలోచించినా, నా మాతృదేశం నన్ను ఎక్కువగా ఆకర్షించింది. అందుకే ఆంధ్రదేశం వచ్చాను.

అమ్మ, వదిన, అన్న, తమ్ముడు నాతోగూడ నాగపూరు స్టేషన్‌కు వచ్చారు. రైలుబండి కదులుతూండే ఆయమ్మ కరుణ దృక్కులు నాకు వీడ్కోలు పలికాయి. రామస్వామి అన్న దుఃఖం ఆపులేక, ఏడుస్తూ ముఖం కప్పుకొన్నాడు. వదినా, తమ్ముడూ ఏడ్వలేక చిన్నగా నవ్వేరు. బండి వేగం పుంజుకొంది. వారు శాశ్వతంగా దూరమయ్యారు.

ఆంధ్రదేశం వచ్చి కళారాధన, కళా ప్రచారాంలో వడ్డతర్వాత నాగపూరును నేను పూర్తిగా మరచిపోవలసి వచ్చింది. నాగపూరు జీవితాన్నే నా స్మృతిపథంలో నుండి తొలగించవలసివచ్చింది. నేను ఒక నూతన జీవితాన్ని ప్రారంభించాను.

నిరంతరాయంగా నలభై సంవత్సరాలు ఆంధ్రుల నృత్యకళ గురించి తపిస్తూ వచ్చాను. నా తపస్సు చివరకు ఫలించింది. 1995 జనవరి 25వ తేదీ రాత్రి పుణ్యపురుషులైన శ్రీ కె. వి. రమణ గారి ద్వారా తల్లి సరస్వతీదేవి ప్రసన్నమైంది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మన ఆంధ్రుల లాస్యకళను ''ఆంధ్రనాట్యం'' అన్న పేరుతో గుర్తించింది. నేను తరించాను.

ఈ సందర్భంలో అప్పులందరూ గుర్తుకువస్తున్నారు. వారందరు ఇప్పుడు ఎక్కడ ఉన్నారో? ఎలా ఉన్నారో? వారికి నేను గుర్తున్నానో లేదో? వారిలో ఎందరు సజీవులో! ఎందరు స్వర్గస్థులో!! నాకు తెలియదు!!!



# కళామిత్రులు

రాక్ జోసెఫ్ అనే ఒక మిత్రుడు నాకు నాగపూరులో ఉండేవాడు. అతడు పోలీసు బాండ్‌లో క్లారియోనెట్ వాయించేవాడు. అతడు నిజమైన క్రైస్తవుడు. క్రీస్తు ప్రభువు భావాలను చక్కగా పాటించినవాడు. అతని మనసు మార్దవం, మాట మార్దవం. అతని వాయిద్యం మార్దవం. అతడు క్లారియోనెట్ వాయించినంత సున్నితంగా ఇంకొకరు వాయించగా నేను వినలేదు.

శ్రీమతి జ్యోతికా రాయి ఒకసారి కలకత్తానుండి నాగపూరు వచ్చి పాట కచ్చేరీలు చేశారు. ఆ రోజుల్లో ఆట, పాట కచ్చేరీలకు నాగపూరులో ప్రత్యేకంగా ఒక హాలు ఉండేది కాదు. శ్రీ ఎం. జీ. నాయుడుగారి సినిమా థియేటరు ఒక వినోదకార్యక్రమాల థియేటరుగా ఉండేది. శ్రీమతి జ్యోతికా రాయి ప్రత్యేకంగా మీరాబాయి కీర్తనలు పాడేది. ఆమె తెల్లని దుస్తులు ధరించి ఆ కీర్తనలు పాడుతూ, భక్తిభావాన్ని చిప్పిల్లచేస్తుంటే మీరాబాయి కన్నులకు గోచరించేది. ఆమె పాట ప్రక్కవాద్యకులకు పరీక్షగా ఉండేది. ఆమె సున్నితంగా, మృదువుగా పాడేది. ఆమెకు ప్రత్యేక వాద్యకారులు ఉండేవారు. ఆమెకు ఒకసారి క్లారియోనెట్ కావలని వచ్చింది. కొందరిని ఆమె పరీక్షించి చూసింది. చివరకు రాక్ జోసెఫ్ వాద్యం ఆమెకు నచ్చింది. ఒక కచ్చేరీకి నేను వెళ్ళాను. పాట కచ్చేరీలలో ప్రక్కవాద్యాలు ఎలా వాయించాలో ఆ కచ్చేరీలో తెలుసుకొన్నాను.

ఒకసారి శ్రీ రాజావారి దర్బారులో నా నాట్యకచ్చేరీకి రాక్ జోసెఫ్ క్లారియోనెట్ వాయించాడు. రాజావారు ఆయన వాద్యాన్ని మెచ్చుకొన్నారు. కొంత పారితోషికం గూడా ఇచ్చారు. ఆనాటినుండి అతడు ఆస్థాన విద్వాంసుడయ్యాడు. నా కోసమని అతడు ప్రత్యేకంగా మదరాసు వెళ్ళి కర్నాటక బాణీ నేర్చుకొనివచ్చాడు. అతని పరిచయంవల్లనే పాశ్చాత్య తాళ పద్ధతి గురించి, గ్రీక్ న్యూమెరికల్స్ గురించి నాకు తెలిసింది అతనికి సంగీతం మీద ఉన్న ఆసక్తి డబ్బు సంపాదనమీద ఉండేది కాదు.

"కృష్ణా! కృష్ణా!" అంటూ నన్నెంతో అప్యాయంగా పిలిచేవాడు. గంటల తరబడి నేను అతనితో సంగీతం గురించి చర్చించేవాణ్ణి. వారి బాండ్ బృందానికి ఎప్పటికప్పుడు కొత్త నొటేషన్లు ఇంగ్లండు నుండి వచ్చేవి. వాటిని అతడు సాధన చేసి, నాకు వినిపించేవాడు. పాశ్చాత్య లయ పోకడల గురించి నాకు చెప్తూండేవాడు. నా కచ్చేరీ ఎక్కడ ఉన్నా అతడు వచ్చి క్లారియోనెట్ వాయించేవాడు.

ఎవరు ఏదైనా బాగా పాడితే అతడు వెంటనే ఇంగ్లీషు పద్ధతిలో నొటేషను వ్రాసుకొనేవాడు. ఇక ఆ పోలీసు బాండులో నుండిన వారందరు గొప్ప సంగీత విద్వాంసులు. వారికి ప్రత్యేకంగా ఇళ్ళు ఇచ్చారు. వారికి అన్ని సౌకర్యాలు కల్పించారు. ప్రతిరోజూ వారు కొన్ని గంటలు సంగీత సాధనను కలిసి చేసేవారు. ప్రతి ఆదివారం సాయంత్రం ప్రజల వినోదార్థం పార్కులో వారు వాయించేవారు.

రాక్ జోసెఫ్ ద్వారా ఆ పోలీస్ బాండ్ బృందం వారందరితో నాకు పరిచయం ఏర్పడింది. నేనూ ఒక కళాకారుణ్ణి గనుక వారందరికి నేను మిత్రుణ్ణయ్యాను. రాక్ వ్రాసుకొన్న కర్ణాటక బాణీ మ్యూజిక్ నొటేషన్లను వారు సాధన చేసేవారు. వారికి రాగం వాయించడం అంత కష్టంగా ఉండేది కాదుగాని, తాళ విధానంలో తికమక పడేవారు. క్రమేణా కర్ణాటక తాళాలకు అలవాటుపడ్డారు.

ఈ విధంగా ఒకప్రక్క మా సంగీతం గురువుగారు రామభహూసర్ దేశ్‌పాండే, పకవాజ్ శ్రీ కోల్‌బా, తబలా

శ్రీ శాంతారామ్, శ్రీ రామస్వామి, భీమరావు, ట్రుమ్రీ గాయకురాలు శ్రీమతి చంపాబాయి మొదలైన వారి ప్రభావం వల్ల నా సంగీతజ్ఞానం వికసిస్తూ వచ్చింది. అయితే, నా సంగీత జ్ఞానానికి మూలం కాళహస్తిలో నేను శ్రీమతి నాయుడుపేట రాజమ్మగారివద్ద పొందిన శిక్షణ. ఆమె శైవ సిద్ధాంతాన్ననుసరించి నేర్పిన మంత్రాలు వాటిని సరైన ఉచ్చారణతో ఆమె నేర్పారు. ఆ మంత్రాలను పలికే నాదం కంపనలలో వాటికి శక్తి కలుగుతుంది. ఓంకారనాదాన్ని పలకడం ఆమె తొలుత నేర్పారు. ఆ నాదోపాసన వలన నాకెంతో మేలు కలిగింది.

అర్ధరాత్రి, అపరాత్రి అనే తేడా లేకుండా ఏ సమయంలోనైనా నేను బాండ్ లైన్స్‌కు వెళ్ళేవాణ్ణి. నాకేదైనా ఒక కొత్త ఆలోచనవస్తే వెళ్ళి రాక్‌ను పిలిచేవాణ్ణి. ఇద్దరం కలిసి దానిని చర్చించి, సాధన చేసేవాళ్ళం. ఒక నూతన సంగీత రచనను రూపొందించేవారం. ఆ సంగీతంలో నుండి ఒక సరికొత్త నృత్యం ఆవిర్భవించేది. ఆ కాలంలో నృత్త, నృత్య, అభినయాలను ఒక పాటకు రూపకల్పన చేయడమే కాక కేవలం వాద్యసమ్మేళనానికి కరణవిన్యాసంచేసి, ఒక కథను ప్రదర్శించే పద్ధతిని గూడా నేను అభ్యసించాను. ఆ రోజుల్లో ఈ పద్ధతి ఆచరణలో లేనందున నా ఈ ప్రదర్శన ప్రేక్షకులకు రమణీయంగా కనబడేది.

రాక్‌కు వీదైనా ఒక నూతన భావం కలిగితే అతడు వెంటనే నావద్దకు పరుగు పరుగున వచ్చి చర్చించేవాడు. ఆ సంగీతం ఒక రూపందాల్చేవరకు వాయించేవాడు. వెంటనే దాని స్వరాలు వ్రాసుకొనేవాడు. ఈ నిరంతర సాధనవలన ప్రతి స్వరం, ప్రతి రాగం, ప్రతి తాళం యొక్క స్వరూపం తెలుసుకొనే అవకాశం మాకు కలిగింది. ఈ కృషికి మా సంగీతం గురువుగారి ప్రోత్సాహం ఉంటూనే ఉండేది. వాద్య సమ్మేళనం మధ్య అవసరమైనచోట ఆయన రాగాలాపన చేసేవారు. నా భావి జీవితంలో ఈ సాధన నాకెంతో మేలు చేసింది.

ఈ అనుభవాలతో "టెంపుల్ బెల్స్" (Temple Bells) అనే ఒక నృత్య నాటికను తయారుచేశాను. మా మహారాజావారి ప్రోత్సాహంతో దానిని దర్బారులో ప్రదర్శించాను. ఆ ప్రదర్శనకు నాగపూర్‌లోని భోంస్లేలు, చిట్నీసులు, బూటీలు, దేశ్‌ముఖులు, దేశ్‌పాండేలు, ఆస్థాన అధికారులు, ప్రముఖ కళాకారులు, ముఖ్యంగా బాండ్‌మాస్టర్ మొదలగువారు అనేక మందిని రాజావారు ఆహ్వానించారు.

ఆనాటి వాద్య సమ్మేళనంలో 30 మంది వివిధ వాద్యకారులు పాల్గొన్నారు. రాక్ సంగీత సమ్మేళనాన్ని నిర్వహించారు. మా గురువుగారు మధ్య మధ్య అవసరాన్నిబట్టి రాగాలాపన చేస్తూవచ్చారు. ప్రదర్శనను ప్రారంభించేముందు రాక్ వారి బాండ్‌మాష్టర్‌గారికి పాదాభివందనం చేశాడు

అది ఒక దేవాలయం. ఆ యాలయంలో పూజ జరుగుతూంది. వేదఘోష వినిపిస్తూంది. గుడిగంటల నాదం, భేరీనాదం, తర్వాత చిరుగంటలనాదంతో హారతి ఇవ్వడం. ముగింపు. ఇదీ కథ. కథ చిన్నదే.

అది నృత్య పూజా సమయం. పూలపళ్ళెంతో, పూజా ద్రవ్యాలతో, హంస గమనంతో ఒక నర్తకి దేవాలయంలోకి ప్రవేశించింది ఆమె నేత్రాలు భక్తి తత్పరతతో ప్రకాశిస్తున్నాయి. ఒక హస్తం పూతీగెలా కదిలాడుతూంది. ఆమె వేసుకొన్న సన్నని పవిట వాయుదేవునితో సయ్యాటలాడుతూంది. అత్యంత రమణీయంగా ఆమె మెడ ఇరుప్రక్కలకు లాస్య విన్యాసం చేస్తూంది. ఆమె వెళ్ళి దేవదేవుని అర్చించింది. సంధ్యా శివుని యెదుట నృత్య కేళిక చేసింది. అది యాడి అలసిపోయింది. అర్చకులు దేవునికి హారతి ఇచ్చారు. ఆమె అంజలి ఘటించింది. ఈ నర్తకి ఎవరో కాదు; నేనే! నా నాట్యంలో నేను అనేక రకాలైన చారులు, రేచకాలు, కరణాలు మొదలైనవాటి నన్నింటిని జాగ్రత్తగా ఎంపిక చేసి, సమకూర్చి, ప్రదర్శించాను. అదొక అద్భుత ప్రదర్శన. రాజావారితోబాటు ప్రేక్షకులందరూ నిశ్శబ్దంగా ఈ నూతన ప్రక్రియను తిలకించారు. అంతకుముందు వారెవ్వరు ఇటువంటి ప్రదర్శనను చూడలేదు.

రాజావారు చాలా ఆనందించి, వచ్చిన వారందరికి విందు ఏర్పాటు చేశారు. అది రాజ భోజనం. నేనూ, మా సంగీతం మాష్టరు మాత్రం కేవలం పండ్ల రసం తాగేం. అలాంటి సమయాలలో నా స్థానం రాజావారి ప్రక్కనే ఉండేది.

వాద్య సమ్మేళనంలో పాల్గొన్నవారందరిని రాజావారు సమ్మానించారు ఇలాంటి మరొక నృత్య నాటికను రూపొందించమని నన్ను కోరారు. వచ్చే ప్రదర్శనకు సంగీత ప్రియులైన ఇతర సంస్థానాధీశులను గూడ ఆహ్వానిస్తామన్నారు.

రాజావారి కోర్కె ననుసరించి, "యల్లోరా స్వప్నం. నర్తన శివుడు" అనే ఒక నృత్య నాటికను రూపొందించాను.

ఇది టెంపిల్ బెల్స్ కన్నా పెద్దది. నృత్య నాటకం "'స్వప్న సంగీతం''తో ప్రారంభమయింది.

అది సంధ్యా సమయం. శిలా రూపంలోనున్న శివుడు ఆ సంగీతానికి కరిగి సాక్షాత్కరించాడు. భక్తుల స్తోత్ర నర్తనానికి ప్రసన్నుడై సంధ్యా తాండవం చేశాడు. ఋషులు, దేవతలు, కిన్నెర కింపురుషులు ఆ సంధ్యా తాండవాన్ని తిలకించి, పులకించి, ఆనందపరవశులై పరమ శివుని కీర్తించారు. విష్ణువు మృదంగం, ఇంద్రుడు వేణువు వాయించగా బ్రహ్మ తాళంవేశాడు. గీతాలాపనలకు పరమశివుడు స్వాప్నిక స్థితిలోకి వెళ్ళాడు. తర్వాత ఆయన యధాస్థితికి వచ్చి, తన్మయంతో తాండవమాడేడు. ఆ తాండవ రమణీయతకు ఆ రాజ దర్బారులోని ప్రేక్షకులందరు తమ తమ స్థానాలలో నుండి లేచి, చేతులెత్తి నమస్కరించారు. ఈ శివునిపాత్ర ధరించింది ఎవరోకాదు- నేనే!

ఈ విధంగా నేను రాక్ పరిచయంతో పాశ్చాత్య సంగీతజ్ఞానాన్ని పెంపొందించుకొని, వాద్యసంగీతాన్ని కూర్చగల స్థితికి వచ్చాను. ఈ రెండో నృత్యనాటికను నేను రూపొందించినప్పుడు బాండ్‌మాష్టరు అప్పుడప్పుడు వచ్చి నా కూర్పుకు మెరుగులు దిద్దుతూ ఉండేవాడు.

ఆంధ్రదేశంలో ఆంధ్రుల శాస్త్రీయ నృత్యాన్ని ప్రచారం చేయాలన్న దృఢ సంకల్పం కలిగి, ఆంధ్రదేశం రావాలని నిశ్చయించుకొన్నాను. నాగపూరులోని నా ఆప్తులకు, మిత్రులకు, పెద్దలకు ఈ విషయం చెప్పాను. ''రామూ! నాగపూర్ విడిచివెళ్ళకు, కృష్ణా! నాగపూర్ విడిచి వెళ్ళకు. రామకృష్ణా మమ్మల్ని విడిచివెళ్ళకు'' అనే అందరూ అన్నారు, అనేకవిధాల నచ్చచెప్పారు, బోధించారు. కాని ఆంధ్రనృత్య సరస్వతికి సేవ చేయాలన్న సంకల్పం నాలో నానాటికి బలపడుతూ వచ్చింది. అందువల్ల ఒక్క రామస్వామి గారి కుటుంబానికి తప్ప మరెవ్వరికీ చెప్పకుండా ఆంధ్రదేశం వచ్చేశాను. పెద్ద పొరపాటు చేశానేమోనని అప్పుడప్పుడు బాధపడేవాణ్ణి. ఎవ్వరికి నేను నాగపూర్ ఉత్తరాలు వ్రాయలేదు. వార్షికానికి నాగపూర్ వెళ్ళినప్పుడు కూడా ఎవరినీ కలిసేవాణ్ణికాను. అటువంటి దీక్షతో ఆంధ్రలో అడుగుపెట్టాను. మూడు దశాబ్దులకు పైగా నిరంతర తపనతో తపస్సు చేశాను. సన్నిహితులను, స్నేహితులను, చివరకు నా బంధువులను గూడ విస్మరించి ఆంధ్రనృత్య సరస్వతి ఆరాధించాను.

అయితే, నా కృషి, నా దీక్ష, నా తపస్సు ఫలించిన ఈ సమయంలో పాతవారందరూ ఒక్కొక్కరే నా స్మృతిపథంలోకి వస్తున్నారు. వారిని కలుసుకోవాలని నా మనస్సు ఉవ్విళ్ళూరుతూంది. కాని, ఎవరు ఎక్కడ ఉన్నారో తెలియదు. వారిలో ఎంతమంది సజీవులో తెలియదు. వారిని త్వరలో కలియాలి. ఒక్కసారి నాగపూరు వెళ్ళిరావాలి. నా తెలుగుజాతికి నేను చేసిన సేవను వారికి చెప్పాలి. నా ఆనందాన్ని వారితో పంచుకోవాలి. వారి హృదయాలు పులకించాలి. వారు తన్మయులవ్వాలి. వారు నా కృషిని ప్రశంసించి, నన్ను ఆశీర్వదించాలి. ''రామా! కృష్ణా! రామకృష్ణా! ఎంత ఎదిగావయ్యా!'' అంటూ వారు నన్ను అభినందించాలి.

ఇది తీరే కోరికో! తీరని కోరికో!

మధ్యప్రదేశ్‌లోని 36 గోండు సంస్థానాలలో నృత్యకళపరంగా చెప్పుకోనదగిన సంస్థానం రాయఘర్ ఆ సంస్థానాధీశునికి నృత్యకళంటే ప్రాణం. ఆయన నృత్యకళా పోషకుడే కాడు, గొప్ప తబలా కళాకారుడు. దక్షిణాదిలోని యువరంగ మహారాజువలె ఈతనికి కూడ నృత్యకళపైని అత్యంత అభిమాన ముండి నందువల్ల అనేకమంది నృత్య కళాకారులు ఉత్తర భారతదేశంనుండి వీరిని సందర్శించడానికి వస్తూండేవారు. వివిధ నర్తకుల వివిధ బాణీలను ఈ ప్రభువు నిరంతరం చూస్తూండి నందువల్ల వీరిలో విపరీతంగా మనోధర్మం పెరిగింది.

రాజాగారి వద్ద కళ్యాణ్, కార్తీక్ అనే ఇద్దరు కథక్ కళాకారులుండేవారు. వీరు యువకులు గనుక వీరు నిరంతరం నృత్యాన్ని సాధన చేస్తూండేవారు. వీరి 'తయారీ' విశిష్ట రీతిలో ఉండేది. వీరిది కథక్ సంప్రదాయం గనుక వీరి కాళ్ళు వింత వింత విధాలుగా యంత్రాల్లాగ పలికేవి. అయితే వీరి కాళ్ళు పలికినంత చురుకుగా వీరి చేతులు, కళ్ళు ఇతర

అంగాలు పలికేవి కావు. వీరి పాదాలు పరుగులు తీసినంత వేగంగా వీరి భావపరంపర ప్రదర్శితమయ్యేదికాదు. బహుశా వారు భావం ప్రధానమైనదని భావించి యుండరు. వీరి ''భ్రమరా''లను చూడవలసిందే. ఒక్కొక్కసారి విరామం లేకుండా 100 నుండి 150 వరకు భ్రమరాలను ప్రదర్శించే వారు. వీరి సాధన సాంకేతికంగా నిర్దుష్టమైంది. అయితే; అది ప్రేక్షకుల మనస్సును కదిలించినంతగా హృదయాన్ని కదిలించేది కాదు. అయినా అదొక రసలోకం. వారి పాదాలు పాదరసంగా పరుగులు తీసేవి.

ఇక నా నాట్య ప్రదర్శన విషయానికి వస్తే అది సమతూకంలో ఉండేది. నా నాట్యం మనస్సుకు, హృదయానికి, శరీరానికి సంబంధించినదిగా ఉండేది. నేను రాజావారి దర్బారులో కళాకారునిగా ఉండినప్పుడు ఈ కళను అభ్యసించాను. అయితే, నాకు హృదయభాషే ఎక్కువగా పట్టుబడింది. మనస్సుకు సంబంధించిన భాషమీద నా మనస్సును లగ్నం చేయలేదు.

నేనూ, ఈ కథక్ కళాకారులు కలుసుకొన్నప్పుడు మా విద్యల గురించి పరస్పరం చర్చించుకొనేవారం, ఆనందించేవారం ఇక రాయఘడ్, భండారు రాజులు సమావేశమైనప్పుడు మా ఉభయుల నర్తనాన్ని రాజావారు ప్రత్యేకంగా ఏర్పాటు చేసేవారు. నేను పూర్తిగా సాత్వికం, శుద్ధ సాత్వికాలను ప్రదర్శించేవాణ్ణి. గంగానది రెండు పాయలుగా విడిపోయి, మరల సాగరంలో కలుసుకొన్నట్టుగా నా సాత్వికం, శుద్ధసాత్వికం వేరువేరుగా ఉండి, చివరకు కళా సాగరంలో కలుసుకొనేవి.

రాయఘడ్ రాజావారి పద్ధతే వేరు. ఆయన గొప్ప తబలా వాద్యకులయినందున వారికి ఏదైనా నాట్యప్రదర్శన నచ్చితే ఆ యానందంలో మైమరచి, తబలాలు తెప్పించుకొని వారు వాయించడం మొదలుపెట్టేవారు. అప్పుడు ఆ నృత్య ప్రదర్శనలను చూసినవారు ధన్యులైనట్లు చెప్పవచ్చు. ఎన్ని రకాలైన గత్‌లు, గత్‌భావనలు, మొహరలు, లగ్గీలు, తియ్యాలు, పరన్లు, రేలాలు వారు వాయించేవారో నేను చెప్పలేను. ఆ కథక్ నృత్యకళాకారులు వాటన్నింటినీ ప్రదర్శించాలి. అది, అది వారు అలసిపోతే, ''రామకృష్ణా! ఇక నీ వంతు'' అనేవారు ఆయన. ఒక పెనుతుఫాను వెలిసిన తర్వాత నిర్మలాకాశంలో వెన్నెల విరిసి, చక్కనిగాలి వీస్తున్నట్టుగా మా సంగీతం మాష్టారు చల్లగా, హాయిగా, తీయగా, మెత్తగా పాడుతూంటే నా 'నిరత్' ఆ సభకు ఒక వింతశోభను చేకూర్చేది.

మనకు స్వాతంత్ర్యం ఇంకా రానిరోజులు అవి. ఆ రాజుల రాజ్యపాలన ఎలా ఉండేదో నాకు తెలియదు. తెలుసుకోవలసిన అవసరం నాకుండేదికాదు. కాని, వారు కళలను బాగా పోషించారు. అవి చక్కగా వికసించాయి. సంస్థానాలలో ఈ యున్నతస్థాయి శాస్త్రీయ నాట్యకళలు వికసించినట్లుగానే, అక్కడ జానపదనాట్యాలు గూడా వికసించాయని చెప్పవచ్చు. అక్కడి ప్రజలు సుఖసంతోషాలతో హాయిగా ఉండినట్లే కనిపించేవారు.

స్వాతంత్ర్యం మనకు రావడంతో స్వతంత్ర సంస్థానాలు భారతదేశంలో విలీనమయ్యాయి. అప్పుడు రాయఘడ్ రాజావారు, ''నా రాజ్యాన్ని మీరు తీసుకోండి, నా కళా రాజ్యాన్ని మాత్రం నాకు విడిచిపెట్టండి'' అని కోరారట. వారు అంతకుముందు స్వతంత్ర రాజా, అగర్భ శ్రీమంతులు గనుక వారికి ధనానికి లోటు ఉండేది కాదు. ధనానికి ఉన్న విలువ, శక్తి వారికి తెలిసేది కాదు. ఆయన సంస్థానం భారతదేశంలో విలీనమైన తర్వాత వారిని ధనలేమి పట్టుకొంది. వారి సంస్థానం వైభవం పోగొట్టుకొంది. కళాకారులు నిరాశ్రయులయ్యారు. ఎవరిమట్టుకు వారు జీవనవృత్తి కోసం చెల్లాచెదురయ్యారు. తర్వాత ఆ మహారాజా గతించాడు. నేను ఆంధ్రదేశానికి వచ్చాను.

నేను ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీలో నృత్యశాఖకు పెద్దగా యుండినప్పుడు కల్యాణ్‌జీ ఖైరాఘర్ లోని ఇందిరా సంగీత విశ్వవిద్యాలయంలో కథక్ అధ్యాపకులుగా నుండినట్టు తెలిసి, వారిని హైదరాబాద్‌కు ఆహ్వానించాను. కాని, వారు వృద్ధాప్యంవల్ల రాలేకపోయారు. కార్తిక్‌జీ భూపాలులో స్థిరపడ్డారని విన్నాను.



# అనుభవాలు

నెల్లూరులో నృత్యనికేతనాన్ని ప్రారంభించిన కొత్తలో నేను కొంత వ్యతిరేకతను ఎదుర్కొనవలసి వచ్చింది. అయినా కొందరు పెద్దలు, విద్యావేత్తలు, కళా హృదయులు నా ప్రయత్నాన్ని మెచ్చుకొంటూ వచ్చారు. రమణా రెడ్డి గారు, కనకమ్మగారు మాత్రం చాలా ఉత్సాహంగా నన్ను ప్రోత్సహిస్తూ వచ్చారు. చాలామంది పెద్దింటి పిల్లలు ఈ కళను అభ్యసించడానికి నృత్యనికేతంలో చేరడంవల్ల ఈ కళ పట్ల కొంతమందికి అపోహలు పోయాయి. నేను చాలావరకు అవరోధాలను అధిగమించి ప్రచారం చేస్తూ రాగలిగాను. ప్రారంభంలో నాకు కలిగిన ఒక అనుభవాన్ని చెప్తాను.

అక్కడ కళాహృదయులైన ఒక రెడ్డిగారుండేవారు. ఆయన ధనవంతులు. ఇంకా నడి వయస్సులో ఉన్నారు. ఆయన ఒకనాడు నా బసకు వచ్చి, నన్ను వారింటికి ఆహ్వానించారు. ఒకనాడు ఉదయమే వారింటికి వెళ్ళాను. వారి శ్రీమతి అప్పుడు పూజలో ఉన్నారు. నేను కూర్చున్న కొద్ది సేపటికి ఆమెకూడ వచ్చారు. ఇంతలో మా కాఫీ, ఫలహారాలు అయ్యాయి.

ఆయన, ఆమెను నాకు పరిచయం చేశారు. ఆమెది చక్కని నిండైన విగ్రహం. ఆమె నా నమస్కారమందుకొని కూర్చున్నారు. "మాకు ఒక అమ్మాయి ఉంది. ఆమె చదువు కొంటూంది. చదువుతోబాటు ఆమెకు నృత్యంకూడా నేర్పించాలని నాకుంది" అంటూ ఆయన వారమ్మాయిని పిలిపించారు. వారి శ్రీమతి మాత్రం వింటూ కూర్చున్నారు. ఇంతలో వారి అమ్మాయి వచ్చింది. ఆ అమ్మాయి పుత్తడి బొమ్మలా ఉంది. 'ఇలాంటి అందమైన అమ్మాయి నాట్యం నేర్చుకొంటే ఈ శాస్త్రీయ కళకు రాణింపు వస్తుంది. మేలు కలుగుతుంది. నా ప్రచారానికి మరింత ప్రోత్సాహం వస్తుం'దని మనస్సులో అనుకొని, ''తప్పక నేర్పుతాను" అని రెడ్డిగారితో అన్నాను. ఆయనే అంతా మాట్లాడేరుగాని ఆమె ఏమీ మాట్లాడలేదు. మౌనంగా వింటూ కూర్చుంది. అది వారి వంశ మర్యాద అని నేను మనస్సులో భావించి, ఇంక వెళ్ళడానికి సిద్ధపడ్డాను.



నేను నెల్లూరుకు వచ్చిన క్రొత్తలో నా వద్ద శాస్త్రీయ నృత్యకళ నభ్యసించి నా నృత్యకళా ప్రచారంలో నాతో సహకరించిన తొలి నృత్య కళాకారిణి.

**శ్యామాకౌండిన్య**

"బాబూ! మీరు ఎక్కడ ఉంటున్నారు?" అని ఆమె అడిగారు. నా ఎడ్రసు చెప్పాను. మరి రెండు రోజుల తర్వాత ఒకనాటి మధ్యాహ్నం ఆమె నా బసకు వచ్చారు. నేను ఆశ్చర్యపోయాను. ఆశ్చర్యంనుండి తేరుకొని, ఆమెను లోనికి ఆహ్వానించి కూర్చోమన్నాను. ఆమెను చూస్తే విద్యావంతురాలు, సంస్కారవంతురాలులా కనబడ్డారు. ఆమె సంభాషణ ప్రారంభించారు.

"నేను రెడ్డిగారి రెండవ భార్యను. నేను ఒకప్పుడు నాట్యం చేసేదాన్ని. దేవుని ఊరేగింపుల్లో, ఉత్సవాలలో నాట్యం చేశాను. ఆనాటి బాధలు పడలేక ఆ కళనుండి విరమించుకొన్నాను. మిమ్మల్ని ఒక చిన్న సహాయం చేయమని కోరడానికి వచ్చాను...." అని ఆమె ఆగింది. ఆమె కూడా నేర్చుకొంటానని అంటారేమోనని ఆశించి, మనస్సులో ఆనందించాను. "బాబూ! మీరు విద్యావంతులు, వినయ సంపన్నులుగా కనబడుతున్నారు. నా బాధను మీరు అర్థం చేసుకోగలరు. మా అమ్మాయిని చదివిస్తున్నాను. ఆమె నృత్య విద్య నేర్చుకొనడం నాకు ఇష్టంలేదు. నేను ఆమెను నాట్యకళాకారిణిని చేయదలచలేదు. కనుక, మీరు ఆమెను ఈ విద్య నేర్చుకోమని ప్రోత్సహించకండి.మా రెడ్డిగారు కళాపోషకులే. వారు ఈ కళను పోషించదలచుకొంటే వారి మొదటి భార్య కూతురుంది, ఆమెకు చెప్పించమనండి" అంటూ ఆమె కంట తడిపెట్టుకొంది.

ఆమె హృదయ వేదన అప్పుడు నాకు అర్థమయింది. ఆమె తన పూర్వ కళా జీవితాన్ని మరచిపోవాలనుకొంటున్నారు. అందువల్ల 'సరే' అన్నాను. తర్వాత ఆ రెడ్డిగారు నన్ను మరి కలవలేదు. నేను ఆ అమ్మాయిని ప్రోత్సహించవలసిన అవసరం గాని, అవకాశంగాని కలగలేదు. కాని, ఆనాటి సాంఘిక పరిస్థితులను, కళాకారుల కడగండ్లను కొంత వరకు అర్థం చేసుకోగలిగాను. సుమారు 40 సంవత్సరాల క్రిందట ఆంధ్రదేశంలోని పరిస్థితి అలా ఉండేది. ఇలాంటి ఉత్తమ కళాకారుల నెందరినో తర్వాత నేను కలుసుకొన్నాను. వారందరు నృత్య కళారాధననుండి విరమించుకొన్నందువలన ఆంధ్రదేశంలోని నృత్యకళ ఎంత మరుగుపడి పోయిందో, ఎంత అంతరించిపోయిందో ఈ కళకు ఎంత హాని కలిగిందో, దేశానికి ఎంత నష్టం చేకూరిందో నేను మొదటిసారిగా ఆలోచించవలసివచ్చింది.

గ్రంథాలలో చదివి నాట్యవిద్య గురించి తెలుసుకొనవచ్చునేమో గాని నాట్య సంప్రదాయాన్ని తెలుసుకోలేము. సంప్రదాయం అనుభవపూర్వకమైనది. గురువుల నుండి శిష్యులకు లభించే విజ్ఞానమది. అటువంటి విజ్ఞానం మరుగున పడిపోతే దేశానికి మిగిలేది? అంధకారం!

నేను నెల్లూరు వెళ్ళిన నాటికి నాట్య సంప్రదాయ కుటుంబాలవారు ఆ విద్యనుండి విరమించుకొన్నారు. కొందరు ధనవంతులు, నాట్యకళాభిమానులు వారి పిల్లలను నాట్యవిద్య నభ్యసించటానికి మదరాసు పంపిస్తూ ఉండేవారు. ఆనాడు అదొక గొప్పగా భావించేవారు. వారిలో కొందరు నెల్లూరు వచ్చి, వారు మదరాసులో నేర్చుకొన్న విద్యను ప్రదర్శిస్తూ ఉండేవారు. వారి నృత్త, నృత్యాలు చక్కగా ఉండేవి. కాని సాహిత్య పోషణ బాగుండేది కాదు. వారి నృత్య ప్రదర్శనలకు నేపథ్యంలో పాడే గాయకులు తమిళులు. పాటలు తెలుగులో ఉండేవి. వారికి భాష తెలియక తప్పుగా పాడేవారు.

ఆనాటి నాట్యకచ్చేరీలలో పాము డాన్సును ఒక అంశంగా చేస్తూ ఉండేవారు. ఈ మోడీని ప్రదర్శించడం ఒక మోజుగా ఉండేది. ఈ మోడీని ప్రదర్శించిన తర్వాత డబ్బులు అడుక్కొనేవారు. ప్రేక్షకులు రంగస్థలం మీదికి డబ్బులు విసిరేవారు. నాకు ఇదంతా ఒక చిత్రంగా ఉండేది.

ఆ రోజుల్లో శ్రీమతి బాలాంబాళ్ ఒక ప్రసిద్ధ నర్తకీమణి. ఆమె కచ్చేరీలు చూడ్డానికి నేను మదరాసు వెళ్ళేవాడిని. వాద్య సమ్మేళనం బాగుండేది. ఆహార్యం పట్ల ఆమె ఎంతో శ్రద్ధ వహించేది. ఆమె నాట్యం చాలా చక్కగా ఉండేది. నాట్యానికి తగ్గట్టుగా రంగురంగుల దీపాలు వెలుగుతూ ఉండేవి. ఆమె అంగశుద్ధి చెప్పుకోతగ్గది. కాని, ఆమె ఏ యంశాన్నీ పది నిమిషాలకు మించి చేసేదికాదు. అంతకు పూర్వం నృత్త, నృత్య, అభినయాలను ప్రదర్శించడానికి ప్రతి నాట్యాంశానికి ఎక్కువ సమయం పట్టేది. నాట్య విన్యాసాలు ఎక్కువగా ఉండేవి. వీటిని చూసినవారికి ఈమె నృత్య ప్రదర్శనలు అంత సంతృప్తికరంగా ఉండేవికావు.

ప్రాచీన పద్ధతుల స్థానాలలో నూతన పద్ధతులు వస్తున్న రోజులవి. అటువంటి సమయంలో నేను ఆంధ్ర దేశంలో నా నాట్యకళా ప్రచారాన్ని ప్రారంభించాను. అందు వలన నా విద్య సామాన్యులకేకాక విద్యావంతులకు గూడ నచ్చేటట్టు ఉండాలని నేను నిశ్చయించుకొన్నాను. ఆ విధంగా నా విద్యను ప్రదర్శించవలసిన అవసరం వచ్చింది. నా వద్ద విద్య నభ్యసిస్తూండిన పిల్లల తల్లిదండ్రులకు ఎటువంటి బాధ కలగని రీతిలో నాట్యాంశాలను తీర్చిదిద్దవలసివచ్చింది. అందుకు తగిన పాటలు, పద్యాలను ఎన్నుకోవలసివచ్చింది.

ఈ విషయంలో నా శిష్యురాలు శ్యామల తల్లిగారు నాకు ఎంతో సహాయం చేశారు. ఆమె మంచి పండితురాలు, కవయిత్రి, కథారచయిత్రి. ఉన్నత కుటుంబానికి చెందినవారు. ఆధునిక దృక్పథాలు గలవారు. తమ కూతురుకు కావలసిన నాట్య దుస్తులను ఆమే స్వయంగా కుట్టేవారు. ఆమె అజంతా, ఎల్లోరా మొదలగు ఆలయ శిల్పాలను పరిశీలించి, ఈ దుస్తులను తయారుచేసేవారు. శ్యామలను ఒక సజీవ అజంతా శిల్పంగా తయారుచేసేవారు. కళారాధన ఆమెకు ఒక తపస్సు వంటిది.

ఆ కాలంలోనే శ్రీ అలెగ్జాండర్‌గారు నెల్లూరు కాలేజీలో లెక్చరర్‌గా ఉండేవారు. వారి శ్రీమతి గూడా బాగా చదువుకొన్న వారు. వీరు వారి అమ్మాయిని నాట్యానికి నా దగ్గర చేర్పించారు. ఆ అమ్మాయికి 6, 7 ఏళ్ళ వయస్సుంటుంది. రంగు కాస్త తక్కువే అయినా అందమైనది. ఆమె మాతృభాష మళయాళం ఆమెకు తెలుగు బాగా రాకపోయినా, తెలివైంది గనుక నేను చెప్పినట్టుగా అభినయం చక్కగా చేసేది. ఈ అమ్మాయికి నాట్యం బాగా వస్తుందని నేను ఆశిస్తున్న రోజుల్లో, అలెగ్జాండరుగారు మదరాసు వెళ్ళిపోయారు. ఆ తర్వాత ఆయన ఢిల్లీ వెళ్ళి, ఉన్నత పదవులు అలంకరించారు. తర్వాత ఇందిరాగాంధిగారికి సెక్రటరీగా పని చేశారు. తర్వాత తమిళనాడు రాష్ట్రానికి గవర్నర్ అయ్యారు. కాని, ఆయన్ని మరల కలిసే అవకాశం నాకు కలగలేదు.



గుంటూరు వాస్తవ్యులు శ్రీ తమ్మా రంగారెడ్డి గారి కుమార్తె కుమారి ఉమ

నేను నెల్లూరులో కేవలం రెండు సంవత్సరాలు ఉండాలన్న సంకల్పంతోనే వచ్చాను. అందువల్ల నేను నెల్లూరు నుండి ఆ సమయంలోనే గుంటూరు వెళ్ళిపోయాను. నేను నెల్లూరులో ఉండిన రెండు సంవత్సరాలలో అక్కడ శాస్త్రీయ నృత్యకళ బాగా ప్రచారంలోకి వచ్చింది. చాలా మంది నెల్లూరు బాల బాలికులు నా వద్ద శాస్త్రీయ నృత్యం నేర్చుకొన్నారు. నా నెల్లూరు రాకకు కారణభూతుడైన మిత్రుడు రమణయ్య సినీనటుడుగా మద్రాసులో స్థిరపడ్డాడు.

నేను నెల్లూరు రాకపూర్వమే 'నృత్యాంజలి' పేరుతో కొన్ని వ్యాసాలు నృత్యకళపైన వ్రాసి 'ఆంధ్రప్రభ' దిన పత్రికకు పంపుతూ ఉండేవాణ్ణి. అప్పుడు శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు దానికి సంపాదకులుగా ఉండేవారు. వారు నా వ్యాసాలు ప్రచురిస్తూ ఉండేవారు. ఈ శతాబ్దిలో సులభమైన శైలిలో, వ్యవహారిక భాషలో నృత్యకళపైని, పాండిత్య పటిమతో వ్యాసాలు వ్రాసిన తొలి రచయితను నేను. వారు నన్నెప్పుడు చూడలేదు. అందువల్ల ఎవరో పెద్ద నాట పండితుడే వ్రాస్తున్నాడని ఆయన భావించారు. నాగపూర్‌లో స్థిరపడ్డ ఏ పండితుణ్ణోనని వారు అనుకొన్నారట! నేను

తెలుగు వాతావరణంలో లేకపోవడం వల్ల నేను ఆంగ్లంలో ఆలోచించి, ఆంధ్రభాషలో వ్రాసేవాణ్ణి. తెలుగు నుడికారం కొంత లోపించినా విషయం ప్రామాణికంగా ఉండడంవల్ల నార్ల వారు నా వ్యాసాలు వరుసగా ప్రచురించారు. దానివల్ల ఆంధ్రుల నృత్యకళకే కాక నా పేరుకు కూడా ఆంధ్ర దేశంలో మంచి ప్రచారం వచ్చింది. నాతో వ్యక్తిగత పరిచయం ఎవరికీ లేకపోయినా నా పేరు అందరికీ చిర పరిచయమైంది. నా వ్యాసాలు చదివిన వారందరికీ నృత్యకళ పట్ల ఆసక్తి పెరిగింది. ఆ కారణంవల్లనే నవ్వుల రమణయ్య నన్ను నెల్లూరు ఆహ్వానించాడు.

నేను నెల్లూరు విడిచి, మళ్ళా నాగపూర్ వెళ్దామను కొంటున్న సమయంలో నార్ల వేంకటేశ్వరరావుగారి మేనమామ నాకు గుంటూరునుండి ఒక లేఖ వ్రాశారు శ్రీ నార్లవారు ఏదో పనిమీద గుంటూరు వస్తున్నారని, వారు నన్ను చూడా లనుకొంటున్నారని, అంతేకాక, వారి (నార్లవారి మేనమామ గారి) పిల్లలకు నృత్యం నేర్పాలన్నదే ఆ లేఖలోని సారాంశం. నార్లవారిని కలవాలని నేనూ అభిలషిస్తున్నందున వారు రమ్మన్నరోజున గుంటూరు వెళ్ళాను. ఆ సాయంత్రం నార్ల వారి బసకు వెళ్ళాను. వారు నన్ను చూసి ఆశ్చర్య పోయారు. "మీరేనా ఆ వ్యాసాలు వ్రాసిన రామకృష్ణ! ఇంత చిన్న వయస్సులో అంత ఉన్నత భావాలతో అంత చక్కని భాషలో చాలా బాగా వ్రాశారు కాని, మిమ్మల్ని చూస్తుంటే నేను నమ్మలేకుండా ఉన్నాను. బహుశా మీ అన్నగారు ఎవరైనా వ్రాశారేమో అనిపిస్తుంది" అన్నారు ఆయన. "నాకొక అన్న ఉండేవాడు. కాని, ఇప్పుడు లేడు. ఆ వ్యాసాలు వ్రాసింది నేనే. నేనే ఆ నటరాజ రామకృష్ణని" అన్నాను నవ్వుతూ. ఆ తర్వాత ఆయన చాలా సంతోషించి నన్ను అభినందించి "నీకు మంచి భవిష్యత్తుంది!" అని దీవించారు.

ఏ కారణంవల్లనోగాని నార్లవారి మేనమామ తమ పిల్లలకు నాట్యం నేర్పించలేదు. మరికొద్ది కాలానికే ఆయన గతించారు. కాని, ప్రసిద్ధ న్యాయవాది శ్రీ తమ్మా రంగా రెడ్డిగారు, ప్రముఖ వ్యాపారవేత్త శ్రీ వేలూరు శివరామశాస్త్రి గారు తమ పిల్లలకు నాట్యం నేర్పమని నన్ను కోరారు. అందుకే కొంతకాలం నేను గుంటూరులో ఉండవలసి వచ్చింది.

శ్రీ రంగారెడ్డిగారి కుమార్తె చిరంజీవి ఉమ చక్కగా నాట్యం నేర్చుకొని హైదరాబాద్‌లోని ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఒక ప్రదర్శన ఇచ్చింది. తర్వాత మరికొన్ని ప్రదర్శనలు ఇచ్చి, పెళ్ళి చేసుకొని, విరమించుకొంది.

శ్రీ శివరామ శాస్త్రిగారి కుమారుడు శివ చిన్నవాడైనా మంచి ప్రతిభావంతుడు. అతనికి మనోధర్మం అబ్బింది. అతడు చాలా అందమైనవాడు. పాలరాతి విగ్రహంలా ఉండేవాడు. పాట కచ్చేరీలో పాట పాడేవాడు, మృదంగ వాద్యకునికి అవకాశం యిస్తే అతడు ఎలా తన నేర్పును ప్రదర్శిస్తూ వాయిస్తాడో ఆ విధంగా ఈ కుర్రవాడు నృత్యం చేసేవాడు. ఇది చాలా అరుదు. ఇతడు అకాల మృత్యువును పొందకుండా యుండియుంటే నాట్య కళాకారుడుగా ప్రపంచ విఖ్యాతి పొందియుండేవాడు. ఆ అదృష్టం నాకూ ఆంధ్రదేశానికి లేకుండాపోయింది. నేను గుంటూరునుండి హైదరాబాదు వస్తున్నప్పుడు ఆ పిల్లవాణ్ణి నాతో పంపించమని అతని తల్లిదండ్రుల్ని కోరాను. కాని, వారికి పిలుపడలేదు. మరి కొన్నాళ్ళకే ఆ యబ్బాయి చనిపోయాడు. నేను కంట తడి పెట్టాను.

ఆ కాలంలో కృష్ణాపత్రికలో వ్యాసాలు ప్రచురింపబడితే ఆ వ్యాసకర్తలకు గర్వంగా ఉండేది. అందువల్ల నేను నృత్యకళపైని కొన్ని కథలు వ్రాసి కృష్ణాపత్రికకు పంపించాను. సాహిత్యపరంగా, సాంస్కృతికపరంగా విలువున్న వ్యాసాలు, కథలను మాత్రమే కృష్ణాపత్రిక వారు స్వీకరించేవారు. నా కథలు కృష్ణాపత్రికలో ప్రచురింపబడ్డాయి. నాకు దేశంలో మంచి గుర్తింపు వచ్చింది. ఆంధ్ర ప్రభ చదివిన సామాన్య పాఠకులకు, కృష్ణాపత్రిక చదివిన పండితులకు, విద్వాంసులకు నేను పరిచయమయ్యాను. కాని, నన్ను ముఖాముఖిగా చూసినవారు చాలా తక్కువ మంది.

అప్పుడు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు కృష్ణా పత్రికకు సంపాదకులుగా ఉండేవారు. ఆ కాలంలో నాట్య కళపైని వ్యాసాలు వ్రాసేవారు ఎవరూ లేరు. భావగర్భిత మైన వర్ణనలతో నాట్యకళకు సంబంధించిన కథలు వ్రాయడం ఆయనకు చాలా అద్భుతంగా తోచింది. అందు వల్ల నన్ను బందరు రమ్మనమని ఆయన నాకు లేఖ వ్రాశారు. ఒకనాడు వెళ్ళాను. ఉదయమే వారి కార్యాలయానికి వెళ్ళాను. అప్పటికింకా ఆయన రాలేదు. వారి సిబ్బంది నన్ను కూర్చోమన్నారు. మరికాస్సేపటికి కాటూరివారు వచ్చారు.

వారు తిన్నగా వారి గదిలోకి వెళ్ళి, ముఖ్యమైన విషయాలు చూసుకొన్న తర్వాత నన్ను గమనించి, నా గురించి వారి సిబ్బందిని అడిగారు. "మన పత్రికకు నాట్యకళపైని కథలు వ్రాసి, పంపే నటరాజు ..." అని ఆ సిబ్బంది నన్ను పరిచయంచేయడం పూర్తికాకమునుపే ఆయన ఆశ్చర్యంతో నన్ను చూసి, "నువ్వేనా బాబూ, రసిక జనులను రంజింపజేస్తున్న ప్రౌఢమైన కథలు వ్రాసింది?!"అని అడిగారు. నేను మునిమునిగా నవ్వుతూ "నేనేనండి" అన్నాను. "భేష్! ఆంధ్రదేశంలో నీవంటి యువ కళాకారుడున్నందుకు గర్విస్తున్నాను. ఎందరో పెద్దలు నాట్యం చేయగా చూ కాని, నాట్యంపైన ఉపన్యసించడం, వ్యాసాలు, వ్రాయడం ఇదే నేను మొదటిసారి చూడ్డం. మా ముట కృష్ణారావుగారు ఇప్పు డుండియుంటే నిన్ను చూసి సంతోషించేవారో! ఎంత ప్రోత్సహించేవారో!" అని కా వారు నన్ను మెచ్చుకొన్నారు.



విశాఖపట్నం వాస్తవ్యులు శ్రీ వడ్డాది బాపిరాజు గారి సోదరుడు
శ్రీ కృష్ణారావు గారి కుమార్తె, నా శిష్యురాలు
శ్రీమతి ఉమా రామారావు - తెలుగు విశ్వవిద్యా
లయంలో నృత్య శాఖకు రీడరు.

# తపన-తపస్సు-తరింపు

ఏ కార్యాన్ని మానవుడు సాధించాలనుకొన్నా దాన్ని గురించి అతనికి తపన ఉండాలి. రాత్రింబవళ్ళు దాన్ని గురించే అతడు తపించాలి. తర్వాత దానికి తపస్సు అవసరం. అంటే- ఆ ధ్యేయంపైన తన మనస్సును లగ్నం చేసి యేకాగ్రతతో ధ్యానం చేయడం. ఆ ధ్యానం పవిత్రంగా, నిశ్చలంగా, నిర్మలంగా ఉండాలి.

రాక్షసులు మహా తపఃసంపన్నులు. కాని, వారి తపస్సు స్వార్థపరమైనది. అందువల్లనే భస్మాసురుడు అంత శక్తిని సంపాదించుకొని తన చేతిలోతానే భస్మమయ్యాడు. అది తన తపస్సులోని లోపంవల్ల కాదు. తాను సాధించిన తపోఫలాన్ని దుర్వినియోగపరచదలచడం వల్ల అలా జరిగింది. మన పురాణాల్లో ఇలాంటి దృష్టాంతరాలు ఎన్నో కనిపిస్తాయి.

చేసిన తపస్సు సంపూర్ణంగా ఫలించినప్పుడు ఆ మానవుని జన్మ సార్థకమౌతుంది. ఆ తపోఫలాన్ని లోకకళ్యాణార్థం ఉపయోగించినప్పుడు ఆ మానవుడు తరిస్తాడు, ముక్తిని పొందుతాడు

మా పూజ్యగురుమాత రాజమ్మగారు ఉపదేశించిన సిద్ధాంతానికి సూక్ష్మరూపం పైది.

కిన్నెరసాని చిన్న నది. కానీ, అదివరద వచ్చినప్పుడు ఉరుకులు పరుగులతో ఉధృతంగా ప్రవహించి, పరుగు పరుగున వెళ్ళి గోదావరిలో లీనమైపోతుంది. ఆ ఉధృత ప్రవాహాన్ని తన ఒడిలో చేర్చుకొన్న గోదావరి మాత్రం ప్రశాంతంగా ప్రవహిస్తుంది. గోదావరి నదిలాగే మానవుడుగూడ అన్ని ఉధృతాలను తట్టుకొని ప్రశాంతంగా జీవించాలి- ముఖ్యంగా కళాకారుడైన నర్తకుడు.

తాను నేర్చుకొన్న విద్య అసంపూర్ణమైనదని ప్రారంభంలో నర్తకుడు తెలుసుకొనక ఎగిరెగిరి పడుతూంటాడు. ఎప్పుడైతే పండితుల సాంగత్యంవల్ల విద్వాంసుల విమర్శలకు గురౌతాడో అప్పుడు ఆత్మవిమర్శ చేసుకొనడం నేర్చుకొంటాడు. తన లోపాలను గుర్తెరిగిన కళాకారుడు తనంతట తానే ఓర్పు వహించి, సహనం, వినయం, విధేయతలను నేర్చుకొంటాడు. అభివృద్ధి చెందుతాడు. లోకప్రియుడౌతాడు. దేశసేవకుడౌతాడు. "తెలిసి రామచింతనతో" అని త్యాగయ్య అన్నట్టు తననుతాను తెలుసుకొన్నవాడు ఉత్తమోత్తముడైన కళాకారుడు.

20 వ శతాబ్ది ప్రారంభంలో వేంకటగిరి ప్రభువులు నృత్యశాస్త్రజ్ఞులను, పండితులను, కవులను, గాయకులను, వాద్యకారులను, నాట్యాచారులను, నర్తక నర్తకీమణులను సమావేశపరచి, సదస్సును నిర్వహించి, తర్వాత 'సభా రంజని' అనే గ్రంథాన్ని రచించి, ప్రచురించారు. ఆ తర్వాత ప్రభువుల, ప్రజల, రసిక జనుల అభిరుచుల ననుసరించి నృత్యకళ అభివృద్ధి చెందింది.

కార్వేటి నగరం, కాళహస్తి, వేంకటగిరి, నూజివీడు, కొల్హాపురం, గద్వాల, గోపాలపేట, పిఠాపురం, పెద్దాపురం, విజయనగరం, బొబ్బిలి మొదలైన సంస్థానాలలోని నృత్యకళ ఒకే పద్ధతిలో ఒకే రీతిలో అభివృద్ధి చెందింది. ఈ సంస్థానాలలోని కచ్చేరీలు నృత్తంతో ప్రారంభమై, నృత్యాభినయనాలతో ముగిసేవి. ఇంతవరకే ప్రభువులు నాట్యాన్ని తిలకించేవారు. తర్వాత నిష్క్రమించేవారు. ఆ తర్వాత కొన్ని వినోదకరమైన నృత్యాలు ప్రదర్శింపబడేవి.

కొన్ని సమయాలలో అధ్యక్షస్థాన మలంకరించి యుండిన ప్రభువుకు స్తోత్రంగా—

"జయజయశ్రీ సదయ సుందరశ్యామ దశరథ
రామా! శ్రీరంగరాయ మహాప్రభో!" - ఈ శబ్దం శ్రీమతి బొబ్బిలి జీవరత్నమ్మ దర్బారు ఆట ప్రారంభంలో- నర్తనమాడి - మొగ్గి - కచ్చేరి ప్రారంభించేవారు.

ఒక గీతాన్ని ఆడి, మొగ్గి, తర్వాత స్వరపల్లవి, స్వర జతి, వర్ణం, పదం, శ్లోకం ఆడి, అభినయించి కచ్చేరిని ముగించేవారు.అంటే నృత్తంతో ప్రారంభించి నృత్యం, సాత్వికాభినయాలతో ముగించేవారు.

గోలకొండ పాదుషాల దర్బారు కేళికలందు తెలుగు, సంస్కృతాలతో బాటు పర్షియా, ఉర్దూ (దక్కనీ) బాషల్లోని గీతాలకు నృత్త, నృత్య, అభినయాలు ప్రదర్శింపబడేవి.

సభలో కూర్చుని అభినయించడాన్ని (హావ, భావ, సాత్విక, సంచారులను ప్రదర్శించడాన్ని) 'నిరత్' అని ఉర్దూలోను, సాత్వికాభినయమని తెలుగులోను అంటారు. అన్నిటి కంటె ఉత్తమమైనది శుద్ధ సాత్వికం. కోలాటం (దండలాస్యం) ఒక ఉత్తమ కళారూపంగా రూపొందింది. నృత్యానుకూలమైన కృష్ణపరమైన లేక శివపరమైన గీతాలను నర్తకీజనం ఈ దండలాస్యంలో ప్రదర్శించేవారు. జడ కోలాటం, వల కోలాటం, లత కోలాటం అని ఈ కోలాటం పలు రకాలైంది. ప్రత్యేకంగా స్త్రీలే ఈ విద్యలను ఆ కాలంలో ప్రదర్శించేవారు. శ్రీశైలం, రామప్ప మొదలైన దేవాలయాలో ఎన్నో కోలాటం వర్ణన చిత్ర శిల్పాలు ఉన్నాయి

ప్రతి మేళానికి విద్యావంతురాలైన నాయకురాలు ఉండేది. తన మేళంలో ఉండేవారికి ఈమె పూర్తి శిక్షణ ఇచ్చేది. కొన్నిచోట్ల శాస్త్రవేత్తలైన బ్రాహ్మణులు ఈ నర్తకీ జనానికి శిక్షణ ఇచ్చేవారు. అయితే, ఈ బ్రాహ్మణ గురువుల వద్ద శిక్షణ పూర్తయిన తర్వాత వృద్ధురాలైన ఒక నాయకురాలు వీరి లాస్యానికి తుదిమెరుగులు తీర్చిదిద్దేది. ఈ బ్రాహ్మణ గురువులు కర్నాటక కచ్చేరీ పద్ధతి తెలిసినవారు. అయితే, వీరు భాగవత పద్ధతి ఎరిగిన కూచిపూడి బ్రాహ్మణులుమాత్రం కారు.

తెలుగు భాషలోని గీతాలనే వీరందరూ ఆరాధించినా, వీరంద. సంగీతం కర్నాటకమే అయినా, ప్రదర్శనా విధానంలో వీరిమధ్య తేడా లున్నాయి.

నే నెరిగినంతవరకు మా గురుదేవులు పూజ్యశ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, బ్రహ్మశ్రీ భాగవతుల విస్సయ్యగారు, ఇంకా మరికొందరు కూచిపూడి శాస్త్రవేత్తలు నట్టువ మేళానికి చెందిన కొందరు స్త్రీలకు కూచిపూడి భాగవత బాణీని ప్రత్యేకంగా నేర్పారు. సంగిగెద్దలో కృష్ణవేణి మొదలైనవారికి, రేపల్లెలో బండి బాలాత్రిపురసుందరి మొదలైన వారికి విస్సయ్యగారు కూచిపూడి బాణీ నేర్పారు. అంతకు పూర్వమే శ్రీమతి కృష్ణవేణి వారి లాస్యబాణీలో సిద్ధహస్తురాలైయుండినా ఈ కూచిపూడి బాణీనిగూడ నేర్చుకొన్నారు. శ్రీమతి బాలత్రిపురసుందరి ప్రత్యేకంగా గొల్ల కలాపం నేర్చుకొని, ప్రదర్శనలిచ్చి పేరు గడించారు. కాని, కరణీకంలో నిమగ్నం కావలసి వచ్చి ఈ విద్యనుండి విరమించుకొన్నారు. ఈ రెండు ప్రాంతాలలోని వారేకాక ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రమయిన ఘంటసాలలోని కొందరు నర్తకీమణులు విస్సయ్యగారివద్ద కూచిపూడిబాణీ నేర్చుకొన్నారు. 1965 నుండి నేను విస్సయ్యగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండేవాణ్ణి. ఈ విషయాలన్నీ నాకు వారు చెప్పినవే.

భరత కళానిధి వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు ఆ కాలంలో విశేషంగా పర్యటిస్తూ ఉండేవారు. వీరి పాండిత్యానికి ఆకర్షింపబడ్డ కొందరు నర్తకీమణులు వీరివద్ద కూచిపూడి బాణీ నేర్చుకొన్నారు.

వేంకటగిరి నీలవేణి, అన్నమ్మ, మండపేట దుగ్గిరాల జగదాంబ, పందిరి వేంకటరత్నమ్మ మొదలైనవారు లక్ష్మీనారాయణ శాస్త్రిగారివద్ద కూచిపూడి బాణీ నేర్చుకొనడమే కాక, వారి లాస్య బాణీలోని కొన్ని మెళకువలను శాస్త్రిగారికి తెలియజేశారు. శ్రీ శాస్త్రిగారు మైసూరు సంస్థానంలో అనేక మంది నాట్యశాస్త్ర పండితుల కలుసుకొన్నారు.

(ఆ కాలంలో మైసూరు ఆస్థానంలో జెట్టి తాయమ్మ అనే ఒక ప్రసిద్ధ నర్తకీమణి ఉండేది. ఆమె తండ్రి ఒక జెట్టి. మల్ల యుద్ధంలో ప్రసిద్ధుడు. వీరు తెలుగువారు. శ్రీమతి తాయమ్మ తెలుగు, సంస్కృతం, కన్నడ భాషలు తెలిసిన మహా విద్వాంసురాలు. అందువల్ల మైసూరు సంస్థా

నంలో తెలుగు నాట్యబాణీ ప్రచారంలో ఉండేది. వృద్ధకళామూర్తి వేంకట లక్ష్మమ్మ ఈ తాయమ్మగారి శిష్యురాలు.

వీరి బాణీకి, అక్కడి శివాలయంలో నృత్యపూజ చేస్తూండిన మూగూరు జేజమ్మగారి బాణీకి వ్యత్యాసముండేది. వీరు కాక మైసూరు సుందరమ్మ అనే మరొక ప్రసిద్ధ నర్తకి అక్కడ ఉండేది. బెంగుళూరులో శ్రీమతి ధన భాగ్యమ్మ అనే ఒక ప్రసిద్ధ విద్వాంసురాలు ఉన్నారు. ఈమె తన జీవితాన్ని నృత్య కళారాధనతో ప్రారంభించారు కాని, తర్వాత సంగీత కళకు అంకితమై పోయారు.

ప్రసిద్ధ వయోలిన్ విద్వాంసుడు చౌడయ్యగారి మాతృమూర్తి శ్రీమతి చంద్రకాంతమ్మగారు కూడా ఒకప్పుడు గొప్ప నర్తకీమణి. నంజనగూడి నాగరత్నమ్మ మైసూరు రాష్ట్రంలో గొప్ప పేరు పొందిన సంగీత, నాట్య విద్వాంసురాలు. ఈమె తండ్రి శ్రీ ముత్తయ్య భాగవతారు దేవీ ఉపాసకుడు. ఈయన దేవిపైన 300 కీర్తనలు రచించి, పాడుతూ ఉండేవాడు.

వీరిలో కొందరిని ప్రత్యక్షంగా కలుసుకొని, వారి విద్య వివరాలను తెలుసుకొనే అదృష్టం నాకు నా మిత్రులు శ్రీయుతులు ఎన్.ఎస్. నటరాజన్, బి.వి.కె. శాస్త్రిగార్ల సహకారంతో లభించింది.)

ఈ పర్యటనల వలన వారెన్నో నూతన విషయాలను గ్రహించారు. ఈ నట్టువ మేళ కళాకారులతో శ్రీ శాస్త్రిగారికి పరిచయం ఏర్పడిన తర్వాత బహుశా తమ బహుపాత్రల నృత్య ప్రదర్శనలను ఏకపాత్ర కేళికలుగా తీర్చిదిద్దాలన్న ఆలోచన వారికి కలిగియుండవచ్చును. ఈ పర్యటనలలో శ్రీ శాస్త్రిగారు అనేక అభినయ రీతులను గమనించి వారి విద్యకు మెరుగులు దిద్దుకొన్నందువల్లనే బాలసరస్వతి వంటి గొప్ప నృత్యకళాకారిణి వీరి పద్ధతిలో అభినయం నేర్చుకొన్నారు.

శ్రీ శాస్త్రిగారితోగూడ ఆయన కుమారుడు జగన్నాథ శర్మకూడా వెళ్తూండేవాడు. జగన్నాథ శర్మ అప్పుడు చాలా చిన్నవాడు. ఒకసారి వీరిరువురు బుచ్చిరెడ్డిపాలెం వెళ్ళి, ప్రసిద్ధ సాహితీవేత్త, సాహిత్య కళా పోషకులైన శ్రీ బెజవాడ రామచంద్రరెడ్డి జమిందారుగారి అతిథులుగా వారి దివాణంలో ఉన్నారు. ఆ చిన్న వయస్సులో జగన్నాథశర్మ చూడ ముచ్చటగా ఉండేవాడు. తెల్లని రంగు, గిరజాల జుత్తు, కోటారేసిన ముక్కు. జగన్నాథశర్మ గౌను, మేజోళ్ళు వేసికొని పిల్లదొరసానిలా తయారు అయ్యి నాట్యం చేసేవాడు. శర్మే పాడుతూ ఆడేవాడు. ఆట రక్తి కట్టేది. ఆ కాలంలో తగిన సంభావన కూడా ఉండేది. ఈ ముచ్చట గురించి ఒకసారి నాకు శ్రీ రామచంద్రరెడ్డిగారు చెప్పారు.

బుచ్చిరెడ్డిపాలెంలో ఒక అలము నర్తకి ఉండేది. ఆమెది కర్నాటక బాణీ. ఆమె బాణీలోని మెలకువలనుగూడ శాస్త్రిగారు గ్రహించారు. కర్నాటక, కూచిపూడి బాణీలు రెండింటిని క్షుణ్ణంగా తెలుసుకొన్న శ్రీ శాస్త్రిగారికి ఎన్నో నూతన భావాలు కలగడం సహజం.

ఆ కాలంలో నృత్యకళ ఇంత ప్రచారంలో లేక పోవడం వల్ల శ్రీ శాస్త్రిగారి గొప్పతనాన్ని గ్రహించినవారు చాలా అరుదుగా ఉండేవారు. అందువల్లనే ఆయన చాలా ఆర్థిక ఇబ్బందులు పడ్డారు. ఆయన కుమారుడు జగన్నాథ శర్మ చాలా తెలివైనవాడు, అనుభవజ్ఞుడు, మంచి నాట్య గురువు, తండ్రిలాగే సంస్కరణాభిలాషి. అందువల్ల తన కళలో ఎప్పటికప్పుడు నూతన పోకడలను ప్రవేశ పెట్టేవాడు.

నేను నాగపూరులో బండారు రాజావారి ఆస్థానంలో ఉండగా కూచిపూడివారి కళ గురించి మొదటిసారి విన్నాను. దాని యెడల నాకు ఆసక్తి కలిగింది. అప్పటికింకా తాతగారి గురించి నాకు తెలియదు. (శాస్త్రిగారిని మేం ముద్దుగా తాతగారు అనేవారం.) నాగపూరులోని తపాలా కార్యాలయంలో శ్రీ వేమూరి సూర్యనారాయణ అనే ఒక కళాభిమాని ఉండేవాడు. ఆయన హరికథలు చెప్పేవాడు. ఆయన స్వస్థలం విజయనగరం. ఆయన ఒకసారి దక్షిణ భారత బాలికల పాఠశాల విద్యార్థినుల చేత 'భక్త కుచేల' నాటకం వేయించాలని తలపెట్టాడు. రుక్మిణి, కృష్ణుల దృశ్యంలో ఒక నాట్యం చేయించాలని నిర్ణయించుకొన్నాడు. పాటని ఆయనే ఎన్నుకొన్నాడు. నన్ను అభినయం కూర్చమన్నాడు. అలాగే చేశాను. నేనే పాడాను నాటకం రక్తికట్టింది. ఆ నాటకాన్ని

తయారు చేస్తున్న సమయంలో కూచిపూడి భాగవతుల గురించి ఆయన నాకు చెప్పాడు. "రామకృష్ణగారూ! మీరు లాస్యంలో నిష్ణాతులు. అభినయం మీ సొత్తు. మీరు మన కూచిపూడి కళనుగూడ అభ్యసిస్తే బాగుంటుంది" అని ఆయన నాకు సలహా యిచ్చాడు అయితే, బండారు సంస్థానాధీశులు శ్రీ రాజా గణపతిరావు పాండ్యగారి దర్బారులో చేరిననాటికే నేను తంజావూరు భరతనాట్యం, కాళహస్తివారి ఆలయ నృత్యంలోని అభినయం సంపూర్ణంగా నేర్చుకొని ఉండడంవల్ల ఈ కూచిపూడి కళగురించి నాకు అంతగా ఆసక్తి కలగలేదు. కాని, వేమూరి సూర్యనారాయణగారి బలవంతం వల్ల శ్రీ వేదాంతం పార్వతీశంగారికి చాలా లేఖలు వ్రాశాను. కాని, ఫలితం లేకపోయింది. అయినా, నేను ఆయనకు లేఖలు వ్రాయడం మానలేదు. ఇంతలో కృష్ణా పుష్కరాలు వచ్చాయి. ఆ సందర్భంలో లేఖల ద్వారా శ్రీ అయ్యంకి తాండవకృష్ణగారితో పరిచయం ఏర్పడింది. "తాండవకృష్ణ" చక్కని పేరు నన్ను చాలా ఆకర్షించింది.

ఆ కాలంలో నేను రామకృష్ణ మిషన్లో ఉండి, చదువుకొంటున్నాను. మా పెద్దలు రామకృష్ణ పరమహంస భక్తులైనందున అక్కడి స్వామీజీలు నా యెడల ప్రత్యేక శ్రద్ధ తీసుకొంటూ ఉండేవారు. ఇది నాతోటి సహాధ్యాయుల ఈర్ష్యకు కారణమయింది. అంతేకాదు, నేను అప్పుడు చాలా అందంగా ఉండేవాణ్ణి గనుక నాకు అందరిలో ఒక ప్రత్యేకత ఉండేది. తర్వాత నేను అక్కడి హిస్లాప్ కాలేజీలో చేరాను. అది క్రిష్టియన్ మిషన్ కాలేజీ. దాని ప్రిన్సిపాల్ మోసెస్ తమిళుడు, ప్రొఫెసర్ ధర్మరాజు తమిళుడు, ప్రొఫెసర్ ఇస్సాక్ మళయాళి, ప్రొఫెసర్ రాఘవయ్య, హెడ్ గుమస్తా అగస్తీను ఆంధ్రులు వీరందరికి నేను అభిమాన పాత్రుణ్ణయ్యాను. నా పాట, ఆట, ఉపన్యాసం నా రూపం వీరినే కాదు-అందర్నీ ఆకర్షించేవి. నేను కాంబ్రిడ్జి సీనియర్ చదివినందువల్ల నా ఆంగ్లభాష కూడ బాగుండేది.

నేను కాలేజీలో చేరిన సంవత్సరం 'కాలేజీ డే'కి విద్యార్థులు నాటకాలు వేయదలచుకొన్నారు. హిందీ విద్యార్థులు 'ముద్రారాక్షసం' చేపట్టారు. వారి నాటకంలో నన్ను నాట్యం చేయమన్నారు. ఒప్పుకొన్నాను. ప్రారంభంలో హిమాలయ శిఖరంపైని శివుని నాట్యం, తర్వాత చంద్రగుప్తుడు తన ప్రేయసితో గూడ ఉద్యానవనంలో ఉండగా వారి వినోదార్థం ఒక స్త్రీ నాట్యం. ఇవి అసలు నాటకంలో లేవు. ఆకర్షణ కొరకు చేర్చారు. మేము రిహార్సల్సు చేస్తూండగా మరాఠీ విద్యార్థులు చూశారు. వారొక సాంఘిక నాటకాన్ని తయారు చేస్తున్నారు వీరికి, హిందీ వారికి మధ్య స్పర్థ ఉంది. నా వల్ల హిందీ నాటకం మెప్పుపొందుతుందన్న భయం మరాఠీ విద్యార్థులకు కలిగింది. వారు నన్ను ప్రత్యేకంగా కలిసి, వారి నాటకంలో గూడ ఒక నాట్యం చేయమన్నారు. వారు "గేలా దంయా పార్, ఘరదని...." అనే పాటను ఎంపిక చేశారు. ఒక యువతికి అప్పుడే పెళ్లయింది. అయితే, పెళ్ళికొడుకు సైనికోద్యోగి గనుక యుద్ధానికి రమ్మనమని అధికారులనుండి కబురు వచ్చింది. అతడు వెళ్ళక తప్పదు. ఆమె మానసికంగా వ్యధ చెందుతుంది ఆ పాటను అభినయించమని కోరారు. అది కరుణరస ప్రాధాన్యం గల గీతం - నాకు నచ్చింది. ఒప్పుకొన్నాను.



శ్రీమతి ఉమా రామారావు సోదరి, నా శిష్యురాలు శ్రీమతి సుమతీ కౌసల్. ఉస్మానియా విశ్వవిద్యాలయం తరఫున అఖిలభారత యూత్ ఫెస్టివల్లో స్వర్ణపతకం పొందింది.

శ్రీరామ్ బవు సర్దేష్‌పాండే అనే ఒక గొప్ప సంగీత విద్వాంసుడు ఆ పాట పాడడానికి అంగీకరించాడు. ఆయన కంఠం బహు చక్కనిది. బంగారు తీగలాగ సాగేది. అంత శ్రుతి మెత్తని కంఠం మళ్లా నేను ఇంతవరకు వినలేదు. అందువల్ల ఆయన నాకు ఆ తర్వాత శాశ్వతమైన నేపథ్య గాయకుడయ్యాడు. నేను బండారు సంస్థాన ఆస్థాన నర్తకునిగా నుండినంత కాలం ఆయనే నాకు పాడుతూ ఉండేవాడు. నేను కూడా చక్కగా పాడేవాణ్ణి. హిందూస్థానీ, కర్నాటక బాణీలు రెండు నేర్చుకొన్నాను కాని, ఆయన గానంలో ఒక రకమైన మాధుర్యం ఉండేది.

మొదటి రోజున హిందీ నాటకంలో నా శివతాండవం చాలా విజయవంతమైంది. అందరూ మెచ్చుకొన్నారు. ఆ మర్నాడు పై పాటకు సాత్వికాభినయం చేశాను. చూస్తున్నంత సేపూ కంట తడి పెట్టని స్త్రీ, పురుషులు ఎవ్వరూ లేరు. అంత హృదయరంజకంగా ఆ పాటను అభినయించాను. ఆ నాటినుండి నన్నొక గొప్ప కళాకారునిగా అందరూ గుర్తించారు. నేనొక ప్రముఖ వ్యక్తి నయినట్టు భావించుకొన్నాను. నా ఆటోగ్రాఫ్ కోసం ఎవరో ఒకరు వస్తూండేవారు. నేను చదివిన గ్రంథాల్లోని సూక్తులను వ్రాసి, సంతకాలు చేస్తూ ఉండేవాణ్ణి. దీనివల్ల కాలేజిలో నాకు మిత్రులకన్నా శత్రువులు ఎక్కువయ్యేరు. ఇది మా స్వామీజీ భాస్కరేశ్వరానంద మహారాజ్ గారికి తెలిసింది. ఆయన ఒక రోజున నన్ను పిల్చి, ప్రేమగా దగ్గర కూర్చోబెట్టుకొని, "రామ్ దా! నీవు ఆశ్రమవాసివి. నిన్ను గురు మహారాజ్ (రామకృష్ణ పరమహంస) భక్తునిగా, సన్యాసిగా చేయాలని మీ తండ్రిగారు నిన్నిక్కడ ఉంచారు. ఆ శిక్షణ ఇక్కడ పొందాలి. అంతేకాని, ఈ యాట పాటలు నీకు పనికిరావు'' అని మెత్తగా చివాట్లు పెట్టారు. అంతవరకు నేను నాట్యం చేస్తానని ఎవరికీ తెలియదు. తెలిసినవారు అంతగా పట్టించుకొనలేదు. కాని, తర్వాత నేనేదో పెద్ద తప్పు చేసినట్టు ఆ యాశ్రమంలో నన్నందరూ చూడ్డం మొదలు పెట్టారు.

రామకృష్ణ మిషన్‌లో ఉండినందువల్ల నాకు చక్కని క్రమశిక్షణ అలవడింది. పెద్దలను గౌరవించడం, వారితో వినయంగా మాట్లాడ్డం, కార్యదీక్ష, శ్రద్ధ, మానవునిలోని మాధవుణ్ణి చూడ్డం మొదలైనవి అక్కడ అలవరచుకొన్నాను.

నన్ను కాస్త కట్టడి చేయడానికి సాయంత్ర సమయాల్లో ఆశ్రమ గ్రంథాలయంలో ఉండమని స్వామీజీ ఆదేశించారు. అయితే ఇది నాకు వరమే అయింది. ఆ గ్రంథాలయంలో చిత్రశాస్త్రం, సంస్కృతి, కళలు, చరిత్ర, సాహిత్యం మొదలైనవాటికి సంబంధించిన అనేక గ్రంథాలుండేవి. నేను వాటిని చదివి, నాకు నచ్చిన విషయాలు వ్రాసిపెట్టుకొనేవాణ్ణి దానివల్ల నాకు నా భావి జీవితంలో ఎంతో మేలు కలిగింది.

ఆ కాలంలోనే నేను కాన్పూర్ విశ్వవిద్యాలయ గ్రంథాలయానికి వెళ్ళి రోజూ రెండు గంటలు గడిపేవాణ్ణి. అప్పుడే మొదటిసారి తరిటన్ వ్రాసిన 'కాస్ట్స్ అండ్ ట్రైబ్స్' సంపుటాలు చదివి, భారతదేశంలోని వివిధ తెగలవారిగురించి, వారి ఆచార వ్యవహారాల గురించి తెలుసుకొన్నాను. 'లండన్ కోర్టు రహస్యాలు' (Mysteries of Court of London) చదివి నా ఆంగ్ల భాషా పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొన్నాను. కళలకు సంబంధించిన గ్రంథాలు చదవడం వల్ల నాట్యంయెడల నాకుండిన ఆసక్తి మరింత పెరగజొచ్చింది. నాకు అసలు ఈ యాసక్తి ఎలా కలిగింది?

మా పితృవంశస్థులది ఒకప్పుడు కోనసీమ. పచ్చని పొలాలు, కొబ్బరి తోటలు, పూతోటలతో శోభిందిన బంగారు భూములు మా తాతలకు రాజోలు ప్రాంతంలో ఉండేవట! మా యింట బంగారు ఇటుకలు ఉండేవట. అయితే, ఆవేవి నేను చూడలేదు. దీనిబట్టి మా పూర్వీకులు జమీందారులై యుండవచ్చునని నేను భావించాను. మా యింట జీవిత శైలి కూడా అలాగే ఉండేది

మా నాన్నగారు దైవభక్తి గలవారు. సాధువులకు, సంత్ మహంతులకు, మఠాలకు ఎన్నో దాన ధర్మాలు చేశారు. కాషాయి రంగు వస్త్రాలు ధరించినవాడు ఎవడు కనబడినా అతన్ని మా నాన్నగారు ఇంటికి తీసికొని వచ్చి అతిథి సత్కారాలు చేసేవారు.

మా చిన్నాన్న శృంగారపురుషుడు, రసికుడు, మధుపాన ప్రియుడు. అందమైన అమ్మాయి కనిపిస్తే, ఆమె అనుకూలిస్తే ఎంత ఖర్చయినా పెట్టేవాడు.

నా చిన్నప్పుడే మా మాతృమూర్తి గతించారు. ఆమె చాలా సౌందర్యవతి. వీణ వాయించేవారు, శాస్త్రీయ సంగీతం పాడేవారు. నాలుగైదు భాషల్లో పండితురాలు. విశేషంగా గ్రంథాలు చదివేవారు. కాని, ఏం లాభం? ఆ కాలంలో సంసార స్త్రీలు ఇంటికే పరిమితులు. ఆమె విద్యలన్నీ కొరగాకుండా పోయాయి. అప్పుడప్పుడు ఎవరైనా ఆడవారు వస్తే వారికి ఏదైనా పురాణం చదివి వినిపించి, తృప్తిపడేవారు. మా అమ్మమ్మ చాలా సంస్కారవంతురాలు. ఆమె మా తల్లిగారికి ఇంటివద్దే చదువు చెప్పించారు. అయితే, ఆనాటి సాంఘిక పరిస్థితులవల్ల ఆమె అభ్యుదయ భావాలు మా అమ్మగారి పెళ్ళివరకే పనిచేశాయి. మా అమ్మమ్మగారి స్వస్థలం ప్రఖ్యాత జైన మందిరం గల కొలనుపాక.



30 సంవత్సరాలక్రితం మా నృత్యనికేతనం సమర్పించిన వేంకటేశ్వర కల్యాణం (తెలుగు), బాలాజీ (హిందీ), కుమార సంభవం (సంస్కృతం) నృత్య నాటకాలలో పాల్గొన్న నర్తకీమణులు "రాధాకృష్ణ" నృత్య నాటకంలో కృష్ణుడుగా శ్రీమతి గిడుగు విశాలాక్షి, రాధగా శ్రీమతి స్వర్ణలత. శ్రీమతి విశాలాక్షి ప్రస్తుతం 'నృత్యాంజలి' నర్తనశాలను నిర్వహిస్తూ శిష్యులకు నృత్యంలో శిక్షణ ఇస్తున్నారు.

మా అమ్మగారిది మేలిమి బంగారుఛాయ. సుందమైన విశాల నేత్రాలు గలది, శాంత స్వభావురాలు, బంగారు తీగలాంటి చక్కని కిన్నెర కంఠం గలది. కాని నాకివ్వన్నీ గుర్తులేవు. మావాళ్ళు చెప్పగా విన్నవే ఇవి. ఆమె చనిపోయిన నాటికి నా వయస్సు సుమారు మూడేళ్ళు. మా తండ్రిగారు చాలా దయార్ద్రహృదయులు. కాని, చాలా పట్టుదలగల మనిషి.

మా అమ్మగారు గర్భవతిగా నున్నప్పుడు ఒక శుక్రవారంనాడు తలంటి, స్నానంచేసి, తన నిడుపైన జుత్తుకు సాంబ్రాణిపొగ వేసుకొంటూ ఉండగా, గర్భస్థ శిశువు మాట్లాడినట్లు ఆమెకు వినిపించిందట. మా అమ్మమ్మ, అమ్మ మేధాసంపన్నులు, భారత భాగవతాలను బాగా అధ్యయనం చేసినవారు. అందువల్ల ఈ గర్భస్థ శిశువు మాట్లాడడం ఏదో అనర్థానికి దారితీస్తుందని వారు భావించారు. ప్రహ్లాదుడు తన తల్లి గర్భంలో ఉండగా ఇలాగే మాట్లాడాడు. అతని తండ్రికి అనర్థం జరిగింది. అందువల్ల మగపిల్లవాడు పుడితే తండ్రికి, ఆడబిడ్డ పుడితే తల్లికి గండం అని వీరు అర్థం చేసుకొన్నారు. "ఆడబిడ్డనే ప్రసాదించు తండ్రీ! మగపిల్ల పుడితే నేను వైధవ్యం జీవితాంతం భరించలేను" అని ప్రతి రోజు మా అమ్మగారు భగవంతుణ్ణి ప్రార్థించేవారట.

నవమాసాలు మోసిన తర్వాత ఆమెకు అతి అందమైన ఆడబిడ్డ జన్మించింది. ఆ ప్రసవ సమయంలోనే ఆ తల్లీకూతుళ్ళిద్దరూ మరణించారు. మా నాన్నగారి సంసార జీవితం అంతటితో ముగిసింది. మా అమ్మ బ్రతికి ఉండగానే మా నాన్నగారు రామకృష్ణ పరమహంస బోధనల పట్ల ఆకర్షితులైనారు. ఆధ్యాత్మిక జీవితాన్నే గడుపుతూ ఉండేవారు.

మా అమ్మగారి మరణంతో, మా నాన్నగారి ఆధ్యాత్మిక చింతనవల్ల మా కుటుంబంలో కలతలు ప్రారంభమయ్యాయి. ధనమూలం ఇదమ్ జగత్! మా కుటుంబం చెదిరిపోవడానికి ఇదే ప్రధాన కారణమయింది.

రాజోలు సమీపంలోని ఒక దేవాలయానికి మా పూర్వీకులు ధర్మకర్తలుగా ఉండేవారు. ఆ యాలయం

ఏమంత పెద్దది కాకపోయినా చాలా ఆదాయం గలది. అప్ప టికింకా సంఘసంస్కరణలు ఆ మారుమూల ప్రాంతాలకు వ్యాపించలేదు. ధ్వజస్తంభంమీది చిరుగంటలు గాలికి మధు రంగా పలుకుతూంటే నా హృదయంలో ఆనందం కల్గేది, తన్మయత్వం చెందేవాణ్ణి

ప్రతి నిత్యం దేవునికి హారతి ఇవ్వడం ముగిసిన తర్వాత ఒక స్త్రీ, తోపురంగు పైజామాపై తెల్లని చీర కట్టు కొని, తెల్లని రవికె ధరించి, నడుంకు బంగారు వడ్డాణం ధరించి, దండలకు రాళ్ళ వంకీలు, మెడలో కాసులపేరు మొదలైనవి పెట్టుకొని, కాళ్ళకు గజ్జెలు ధరించి, మద్దెల, సహకార గానంతో నృత్యం చేసేది. ఆ స్త్రీ మంచి తెలుపు, ఎత్తుగా ఉండేది. ఆమెకు మాన్యాలుండేవి.

ఆ చిన్న వయస్సులో ఆ పాటలకు అర్థాలు, ఆ నృత్త నృత్యాల భేదాలు, అభినయంలోని అర్థం తెలియక పోయినా నా ఊహ కందని ఒక దివ్యానుభూతిని పొందే వాణ్ణి.

కాళ్ళకు గజ్జెలు కట్టుకొని నాట్యం చేయాలని నా మనస్సు తహతహలాడేది. కాని, అదెలా సాధ్యం? గజ్జెలు ఎలా సంపాదించాలి? ఎక్కడ సంపాదించాలి? ఆలోచించాను. ఎండిన తుమ్మకాయలను ఆడించినప్పుడు అవి గలగలమని శబ్దం చేశాయి ఒకసారి. ఆ విషయం జ్ఞాపకంవచ్చి, ఊరి వెలువలనున్న తుమ్మతోపులోకివెళ్ళి, ఎండిన తుమ్మకాయలు ఏరుకొని వచ్చాను. వాటిని దారాలతో చక్కగా అల్లుకొని, కాళ్ళకు కట్టుకొని, ఘల్లు ఘల్లున మోగిస్తూ చిందులు వేసి, వంటరిగా ఆనందించేవాణ్ణి. అదొక వెర్రి ఆనందం.

ఆ కాలంలో ఒక ఆచారముండేది. వివాహాది శుభ కార్యాలకు కళావంతుల్ని పిలిపించి ఆడించేవారు. ఒక్కొక్క సారి ఈ కళావంతులు వారం రోజులు కూడ ఉండేవారు. వారి బస, భోజన ఏర్పాట్లను వారిని పిలిపించినవారే చేసే వారు. అయితే వీరు ఉన్నత కుటుంబాలవారు, అందులోనూ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కుటుంబాలవారు పిలిస్తేనే వెళ్లే వారు. ఇతరులు ఎంత ధనవంతులైనా సరే- వెళ్లేవారు కారు. అది ఆనాటి సంఘ కట్టుబాటు.

ఒకసారి ఒక దేవాంగుల ఇంట్లో పెళ్ళి జరిగింది. దానికి కలాపం ఆడను రమ్మనమని పిలిస్తే ఈ కళావంతులు వెళ్ళలేదు. దేవాంగులు మంచి నిష్ఠాపరులు. శివపూజా దురంధరులు, సంస్కృతం అధ్యయనం చేసేవారు. చక్కగా పాడి, ఈ కళావంతులను పట్టువాలగించి నెరపేవారు. వీరితో కొందరు. ఒక విధంగా ఈ కళావంతులను కొందరు దేవాంగులు హంసుదాసులు. అందువల్ల ఆ గజ్జెలు వీరు కట్టు గట్టి వీరి నాట్యానికి హాంగు చేయమన్నారు. "మేం నష్ట పోయినా సరే, మేం దేవాంగుల ఇండ్లలో ప్రదర్శన ఇవ్వం" అన్నారు కళావంతులు. ఇలా కొంతకాలం జరిగింది. ఇరు వురు నష్టపోయారు. తుదకు కొందరు సంసారపక్షంతులు వీరి మధ్య రాజీ కుదిర్చి, సర్దుబాటు చేశారు. ఇలా ఉండేవి ఆనాటి ఆచారాలు

పెద్దాపురం, కాకినాడ మొదలైన ప్రాంతాల నుండి కూడా కొన్ని ప్రత్యేక మేళాలను పిలిపించేవారు. ఆ కాలంలో ఎన్ని మేళాల్ని పెడితే అంతగొప్ప. ఊరేగింపు ఎంత పొడ వుంటే అంత హోదా. సన్నాయి మేళం, రండోలు మేళం, సుర్నామేళం, గన్ సెట్ మేళం, బుట్టబొమ్మల మేళం, కీలు గుఱ్ఱాల మేళం, (కొన్ని సందర్భాలలో జీవంతో వున్న గుఱ్ఱానికే ఆటలో శిక్షణిచ్చి, దాని కాళ్ళకు గజ్జెలు కట్టి ప్రక్కన ఉన్న డప్పువాడు వాయించగా స్వరం చేత ఆడించేవారు. (బ్యాండ్ మేళం, కొరువా మేళం, నట్టువ మేళం- ఇలా ఎన్నో మేళాలు ఊరేగింపుల్లో పాల్గొనేవి. అన్నింటికంటే ఎక్కువ ప్రాముఖ్యం నట్టువ మేళానికి ఉండేది. ఈ మేళం వారికి ఎక్కువ సదుపాయా లుండేవి. సాయంత్రం వీరు మేజువాణి చేసి, రాత్రి ఊరేగింపులో పాల్గొనేవారు.

మేజువాణి అంటే పండితసభ. నిష్ణాతురాలైన నర్తకి మాత్రమే ఇటువంటి మేజువాణీలో పాల్గొనేది. ఈమె ఇతర సమయాలలో మేళానికి నాయకత్వం వహించేది. అందువల్ల ఈమెను నాయకురాలు అనేవారు. ఊరేగింపు మేళంలో ఈమె గజ్జెకట్టేది కాదు, నాయకత్వం వహించేది. ఒకసారి మా యింట్లో మేళం ఏర్పాటు చేశారు.

కొరిక సమయాల్లో ఈమె తన పరివారంతో మా యింటికి వచ్చి, మా నాయనమ్మ మొదలగు వారితో వారి ముచ్చట్లు చెప్పేవారు. వారి ఆధునిక నగలను చూపించేవారు. ఎందువల్లనంటే, ఏ కొత్తరకం నగ వచ్చినా, వారిద్వారానే ప్రచారం పొందేది. అడిగితే వారు పాటలుకూడా పాడేవారు.

వీరు మేళం కట్టినప్పుడు శంఖతావళం, చంద్రహారం మిరియాల దండ. వగడాల దండ. అడ్డిగ, ఒంటిగజ్జె, గజ్జెపట్టెడ, జిగినీ గొలుసు మొదలైన బంగారు నగలుధరించే వారు. వీరి ద్వారానే శంఖతావళం ప్రచారంలోకి వచ్చింది.



'భారత కళా ప్రపూర్ణ' బిరుదును ఆం.ప్ర. సంగీత నృత్య అకాడమీ అధ్యక్షులు శ్రీ వసల సూర్యచంద్రరావుగారి నుండి స్వీకరిస్తున్న డాక్టర్ నటరాజ రామకృష్ణ.

వీరి నడక, మాట తీరు, అవయవాల కదలిక మొదలైన చేష్టలు కావ్య ప్రబంధాల్లా ఉండేవి. వీనిలో చాలామంది పెదవులు విప్పకుండా, కళ్ళతో మాట్లాడేవారు. కొందరి శరీర అవయవాల కదలిక లలో గాన వాహినులు ప్రవహించేవి. వీరు ఒక రస లోకాన్ని సృష్టించేవారు. అదొక ప్రత్యేక ప్రపంచంలా నాకు అనిపించేది. ఆ చిన్న వయస్సులో నాకు అదొక దివ్యలోక సందర్శనం. అందువల్ల బాల్యంలోనే నన్ను ఈ నృత్యకళ ఆకర్షించింది. ఒంటరిగా కూర్చుంటే ఆ మువ్వల సవ్వడి, ఆ మృదంగనాదం, ఆ కిన్నెరగాత్రం వినిపిస్తూ ఉండేవి. నాకూ వారిలా నాట్యం చేయాలనిపించేది. ఆదిలో నా ఊహలకు మా పెద్దలు సంతోషించారు. ఎందువల్లనంటే, నేనప్పుడు చాలా చిన్న వాణ్ణి. నే నేవో పిచ్చిగంతులు వేసి నాట్యం చేస్తూంటే మా పెద్దలు ఆనందించేవారు. కాని, నా పిచ్చి ముదురు తూంటే ఒకసారి మా దాయమ్మ నన్ను పిలిచి, తన వడిలో కూర్చుండబెట్టుకుని ''చూడు బాబూ! మనం నృత్యం చూడాలి. ఆనందించాలి, అభినందించాలి, గౌరవించాలి, పోషించాలి. అంతేకాని, మనం నాట్యం చేయకూడదు. అది మన వంశ మర్యాదకు అవమానం'' అని మందలించింది.

పెళ్ళి జరిగిన మరునాటి మధ్యాహ్నం ఈ నట్టువమేళం వారు వారి వూరికి తిరిగి వెళ్ళిపోతుంటే మా యింట్లోవారు వారికి చీరలు, రవికెలు, తాంబూలం, పళ్లు ఇచ్చి, వారిని సమ్మానించారు. వారు వాటిని పుచ్చుకొంటూ కళ్ళలో నీరు పెట్టుకొన్నారు. ఇది నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. ఒకప్రక్క నన్ను వారించారు. మరొకప్రక్క వారిని గౌరవిస్తున్నారు. ఈ ద్వంద్వ వైఖరి నాకు అర్థం కాలేదు. తర్వాత మా ఆయాని అడిగితే, "మనం కళలను అభిమానించి పోషించాలే కాని వాటిని ఆరాధించకూడదు' అని ఆమె చెప్పింది. ఆ వయస్సులో, కళలను ఆరాధించడానికి, అభిమానించడానికి మధ్యగల తేడా ఏమిటో నాకు అర్థంకాలేదు.

ఆ రోజుల్లో పెద్దాపురం మేళానికి మంచి పేరుండేది. పెద్దాపురం ప్రసిద్ధి చెందిన క్షత్రియ సంస్థానం. ఈ సంస్థానాన్ని అయిదుగురు తిమ్మ జగపతులు పాలించారు. 1. ముసలి తిమ్మజగపతి మహారాజువారు పెద్దాపురం సంస్థానానికి మూల పురుషుడు. 2. రాజా జగపతి. 3. తిమ్మ జగపతి. ఈయనకు ''చతుర్భుజ తిమ్మ జగపతి'' అన్న బిరుదు ఉండేది. 4. రాజా జగపతి. 5. తిమ్మ జగపతి ఈయనకు 'కళా తిమ్మ జగపతి' అని బిరుదు ఉండేది. ఈయన గొప్ప కళాపోషకుడు. అన్ని కళలను పోషించాడు. ఈయనవల్లనే పెద్దాపురంలో సంగీత, నాట్యకళలు విశేషంగా అభివృద్ధి చెందాయి.

పిఠాపురం వెలమ సంస్థానం. పెద్దాపురం క్షత్రియ సంస్థానం. పిఠాపురం పెద్దాపురం ఇరుగుపొరుగున ఉన్నాయి. పెద్దాపుర సంస్థానం విచ్ఛిన్నమైన తర్వాత ఆ రాజులు తుని వెళ్ళి అక్కడొక సంస్థానాన్ని నెలకొల్పుకొన్నారు. అయినా, పెద్దాపురంలో నృత్యకళ అంతం కాలేదు. నృత్య కళను పిఠాపురంలో పోషించిన చివరి ప్రభువు రావు గంగాధర రామారావు గారు. వీరి తర్వాత గద్దెనెక్కిన రావు సూర్యరావుగారు సంస్కార ప్రియులు, బ్రహ్మ సమాజం సభ్యులు. నృత్యకళకు వీరి పోషణ కరువైనా కుంతి మాధవుని సేవలో ఆగమ నృత్యపూజ, కర్నాటక కచ్చేరీ బాణి, పారిజాత కలాపబాణి కొనసాగుతూనే వచ్చాయి.

పెద్దాపురంలో యండమూరి వారి మేళం ఆ రోజుల్లో ఉండేది. ఈ మేళంలో ఏడుగురు అక్కచెల్లెళ్ళు ఉండేవారు. ఈ ఏడుగురు పుత్తడి బొమ్మలే. వీరు ఆటకొచ్చారని తెలిస్తే తండోపతండాలుగా ప్రజలు వచ్చేవారు. ఈ మేళంలో అదనంగా మరి ముగ్గురు నర్తకీమణు లుండేవారు. వీరికి ఇరుప్రక్కలా రెండు ఫిడేళ్ళు, కుడిప్రక్కన మృదంగం, వెనుక శ్రుతి పెట్టి, నాయకురాలు ఉండేవారు. తెల్లని వస్త్రాలు, తెల్లని మల్లెపూవులు, రవ్వల నగలతో గ్యాస్‌లైట్ల వెలుగులో ఈ నర్తకులు తళతళ మెరిసిపోయేవారు.

ఈ మేళం ఊరేగింపుగా ఊరంతా తిరిగేది. ఏయే స్థలాల్లో ఆడాలో ముందుగానే నిర్ణయించుకొనేవారు. స్థలాల్ని బట్టి ఆడవలసిన పాటను నాయకురాలు నిర్ణయించేది. ఎవరైనా ఒక పాటకు ఆడాలని కోరితే, ఆ విషయం నాయకురాలికి తెలియజేయవలసి యుండేది. సర్వసాధారణంగా ఊరేగింపులో చిన్న చిన్న పాటలు పాడి, తర్వాత గత్తు ఆడి ముగించేవారు.

ఊరేగింపుల్లో వీరు పాడి ఆడిన ఆటలు నాకు జ్ఞాపకమున్నంతవరకు తెలియజేస్తాను.

మేళంలోని వారందరూ వరుసగా నిల్చున తర్వాత అందులో ఎవరెవరు ఆడాలో కొందరు పెద్దలు నిర్ణయించేవారు. అప్పుడు వారు మువ్వలు ధరించి, మృదంగానికి, సభకు నమస్కరించి నిల్చునేవారు. మేళంలో అందరికంటే అందమైన అమ్మాయి వుంటే ఆమె అలిసినా ఊరేగింపు ఊరంతా తిరిగేవరకు ఆడవలసిందే. ప్రేక్షకులు ప్రతివారి కండ్లు ఆ జవ్వనిపై పడేవి. వినాయక ప్రార్థనతో ఆట ప్రారంభమయ్యేది. ప్రేక్షకులకు తగినట్టుగా పాటలు తేలికగా, చవుకగా ఉండేవి.

ఉదాహరణకు :

1. చిన్నతనమున చనిన స్నేహము - మరచనుగా నా ప్రాణ ప్రియుడు
2. చెలియరో నా చెలువుడేల చెంతకు రాడాయెనే.
   ఏమి సేతు, ఎటుల సైతు ఏల రాడే గోపాలుడు.
3. రాణి వయ్యారి మారుని కటారి పక్క సాంగా
4. ఎంత జేసితివే అలవాని కొంప తీసితివే
   నా సవతి కొంప తీసితివే (సవతుల కయ్యం)
5. చూడు పిన్నమ్మ పాడు పిల్లడు
6. మగవారి షోకు జూడ మనకెంత విచిత్రమగునే
   వంచలంతరించగానే పంట్లాము లొచ్చె మీకు
   సూటు, బూటు, హాటులంట! నీటైన క్రాపులంట
7. బెంగాలీ బాబూ!
8. ఒంటికొయ్యపడవమీద ముక్కుపుడక పంపినాను
   అందిందో, అందలేదో జాబైన వ్రాసినావ! లెటరైన వ్రాసినావ?
9. పచ్చబొట్టు పొడిపించు బావా
10. ఈత పండ్లపాట; బత్తాయి పండ్లపాట.

రాను రాను ఈ విధంగా పాటల స్థాయి దిగజారిపోవడంతో వారూ నాట్యం మానేసి, యింట్లో కూర్చున్నారు. తర్వాత దేవదాసీ చట్టం వచ్చింది. ఆ తరావిత కళావంతుల సంస్కారోద్యమం రావడంతో ఈ కళ పూర్తిగా నశించింది. ఆనాటి శిక్షణ సాంప్రదాయిక రహస్యాలు ఆనాటి గురువుల వద్దనే ఉండిపోయాయి.

నాలో కళాజ్యోతి వెలుగుతున్న సమయంలో గృహ సంబంధిత విషయాలకు నేను మదరాసు వెళ్ళవలసివచ్చింది. అక్కడ నాకు చాలా స్వేచ్ఛ లభించింది వందనల్లూరు శ్రీ మీనాక్షి సుందరంగారిని కలిశాను. ఆ కాలంలో వారిని మించిన నాట్యాచార్యులు లేరని ప్రతీతి. వారివద్ద నాట్య శిక్షణకు చేరాను.

క్రమంగా నాలో ఒక ''విప్లవ రామకృష్ణ'' రూపు దిద్దుకోవడం ప్రారంభించాడు. నేను అప్పుడు రామకృష్ణ మిషన్లో చేరాను. నేను చదువులో ప్రథముడుగా ఉంటూ ఉండడం వల్ల నా యితర వ్యాసాంగాల గురించి ఎవరూ అంతగా పట్టించుకొనలేదు. అంతేకాదు, నేను కోరినంత ధనం మా నాన్నగారు ఇచ్చేవారు. ఆ డబ్బులు నేను నృత్య సంబంధమైన వాటికింద ఖర్చు పెట్టేవాణ్ణి. నా పెట్టె నిండా డబ్బు ఉండేది.

నాట్య విద్యను నాకు సంపూర్ణంగా నేర్పించాలని మా అన్నగారు ఎన్నో ప్రయత్నాలు చేశారు. ఎందరెందరో పెద్దల్ని కలుసుకొన్నారు. నా వాంఛలు ఫలించేలోగా నా ప్రాణం, నా జీవం అయిన నా అన్నగారు గతించారు. అది నాకొక గొప్ప పెద్ద దెబ్బ. ఒడ్డున పడిన చేపలా అయింది నా జీవితం.

నా సోదరుని మరణంతో నా కష్టాలు ప్రారంభమైనాయి. అంతవరకు నాకు కావలసినవన్నీ సమకూర్చే నా సోదరుడు ఇంక లేడు. నేను ఒంటరివాణ్ణయ్యాను. అంతవరకు నా ఊహా ప్రపంచం వేరు, వాస్తవ ప్రపంచం వేరు, ఈ ప్రపంచం నాకు తెలియంది. దీని విలువలు వేరు. నాకింక మదరాసులో ఉండబుద్ధి కాలేదు. కారణం నాకే తెలియదు. రామకృష్ణ మిషన్ వదిలి పెట్టాను. అక్కడి వారు నన్నుండమని నచ్చచెప్పారు. నేను వినలేదు. వారు నిరాశ చెందారు. జీవితం శాంతిరహితమయింది. మదరాసు నుండి ఆల్మోరా వెళ్లాను. ఆ మంచుకొండలు, మేఘమాలలు, సూర్యకాంతితో మెరిసే ఆ వెండికొండలు చూస్తూ కూర్చోన్నదంలో నాకు కొంత మనశ్శాంతి లభించింది, ఆనందం కలిగింది. అక్కడున్న ఒక ఆశ్రమానికి వెళ్లాను. అక్కడున్న స్వామీజీ నా మనోవేదన్ని అర్థం చేసుకొన్నారు. తన దగ్గర ఉండమన్నారు.

ఉదయం, సాయంత్రం ఆ వెండికొండలను చూస్తూంటే 'ఈ పర్వతాలలోనే గదా శివుడు సంధ్యాతాండవమాడేడు! ఆనందంగా ఇక్కడే గదా శివుడు నర్తించాడు!' అని ఊహించుకొని, కన్నులు మూసుకొని, ఆ దృశ్యాలను నా మనస్సులో సృష్టించుకొనేవాణ్ణి. ఆ తాండవమూర్తిని మనసులో చూసి ప్రార్థిస్తూంటే ఆనందాశ్రువులు జల జలా నా కన్నులలో నుండి కారిపోయేవి. కాని, శివసాక్షాత్కారం లభించలేదని నాలో నేను పరితపించేవాణ్ణి. స్వామీజీ నాలోని మార్పులు గమనిస్తూండేవాడు. ఆయన తీరిక సమయాలలో నాకు శివపురాణ గాథలను వినిపిస్తూండేవాడు.



నృత్యనికేతన్ స్థాపకులు
డాక్టర్ నటరాజ రామకృష్ణ.

ఒకనాడు సూర్యోదయం అవుతూంది. మంచు బిందువులు పడి అక్కడి గులాబీలు వింత శోభతో మెరిసిపోతున్నాయి. ప్రకృతి ప్రశాంతం ఉంది. సూర్యకిరణాలు మేఘాలను చీల్చుకొని రావాలని ప్రయత్నిస్తున్నాయి. ఆ సమయంలో ఆ స్వామీజీ వచ్చి నన్ను గులాబీ ఉద్యానవనంలోకి తీసికొని వెళ్ళాడు. "రామూ! చూశావా, ఈ గులాబితోట ఎంత శోభాయమానంగా ఉందో! ఎన్నో గులాబీలు విరియబూసి, తమ సౌరభాన్ని వెదచల్లి లోకానికి ఆందాన్ని కలుగ జేస్తున్నాయి. వాటికి స్వార్థం లేదు. అవి లోకం కోసమే పూస్తాయి. లోకానికి ఆనందం చేకూర్చడానికే ప్రకృతి మాత వివిధ రంగుల్లో ఆ గులాబీలను సృష్టించింది. కాని, స్వార్థ

మానవుడు వాటిని కోస్తాడు. వాసన చూస్తాడు, సంతోషిస్తాడు, రేఖలు వాడగానే వాటిని పారేస్తాడు ఆ గులాబీ అతనికి ఆనందాన్నిచ్చింది. మరి అతడు ఆ గులాబీకి ఏం ఇచ్చాడు? ఏం లేదు. గులాబీ పువ్వును కోసేటప్పుడు ఆ చెట్టుకు కొంత బాధ కలుగుతుందన్న విషయాన్ని మానవుడు గ్రహించడానికే గులాబీ చెట్లకు ముళ్ళు ఉన్నాయేమో!" ఇలా ఆయన కబుర్లు చెబుతూ నన్ను తోటమధ్యకు ఆయన తీసికొనివెళ్ళాడు.

ఆయన నన్ను చూస్తూ "రాముా! ఒక పువ్వును కోసి తీసికొనిరా" అన్నాడు. నేను తోటంతా కలియజూసి నాకు నచ్చిన ఒక అందమైన పర్షియా గులాబీ పువ్వును కోసి, తీసికొని వచ్చాను. ఆయన దాన్ని చూస్తూ "రాముా! చాలా అందమైన పూవును కోసి తెచ్చావు. నీకు నచ్చిన దాన్ని కోశావు. అలాగే భగవంతుడు తనకు నచ్చిన వానిని ఎన్నుకొంటాడు. నీ అన్న ఆయనకు చాలా నచ్చాడు, అందుకే ఆయన్ని దేవుడు తీసికొని వెళ్ళాడు. కనుక విచారించకు. నీ జీవితాశయాన్ని నీవు నెరవేర్చుకో. అందుకు శ్రమించు" అంటూ ఆయన నా చేయి పట్టుకొని ఆశ్రమంలోకి తీసికొని వచ్చారు. ఆయన మాటలవల్ల నాకు కొంత ఊరట కలిగింది. మరికొన్ని రోజులు అక్కడ ఉండి, తిరిగి వచ్చాను. మళ్ళీ నేను ఆల్మోరా వెళ్ళలేదు. ఆ యాదర్శమూర్తి, ఆ మార్గదర్శకుడు జీవించియున్నాడో, లేడో నాకు తెలియదు.

మేళమంటే ఏమిటో ఇంతకుముందు వివరించాను. అసలు మేళమంటే నాట్యమాడే గణికలు, మృదంగం, తాళాలు, శ్రుతి, తంత్రీ వాయిద్యాలు, గాలి వాయిద్యాలు వాయించేవారు అందరూ కలిసిన సమ్మేళనం మేళం. దీనినే తూర్పు దీవులవారు "గమ్మేళనం" అంటారు. పూర్వం శ్రుతికి బేగ్ పైప్ (తిత్తి) ఉండేది. దీని తర్వాత పాముల వాడి బూరా వచ్చింది. (తంజావూర్, మహారాష్ట్ర రాజుల కాలంనాటి కొన్ని వర్ణచిత్రాలను చూస్తే ఈ విషయం తెలుస్తుంది.) అటుపైని హార్మోనియం వచ్చింది. తర్వాత, తర్వాత తంబూరా, నేటి కాలంలో ఎలక్ట్రానిక్ శ్రుతి పెట్టె వచ్చాయి. వీరందరూ, ఆడే నర్తకి వెనుక నిలబడి వాయిస్తూ, నాట్యానికి అనుగుణంగా ఆమెతోబాటు ముందు వెనుకలకు వెళ్ళేవారు.

ఊరేగింపు ముగిసిన తర్వాత పెళ్ళిపెద్దలు, ఆహ్వానితులు, పండితులు, కవులు మొదలైనవారు పెళ్ళి పందిట్లో ఆదిదేవుని పెండ్లిగాని, మానవులు పెండ్లిగాని సమావేశమైయుండగా గణికలు తమ నాట్యవిద్యను ప్రదర్శించేవారు. ఊరేగింపులోని గణికులు తెల్లనిదుస్తులు ధరించేవారు. మేజువాణీ గణికులు రంగురంగుల బనారసుచీర పట్టుచీరలు ధరించేవారు బనారసు పట్టుచీర ఆ కాలంలో తప్పనిసరి. పెండ్లిళ్లలో పెండ్లికూతురుకు విధిగా ఒక బనారసు చీరె పెట్టేవారు. ఎన్ని బనారసు చీరలుంటే అంత ఘనత - కొంత వెండిజరీ తూకంవేసి బనారసు పంపి-నేయించి ప్రత్యేకంగా తెప్పించేవారు. అదొక ఆచారం. ఆనందం - నేటి కాలంలో కంచిపట్టుచీర కొన్నట్లు. వెంకటగిరిచీరె కొందరు ధనికుల యిండ్లవారు యిష్టపడతారు. బనారసు పట్టుచీరెలు సెంటువాసనలతో ఆ సభ ఘుమఘుమలాడేది. నాట్యగణికలందరూ వరుసగా నిల్చొనేవారు. అప్పుడు వారి నాయకురాలు గజ్జెలు ధరించి, మేళప్రాప్తి (గణపతి వందనం, గురువందనం మొదలైన వాటిని) చేసేది. ఆ తర్వాత తనకు వచ్చిన ఒక పాటను పాడి, ఆ తర్వాత నాట్య ప్రదర్శనాన్ని నిర్వహించేది. అయితే, నాట్య ప్రదర్శన ఆ యా ప్రేక్షకుల అభిరుచులనుబట్టి సాగేది. కొందరు శృంగార నాయికాపద వర్ణంతో ప్రారంభిస్తే మరికొందరు శ్లోకాలతో ప్రారంభించేవారు. వేరొకరు వైరాగ్య తత్వాలతో ప్రారంభిస్తే- ఇంకొకరు రక్తితో, మరికొందరు విరక్తితో ప్రారంభించేవారు. ఉదాహరణకు—

"ఏమి తెలిసినను మోహిస్తిని. దేహ మెలాంటిదని
ఆలోచిస్తివి.
స్వామి మోహమేగాని, సారమింతయులేదు
మోము, చన్ను, యోని, మలము మాంసము
చీము, నెత్తురు, పేగులెముకలు, రోమములు,
మల, మూత్ర, పురుగులు, స్థాయని నిజమెరిగి
మోహము త్రోసి త్రోయక నిలువు నిలువుము ॥ఏమి॥

ఇలా ఈ శరీరంవట్టి మాంసంముద్ద అని చెబుతూవిరక్తి గీతాన్ని కొందరు అభినయించేవారు. ఆ తర్వాత శ్లోకాలలో నుండి శృంగారం వర్ణించేది. ఎక్కువగా పుష్పబాణ విలాసంలో నుండి ఈ శ్లోకాలను ఎన్నుకొనేవారు. ఉదాహరణకు "కాంతో యాస్యతి దూరదేశ మితిమే చింతావరంజాయతే." దీని తర్వాత ప్రోషిత నాయికగల క్షేత్రయ పదాన్ని - "భామరో,ఊరికి బయలుదేరేవేళ ప్రేమమీర నా సామి పిలిచి జెప్పినమాట" వంటి పదాలను అభినయించేవారు.

ఒక్కొక్కప్పుడు పండితులు కోరితే, "మాతః కేశి గృహం నజాతు శయనం" అనే శ్లోకాన్ని అభినయించేవారు. ఒక నూతన వధువు తొలిరాత్రి భర్తతో గడిపింది. మరునాడి సాయంత్రం తల్లి పక్క ముస్తాబు చేస్తూంటే "అమ్మా! నేను రాత్రికి పడకగదికి వెళ్ళనే" అంది. తల్లి ఆశ్చర్యపోయి "ఎందుకే ముద్దులగుమ్మా! నా బంగారు బొమ్మా!" అని అడుగుతుంది "నీ అల్లుడున్నాడే, చూడ్డానికి ఎంతో సౌమ్యుడు గాని, ఏమేమో చేస్తున్నాడే!" అని అమాయకంగా అంటుంది కూతురు.

అనుభవజ్ఞురాలైన ఆ తల్లి తన మొదటి రాత్రి ముచ్చట్లు గుర్తుకుతెచ్చుకొని, వక్కున నవ్వుకొని తన కుమార్తెకు జీవితరహస్యాలను మెత్తగా బోధిస్తుంది. నాయిక ముగ్ధ, అభినయించే నాయకురాలు ప్రౌఢ లేక ఒక్కొక్క సమయంలో "లోల" అయినా, ఆ నాయకురాలు వదహారేండ్ల లేజవ్వని రూపమెత్తేది.

శ్లోకాల తర్వాత నాయకురాలు పదాల నభినయించేది. "సుదతులందరు నీకు శోభనమని యంటే అది ఏమో అనుకొంటినే" వంటి పదాలను అభినయించేది. ఇందులోని నాయిక ఏమీ తెలియని అమాకురాలైన ముగ్ధ.

ఆ తర్వాత మేళంలోచిన్నగణికలు అభినయించేవారు. మేజువాణీలో ఆటకంటే అభినయానికే ఎక్కువ ప్రాముఖ్యముండేది. ఆ పాటలు, పదాలు, స్వీయ, పరకీయ, సామాన్య నాయికలకు, అష్టవిధ నాయిక అవస్థలకు చెందిన స్వాధీనపతిక, ఖండిత,కలహాంతరిత, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, వాసకసజ్జిక, అభిసారిక, ప్రోషితపతిక నాయికలకు సంబంధించి యుండేవి.

అభినయంలో స్వీయ, సామాన్య నాయికలకన్నా పరకీయ నాయికకే ఎక్కువ ప్రాముఖ్యముంది. ఎందువల్లనంటే-అభినయించే అవకాశం ఎక్కువగా ఉంటుంది.

"ప్రసవమైతిని గోపాల!
వంట పసలేనిదే తరచనేల
కుశలము నీదయా రసముచేతను
మగ శిశు వుదయించెను
శశిగాత్ర సన్మిత్ర
వశము గాదుర నీతో నిప్పుడు
కుసుమశర క్రీడలను సలుపుట
కసలు శిశువుకే పాలు చాలవు
వశులగావరితనము మానుమ॥
పిప్ప లింగువ తినుటవల్ల
చాల నొప్పి చెందెను దేహమెల్ల
కప్పను మొక్కించుటకు మా వారంత
నను వెదకుచుందురు
నళినదళనేత్ర -
చెప్పగూడ దిదాడ మర్మము
విప్పి చెప్పితే చప్పుదనమగు
ఒప్పులుగా భావించి మా వరకుప్ప నాపై
తప్పు లెంచకు॥"

ఈ వరకీయ పదం క్షేత్రయ్యది కాదు. బహు కొద్దిమందికే ఈ పదం తెలిసియుండేది. నాకు మా గురువుగారు రెండు చరణాలు మాత్రమే చెప్పారు. మూడవ చరణం చెప్పలేదు. ఎందుకో నాకు తెలియదు. పూజ్య గురువులను అడిగే ధైర్యం నాకు లేకపోయింది.

మరొక ప్రసూతి పదం, "వచ్చి ఒడలు దాననురా!" ఇది క్షేత్రయ్య పదం. ఇవేకాక కృష్ణకర్ణామృతం, శృంగార మంజరి మొదలైన గ్రంథాలలోని శ్లోకాలను ప్రేక్షకుల అభిరుచుల ననుసరించి గణికలు ప్రదర్శించేవారు.

కొందరి కోరికపైని మొగ్గలు వేసి కంటిరెప్పతో సూదిని తీయడం, నొసటికి కాసును అద్ది తీయడంవంటి కొన్ని విద్యలను ప్రదర్శించేవారు చిన్న చెక్క పీటపైని

అద్దం, పళ్లెంలో నీళ్ళుపోసి, పళ్లెం అంచులపైని నిల్చుని, నీళ్ళు తొణక్కుండా, పళ్ళాన్ని జరుపుతూ అద్దం, మోడి - పాము ఆట, దశావతారాలు, పతంగి ఆట, నెమలి ఆట మొదలైనవాటితో చౌచౌ నృత్యం చేసేవారు. అప్పటికి అర్ధ రాత్రి దాటిపోయేది.

కచ్చేరి కైశికీ వృత్తి ప్రాధాన్యం గలది. శృంగార, హాస్య, అద్భుత, కరుణ రసాలను కచ్చేరి ఆటలో ఒప్పించాలి.

పారిజాత కలాపాలను ఉభయగోదావరి జిల్లాలలో స్త్రీ నర్తకులు ఎక్కువగా ప్రదర్శించేవారు. వీటిని ఇతర ప్రాంతాల స్త్రీలు ఆడగా నేను చూడలేదు. కొందరు ఆడేవా రంటారు.

నా పరిశోధలో నేను అనుభవపూర్వకంగా తెలుసుకొన్న, గ్రహించిన కొన్ని ముఖ్య విషయాలు:

గంజాం జిల్లాలోని బరంపురం మొదలుకొని కోస్తా ప్రాంతంలోని నెల్లూరు వరకు, తెలంగాణా ప్రాంతంలోని ధర్మపురి వరకు గల నృత్యకళను ఈ విధంగా విభజించవచ్చును-

సంస్థానా లుండిన చోట్ల నృత్త, నృత్య అభినయాలు సమపాళ్ళలో అభివృద్ధి చెందాయి. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ జిల్లాలలోని నాట్యకళ ఒకేరకంగా ఉండేది. తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాలలో సాత్వికభావ ప్రకటనకు ఎక్కువ ప్రాముఖ్య ముండేది. ఆటకు ప్రాముఖ్యం తక్కువ. పారిజాతాలలో ఈ రీతి పెంపొందింది. ఈ జిల్లాలలో కూర్చుని అభినయించడం ఒక ప్రత్యేకత. వర్ణాలు, పెద్ద వర్ణాలు, పద వర్ణాలను మూడు కాలాలలో పాడుతూ అభినయించడం చాలా ముఖ్యం కాని, స్వరాలకు అడ్డం ఇక్కడ అంత ముఖ్యం కాదు.

రాయలసీమలో ఒక ప్రత్యేక తీరు ఉండేది. మేళం ముగిసిన తర్వాత నట్టువ మేళంలోని వారందరూ కూర్చునేవారు. నాయకురాలు తన సంగీత ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తూ కొంతసేపు గానం చేసేది. ఆ తర్వాత ఒకరు గాని, ఇద్దరు గాని గణికలు లేచి నిలబడి పాడుతూ అభినయించేవారు. ప్రతి చరణాన్ని ఆడి, ముగించేవారు.

తెలంగాణాలోని గణికలు తెలుగు పాటల్నే కాక హిందీ, మరాఠీ ట్రుమ్రీలను, గజళ్ళను, టప్పాలు మొదలైన గీతాలను ఆడేవారు. ఆలయ నృత్యం గురించి వ్రాసేటప్పుడు వీరి ఆటను వివరిస్తాను.

ఇంతవరకు పండితులు, కవులు, పెద్దలు, సామాన్యులు మొదలైన వారి సమక్షంలో ప్రదర్శింపబడిన ఆట గురించి మాత్రం తెలియజేశాను. రాజాస్థానాలు, ఆలయాలలో ప్రదర్శింపబడిన నృత్యకళ గురించి తర్వాత తెలియజేస్తాను.

ఇప్పుడు ఒక సామాన్యమైన పదానికి ఒక అసామాన్యమైన అభినయాన్ని తెలియజేస్తాను.

"వరవేణు గోపాల చలమేల జేసేవు?
సరగున రావేలరా?
నిన్న రాతిరి చిన్నె లెన్నో వింతగ జేసి,
కన్ను మూసిన యంత కనుపింపవైతివి
వన్నెకాడ నీదు చేతలు ఎన్నియో వివరింపజాల
మొన్న రాతిరి నీవు కోరిన చిన్నది వినిపించిపోయెను"

ఇది పదమో, జావళీయో కాని, పాట మాత్రం చాలా తేలికైనది. అయితే, దీనిని కనీసం అర్ధగంటైనా అభినయించ వలసియుంటుంది.

"నిన్న రాతిరి చిన్నె లెన్నో వింతగ జేసి
నీదు చేతలు ఎన్నియో వివరింపజాల
మొన్న రాతిరి నీవు కోరిన చిన్నది వినిపించిపోయెను"

నెరవు చేయడానికి పైపదాలు చాలా అనుకూలమైనవి.

చిన్నెలు : కచాలింగనం, కుచాలింగనం,
దంతక్షతాలు, నఖక్షతాలు, ఆలింగనం.
(స్పందన, ప్రతిస్పందన రీతుల్లో.)
ఎన్నో వింతలు - అద్భుతం
చేతలు - చుంబనాదులు, చౌసీతి బంధనాలు
రతి విశేషాలు.

వీటన్నింటిని హస్తాలతో, భంగిమలతో, సాత్విక సంచారులతో అభినయిస్తూపోతే చాలా పెద్ద గ్రంథమౌతుంది. పదార్థాభినయం, వాక్యాభినయం, అర్థాభినయం, భావాభి

నయం, చిత్రాభినయం - ఇలా ఎన్నో రీతుల్లో అభినయించవచ్చు.

ఈ యభినయాన్ని మా గురువుగారు నాకు నేర్పి, ఒక సూచన యిచ్చారు:

"బాబూ! మా కాలంలో ఈ యభినయం, ఈ హస్తాలు సరిపోయాయి. పండితులు, శాస్త్రవేత్తలు ప్రేక్షకులు. అభినయించినవారు వృత్తి కళాకారులు గనుక ఇబ్బంది ఉండేది కాదు. నేడి సంఘం మారింది, సాంఘిక విలువలు మారేయి, సమాజ దృక్పథం మారింది. కులవృత్తిగా నృత్య గీతాలను అభినయించినవారు విరమించి, ఇళ్ళలో కూర్చున్నారు. నేడు నవ సమాజంలో నూతన వాతావరణం ఏర్పడి, కొత్త మార్పులు వచ్చాయి. నీకు నేర్పిన ఈ యభినయాన్ని నీవు నేడి పిల్లలకు నేర్పితే వారి తల్లిదండ్రులు హర్షించరు. కనుక, నీవు పిల్లలకు నేర్పేటప్పుడు కొన్ని మార్పులు చేసుకొనాలి. ఈ మార్పులు చేసి, చెప్పకపోతే ఈ యభినయ కళ సజీవంగా ఉండదు, నశించిపోతుంది."

ఈ సలహా నాకే కాదు ప్రతి కళాకారునికి సరిపోతుంది. ఇది నిత్య సత్యం. మార్పులంటే నేల విడచి సాము చేయడం కాదు. సాంప్రదాయిక విలువలను గ్రహించి, సంప్రదాయాన్ని విడిచిపెట్టకుండా, కాలానుగుణమైన మార్పులు తేవడం అవసరం.

## నే నెరిగిన కొందరు కవులు

### 1. శ్రీ వానమామలై వరదాచార్యులుగారు :

వీరు మహాభక్తులు, గొప్ప కవి. బమ్మెర పోతన భాగవతాన్ని తెలుగులో వ్రాసి మనకు అందించారు. మనకిది పారాయణ గ్రంథముగుండి. అయితే, వరదాచార్యులుగారు పోతన కావ్యాన్ని రచించి ధన్యులయ్యారు. ఈ కావ్యంలో వరదాచార్యులుగారు భోగినీ నృత్యవిన్యాసాల గురించి వంద పద్యాలకు మించి వ్రాశారు.

ఈ రచనంతా భాగవత పద్ధతిలో నడిచింది. ఈ రచనకు వీరికి ప్రేరణ ఏమిటంటే, ప్రదర్శనం గురించి వీరి ఊరు వెళ్ళిన కూచిపూడి భాగవతులు వీరి యింట నెలల తరబడి విడిదియుండేవారు. ఆ భాగవతుల ప్రదర్శనలు, ఒద్దికలు, అభ్యాసక్రమం మొదలైనవాటిని చేరువనుండి పరిశీలించే అవకాశం ఆచార్యులవారికి కలిగింది. నర్తకుడు నిలబడే విధం మొదలుకొని, కనులు, కనుబొమలు, కనురెప్పలు కదిలించే విధంవరకూ అన్నింటిని సూక్ష్మంగా పరిశీలించే అవకాశంకూడా వీరికి కలిగింది. అందుకే వీరు తమ కావ్యంలో, ఇంతవరకు ఏ కవీ వర్ణించని విధంగా భోగినీ నృత్య విన్యాసాలను వర్ణించారు.

వీరి కావ్యం ప్రచురింపబడిన తర్వాత నా మిత్రుడు శ్రీ రామచంద్రాచారి ద్వారా వీరి పరిచయం నాకు కలిగింది. వీరి కవిత్వం వినే భాగ్యం నాకు కలిగింది. వీరి గ్రంథం అపూర్వ రచన. అయితే, వీరి నాట్య వర్ణన రాచనగరాల్లో రాజాస్థానాలలో ప్రదర్శించే తీరుకు సరిగాలేదు. ఈ విషయాన్ని వారి దృష్టికి తెచ్చాను. కూచిపూడివారి ప్రభావం వల్ల ఈ రచన చేసినట్లు చెప్పి, నా అభిప్రాయాన్ని సద్భావంతో స్వీకరించారు. నాట్యం చేసే ప్రతివారు శ్రీ వరదాచార్యులవారి 'పోతన' కావ్యం చదవాలి.

### 2. శ్రీ పుటపర్తి నారాయణాచార్యులుగారు :

ఈయ నొక యుగపురుషుడు. పలు భాషల్లో కవిత్వం చెప్పిన శక్తి సంపన్నుడు. బహుముఖ ప్రజ్ఞావంతుడు. సంగీతం, నాట్యం, అభినయం, కొనుగోలు మొదలైనవాటిని ప్రత్యేకంగా అభ్యసించిన మేధా సంపన్నుడు. ఈయన రచించిన 'శివతాండవం' ఒక అపూర్వ రచన. ఈ రచనను సరిగా అర్థం చేసికొనాలంటే ముందుగా అభినయ దర్పణం, నాట్యశాస్త్రం అధ్యయనం చేయక తప్పదు. ఈ రచనను చదువుతూంటే పరమ శివుడు నర్తనమాడుతున్నట్టే భ్రమ కలుగుతుంది. ఈయన మంచి స్నేహపాత్రులు. నా అదృష్టం కొద్దీ వీరితో కొన్ని రోజులు తాండవం గురించి చర్చించే అవకాశం నాకు కలిగింది.

### 3. డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు :

నేను హైదరాబాద్ వచ్చిన కొత్త రోజుల్లో నృత్య కళను ప్రచారం చేస్తూ అనేకచోట్ల అభినయ పూర్వక ఉపన్యాసాలు ఇచ్చాను. ఇవి పండితులను, పామరులనుగూడ

చాలా ఆకర్షించాయి. సమ్మోహితులను చేశాయి. ఆ సమయంలో డాక్టర్ నారాయణరెడ్డి గారు "కర్పూర వసంత రాయలు" కావ్యాన్ని వ్రాయ తలపెట్టారు. ఆ కావ్యంలో లకుమ నర్తనం చాలా ముఖ్యమైంది. ఆస్థాన నర్తన రీతుల గురించి వివరంగా తెలుసుకొనడానికి ఆయన ఒక నెల రోజులు నాతో చర్చించారు.

నర్తకి సభలో ప్రవేశించే విధం మొదలుకొని, పుష్పాంజలి, అడ్డితం, కైవారం వరకు ఎలా చేసేదో ప్రాయోగికంగా చేసి, వారికి చూపించాను. అప్పటికి కొద్ది కాలంముందు నేను బండారా సంస్థానంలో ఆస్థాన నర్తకుడిగా నుండినందువల్ల ఆ రాచ మర్యాదలన్నీ క్షుణ్ణంగా తెలుసు కనుక వారికి అనుభవపూర్వకంగా చెప్పగలిగాను. ఆ నెల రోజులు దివ్యానుభూతితో కళాలోకంలో విహరించాం.

## 4. శ్రీ నల్లతీగెల శ్రీనివాసాచారి గారు

వీరి కవిత్వం శ్రీ వేంకటేశ్వర స్వామి వారి వర ప్రసాదం. ఆంధ్ర గీర్వాణ భాషలలో ఉత్తమ పండితులు. అమృత హృదయులు. "తాండవ మదనుడు" అనే నృత్య కావ్యాన్ని వీరు రచించారు. మదనుని పూల బాణాలు ఎంత మెత్తగా ఉంటాయో వీరి కవిత్వ మంత మృదు మధురంగా ఉంటుంది. మదనుని బాణాల ప్రభావం మన మీద ఎలా ఉంటుందో, అలాగే వీరి కవితా ప్రభావం మన మీద కలుగుతుంది. ఆలయ ఆగమ నర్తన విశేషాలు గురించి వీరికి తెలుసు. ఏ యే దేవతలకు ఏ యే సమయాలలో ఏ యే నాట్యాన్ని ప్రదర్శించాలో వీరు వీరి కావ్యాలలో వర్ణించారు. వారి కంటే నేను వయస్సులో చిన్నవాణ్ణి అయినా, నా మీద వారికగల అభిమానంకొద్దీ ఆ కావ్యాన్ని నాకు సమర్పించారు. నా జన్మ సార్థకమయింది.

## 5. శ్రీ మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యం గారు

సంగీత, నాట్య, అభినయ శాస్త్రాలలోను, కథాకాలక్షేపంలోను, సాహిత్యంలోను, కవిత్వంలోనూ నిష్ణాతులు శ్రీ మైనంపాటి వంశీయులు. అలాంటి వంశంలో జన్మించారు శ్రీ వేంకట సుబ్రహ్మణ్యంగారు. వీరు వ్రాసిన 'శ్రీకృష్ణ తాండవం' అందరూ- ముఖ్యంగా నాట్య కళాకారులు చదవవలసిన ఉత్తమ కావ్యం. భరత శాస్త్రాన్ని పూర్తిగా అధ్యయనం చేసిన ఈ కవిగారు కాళీయుని పడగలపైన నర్తన మాడిన బాలకృష్ణుని కాలి యందియలను కావ్యమంతట పలికించారు. వీరి కవిత ఎంత మృదుమధురమైందో దాని లోని భావం అంత లోతైంది, అంత వికాసవంతమైంది. వీరి కావ్యాన్ని చదివి, అర్థం చేసుకొంటే, భరతుని నాట్య శాస్త్రం అవగతమైపోతుంది.

వీరి ఈ గ్రంథానికి కవిసమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ గారు ఉపోద్ఘాతం వ్రాయడం సముచితమైంది. దానినిగూడ చదవడం చాలా ముఖ్యం.

విశ్వనాథవారు కూచిపూడి నాట్యశైలినేగాక కాకరపర్రువారి, మైనంపాటివారి నాట్య రీతులను గురించిగూడ ఇందులో ముచ్చటించారు.

మైనంపాటివారి లాస్యబాణీని అభ్యసించిన నర్తకి ఒకామెను నేను ఒకసారి నా పర్యటనలో కలుసుకొన్నాను. కాని, అప్పటికే ఆమె బహు వయోవృద్ధురాలైనందున, నృత్యం చేసి చాల కాలమైనందున, ఆమెకు నాట్యం జ్ఞాపకం లేకపోయినందున ఆమె నాట్యాన్ని చూసే అదృష్టం నాకు లేకపోయింది.

కాకరపర్రు ఒక అగ్రహారం. అక్కడి బ్రాహ్మణులు ఎందరో గణికలకు నాట్యం నేర్పారు. అందువల్ల కాకరపర్రు వారి నాట్యబాణీ నేటికీ ఉభయ గోదావరి జిల్లాలలో ప్రచారంలో ఉంది.

ఆరామ ద్రావిళ్ళు, పూరూరు ద్రావిళ్ళు, పేరూరు ద్రావిళ్ళు, తుమ్మగుంటవారు మొదలైన అనేకమంది ద్రావిడ కుటుంబాలవారు కొందరు ఉభయ గోదావరి జిల్లాలలోని గణికలకు నాట్యాన్ని నేర్పేవారని విశ్వేశ్వర అగ్రహారానికి చెందిన కవి, పండితుడు, భరత కళా విమర్శకులు అయిన శ్రీ విశ్వనాథం సత్యనారాయణగారు నాకు తెలియజేశారు.

## కత్తులూ, కటార్లూ, దేవీనవరాత్రుళ్లూ, దసరా పూజలు

మాయింట్లో - రెండు పండుగలను ఎక్కువగా పాటించే వారు. ఒకటి దసరా, రెండవది పెద్ద పండుగ అంటే, సంక్రాంతి. మా పూర్వుల్లో ఒకరెవరో, ఏదో యుద్ధంలో పాల్గొన్నారట! అప్పటి అనేక రకాలైన కత్తులు, కటార్లు మా యింట్లో ఒరల్లో భద్రంగా ఉండేవి. వాటిని సంవత్సరానికి ఒకసారి బయటకు తీసి, శుభ్రపరచి, బొట్లు పెట్టి, 'దేవీ కలశం' వద్ద వాటి నుంచి, 'ఆయుధపూజ'ను బహునిష్ఠగా చేసేవారు. లోకంలో శృంగారమంటే ఏమిటో తెలియని ఒక అమాయక యువకుని, అతని తల్లిదండ్రుల సమ్మతితో తీసుకొనివచ్చి, అతనికి పసుపు బట్టలు కట్టించి, ప్రత్యేకంగా ఒక గదిలో ఉంచేవారు. అతడు నేలమీద పడుకొనడానికి ఒక చాప నిచ్చేవారు. పొద్దున్నా, సాయంత్రం పెరుగు అన్నం పెట్టేవారు. అతనికి ఆ గదిలో ఏ యిబ్బందీ లేకుండా తగిన ఏర్పాట్లు చేసేవారు. అత నుండిన గదిలో పూజలు చేసేవారు. అతన్ని దైవ సమానంగా భావించి, అతని పాదాలకు నమస్కరించేవారు. పదవ రోజున అతని దీక్ష ముగిసిన తర్వాత అతనికి, అతని తల్లిదండ్రులకు నూతన వస్త్రాలు, కొంత ధనం ఇచ్చి సత్కరించేవారు.

ఈ తొమ్మిది రోజులు - నవరాత్రుళ్ళు - మా యింట్లో వాళ్ళు అమ్మవార్ని పూజించేవారు. ఆంబకు తామరపువ్వంటే చాల ఇష్టమట. అందుకని ఆమెని తామర పూవులతో పూజించేవారు. తర్వాత పూజలు ముగియగానే ఆ యాయుధాల్ని మళ్లీ ఒరల్లో పెట్టి భద్రపరచేవారు.

మా వంశంలో వారికి దెబ్బలాటలంటే చాలా సరదా అనుకొంటాను. మా నాన్నగారు సహజంగా శాంత స్వభావులు



ప్రపంచ తెలుగు మహాసభల్లో ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారినుండి షీల్డును స్వీకరిస్తున్నప్పటి చిత్రం.

కాని, ఎవరితోనైనా తగాదా వస్తే ఉగ్రరూపం ధరించేవారు. కాని, అట్టి సందర్భాలు చాలా అరుదు. మా పినతండ్రి మాత్రం కత్తులు దూయడానికి ఎప్పుడు సంసిద్ధుడే

మా వంశస్తులు ధనవంతులు, సిరిసంపదలతో తుల తూగుతూ ఉండేవారు. మా బంధువులందరూ వీరివల్ల లాభం పొందినవారే గనుక అందరు వీరికి అణగిమణగి ఉండేవారు. తప్పు మాదే అయినా వారు మాకు భయపడేవారు.

మా నాన్నగారు రామకృష్ణ పరమహంస భక్తులు అయినా, తర్వాత శాంత స్వభావులుగా మారినా, పూర్వ రక్తం ఎక్కడికి పోతుంది? ఆ రక్తం నాలో గూడ ప్రవ హిస్తూంది. చిన్నప్పుడు నాకు దెబ్బలాటలంటే చాలా సరదాగా ఉండేది. బొగ్గవరపు జమీందార్లు మా కుటుంబ స్నేహితులు. వారి పిల్లలతో నేను ఆడుకొంటూ ఉండేవాణ్ణి. ఒకసారి ఆటలో నా చొక్కా చిరిగిపోయింది. మా మధ్య తగవు వచ్చింది. నేను తిన్నగా వారి పెద్ద లోగిలిలోకి వెళ్ళి, వాళ్ళ నాన్నగార్ని కలుసుకొని, "ఏమండీ! పిల్లల్ని ఇలాగేనా పెంచేది?" అని ఆయన్ని ప్రశ్నించి, నా చినిగిన చొక్కాను చూపించాను. ఆయన దాన్ని చూసి, నన్ను చూసి, ఆశ్చర్య పోయారు. "కొత్త చొక్కా కుట్టిస్తా బాబూ!" అని నన్ను బుజ్జగించి పంపించారు. ఆ సాయంత్రం మా చిన్నాన్నగారు కలిసినప్పుడు నా వాగ్దాటి గురించి చెప్పారట. మా పిన తండ్రి నన్ను పిలిచి, నావంక గుడ్లురిమి చూశారు. అంతే, నా లాగు తడిసిపోయింది. ఆయనంటే నాకు అంత భయంగా ఉండేది. ఆయన మాట్లాడకపోయినా ఆయ నెందుకు అలా చూశారో నాకు అర్థమయింది. నేను చెంపలు వేసుకొని, ఇంట్లోకి వెళ్ళిపోయాను. అలాంటి క్రమశిక్షణలో మమ్మల్ని పెంచారు.

మా నాన్నగారు, చిన్నాన్నగారు పెద్ద మీసాలు పెంచారు. వాటిని వారు మెలివేసేవారు కాని, వారికి నేను నాట్యం నేర్చుకొనడం నచ్చనప్పుడు నేను ఎదురుతిరిగి వెళ్ళిన తర్వాత మా నాన్నగారు పూర్తిగా మీసాలు తీసి వేశారు. నిమ్మకాయలను మీసాలపైని నిలబెట్టే ఘనత వహించిన మా చిన్నాన్నగారు మీసాలు ఎందుకు తీసివేశారో నాకు తెలియదు. నేనెప్పుడూ ఆయన్ని అడగలేదు, వారు చెప్పలేదు. ఆ తర్వాత వారిద్దరు మరి మీసాలు పెంచలేదు.

నేను నాట్యవిద్యలో ఎన్నో బహుమానాలు పొందాను, ఎన్నో గ్రంథాలు వ్రాశాను, ఎన్నో సత్కారాలు పొందాను, ఎన్నో సమ్మానాలు పొందాను, ఎంతో పేదరికం అనుభ వించాను. బందారు సంస్థానంలో ఆస్థాన నర్తకుడుగా అతి చిన్నతనంలోనే ఎంతో గౌరవం పొంది, ఎంతో ధనం సంపా దించాను. ఇవేవీ మా నాన్నగార్ని కదిలించలేదు. నా దారి నాది, వారి దారి వారిది. ఈ కళపట్ల నా అభిప్రాయాలు నావి, వారి అభిప్రాయాలు వారివి. ఈ కళారాధన ఒక పవిత్రమైనదిగా నేను భావించాను. కళల్ని మనం అభి నందించాలి, పోషించాలే గాని ఆరాధించగూడదని మా నాన్న గారి అభిప్రాయం.

మా అన్నగారు ఏకసంతగ్రాహి. ఏదైనా చూచినా, విన్నా దాన్ని ఆయన పట్టేసేవారు. బహు సుందరుడు. పేరు శ్యామసుందరుడు, ఆరడుగుల పొడవువాడు. నాకన్న 14 సంవత్సరాలు పెద్ద, మా అమ్మగారికి తొలి సంతానం. తర్వాత 12 సంవత్సరాలకు మా అక్క శారదగారు, ఆ తర్వాత నేను, నా తర్వాత నాకో చెల్లెలు. అమ్మ ఆమె పురిటిలోనే పోయారు. నే నెక్కువగా మా అన్నగారి వద్దనే పెరిగాను. మా అమ్మగారికి నే నంటే చాలా ప్రేమ అట. అక్కంటే నాన్నగారికి ఎక్కువ ప్రేమ. ఆమె ఏమి కావా లంటే మా నాన్నగారు అది చేసేవారు. మా అన్నయ్యగారు నాకు కావలసినవన్ని సమకూర్చేవారు. ఆయన సంస్కార భాభిలాషి. 'ఇతరుల బిడ్డలు నాట్యంచేస్తే మనంచూసి ఆనం దిస్తాం, అభిమానిస్తాం, సత్కరిస్తాం, పోషిస్తాం, కాని మన బిడ్డలు నాట్యం చేయకూడదు. ఎందుకు మన బిడ్డలు నాట్యం చేయకూడదు?' అనే తత్వంగల మనిషి మా అన్నగారు. కాని, ఆయ నెన్నడూ ఈ విషయాన్ని పెద్దల ముందు తర్కించలేదు. నన్ను మట్టుకు పరోక్షంగా ఆయన ప్రోత్స హిస్తూ వచ్చారు. కావలసిన ధనం ఇస్తూ వచ్చారు. ఆయన ప్రోత్సాహం వల్లనే నేను భరతనాట్యం అభ్యసించగలిగాను. ఒక ప్రపంచ ప్రఖ్యాత నాట్య కళాకారునిగా నేను పేరు తెచ్చుకోవాలని ఆయన కలలు గన్నారు. ఆ కలలు

ఫలించకముందే ఆయన కన్ను మూశారు. ఆయన మరణంతో నాకూ, మా పెద్దలకు మధ్యనుండిన సంబంధం తెగిపోయింది మా నాన్నగారు రోజు రోజుకూ దూరమౌతూ వచ్చారు. నా దీక్షను, తపనను అర్థం చేసికొనే అవకాశం వారికి లేకుండాపోయింది.

మా అన్నగారు పుట్టిన కొన్నాళ్ళ తర్వాత మా నాన్నగారు రామకృష్ణ పరమహంస భక్తులయ్యారు. అందుకే మా అన్నగారికి శ్యామసుందర్ అని, మా అక్కగారికి శారదా దేవి అని, నాకు రామకృష్ణ అని పేర్లు పెట్టారు. మేము రామకృష్ణ మత సిద్ధాంతాలకు కట్టుబడి, సంఘసేవలో మా జీవితాలను గడుపుతామని నాన్నగారు ఆశించారు. కాని, నా జీవితం నాట్యకళకు అంకితమై పోయింది. మా అక్క మాత్రం ఆయన ఆశను వమ్ము చేయలేదు. మా ఆధ్యాత్మ గురువుగారైన స్వామి శాశ్వతానందగారి ఆజ్ఞానుసారం సంఘ సేవకు అంకితమై, బెంగాలులోని "బారాసాత్" వద్దనున్న కాందిశీకుల వైద్యశాలలో పేదవారికి సేవ చేశారు. ఆమెవల్ల ఎందరో మేలు పొందారు. ఆమె సేవలను మెచ్చి' బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వం ఆమెను 'బెంగాల్ నైటింగ్ గేల్'గా గుర్తించి, స్వర్ణ పతకాన్ని బహూకరించారు. సంఘ సేవకురాలైన ఆమె ఆ స్వర్ణపతకంతో పని లేదని చెప్పి మరింకేదైనా మంచి కార్యానికి దానిని వినియోగించమని చెప్పి, దానిని ప్రభుత్వానికే ఇచ్చివేశారు.

కలకత్తాలోని బేలూరు మఠానికి ఏ ప్రముఖ అతిథి వచ్చినా ఆమె వారికి స్వాగతం చెప్పేవారు. జ్యోతిబసు, శ్యాంప్రసాద్ ముఖర్జీ మొదలైన ప్రముఖులతో ఆమెకు పరిచయ ముండేది. పద్మజానాయుడుగారికి ఆమె సన్నిహితురాలు.

లక్షలు విలువ చేసే ఆస్తిని ఆమె దానధర్మాలు చేశారు. బాల్యంలోనే మేం విడిపోయాం. మళ్లా 45 సంవత్సరాల తర్వాత నన్ను చూడ్డానికని హైదరాబాదు వచ్చి, ఆమె గుండెపోటుతో స్వర్గస్థురాలయ్యారు. ఆమె అంత్యక్రియలు జరిపి ఆమె ఋణం తీర్చుకొన్నాను.

ఆమెకు సంగీతమంటే చాలా ఇష్టం. ఆమె వంగదేశ సంగీతం అభ్యసించారు. బెంగాలీని ఆమె మాతృ భాష చేసుకొన్నారు. పేదవారికి, ప్రత్యేకంగా పేద స్త్రీలకు ఎక్కువగా సహాయపడుతూ ఉండేవారు. హైదరాబాద్‌లో తన పేర ఒక 'ధర్మనిధి' (Trust)ని ఏర్పాటు చేయాలన్న సంకల్పంతో ఆమె హైదరాబాద్ వచ్చారు. ఆమె ఆ కార్యం చేయకుండానే మరణించారు. ఆ కార్యాన్ని నేను మరి కొందరితో కలిసి చేపట్టాను. ఆమె అధ్యాయం అంతటిలో ముగిసింది.

మా నాన్నగారు రామకృష్ణ పరమహంస భక్తులైనందున పనివారిని, నౌకర్లను, పేదవారిని చాలా దయగా చూచేవారు. జీతగాళ్ళను ఏదైనా పని మీద పక్క వూరు పంపిస్తే వారికి దారి ఖర్చు ఇచ్చి పంపించేవారు. తిరిగి రావడం ఆలస్యమైనా మందలించేవారు కారు.

మా చిన్నాన్నగారైతే, ''ఒరే, రేపు కోడికూతతో బయలుదేరి వెళ్ళి, పొద్దు కూకకముందే తిరిగి రా!'' అని జీతగాణ్ణి ఆదేశించేవారు. వాడి తిండి తిప్పలగురించి ఆలోచించేవారు కారు. అందువల్ల జీతగాళ్ళ దృష్టిలో మా నాన్నగారు వట్టి అమాయకులు. ఒకరోజు ఆలస్యంగా వచ్చినా భయంలేదు. అందువల్ల వారు వారి చుట్టాల యిండ్లలో విందులారగించి, నెమ్మదిగా వచ్చేవారు. ఒక్కొక్కసారి ఒక రోజులో అవవలసిన పని నాలుగు రోజు లయ్యేది.

మా చిన్నాన్నగారి జీతగాడయితే ''చిన్నదొర చాల కోపిష్ఠి, అనుకొన్న సమయానకి పని చేయకపోతే డొక్క చీల్చి డోలుకడతాడు'' అని భయపడి, అడ్డదారిని గట్లమీద నడిచి, పొరుగూరు వెళ్ళి, సాయంత్రానికల్లా పని ముగించుకొని వచ్చేవాడు. అన్నదమ్ముల వ్యవహారం ఇలా ఉండేది.

ఉమ్మడి కుటుంబం విడిపోయిన తర్వాత, మా నాన్నగారి మానవహితా దృక్పథంవల్ల ఆయన వ్యవసాయం చేయలేక తన భూముల్ని అమ్ముతూ వచ్చారు. ఆ భూములు నేడుండి ఉంటే కోటి రూపాయలకు మించిన ఆస్తి నాకుండేది. ఆ రోజుల్లోనే పట్టణ జీవిత వ్యామోహంతో పల్లె ప్రజలు వారి స్వగ్రామాలను విడిచి, పట్టణాలకు వెళ్ళడం ప్రారంభించారు.

నేను ఇల్లు విడిచి, వెళ్ళిన తర్వాత డైరీ వ్రాస్తూ వచ్చాను. అందులో ప్రతి చిన్న వ్యక్తిగత విషయాన్నే గాక, రాజకీయ, సాంఘిక, ఆర్థికాది విషయాలను గూడా వ్రాసే వాడిని. నేను స్వీయ అనుభవంతో వ్రాసినవి- అవి ఏ యితర గ్రంథాల్లోను లభించవు. ఏ చరిత్రకారుడు వ్రాసి యుండడు. అయితే, నా దురదృష్టం నా 'అద్దాలమేడ' వ్యాజ్యంలో దానితోబాటు, నాట్యానికి సంబంధించిన అపూర్వ వ్రాత ప్రతులతోబాటు, నా డైరీలుకూడా పోయాయి.

ఆ 'యద్దాలమేడ'ది ఒక విషాదగాథ. నేను దానిని నిర్మించినప్పుడు మరి యే యితర నాట్యకళాకారునికి సొంత భవనం లేదు. ఒకేసారి నూరుమంది పిల్లలకు నాట్యం చెప్ప డానికి వీలుగా ఉండేటట్టు దాన్ని కట్టించాను. చిక్కడ పల్లిలో 'అద్దాలమేడ' అంటే నాదే. చాలా అందంగా ఉండేది. అది పోయిన నాటినుండి నేటివరకు నేను అద్దె ఇళ్ళలోనే కాలక్షేపం చేస్తూ, కళారాధన చేస్తూ, పిల్లలకు నేర్పుతూ, నాట్యం ప్రచారం చేస్తున్నాను. నా తర్వాత వచ్చిన కళా కారులలో చాలామంది ముచ్చటైన మందిరాలు నిర్మించుకొని, కళాత్మకమైన వాతావరణంలో కళారాధన చేస్తున్నారు.

ఆ రోజు మరువరానిరోజు. న్యాయస్థానంలో ఆ 'అద్దాలమేడ' విషయమై నా వాదన వినేరోజు అది. ఆ న్యాయాధిపతి నా శిష్యురాళ్ళలో ఒకరికి దగ్గరచుట్టం. నాకు జరిగిన అన్యాయం గురించి ఆయనకు విశ రంగా తెలుసు. నాకు సహాయం చేయాలన్న మంచి మనసు గల వ్యక్తి ఆయన. మరి కొద్ది నిమిషాలలో నేను ఫోనులో



నవ జనార్దనం గురించి యోచన





Andhra Natyam performed at Sri Venkateswara Temple, Alwal.

నిలబడి చెప్పవలసిన సమయం ఆసన్నమైంది. అప్పుడు నా న్యాయవాది నావద్దకు వచ్చి, "రామకృష్ణగారూ! నేను ఇప్పుడు చెప్తున్నట్టుగా మీరు బోనులో నిలబడి చెప్తే మీ ఆస్తి మీకు దక్కుతుంది, లేకుంటే పోతుంది. మీ ఆస్తి మీకు దక్కడానికి ఇప్పటివరకు నేనెంతో కష్టపడ్డాను. మీరు రెండు చిన్న అబద్ధాలు ఆడండి- చాలు" అన్నారు.

"వకీలుగారూ! ఈ యాస్తి నిలబెట్టుకొనడానికి, బోను ఎక్కి, దేవునిమీద ప్రమాణం చేసి, అబద్ధాలు ఆడాలా?"

"ఔను; ఇంత పెద్ద ఆస్తి అన్యాయంగా పోతుంటే దాన్ని నిలబెట్టుకొనడానికి రెండు చిన్న అబద్ధాలు ఆడవలసి యుంటుంది. ఇదేమంత తప్పవని కాదు."

నేను రెండు నిమిషాలు మనసులో తర్కించుకొన్నాను. సమయం దగ్గర పడుతుంది. నేను నా వకీలును పిలిచి, "అయ్యా! నా ఆస్తి పోతేపోయింది కాని, దేవునిమీద ప్రమాణం చేసి, అబద్ధమాడలేను" అన్నాను. ఆయన నిశ్చేష్టుడయ్యాడు.

"ఆ ధర్మదేవతే మిమ్మల్ని కాపాడాలి" అంటూ నా వాదానికి సంబంధించిన కాగితాలు నా కిచ్చేసి, ఆయన వెళ్ళిపోయారు. నేను వ్యాజ్యాన్ని ఉపసంహరించుకొన్నాను. దాంతో నా "అద్దాలమేడ" నాకు లేకుండా పోయింది. నా మిత్రులు నేను చేసినపనికి ముక్కుమీద వేలు వేసుకొన్నారు.

ఆ 'అద్దాల మేడ' ఉన్నప్పుడు చాలా వ్యయంతో శ్రీవేంకటేశ్వర కల్యాణం (తెలుగు), బాలాజీ (హిందీ), కుమార సంభవం, మేఘసందేశం (కాళిదాసు రచనలు) నృత్య నాటకాలుగా రూపొందించి, ప్రదర్శించాను.

కళాదృష్టితోనే నేను ఆ నృత్య నాటకాలను రూపొందించాను. అందువల్ల అవి అందర్నీ ఆకర్షించాయి. వాటికి మంచి ప్రచారం వచ్చింది. ఎక్కడ ప్రదర్శించినా "హాలు ఫుల్, ఇన్‌కమ్ నిల్"గా ఉండేది. వాటి వల్ల మాకు ఆర్థికంగా లాభం రాలేదు. పేరు, ప్రఖ్యాతులు వచ్చాయి. అవి నేను బండారు సంస్థానం నుండి వచ్చిన కొత్త రోజులు. బాంక్‌లో డబ్బు నిలవ వుంది. ధనానికి లోటు లేదు అందువల్ల ఖర్చులకు నేనెప్పుడూ వెనకాడలేదు.



భరతకళా ప్రపూర్ణ శ్రీమతి అన్నాబత్తుల బులి వేంకటరత్నమ్మ మొదలగువారితో.

ఉజ్జయిని కాళిదాసు సమారోహ్‌లో 'కుమార సంభవం ప్రదర్శించాలని నిర్ణయించుకొన్నాను. మా కళాకారులందరకు $1\frac{1}{2}$ సంవత్సరాలు ఆ గ్రంథ మంతా ఒక సంస్కృత పండితుని చేత చెప్పించాను. అందువల్ల మా కళాకారులలో ప్రతీవారు దానిలోని శ్లోకాలను చక్కని ఉచ్చారణతో పాడడమే కాక అర్థవంతంగా అభినయించడం అలవరచుకొన్నారు.

మేము ఉజ్జయినీ వెళ్ళిన సంవత్సరం మేము హేమాహేమీలతో పోటీ పడవలసి వచ్చింది. అప్పటికి ప్రపంచమంతా తిరిగి మేఘసందేశాన్ని 200 సార్లు ప్రదర్శించిన లిటిల్ బాలే ట్రూప్‌వారు మేఘ సందేశాని ప్రదర్శించడానికి ఉజ్జయినీ వచ్చారు. వారికి పండిట్ నెహ్రూజీ ఆర్థికసహాయం

లభించింది. కలకత్తా సంస్కృత కళాశాలవారు రఘువంశం ప్రదర్శించడానికి వచ్చారు.

ఆ సంవత్సరం మా ధాటికి ఎవరూ నిలవలేక పోయారు. మాకు ప్రథమ బహుమతిగా బంగారు కులశమే గాక ఆల్‌రౌండ్ బెస్ట్ బహుమతి కూడా వచ్చింది. సంగీతం, ఉచ్చారణ, నృత్యం, కూర్పు, వేషధారణ అన్నింటిలో మాదే అత్యంత ఉన్నతమైనదని, నిర్ణయించబడింది.మాకు అందుకు ఒక ప్రత్యేక కలశాన్ని ఇచ్చారు. కాళిదాసు స్థాయికి సరి పోయినట్టుగా కాళిదాసు కావ్యాన్ని ప్రదర్శించా మని పండి తులు, విమర్శకులు, పత్రికలవాళ్ళు మమ్మల్ని మెచ్చు కొన్నారు అనాడు ఉజ్జయినీలో మా ప్రదర్శనను చూసిన పెద్దలు ఈనాడు కలిసినా నన్ను పొగుడుతూ ఉంటారు.

మేము ఉజ్జయినీ వెళ్లే ముందు అంతరిక్ష యాత్ర విజయవంతంగా చేసి వచ్చిన శ్రీ గ్రిగరెన్‌కు హైదరాబాద్ రాజభవనంలో ఘన సమ్మానం జరిగింది. అనాడు మేము నృత్య ప్రదర్శన అక్కడ ఇచ్చాం. ఇతర నాట్య అంశాలతో బాటు కుమారసంభవంలోని రెండు ఘట్టాలను మేము ప్రద ర్శించాం. వాటిని చూసిన పెద్దలు, పండితులు, విమర్శకులు మా ప్రదర్శన చాలా అద్భుతంగా ఉం దన్నారు. అప్పుడు ముఖ్య మంత్రిగా ఉండిన శ్రీ నీలం సంజీవరెడ్డిగారు నన్ను కలిసి, మా నృత్య నాటిక గురించి వివరంగా తెలుసు కొన్నారు. ''రామకృష్ణా! ఈ సంవత్సరం ఉజ్జయినీ బహు మతి మీకు తప్పకుండా వస్తుంది. రాగానే నాకు ఉజ్జయినీ నుండి తంతి ఇవ్వండి. ప్రభుత్వం తరపున మీకు ఘన సమ్మానం ఏర్పాటు చేస్తాం'' అన్నారు అయన. ఆయన ఆశీర్వదించినట్టుగానే మాకు ప్రథమ బహుమతి వచ్చింది. సిప్రానది ఒడ్డున జరిగిన మేళాలో దానిని ప్రత్యేకంగా ప్రద ర్శించాం. తర్వాత 'రత్లం' రాజస్థాన్‌వారు ఆహ్వానించగా అక్కడ కూడా దీన్ని ప్రదర్శించాం. ఈ కీర్తి మాదికాదు— ఆంధ్రదేశానికి అని నేను, మా బృందంలోని నర్తకులు గర్వించాం.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు మాకు రవీంద్ర భారతిలో ఘన సమ్మానం చేశారు. పూజ్యులు శ్రీ నీలం సంజీవరెడ్డిగారికి నేనంటే ఎంతో అభిమానం. నన్ను, మా కళాకారుల్ని ఎంతో అభినందించారు. ప్రదర్శనను వేనోళ్ళ మెచ్చుకొన్నారు. అంతేకాదు, ఒకనాడు మా నృత్య నికేతన్‌కు స్వయంగా వచ్చారు. ఒక గంటసేపు మా ఒద్ది కలు చూసి, మాతో కులాసాగా గడిపారు. ''రామకృష్ణా! నీ నాట్య ప్రచారానికి ఏంకావాలో అడుగు, ఏ సహాయం కావాలన్నా చేస్తాను" అన్నారు.

ఆ రోజుల్లో నాకే లోటు లేదు. అందువల్ల ఏమి అడ గాలో నాకు తెలియలేదు. బంగారంలాంటి అవకాశాన్ని చేజార్చుకొన్నాను. ఇలాంటి అవకాశాలు అనాడు నాకెన్నో వచ్చాయి కాని వేటినీ ఉపయోగించుకొనలేకపోయాను. కేవలం నృత్యసరస్వతీ దేవిని ఆరాధించడం తప్ప ఇంకే లోక జ్ఞానంలేని కళాకారుణ్ణి నేను. ఆ మరుసటి సంవత్సరం 'మేఘ సందేశాన్ని' ఉజ్జయినీ తీసికొని వెళ్ళాను. మా బృందాన్ని చూడగానే ఇతర బృందాలవారికి దడ పుట్టింది. గుసగుసలు ప్రారంభమయ్యాయి. వారందరూ కలిసి ఏ పథకం వేశారో కాని, ఆ సమారోహ నిర్వాహకులు నా వద్దకు వచ్చి "గత సంవత్సరం మీకు ప్రథమ బహుమతేకాక, ఆల్‌రౌండ్ బహు మతి కూడా వచ్చింది కనుక మీ బృందాన్ని పోటీలో నుండి తొలగిస్తున్నాము. ఇతరులకు మీరు అవకాశం ఇవ్వండి. మీ నృత్య నాటకాన్ని ప్రత్యేక ప్రదర్శన క్రింద ఏర్పాటు చేస్తున్నాం" అన్నారు. మేం చేసేది ఏం లేక ప్రత్యేకంగా ప్రదర్శించి, తిరిగి వచ్చాం. మరింక ఆ పోటీలకు వెళ్ళదలచక అక్కడకు వెళ్ళడం మానుకొన్నాం. ఇది జరిగి నేటికి 30 సంవత్సరాలయింది. మా నృత్యనాటికలు చూసినవారు ఇంతటి శోభాయమానమైన నృత్యనాటికలను చూడలేదని ఇప్పటికీ అంటూంటారు ఆ ప్రాంతంలో.

అనాటికి ఈనాటికి రంగస్థల కళలో ఎన్నో మార్పులు వచ్చాయి. లైట్లు, మైకులు, అలంకరణ మొదలైన విషయా లలో నేడు ఎంతో అభివృద్ధి కానవస్తుంది. అయినా మా నృత్య నాటకాల కూర్పు వేరు. మా దృక్పథమే వేరు.

మా బృందంలోని కళాకారులందరూ సంగీతం, సంస్కృతం నేర్చుకొన్నారు. అందువల్ల వారు నర్తించిన పాత్రలు జీవంతో తొణికిసలాడేవి. మా కళాకారులు ధరించిన

పాత్రంలో కాళిదాసు కవితామూర్తులు రంగస్థలంపైని కద లాడుతున్నట్టుగా ప్రేక్షకులు అనుభూతి పొందేవారు.

ఉజ్జయినిలో కుమారసంభవం ప్రదర్శించిన మరునాడు మేము ఎక్కడికి వెళ్ళినా "మా కాళిదాసుని మా ముందు జీవింప జేశారు. మేం ధన్యులం, మీరు గొప్ప కళాకారులు" అంటూ మమ్మల్ని అభినందించారు. ఏ హోటల్లోను మావద్ద డబ్బులు పుచ్చుకోలేదు. మేము కొన్న కొన్ని అపురూవ వస్తువులు తక్కువ ధరలకే లభించాయి.

అప్పుడు మధ్యప్రదేశ్ గవర్నరుగా నుండిన శ్రీ కైలాసనాథ్ కట్జూగారు గొప్ప సంస్కృత పండితులు. ఆయన మా కుమారసంభవం నృత్య నాటకాన్ని చూసి యెంతో ఆనందించి, మమ్మల్ని అభినందించారు.

మా దురదృష్టం కొద్దీ అప్పుడే భారత, చైనాల మధ్య యుద్ధం సంభవించింది. నా అద్దాల మేడ రచ్చ కెక్కింది. ఆ యుద్ధాలు ముగిసిన నాటికి మా బృందం విచ్ఛిన్నమైంది. నృత్య నాటకాల గురించి నేను మరి ఆలోచించలేదు.

ఆనాడు మా బృందంలో పాల్గొన్న కళాకారులలో కొందరు అమెరికాలో స్థిరపడ్డారు. ఇతరులు పంజాబ్, బెంగాల్, మహారాష్ట్ర, కర్ణాటక, హైదరాబాద్ ప్రాంతాలలో స్థిరపడ్డారు. వీరిలో కొందరు వారి సొంత నాట్య సంస్థలను నెలకొల్పుకొని, నిర్వహిస్తున్నారు. మిగిలిన వారు గృహిణులుగా సంసార జీవితం గడుపుతున్నారు. ఆనాటి కళారాధన వేరు. అది నేడు లేదు, మరి రాదు. ఇప్పుడంతా వ్యాపార సరళిలో కళ అమ్ముడుపోతూంది. అయితే నేడు నృత్య కళకున్న ప్రోత్సాహం, ఆర్థిక సహాయం, ఇతర అవకాశాలు ఆనాడు లేవు. అప్పుడు నాతో ఉండిన కళాకారులెవ్వరూ డబ్బు కాశించి కళాసేవ చేయలేదు. గురుభక్తి మెండుగా ఉండేది ఏదో ఒక కొత్త అంశం నేర్చుకొనాలనే



ఆంధ్రుల లాస్య నర్తనానికి 1970 లో రాజమహేంద్రవరం సదస్సులో 'ఆంధ్ర నాట్యం' అని నామకరణం చేసిన రోజున శ్రీమతి నాయుడు పెద సత్యం గారి 'భామా కలాపం' ప్రదర్శన.

తవన వారిలో ఉండేది. ఒకరితో ఒకరు పోటీపడి నాట్యాంశాలను సాధన చేసేవారు. వారిమధ్య ఆరోగ్యకరమైన స్పర్థ ఉండేది.

మా కళాకారులకు నృత్య నాటకాలలోని వారి అంశాలనే కాక ప్రతివారు ఏకపాత్ర ప్రదర్శన ఇవ్వడానికి తగిన అంశాలను గూడ నేర్పేవాడిని. బొబ్బిలి రాజాస్థానంలో నర్తకిగా నుండిన జీవరత్నమ్మగారు మా నృత్య నికేతనంలో ఉండేవారు. తీరిక సమయాలలో ఆమె ఈ కళాకారులకు పదాలు, వర్ణాలు, జావళీలు మొదలైనవి నేర్పుతూ ఉండేవారు. ఒక సంస్కృత పండితుడు వీరికి సంస్కృతం బోధించేవారు. అందువలన ఆనాటి మా కళాకారులకు ఈ శిక్షణలు ఎంతో ఉపకరించాయి.

మా 'వేంకటేశ్వర కల్యాణం' ఒక అద్భుతమైన నృత్య నాటక ప్రదర్శన. ఆంధ్ర దేశంలో తొలిసారి నృత్య నాటకాలను ప్రదర్శించినవాళ్ళం మేమే. మా వేంకటేశ్వర కల్యాణం ఒక విశిష్టమైన కళాఖండం. ఆ తర్వాత చాలా మంది వేంకటేశ్వర కల్యాణాన్ని నృత్య నాటకాలుగా ప్రదర్శించారు గాని, మా స్థాయికి రాలేదు.

ముప్పయి రెండు సంవత్సరాల క్రిందట ఈ నృత్య నాటకంలో పాత్రల దుస్తుల కోసం లక్ష రూపాయలు ఖర్చు చేశాను. వెంకన్న ధనవంతుడు. ఆ ధనవంతుని కల్యాణం శోభాయమానంగా, సిరిసంపదలతో వెలిగిపోవాలని, అన్ని విషయాలలోను శ్రద్ధ తీసుకొని, విరివిగా ఖర్చు చేశాను.

ఇక సంగీతం సంగతి వివరిస్తాను. ఈ నృత్య నాటకాన్ని మూడు గంటల సేపు ప్రదర్శించేవాళ్ళం. ఆంధ్ర దేశంలో అభివృద్ధి చెందిన అన్ని రకాల సంగీతాన్ని ప్రేక్షకులకు వినిపించాలన్నదే నా ఆశయంగా ఉండేది. అందువల్ల తెలుగువారి ఇండ్లలో వివాహాది శుభకార్యాలలో పాడే జానపద శైలులలోని మంగళహారతులు, నలుగుపాటలు, సువ్విపాటలు, ధవళాలు, ఏలలు, హెచ్చరికలు మొదలైనవి మొదలుకొని శాస్త్రీయ సంగీతపరమైన పదాలు, జావళీలు, వర్ణాలు మొదలైన వాటినన్నింటిని ఈ నృత్య నాటకంలో ఉపయోగించాను. ఈ నృత్య నాటకంలో ఎరుకలసాని పాత్ర ఒక ముఖ్యాంశం. ఈ పాత్రని తీర్చిదిద్దేముందు ఒక ఎరుకలసానిని పిలిచి, వారి ఆచార వ్యవహారాలు తెలుసుకొని, వారి సంగీత ధోరణిలో నృత్యాన్ని కూర్చాను. ఇది విలక్షణంగా రూపుదిద్దుకొంది. అందువల్ల ఈ నృత్య నాటకంలో ఎరుకత పాత్ర మహా శక్తివంతంగా తయారయింది. సోది చెప్పేటప్పుడు ఆమె కూర్చునే పద్ధతి, దేవతలను పలకమని ప్రార్థించేటప్పుడు ఆమె చేసే అభినయం-ఇవన్నీ నేను శ్రద్ధగా పరికించి ఈ పాత్రను తీర్చిదిద్దాను. అందువల్ల ఈ పాత్ర ఒక ప్రత్యేకతను సంతరించుకొంది.

ఈ నృత్య నాటకానికి శ్రీమతి విజయలక్ష్మి కన్నారావు, స్వర్గీయ శ్రీరాములు గాత్రంతో సహకరించారు. శ్రీరాములుకు రెండు సంవత్సరాలు శాస్త్రీయ సంగీతం చెప్పించాను. ఉచ్చారణ శుద్ధంగా ఉండాలని అతనికి సంస్కృతం నేర్పించాను. అతడు పాడితే అతని గాన మాధుర్యానికి కొంతసేపు హాలంతా కరతాళ ధ్వనులతో మారుమ్రోగేది. అతని కంఠ మాధుర్యమే అతనికి శత్రువైంది. సినిమా పరిశ్రమలో చేరాలని అతడు మదరాసు వెళ్ళాడు. కిట్టనివారు అతనికి దురలవాట్లు నేర్పారు. దాంతో క్షయ రోగం వచ్చి చనిపోయాడు.

ఈ నృత్య నాటకంలో ద్విపద, ద్విపదార్థం, కందం, కందార్థం, సీసం, సీసార్థం, దరువదం, హెచ్చరిక, వెన్నెల పదం, అర్థచంద్రిక, పదం, జావళి, కీర్తన మొదలైన కవితా రీతులను ఉపయోగించాం.

ప్రాచీన యక్షగానం, ధ్రువాగానం (ఛందోగానం), పదాభినయం, వర్ణం మొదలైన వివిధ రకాలైన నృత్యాభినయాలను దీనిలో ప్రవేశపెట్టాం.

ఇన్ని రుచులు, అభిరుచులతో మేం ఈ వేంకటేశ్వర కల్యాణాన్ని తయారుచేసినా ఆయన మమ్మల్ని చిన్నచూపు చూశాడు. ఈ నృత్య నాటకానికి మంచి పేరు వచ్చింది కాని, కొన్ని కారణాలవలన నాకు విపరీతమైన నష్టం వచ్చింది. అయితే, ఈ నృత్య నాటకంలో పాల్గొన్న నా శిష్యులు చక్కగా నాట్యాన్ని, సంస్కృత భాషని నేర్చుకొన్నారు.

# చమ్‌కీ, మున్నా, మిట్టు లక్ష్మణ్, ఢంకియా, పరోటా బైగన్

"హే మిటూ! హే మున్నా! ఏ చమకీ! ఏ ఢకియా! దుర్ ర్ లక్ష్మణ్! పరోటా! బైగన్!...." ఇలా హేళన చేస్తూ, చప్పట్లు చరుస్తూ ఆ రోజు మిట్ట మధ్యాహ్నం ఆ మండు టెండలో ఆ యువకులందరూ అతని చుట్టూ తిరుగుతూ ఆట పట్టిస్తున్నారు. ఒకడు ధోవతీ లాగుతున్నాడు, మరొకడు అతని నెత్తిమీద టోపీని తీసి ఎగురవేస్తున్నాడు, వేరొకడు అతని జుట్టుపట్టుకొని పీకుతున్నాడు. అతని చేతిలోని కూరగాయల బుట్టను లాక్కొని పక్కకు పడేశారు. ఇలా ఎంతసేపటి నుండి అతన్ని ఆటపట్టిస్తున్నారో! ఆ దారిన పోయేవాళ్ళు చూసీ చూడనట్టు, నవ్వీ నవ్వకుండా సాగిపోతున్నారు. ఎవరూ ఆ యువకుల్ని ఏమీ అనడంలేదు.

"హే నాచియా! హే ఢంకియా....!" అంటూ కేకలు వినబడుతూ ఉండగా మా కారు అక్కడ ఆగింది. మా బంగ్లాకు ఎదురుగా నున్న బజారులో జరుగుతూంది ఆ అల్లరి. కారులో నేను, దర్వాను ఉన్నాం. నన్ను చూడగానే "కళాకార్ ఆయా, కళాకార్ ఆయా.... చలో, చలో" అంటూ ఆ యువకులు ఎవరిమట్టుకు వారు జారుకొన్నారు. అతడు ఊపిరి ఎగపీలుస్తూ, ఒంటరిగా రోడ్డుమీద నిలబడిపోయాడు. తర్వాత తువాలుతో ముఖం తుడుచుకొంటూ, గుడ్లలో నీరు నింపుకొన్నాడు. అసలే మనిషి ఎర్రనివాడు. ఈ సంఘటనతో అతని ముఖం కందగడ్డలా ఎర్రగా కందిపోయింది. వర్షంలో తడిసినట్టు అతని ఒంటిమీద చెమట కారుతోంది. నన్ను చూసి నమస్కరించాడు. నేను ఏం మాట్లాడకుండా మా బంగ్లాకు రమ్మనమని సైగచేసి, వెళ్ళాను. కాస్సేపటికి అతడు వచ్చి, వరండాలో గోడకి జారబడి నిలబడ్డాడు.

నేను ఇంతలో ముఖం కడుక్కొని, వచ్చి, ఆ వరండాలో కుర్చీలో కూర్చున్నాను. అతడు నా కాళ్ళ దగ్గర కూర్చొని, ఏడవడం మొదలుపెట్టాడు.

"లక్ష్మణ్! నీవు వాళ్ళని ఎదిరించలేవా? ఆట పట్టిస్తుంటే అలా చేతకానివాడిలా ఊరుకొంటావేం? నువ్వేం ఆట వస్తువా?" అని మందలించాను.

"వాళ్ళని ఎదుర్కొని జీవించలేను బాబూజీ!"

"అయితే, ఈ ప్రాంతం వదిలి ఇంకెక్కడికైనా వెళ్ళిపో!"

"ఎక్కడికి పోగలను బాబూజీ! నా కెవరున్నారు?"

"తల్లీ? తండ్రీ?...."

"నా తల్లి నా చిన్నప్పుడే పోయింది. తండ్రి మారు పెళ్ళి చేసుకొన్నాడు. వాళ్ళు నన్ను ఇంట్లోనుండి తరిమేశారు. విధి లేక, మా వూరు వదిలి, ఇక్కడ కూలీనాలీ చేసుకొని బతకాలని ఈ వూరు వచ్చాను. కళాసీలైన్‌లో ఒక పూరింట్లో ఒక ముసలమ్మ దగ్గర ఉంటున్నాను. రోజు కూలిడబ్బు ఆమె కిస్తాను. ఆమె నా కింత గంజి పోస్తుంది."

"అసలు మీరెవరు?"

"నేను మరాఠీవాణ్ణి బాబూజీ!"

"నా దగ్గర ఉంటావా?"

"నేనా బాబూజీ! మీ దగ్గర నేను! నన్ను మీరు గూడా హాస్యం పట్టిస్తున్నారా! పేదవాళ్ళంటే అందరికీ చులకనే... బాబూజీ!"

రెండు నిమిషాలు అతన్ని పరిశీలిస్తూ, మౌనంగా ఉండిపోయి తర్వాత మెల్లగా, లాలనగా "లేదు లక్ష్మణ్! నేను హాస్యం ఆడ్డంలేదు, అబద్ధం ఆడ్డంలేదు. నీవు నిజంగా

వచ్చి, నా దగ్గిర ఉండు. నిన్ను చదివిస్తా, చదువుకో; సంగీతం నేర్పిస్తా, నేర్చుకో. ఇలా ఎన్నాళ్ళు బాధలుపడుతూ ఈ బజారు జీవితం గడుపుతావు?"

అతని కళ్ళలో ఆనందాశ్రువులు ప్రవహించాయి. "నా జీవితంలో ఎందరినో చూశాను. ఎందర్నో కలిశాను. ఎందరికో కూలి పని చేశాను. ఎందరికో సహాయం చేశాను. అందరూ నన్ను దోపిడి చేశారు. ఎందరో ఎన్నో మాటలు చెప్పారు. ఒక్కరూ వారి మాట నిలబెట్టుకోలేదు. బాబూజీ! చావలేక, బ్రతకలేక, బతుకు ఆశ వదులుకోలేక ఇలా నికృష్టంగా జీవిస్తున్నాను - ఏదో ఒకనాడు ఆ భగవాన్ నా మొర ఆలకించడా, నా జీవితం వెలుగుచూడక పోతుందా అన్న ఆశతో...."

"సరే, జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఇప్పుడు బాగా ఆలోచించుకో. నీ కిష్టమైతే నా దగ్గరకు వచ్చిఉండు. నువ్వు ఎప్పుడైనా రావచ్చు" అంటుండగా మా నౌకరు వేడి వేడి టీ తెచ్చియిచ్చాడు. అతడు టీ తాగుతూ "బాబూజీ కొంచెం సమయం కావాలి" అన్నాడు.

ఆ కాలంలో ఆ ప్రాంతంలో కొందరు తమాషా నర్తకులుండేవారు. మరాట్వాడాలో శాస్త్రీయ సంగీతం అభివృద్ధి చెందినా శాస్త్రీయ నాట్యం అభివృద్ధి చెందలేదు. అక్కడ తమాషాయైన నాట్య బృందా లుండేవి. వారు ఎక్కువగా లావణీ, గౌళన్ మొదలైన జానపద నృత్యాలు చేసేవారు. వీదుల్లో జానపద పాటలు పాడుతూ వీదుల్లోనే నృత్య ప్రదనలు ఇచ్చేవారు. వారిలో కళ ఉంది. కాని వారు పేదవారు. వారికి గుర్తింపు లేదు. ఆదరించేవారు లేరు. పేదవాని ఆట ఆనాటి కూటికి సరి.

ఎందువల్లనోగాని ఆ నర్తకుల్లో చాలామంది విరాట రాజు కొలువులో శాపగ్రస్తుడైన బృహన్నల్లా, భుజాలవరకు జుత్తు పెంచుకొని, గిరిజాలు దువ్వుకోడం, కండ్లకు సురమా పెట్టుకోవడం, చేతి వేళ్ళకు, కాలి వేళ్ళకు ఎర్రని రంగు వేసుకొని, పల్చని దుస్తులు వేసికొని, వయ్యారంగా నడుస్తూ, బిత్తర చూపులు చూస్తూ పోతూంటే పొద్దుపోని యువకులు వారిని ఆట పట్టిస్తూంటే అదో తమాషాగా ఉండేది.

ఒక బృందం లక్ష్మణ్‌ను ఆకర్షించింది. వారితో చేరి నాట్యం చేసేవాడు. ఇది అతని తండ్రికి నచ్చక ఇంట్లో నుండి వెళ్ళగొట్టాడు. 3వ పారం వరకు లక్ష్మణ్ చదువుకొన్నాడు. పొట్టగడవక కూలిపని చేసికొంటూ జీవిస్తున్నాడు. ఆదరించి, నాట్యం నేర్పితే మంచి కళాకారుడు కాగలడని నాకు అనిపించింది.

వారం గడిచింది. లక్ష్మణ్ జాడలేదు. సరే- వాడికర్మ అనుకొన్నాను.

ఆ రోజు శనివారం. ఒక పూలదండ, ఒక కొబ్బరి చిప్పలో లక్ష్మణ్ వచ్చాడు. హనుమాన్ గుడికి వెళ్ళి వస్తున్నాడట. నన్ను పిలిచి కుర్చీలో కూర్చోమన్నాడు కూర్చున్నాను. నా మెడలో పూలదండ వేశాడు. "నేను మీ దగ్గరుంటాను బాపూజీ! నేను బాగుపడాలి. నేను బాగా జీవించాలి. నన్ను దీవించండి" అంటూ నా కాళ్ళమీద పడ్డాడు. అతని కన్నీటితో నా పాదాలు తడిసిపోయాయి.

"సరే, మంచిది. నీ యిష్టం వచ్చినన్నాళ్ళు రా" అంటూ అతని లేవదీశాను. అతడు సరిగ్గా కూర్చుని "అవ్వతో చెప్పాను బాపూజీ! మొదట కొంచెం ఏడ్చింది. నన్నువదలి పోతావా బేటా! నే చచ్చిపోతే నా మీద పిడికెడు మట్టి వేస్తావనుకొన్నాను అని మొదట అంది. తర్వాత ఆలోచించి, నా జీవితం ఆఖరవుతూంది. మరెంత కాలం జీవిస్తాను? నువ్వైనా బాగుపడు. నీ జీవితానికి నేను అడ్డురాను అంటూ నాకు అనుమతి ఇచ్చింది. బాపూజీ! వచ్చే పౌర్ణమి మంచిదట. ఆ రోజు వచ్చేస్తా" అంటూ సెలవు తీసికొని వెళ్ళిపోయాడు.

అతనికోసం మా బంగ్లాలో ఒక గది ఖాళీ చేయించి ఉంచాను. అయితే ఆ పౌర్ణమి రాదు, అతని జీవితం వెలుగు చూడదని నేను అనుకోలేదు. అతడూ అనుకొని ఉండడు.

ఆనాటి మధ్యాహ్నం వాలుకుర్చీలో పడుకొని పేపరు చదువుతున్నాను. ఇంతలో మా వంటవాడు పరుగు పరుగున వచ్చి "బాపూజీ! బాపూజీ! లక్ష్మణ్‌కి మోటారు టక్కర్ బెలియే బాపూజీ!" అన్నాడు. వెంటనే బయలుదేరాను. అక్కడ జనం గుంపుగా కూడున్నారు. నన్ను చూసి దారి యిచ్చారు. లక్ష్మణ్ రక్తంమడుగులో పడి ఉన్నాడు. నన్ను చూసి, "బాపూజీ! బాపూజీ! మీ వద్దకు రాలేను. నేను వెళ్ళి

పోతున్నా. మిమ్మల్ని, ఈ ప్రపంచాన్ని వదిలి, దూరతీరాలకు వెళిపోతున్నా'' అన్నాడు హీన స్వరంతో.

"లక్ష్మణ్! భయపడకు, నీవు బ్రతుకుతావు'' అని అతని చేయి నా చేతిలోకి తీసికొన్నా. అంతే, అతని శ్వాస అనంత వాయువుల్లో కలిసిపోయింది. దీనమైన అతని చూపు నా పైనే ఉండిపోయింది.

అతని ప్రక్కన ఒక సంచిలో ఒక పంచె, ఒక చొక్కా, చిన్ననాటి అతని ఫోటో ఉన్నాయి. ఆ ప్రక్కని అవ్వ ఏడుస్తూ కూర్చుని ఉంది.

అతని అంత్యక్రియలు నేనే చేయించాను. సాయంత్రానికి బంగ్లా చేరుకొని, స్నానం చేసి, వంటరిగా మంచం మీద పడుకొన్నాను. మా వంటవాడు రాము వచ్చి, నా కాళ్ళ దగ్గర కూర్చొని పాదాలు నొక్కుతూ, ''బాధపడుతున్నారా బాపూజీ! బాధపడి ఏంలాభం? వాడికి ఈ భూమ్మీద నూకలు చెల్లిపోయాయి'' అంటూ నన్ను ఓదారుస్తూ కాళ్ళు పిసికాడు. నాకు నిద్ర వచ్చింది. ఆ నిద్రలో నా ఆత్మ లక్ష్మణ్‌ని వెదుకుతూ వెళ్ళింది. ఏవేవో లోకాలు తిరిగింది. కాని, లక్ష్మణ్ కనిపించలేదు.

ఆ మర్నాటి ఉదయం నేను లేచానోలేదో; రాజా వారి నుండి కబురు వచ్చింది - ''గవర్నర్ నవాబుగారు వచ్చారు, కచ్చేరికి రండి'' అని. నేనింకా నిన్నటి సంఘటననుండి తేరుకోలేదు. "కళాకారుని హృదయంలో చీకటి ఉన్నా, లోకంలో వెలుగు కాంతులను విరజిమ్మాలి, నవ్వులు పువ్వులు పూయించాలి, లోకాన్ని ఆనందంలో ముంచెత్తాలి" అని అనుకొంటూ, రాజావారి మహాలుకు బయలుదేరాను. మళ్ళీ యధాప్రకారం జీవితం సాగవలసిందే. ఇది లోకం! లోకధర్మం!

## రవుతాయిన్ రమాజీ - తెల్ల చెప్పులు

అన్న శ్యామసుందర్ చనిపోకముందు అదొక లోకం. నా జీవితంలో అదొక యుగం. అది గడిచిపోయింది. తర్వాత నాది క్రమ జీవితం. ఒక నియమ జీవిత విధానం ఏర్పడింది. నన్ను అలా ఉండమని ఎవరూ శాసించలేదు. నా గురించి నేను ఆలోచించుకోవలసి వచ్చింది. నా మార్గం నేను ఏర్పరచుకొనాలి. లోకంలో నాకు తెలిసినవారు ఎంతోమంది ఉన్నా



1970 లో - రాజమండ్రిలో - ఆంధ్రుల లాస్య నర్తన సదస్సు రాజమండ్రి నవభారత గురుకులంలో - జరిపించుటకు శ్రమించి, సదస్సులో - కొనఊపిరితో కొట్టుమిట్టాడుతున్న ఆ నర్తనాన్ని పునరుజ్జీవింపజేయుటకు స్ఫూర్తిని కలిగించిన 'భరత కళా ప్రపూర్ణ' - అన్నాబత్తుల బులివేంకటరత్నం గారు. అనాడు ఆంధ్ర లాస్యం - 'ఆంధ్ర నాట్యం' గా అవతరించింది.

1995 లో ప్రభుత్వం ఈ నాట్యం యొక్క విశిష్టతను గుర్తించి G.O Pass చేసింది.

నాకెవరూ లేరు. నాది ఒంటరి జీవితం. నా జీవితాన్ని నేను సరిదిద్దుకోవాలి. ఒక వెలుగు బాటలో పయనించాలి. ఇలాంటి భావాలు నాలో కలుగుతూ ఉండేవి ఈ యాలోచనలవల్లనే నేను ఇంటికి దూరమయ్యాను. గాంధీజీ సేవాశ్రమం, రామకృష్ణ మఠం నన్ను ఆకర్షించాయి. బౌద్ధానికి నేను చేరువవుతున్నట్లు అనిపించింది. నేను నర్తనవిద్యను ఆరాధించకుండా ఉండియుంటే ఏదో ఒక బౌద్ధ సంఘంలో చేరిపోయి ఉండేవాణ్ణి. బౌద్ధ ధర్మాలు నాకు నచ్చాయి. బౌద్ధ శిల్పాలు నన్ను ఆకర్షించాయి. సారానాథ్‌లోని సుందర శిల్పమూర్తులు నన్ను విశేషంగా ఆకర్షించాయి. ఆ శిల్పాలను అలా చూస్తూంటే ఆ కరుణామూర్తి నన్ను చేరబిలిచి, నన్ను

అక్కున చేర్చుకొన్నట్టు అనిపించేది. ఆ ప్రేమమూర్తి నన్ను రమ్మని ఆహ్వానిస్తున్నట్టు అనిపించేది. వేలాదిమంది బౌద్ధ భిక్షువులు వారి దివ్యగానంతో, స్తోత్రగీతాలతో ఆ తథాగతుం ప్రార్థిస్తున్నట్టు భ్రమకలిగేది.

ఆ తథాగతుని ముఖవర్చస్సులో ఏదో దివ్య తేజస్సు ఉట్టిపడుతూ, ఒక ప్రశాంతత గోచరించేది. కాని, నా జీవిత ఆశయం నన్ను ఆయనకు దూరం చేసింది. ఆయన స క్షంలో ఎక్కువ కాలం గడపలేకపోయాను. అప్పటికే నే నృత్యకళకు అంకితమైపోయాను. ఆ విద్య సంపూర్ణం అభ్యసించి, ప్రచారం చేయాలన్నదే నా జీవిత ఆశయ ఆ యాశయం నానాటికి వృద్ధిపడుతూ వచ్చింది



1962 లో అఖిలభారత కాళిదాస సమారోహ్ సందర్భంలో ఉజ్జయినిలో జరిగిన పోటీలో మా 'కుమార సంభవం ప్రదర్శనానికి ప్రథమ బహుమతిని గవర్నర్ శ్రీ కైలాసనాథ కట్జూ నుండి స్వీకరిస్తున్న చిత్రం ఈ పోటీలో "ఆల్‌రౌండ్" బెస్ట్ అవార్డు పొందిన అత్యంత గౌరవం కూడా లభించింది.

బుద్ధదేవుని బోధనలు నా జీవితమార్గాన్ని తీర్చిదిద్దినా, నృత్యకళారాధనవైపు నా మనస్సు పయనించింది. తెల్లని మంచుకొండలమీద ఆ తెల్లనయ్య, ఒక తెల్లని గిబ్బనెక్కి, తెల్లని మిన్కులవానిని పువ్వుగా ధరించి, తెల్లని నీటిధారను తన జటాజూటంలో బంధించి, ఆ తెల్లని పర్వతశ్రేణిలో సంచరిస్తున్నట్టుగా నా ఊహా లోకంలో చూస్తూ ఉండేవాణ్ణి.

కాళిదాసుని కుమార సంభవం, నన్నెచోడుని కుమార సంభవం. శ్రీనాధుని కాశీ ఖండం, భీమేశ్వర పురాణం ఇవన్నీ నా మెదడులో మెదులుతూ ఉండేవి. పర్వత రాజ పుత్రిక నా కళ్ళ ఎదుట నిలిచేది.

'సాని యీశానిదై - నర్తించువేళ' - ఈ కావ్య వర్ణనలు నన్ను విశేషంగా ఆకర్షించాయి. ఎంత ధన్యురాలు ఆ గుడిసాని! ఆమె పార్వతై - అన్నపూర్ణైన, ఆది భిక్షాటనమూర్తి ఆది జంగము దేవరకు ఆత్మ నర్పించిన ధన్యజీవి.

ఎన్ని జన్మల తపః ఫలం కళాకారుల జీవితం! మన పురాణాల్లో, కవితల్లో, కావ్యాల్లో వర్ణింపబడిన మూర్తుల రూపాల్లో వారు జీవించగలుగుతున్నారు. వారే ఆ మూర్తులుగా తమ నటనద్వారా లోకాన్ని భ్రమింపజేస్తున్నారు. అర్ధరాత్రి వేళ ఏదైనా పెళ్ళి ఊరేగింపు వీధిలో వెళ్తుంటే శివ కల్యాణ ఊరేగింపుగా భావించి, ఆయన అత్తవారింటికి తరలి వెళ్తున్నట్టు ఊహించి తన్మయత్వం పొందేవాణ్ణి.

కాళిదాసుని సంస్కృత కుమార సంభవంలో, మరెక్కడ గాని కన్పించని మరొక నూతన విషయాన్ని నన్నెచోడుడు తన కుమారసంభవంలో వర్ణించాడు. శివుని పెళ్ళి ఊరేగింపులో ఆయన అక్కగారు ఆడుతూ, పాడుతూ అట్టహాసంగా తరలి వెళ్తుందట! తెలుగు వారింటి ఆడబడుచుల్ని మనసులో పెట్టుకొని, కొత్త పెళ్ళి కూతుర్ని యాతన పెట్టే ఆ యాడబిడుచుని ఆ దృశ్యంలో నన్నెచోడుడు సృష్టించి యుండవచ్చును.

ఉమ పర్వత రాజకుమార్తె, అంతే కలవారింటి ఆడబిడ్డ. సకల సౌఖ్యాలను ఆమె త్యజించి శ్మశానంలో నివసించే ఒక భికారిని ప్రేమించినందుకు ఆమె తల్లి తండ్రులు కుంగి, కృశించిపోయి యుంటారు. ఏదో మనసుని దిటవు చేసికొని వివాహానికి అంగీకరించియుంటారు. వారి వివాహానికి బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతలందరూ వెళ్తున్నారు. ఆ శుభ సమయంలో ఆడబడుచు రాక్షసి ఎందుకు? ఈ యట్టహాసమేమిటి? జుత్తు విరబోసుకొని, నెత్తిమీద కుంపటి పెట్టుకొని, ఊరేగింపుముందు కేకలు పెడుతూ ఆ యాట పాటలేమిటని ఉమ తల్లి దండ్రులు హడలిపోయి, ఖిన్నులై, చేష్టలుడిగి, దిక్కుతోచక చూస్తూండగా ఒక మహర్షి వచ్చి "మీరేం భయపడకండి. ఆమె చాలా మంచి ఆడబడుచు. ఏదో తమ్ముని పెళ్ళిగదా అని సరదాగా వచ్చింది, ఆనందంగా ఆడుతూ ఉంది. ఆమె శాశ్వతంగా శివుని ఇంట ఉండదు. ఈ మూణ్ణాళ్ళ ముచ్చట కళ్ళారచూసి ఆనందించి, అరణ్యంలో ఉన్న తన అత్తవారింటికి వెళ్ళిపోతుంది" అని వారికి చెప్పి, వారి సందేహాలను నివృత్తి చేసి, భయాన్ని పోగొట్టేడు.

నేను ఊహించుకొన్న ఈ దృశ్యాలన్నీ నా కళ్ళ ముందు కదలాడేవి. ఉజ్జయినీ కాళిదాస నాట్య సమారోహానికు 'కుమారసంభవం' నృత్య నాటకాన్ని తయారుచేసి, తీసికొని వెళ్ళినపుడు ఈ యనుభూతులు, అనుభవాలు నాకెంతగానో ఉపకరించాయి.

మాతా పితృడన్న భావంతో మనం శివుణ్ణి ఆరాధిస్తాం. అందువల్ల తల్లిదండ్రుల శృంగారాన్ని విపులంగా వర్ణిస్తూ రచించలేం, అభినయించలేం. పార్వతీపరమేశ్వరుల శృంగారం భక్తితో, పవిత్రభావంతో కూడుకొన్నది.

అభినయ కళను సంపూర్ణంగా ఆరాధించాలన్న కోర్కె నాలో దినదినాభివృద్ధి చెందింది. శృంగారం కైశికీ వృత్తి ప్రాధాన్యం గలది. ఇది రసాభినయం....

ఇందులో ముఖ్యంగా ముగ్గురు నాయికలు, అష్టవిధ నాయికావస్థలు, నాయికల దశావస్థలు, చేష్టలు, వ్యాపారాలు, చిత్రాభినయం, అర్థాభినయం, ముప్పైమూడు సంచారులు; దక్షిణుడు మొదలైన నాయకులు, వారి భావాలు - ఇవన్నీ అలంకార, రసాది శాస్త్రాలను అధ్యయనం చేసి, తెలుసుకోవలసినవి.

ఆంగికం, సాత్వికం, శుద్ధసాత్వికం - ఈ విధంగా అభినయ కళను క్రమపద్ధతిలో సక్రమంగా ప్రదర్శించాలన్న కోర్కె నాలో దృఢపడింద.

భాగవత పురుషుడైన కృష్ణుడొక్కడే దక్షిణ నాయకుడుగా ఉండదగినవాడు. అందువల్లనే వ్రజ, సంస్కృతాంధ్రాది భాషల్లోని కృష్ణ కథలను చదవడం మొదలుపెట్టాను. వీటి అధ్యయనంవల్ల నేను కృష్ణునికి చేరువవుతూ వచ్చాను. నాకు కృష్ణుడు సన్నిహితుడన్న భావం కలిగేది. అది నా కొక దివ్యానుభూతి. అయితే ఈ యనుభూతి వేరు, బుద్ధదేవుని ఆరాధన వేరు, శివపార్వతుల నృత్య గాథల్ని నర్తించడం వేరు, వీటి అనుభవం వేరు, పూర్తిగా లీనమై కృష్ణ గాథలను అభినయించడం వేరు.

జగన్నాథుడు ఒక్కడే, జగత్తుకు అతడు నాథుడు. అతడే పురుషుడు. మిగిలిన జీవకోటి అంతా స్త్రీ స్వరూపం-అదే ప్రకృతి.

పరమాత్మనుండి వేరుపడిన ఆత్మ అతని గురించి తహతహలాడి, తపించి, తపించి, చివరకు ఆ పరమాత్మలో లీనమౌతుంది. ఇదే భాగవత సారం, ఇదే భక్తుల విశ్వాసం.

ఈ విధమైన భక్తితత్వాన్ని మధురభక్తి అంటారు. దీనికి ప్రతీకలు రాధామాధవులు. వీరు దివ్య ప్రేమికులు. అయితే ఈ రాధ ఎవరు? కృష్ణుని మేనత్తా? వేరొకరా? నా యభిప్రాయంలో ఈ రాధ ఒక దివ్య ప్రేమికురాలు. తన సర్వాన్ని కృష్ణదేవుని కర్పించిన మధురమూర్తి. ఈ రాదే అసలు లేకుంటే ఈ ప్రపంచంలో ఇంత ప్రేమ కవిత వెల్లివిరిసేది కాదు.

ఈ రాధామాధవుల ప్రేమ, విరహం, వియోగం, అలుక పొలయలుక, చివరకు సంయోగం- ఇవన్నీ కలిసి ఒక దివ్య ప్రబంధంగా రూపొందింది. ఇదే గీత గోవిందం. ఇదే తెలుగువారి పారిజాతం. ఈ గోవిందాన్ని మధురాతి మధురంగా జయదేవుడు సంస్కృతంలో వ్రాశాడు. దీనిలోని పాటల్ని అష్టపదు లంటారు. భారత దేశమంతటా కృష్ణభక్తులు వీటిని పాడుతూ ఉంటారు. నర్తకులు అభినయిస్తూ ఉంటారు. వారి వారి భాషల్లో, వారి నృత్యరీతుల్లో వ్రాస్తారు, ఆడతారు, అభినయిస్తూ ఉంటారు. ఇది శృంగార కవిత. రాధామాధవుల ప్రణయలీల, నమ్మిన వారికి ఇది దివ్య శృంగారం. నమ్మని వారికి లౌకిక శృంగారం. అంతా వారి వారి ఊహల్నిబట్టి ఉంటుంది.

ఇంక మువ్వలోని గోపాలుడు. ఈ గోపాలుని భక్తుడు క్షేత్రయ్య. ఈతడు కవి, గాయకుడు, నర్తకుడు, అభినయ శాస్త్రవేత్త. మువ్వ గోపాలునిపైని అనేక నాయికా నాయకుల ప్రణయలీలకు సంబంధించి పదాలను ఈయన రచించాడు. నాయికా భావాన్ని అభినయించే ఆనాటి నర్తకులకు ఈనాటి నర్తకులకూ కూడ ఈ పదాలు ఆధారాలైనాయి. క్షేత్రయ ఈ పదాలను రచించకపోయినట్లయితే సాహిత్యం, శుద్ధ సాత్వికం, అభినయం ఇంత గొప్పగా దక్షిణదేశంలో అభివృద్ధి చెందేది కాదని పండితుల, శాస్త్రకారుల అభిప్రాయం.

బౌద్ధం, వైష్ణవం, శైవం - ఈ మూడు మతాల గురించి నేను శుభ్రంగా చదవడమే కాదు, అనుభవ పూర్వకంగా నా నృత్యకళకు వీటిని అన్వయించుకొని, ప్రదర్శించడంవల్ల నాలో విశాల భావాలు అభివృద్ధి చెందాయి., నా కళా జీవితానికి ఇవెంతో దోహదకారులైనాయి.

నేను ఖడాంరు రాజావారి ఆస్థానంలో ఉండగా ఇదంతా జరిగింది. నాకు తెలియకుండానే ఈ మార్పు నాలో వచ్చింది. ఇదంతా నా మంచికే జరిగిందని నేను తెలుసుకొన్నాను

నేను నాగపూరులో ఉండగా ఒక సంఘటన నా హృదయాన్ని కలిచివేసింది

మధ్యప్రదేశ్ ఛత్తీస్‌ఘడ్ ప్రజలు చాలా పేదవారు. వీరు పొట్టచేతపట్టుకొని, నాగపూర్ వచ్చి, కూలిపని చేసి, జీవిస్తూండేవారు. ఈ ఛత్తీస్‌ఘడ్ స్త్రీలు చాలా అందమైన వారు. వీరు ఎంత దరిద్రులో అంత సుందరమైనవారు. ఇదే ప్రకృతిలోని వైచిత్రం చింకిగుడ్డలు ధరించినా, వంటి నిండా గుడ్డ లేకపోయినా ఈ స్త్రీల సౌందర్యం కడు రమణీయం. వారి శరీరరంగు చామనఛాయ. వీరిలో కొందరు ధనవంతుల ఇండ్లలో పాచిపని చేసేవారు, కొందరు బజారులో కూలికి గంపలు మోసేవారు. అలాంటి వారిలో ఒకామె నా యింట్లో పనికి కుదిరింది. ఆమెది నడివయస్సు భర్త పోయాడు. ఆమెపేరు రయిబాయిన్‌రమా. ఆ రోజుల్లో ఆమెకు నెలకు రు. 30/-లు ఇచ్చేవాణ్ణి ఆ రోజుల్లో అది చాలా ఎక్కువ అని చాలామంది నాతో అన్నారు. అది ఎక్కువో, తక్కువో నాకు తెలీదు. ఆమె అడిగింది, నేను ఒప్పుకొన్నాను. నాకు అంతే తెలుసు.

నేను రాజావారి కొలువులో ఉన్నాను. సరివారితో సమానంగా ఉండాలి గనుక తాజా షోకులు అలవరచుకొనాలి. అప్పటికి మా అన్నగారు గతించి కొంతకాలమైంది. ఆయన బ్రతికి యుండినప్పుడు ఎన్నో రకాలైన రంగు రంగుల, వివిధ నమూనాల దుస్తులు ధరించేవాణ్ణి. ఆయన పెద్దకర్మనాడు నిర్ణయించుకొన్నాను. మరింక అలాంటి దుస్తులు ధరించకూడదని తెల్లనిదుస్తులు తప్ప వేరొక రంగు దుస్తులు తొడగరాదని. నేటికీ ఆ నిర్ణయానికి కట్టుబడి ఉన్నాను. రాజావారు నాకు ఎన్నో రకాలైన పట్టుబట్టలు ఇస్తూ ఉండేవారు. వాటిని ఎవరికైనా బహూకరిస్తూ ఉండేవాణ్ణి. నేను మాత్రం తెల్లని నూలుబట్టలు ధరిస్తూ వచ్చాను. నాకు అదొక మానసిక తృప్తి

తెల్లదుస్తులు చాలా వేగంగా మాసిపోతాయి. అందువల్ల ప్రొద్దున్న, మధ్యాహ్నం, సాయంత్రం రోజుకు మూడు జతలు మార్చవలసి వచ్చేది.

ఆరోగ్యరీత్యా మంచిదని నేను పియర్స్ సబ్బు వాడేవాణ్ణి. దానికి అంత సువాసన లేకపోయినా చాలా ఖరీదైన సబ్బు. నా బట్టలు రైతాయిన్ కుమారుడు ఉతికేవాడు. ఈ పియర్స సబ్బుతోనే నా బట్టలు ఉతికేవాడు, వాడు చేతులు కడుక్కోడానికి కూడా ఈ సబ్బునే వాడేవాడు. అందువల్ల రెండు రోజులకు ఒక పియర్సు సబ్బు అయిపోయేది. సబ్బు అంత తొందరగా ఎందుకు అయిపోయేదో నాకు తెలిసేది కాదు. చివరకు ఒకనాడు అసలు విషయం కనిపెట్టాను. "ఆదేమిటి, ఒళ్ళు రుద్దుకొనే సబ్బుతో బట్టలు ఉతుకుతున్నావు?" అని వానిని అడిగేను. "బాపూజీ! ఇది నాసిరకం సబ్బు దీనికి వాసన లేదు. బట్టలు దీనితో ఉతికితే వేగం అరిగిపోతోంది. అంతా మోసం! దగా!" అంటూ నాకు పియర్స్ సబ్బు చూపించాడు. వాడి ముఖం చూశాను. చాలా అమాయకంగా ఉంది. వాణ్ణి ఏమనాలో తెలియులేదు. ఎలా మందలించాలో తెలియలేదు. వాడికి దొంగతనం అంటే తెలియదు. అబద్ధాలు అర్థం చేతకాదు. ఉన్నదున్నట్టు, నిజం చెప్పడమే వాడికి తెలుసు. ఏదైనా ఇస్తే పుచ్చుకొంటాడు, కావలసింది అడుగుతాడు. బంగారం దొరికినా వాడు తీసికోడు. నన్ను పిలిచి అప్పచెప్పేవాడు. ఇంత నిజాయితీ పనికి ఇంత పేదరికమా! అని నేను ఒక్కొక్కసారి బాధపడేవాణ్ణి.

పది, పన్నెండు జతల చెప్పు లుండేవి. రోజుకొక రకం చెప్పులు వేసుకొని దివాణానికి వెళ్ళేవాణ్ణి. ఆ చెప్పుల జత లన్నింటిని శుభ్రంగా తుడిచి, వరుసగా అందంగా పెట్టడం మా రవుతాయిన్ పని. ఏ పని చెప్పినా విసుక్కోకుండా చేసేది. ఎందుకంటే, నేను ఎక్కువ జీతం ఇచ్చేవాణ్ణి గనుక.

ఒకనాడు నేను బజారుకు వెళ్ళినప్పుడు తెల్లనికుందేలు చర్మంతో కుట్టిన చెప్పులు కనబడ్డాయి. నా తెల్లని దుస్తులకు ఆ చెప్పులు సరిపోతా యనిపించి వాటిని కొన్నాను. ఆ సాయంత్రం దివాణానికి వెళ్ళడానికి ముస్తాబై తయారుగా ఉన్నాను. కారు ఇంకా రాలేదు. ఆ వేళ కొన్న తెల్లకుందేలు చెప్పులు వేసుకోవాలని రైతాయిన్ను ఆ చెప్పులు తెమ్మన్నాను. ఆమె ఆ చెప్పులు చేత్తో పట్టుకొని, వింతగా చూస్తూ తెచ్చి యిచ్చింది. "చెప్పులు బాగున్నాయా?" అని ఆమె నడిగాను. "చాలా బాగున్నాయి. మీరు వేసుకొంటే ఇంకా బాగుంటాయి" అంది.

"ఎంత చౌకగా కొన్నానో తెలుసా? రూ 30/లకు కొన్నాను.''

ఆమె ముక్కుమీద వేలు వేసుకొని, "రూ 30/- చౌకా? బాబూ! మీరు నాకిచ్చే నెలజీతం రూ 30/-ఈ జీతంతో మా కుటుంబమంతా బతుకుతున్నాం. మా నెల జీతం కర్చు బాబూ, ఈ చెప్పుల ఖరీదు'' అంది తన చిరిగిన చీర సరిచేసుకొంటూ. ఆమె చీర చిరుగులలోనుంచి ఆమె శరీరం అక్కడక్కడ కనిపించింది. ఆ దృశ్యం నన్ను కలిచివేసింది. ఆమె మాత్రం ముసిముసిగా నవ్వుతోంది.

నా చెప్పుల ఖరీదు ఆ బీద కుటుంబానికి నెల్లాళ్ళు తిండి పెడుతుంది, నా చెప్పుల అసలు విలువ నాకిప్పుడు తెలిసింది. కానీ కానీ లెక్కపెట్టి జాగ్రత్తగా కర్చుపెట్టే ఆమెకు ఆ విలువ తెలుసు. అందువల్లనే ఒక కొత్త చీర కొనుక్కొని కట్టుకొనే శక్తి లేక ఆమె ఆ చిరుగుల చీరతో తన శరీరాన్ని కప్పుకొంది. చేతినిండా డబ్బు లున్న నాకు రూ 30/ల విలువ ఎలా తెలుస్తుంది? కాని, ఆమెకు తెలుసు.

ఇంతలో కారు వచ్చింది. ఆ కారులో వెంటనే బజారుకు వెళ్ళి నాలుగు చీరలు కొని తెచ్చి, ఆమెకు ఇస్తూ "రౌతాయిన్! ఇంకెప్పుడు చిరిగిన చీరతో ఇక్కడికి రాకు" అన్నాను. ఆమె ఆ చీరెలు పట్టుకొని, నా వైపు చూస్తూ నిల్చుంది. టపటపమని ఆమె కన్నీళ్ళు కార్చింది. "నమస్తే బాబూ!" అని మాత్రం ఆమె అనగలిగింది. నేను దివాణానికి బయలు దేరాను. కారులో వెళ్తున్నానేగాని ఆమె అశ్రువులే నా దృష్టి పథంలో ఉన్నాయి. నా గురువుల వద్ద నాట్యమే కాదు, దీన మానవుల జీవితాలను అర్థం చేసికొనే శక్తి, సహృదయాన్ని పెంపొందించుకొనడం కూడ నేర్చుకొన్నాను. నా అదృష్టం.

## "ఏ దేశ మేగినా"...

"తాగండి నా బిడ్డల్లారా! తాగండి! అబద్ధాలు చెప్పి, ఒక గ్లాసుడు ఎక్కువ తాగుతున్నారా! అప్పుడే ఏమయింది? ముందుంది ముసళ్ళ పండుగ!"

నా మిత్రుడు నాయుడు టీ ఏజెంటు. అక్కడవారికి టీ పోస్తూ, తెల్లారేసరికి ఇలా తెలుగులో మంత్రాలు వల్లె వేసే వాడు. అక్కడున్నవారికి తెలుగు అర్థం కాదు. అందరూ మరాఠీలు. కొందరికి అర్థమయినా పట్టించుకొనే వాడెవడు? ఎవరి ఆనందం వారిది. ఎవరి తొందర వారిది.

డిసెంబర్ నెలలో నాగపూర్ చలిలో ఘుమ ఘుమ లాడుతూ, పొగలు చిమ్ముతూ, అలనాటి దేవ దానవులు అమృతం కోసం పంక్తులు తీరి కూర్చుని ఉండగా అందమైన అమ్మాయిగా శ్రీ మహావిష్ణువు వేషం కట్టి, అమృతభాండాన్ని చేతబుచ్చుకొని, తన అభినయ విద్యతో అసురులను మోస గించి, అమృతాన్ని పూర్తిగా సురలకే పోసినట్లు నా మిత్రుడు వారికి టీ పోస్తూ ఏం తిట్టినా పట్టించుకొనే దెవరు?

ఆఖరికి మహావిష్ణువు చేసిన మోసాన్ని తెలుసుకొని, రాక్షసులు తిరగబడడానికి సంసిద్ధులైన సమయానికి, తన పనంతా ముగించుకొని, మోహినీ రూపంలో నుండిన విష్ణువు చేతులు దులుపుకొని వెళ్ళిపోగా రాక్షసులు చేసేదేంలేక వెళ్ళి పోయారు. ఈ మోసం జరిగి కొన్ని యుగాలైంది.

దేవతలు వారు కష్టపడి విజయం పొందినట్లు కేరింతలు కొట్టారు. రాక్షసులు తమకు జరిగిన అన్యాయాన్ని మరచి పోవడానికి ప్రయత్నించారు. ఎందుకంటే, క్షీరసాగరాన్ని మథించడంలో వారే ఎక్కువ శ్రమపడ్డారు. ఆదిశేషుని పడగవైపు వారు నిలబడి, ఆ శేషుడు కక్కుతుండిన నిప్పు పొగలు, సెగలు వారే భరించి, సముద్రాన్ని మథించడంలో ఎక్కువగా శ్రమించారు. దేవతలు ఆదిశేషుని తోక ప్రక్క నిలబడి శ్రమను తగ్గించుకొన్నారు. ఎక్కువ శ్రమించిన వారికి ఆ యమృతం దక్కలేదు. శ్రమించినట్టు నటించిన వారికి దక్కింది. దేవతలు అజేయులయ్యారు. వారిని గెలిచే అవకాశం రాక్షసులకు లేకుండాపోయింది. ఏం చేస్తారు? నిరాశపడి ఊరుకొన్నారు.

అంతటితో ఆ సన్నివేశం ముగిసిందా? లేదు. భరతు డనే ముని పుంగవుడు నాట్యశాస్త్రాన్ని రచించి, దానిలో ఒక నాటక పద్ధతిని ఈ క్షీరసాగర మర్దనాన్ని తన బృందం చేత ప్రదర్శింపజేసి, దానికి దేవ దానవులను ఆహ్వానించాడు.

కథా ప్రారంభం బాగానే జరిగింది. అచే అమృతాన్ని పంచే సన్నివేశం. మోహిని రావడం, అమృత భాండంతో వచ్చి, రాక్షసులను మోసగించి, దేవతలకు పంచే సన్నివేశం ప్రదర్శింపబడుతోంది. అసలే విచారంతో కుంగిపోతున్న రాక్షసులకు ఈ సన్నివేశం మరింత బాధాకరమైంది. అందు వల్ల వారు ఆ ప్రదర్శనానికి అడ్డు తగిలారు. దాంతో ఇంద్రు డికి కోపం వచ్చింది. అక్కడున్న ఝర్ఝరాన్ని ఎత్తి రాక్ష సుల్ని పారద్రోలి, ప్రదర్శనాన్ని విజయవంతం చేశాడు.

ఈ ఝర్ఝరమే ఆలయాల్లో ఇంద్రస్థానంలో ధ్వజ స్తంభంగా ఉంది. దీనికి పర్వదినాలలో అష్ట దిక్పాలులకు బలివేసి పిదప జండా పెద్ద ధ్వజానికి తగిలించి పూజించి, దేవునికి కల్యాణం జరుగుతున్నట్టు ప్రకటిస్తారు. ఈ విధంగా ఇంద్రస్థానంలో ధ్వజారోహణ జరుపుతూ ఉంటారు.

అలాగే ఆ నాగపూరు ప్రాంతంలో భయంకర యుద్ధ సమయంలో అన్ని విధాలా రేషన్ ప్రభావానికి లోనై, అవ స్థలు పడుతున్నవేళ, చక్కని బెల్లం పానకం, చిక్కని పాలతో తయారైన వేడివేడి తేనీరు ఏడు అవకుండానే తమ ముందు సాక్షాత్కరిస్తుంటే ఎవరికి మతిపోదు? ఎవరి చిత్తం చలించదు? ఆ రేషన్ కాలంలో చక్కెర దొరకడం పెద్ద

విశేషం. కొంతమంది పేదవారు తమ రేషన్ కార్డుమీద చక్కెర, గోధుమలు కొని, నల్ల బజారులో చాలా ఎక్కువ ధరకు అమ్ముకొనేవారు. ఆ కాలంనుంచే చిన్నా పెద్ద అన్న తారతమ్యం లేకుండా చీకటి వ్యాపారం ప్రబలిపోయింది. నేటికి ఏదో రూపంలో అది కొనసాగుతోంది.

అలాంటి సమయంలో మా మిత్రుడు అందిస్తూ ఉండిన టీ కోసం "నా కంటే నాకు" అంటూ పరుగులు తీసి ముందుకు వెళ్ళి ఒకర్నొకరు తోసుకొంటూ వారి కప్పులు నింపుకొంటూ గటగటా గటగటా తాగేసేవారు. ఆ చలి కాలంలో వారి పొట్టలకు ఈ "గరమ్ గరమ్ ఛా" ఎంతో హాయిని చేకూర్చేది.

ముసి, ముసి నవ్వులు నవ్వుతూ ఉమర్ ఖయ్యాం మధు పాత్రను అతని ప్రియురాలు నింపుతున్నట్లు మా టీ ఏజెంటు వారి పాత్రలను నింపుతూ ఉండేవాడు. వెయ్యేళ్ళు బతకమని వేయినోళ్ళు అతన్ని దీవించేవి. ఇలా ముచ్చటగా మూడు నెలలు గడిచాయి. అందరూ టీ నిషాకు అలవాటు పడ్డారు. అది లేందే బతకలేని స్థితికి వచ్చారు. ఒక శుభ ముహూర్తాన ''మా కంపెనీవారు టీ సరఫరా ఆపేశారు'' అని మా మిత్రుడు, టీ ఏజెంటు ప్రకటించాడు. టీ పొడి పొట్లాలతో వారి ముందు ప్రత్యక్షమయ్యాడు.

''మోసమాయె మందబుద్ధికి, నా సామీ!'' అని వారు జావళిని తీయగా, హాయిగా ఆలపించినా లాభం లేక పోయింది. వేడివేడిగా తయారైన 'ఛా'ను ఉచితంగా సర ఫరా చేయడానికి బదులు 'ఛా' పొట్లాలను వారికి అమ్మడం మొదలుపెట్టాడు. ఆ పొట్లాలు కొనుక్కొని వారు టీ కాచు కొనడం మొదలుపెట్టారు. ఇది వ్యాపార రహస్యం.

అంతకు మూడు నెలల ముందు ఆ ప్రాంతంలో టీ అంటే ఎవరికీ తెలియదు. ఉదయం జిలేబీలు తిని, వేడి వేడి పాలు తాగేవారు. సాయంత్రం అటుకులు ఉప్మా, ఆలు పోహామీద సేవు (కారప్పూస) పొడి జల్లుకొని తినేవారు. పాలల్లో నిమ్మగడ్డి, చక్కెరవేసి, కాచుకొని తాగేవారు. మా స్నేహితుని ప్రభావంవల్ల మూడు నెలల్లో వారి అలవాట్లు మారిపోయాయి. టీ లేందే ఉండలేని స్థితికి వారొచ్చారు.

రకరకాల టీ దుకాణాలు ఆ ప్రాంతంలో వెలిశాయి. ఒక్కొక్క దుకాణం ఒక్కొక్క ప్రత్యేక టీ - మసాలా టీ, పచ్చకర్పూరం టీ, పాలులేని బ్లాక్ టీ, స్పెషల్ ఛా, పౌనేఛా, మలైఛా - ఇలా ఇంకెన్నో. ఇదంతా మా మిత్రుని వర ప్రసాదం. అతని పట్టుదల, అతని దీర్ఘకాల ప్రచారం. టీ మత్తులో ఎంత మహత్తు ఉందో మనం దీన్నిబట్టి తెలుసుకో వచ్చును.

ఈ సందర్భంలో ముచ్చటైన అసలు ముచ్చట మీకు చెప్పడం నా ధర్మం. మా తమిళ స్నేహితుడు- అందే టీ కంపెనీ ఏజెంటు ప్రతిదినం ఒక ఫ్లాస్కులో వేడి పాలు, మరొక ఫ్లాస్కులో వేడి నీలగిరి కాఫీగింజల కషాయం తెచ్చుకొని, కావలసినప్పుడు ఆ రెండింటిని కలుపుకొని సేవిస్తూ ఉండేవాడు. అందులోనే ఉంది వారి ప్రత్యేకత, విశిష్టత, వివేకం. "ఏ దేశమేగినా ఎందుకాలిడినా...." వారి ప్రత్యేకతను వారు నిలుపుకొంటారు. వారి కట్టూ, బొట్టూ కాపాడుకొంటారు. లండన్ వెళ్ళినా వారు వారి గూడకట్టు మరచిపోరు.

తెలుగువారు ఏ ప్రాంతం వెళితే ఆ ప్రాంతం వారితో కలిసిపోతారు. వారి ప్రత్యేకతను విస్మరిస్తారు. ఆ ప్రాంతానికి పుష్టిని చేకూరుస్తారు. వీటిలో ఏది మంచిది? ఏది చెడ్డది? ఏది స్వార్థం? ఏది నిస్వార్థం? అని ఆలోచిస్తే రెండూ మంచివే. ఒకటి జాతీయత, రెండవది అంతర్జాతీయత.

## భగత్ సింగ్

"అయ్యోయ్యో! నా భగత్‌సింగ్! అకటా! సుకదేవా! నా రాజగురూ! నేడు దొరతనమువారలచే ఉరితీయబడ్డారా?"

నేను చాలా చిన్నవాణ్ణి. కొబ్బరి చెట్లు, పచ్చనిపసరు చిమ్మే పైరుపొలాలు, విరబూచిన చామంతి పూలతోటలు, కనుచూపుమేరలో ఎక్కడ చూచినా పచ్చని ప్రకృతి సౌంద ర్యంతో కోనసీమ కళకళ లాడుతూ ఉండేది. కోనసీమను చూస్తూంటే నాకెంతో ఆనందంగా ఉండేది. ఎప్పుడు అక్క డికి వెళ్ళాలన్నా ఎగిరి గంతేసేవాణ్ణి. అది మా పెద్దమ్మమ్మ గారు ఉండే ప్రాంతం. ఆ అన్నపూర్ణ తెల్లవారకముందే లేచి తలారా నీళ్ళుపోసుకొని, ఆ తడి ఆరని జుత్తును వేలుముడి

వేసి, ముత్యమంత పసుపు ముఖానికి పూసుకొని, పావలా కాసంత కుంకుమ బొట్టు పెట్టుకొని, తెల్లని ఖద్దరు చీర ధరించి, ఆ పటం ముందు నిల్చొని, కర్పూరహారతి ఇచ్చి, పైన చెప్పిన విధంగా పాడుతూండేది.

ఎవరీ భగత్‌సింగ్? సాధారణంగా మనవారి పేర్ల చివర రావు, మూర్తి, శాస్త్రి, శర్మ, వర్మ మొదలైన పదా లుంటాయి. సింగ్ అన్న పదం ఉండదు. రాజపుత్రులు, బుందేల్ ఖండ్‌నుంచి వచ్చిన బొందిలీలు వారి పేర్లకు చివర సింగ్ అన్న పదం తగిలించుకొంటారు. మనవారిలో చాలా మంది నరసింహం, సింహాచలం, వెంకన్న, వీరయ్య మొద లైన పేర్లుకూడా పెట్టుకొంటారు. మరి ఈ సింహం పిల్ల ఎవరు? అతనికి మా పెద్దమ్మకు సంబంధ మేమిటి? అవి దేశభక్తి వెల్లివిరిసిన రోజులు. భారతదేశ స్వాతంత్ర్య సమ రంలో ఎందరో త్యాగధనులు తమ అసువులు బాసిన రోజు లవి. నారీమణులు ఇండ్లలోని పరదాల చాటునుండి బయటకు వచ్చి, కర్రలు, కత్తులు ధరించి, కవాతుచేసిన రోజులవి. ఆ కాలంలో పంజాబులోని కొన్ని యువకిశోరాలు తెల్లవారితో తలపడిన రోజులవి. మా అమ్మమ్మ దేశభక్తురాలు. గాంధీజీ ఉపన్యాసాలు విని ఆమె ప్రభావితురాలై కాంగ్రెస్ సేవికగా పనిచేశారు.

ఆంగ్ల పరిపాలకులకు ఎదురు తిరిగిన భగత్‌సింగ్, రాజ గురువు, సుకదేవ్ మొదలగువారు ప్రభుత్వానికి పట్టుబడ్డారు. చట్టరీత్యా వారు రాజద్రోహులయ్యారు, ఉరితీయబడ్డారు. ఆనాటి పదికోట్ల భారతీయులు భారతమాతకు ముద్దుబిడ్డలు. ఒక చెంప కొడితే నీరు, వేరొక చెంప కొడితే పాలు కారే లేప్రాయులు వారు. అందువల్ల ఈ సాహసవీరులను ఉరి కంబంనుంచి తప్పించలేకపోయారు ఆ కర్కశ హృదయు లైన ఆంగ్లేయులకు, వారి కరకు కత్తులకు మన స్వాతంత్ర వీరులు బలి అయ్యారు. ఆనాడు భారతమాత ఎంత విల పించిందో! ఆమె మనస్సు ఎంత విలవిలలాడిందో! తన నిస్సహాయతకు ఆమె హృదయం ఎంత దుఃఖించిందో! ఆమె కన్నీరు మున్నీరై, కెరటాలుగా ఉప్పొంగి, ప్రవ హించి, సామాన్య ప్రజానీకాన్ని మేల్కొలిపింది. ఆ ప్రవా హానికి ఎన్నో విధాల ఆనకట్టలు వేయాలని ఆ విదేశీ పాల కులు ప్రయత్నించారు. వారి ప్రయత్నాలు ఫలించక పోవ డంతో భారతదేశాన్ని రెండు ముక్కలు చేసి, మరీ వెళ్ళారు. అంతవరకు మన భారతీయులు శాంతించలేదు. ఆ రోజుల్లో భగత్‌సింగ్ మొదలైన వారి పటాలను ఇండ్లలో పెట్టుకొన డాన్ని రాజద్రోహంగా బ్రిటిష్ పాలకులు పరిగణించారు.

మా అమ్మమ్మ పూజిస్తూండిన ఆ పటానికి ఇంత చరిత్ర ఉంది. కాని, ఆనాడు నా కీ విషయం తెలీదు. మా అమ్మమ్మ కాంగ్రెసు భక్తురాలు. నూలు వడికేది. ఖద్దరే ధరించేది. ఈ దేశ రాజకీయాలలో ఆమె ఆస్తి చాలా హరించిపోయింది. అయినా, ఆమె లెక్కచేయలేదు. దేశ స్వాతంత్ర్యమే తన ధ్యేయంగా జీవించి, స్వాతంత్ర్యం రాకుండానే ఆమె తన జీవితం చాలించి, అనంత వాయు వుల్లో కలిసిపోయింది.

ప్రతి యేటా ఆగస్టు 15వ తేదీన స్వాతంత్ర్యదినం వస్తూ ఉంటుంది. అది నాయకులకు వినాయకులకు పెద్ద పండుగ. వీరు వీలయినన్ని జాతీయ జెండాలను ఎగర వేస్తారు. తర్వాత మైకుల్లో దేశ స్వాతంత్ర్య సమరం గురించి ఎవరో వ్రానిచ్చింది, చదివి వినిపిస్తారు. త్యాగం, దేశభక్తి, ఆత్మార్పణం గురించి తెలియక గంటల కొలది ఉపన్యాసాలు ఇస్తారు. తమ పలుకుబడిని బట్టి పెద్ద పెద్ద శీర్షికలతో ఆ ఉపన్యాసాలను దినపత్రికల్లో వేయించు కొంటారు, చూసి ఆనందిస్తారు. స్వాతంత్ర్యదినోత్సవ మిఠాయి పొట్లాలతో ఇంటికి చేరుకొంటారు. తర్వాత అర్ధరాత్రి గడిచిపోతుంది. మళ్ళీ రిపబ్లిక్‌డే వరకు దేశభక్తి గీతాలు వారి దృష్టిపథం నుండి దూరంగా వెళ్ళిపోతాయి. స్వార్థ భక్తిగీతాలు ప్రారంభమౌతాయి. ఇదీ మన దేశం - స్వార్థ పూరితమైన మన భారతదేశం.

ఆగస్టు 15వ తేదీనాటి ప్రత్యేక దినపత్రికం నిండా ఝాన్సీరాణీ చిత్రాలే. ఏ కవి చూసినా "మన ఝాన్సీ" అంటూ పద్యమో, పాటో వ్రాస్తాడు. ఆమె జీవిత చరిత్రను వీరిలో ఒకడైనా అసలు చదివేడో లేదో మనకు తెలియదు.

ఝాన్సీరాణీలాగే గోండురాణీ, గర్హమండలరాణి పద్మావతి తన రాజ్యాన్ని కాపాడుకొనడానికి తన శత్రువు

లతో పోరాడి. పోరాడి యుద్ధభూమిలో తన అసువులు బాసింది. ఈ వీరవనిత గురించి ఏ ఒక్క కవీ ఒక పద్యం వ్రాయలేదు. అసలు ఆమె గురించి వీరికి తెలిస్తేగదా? అందుకే ఆమె త్యాగం, దేశభక్తి, సాహసం అడవిగాచిన వెన్నెలలై, చరిత్ర పుటల్లోకి ఎక్కకుండా చెదిరిపోయాయి. మన చరిత్రను సంపూర్ణంగా అధ్యయనంచేసి కవితల్లో కవులు, రచయితలు అరుదైనారు. అలాంటి 'దశరథులు' కరువైనారు.

అంతవరకెందుకు? విజయవంతంగా కాకతి మహాసామ్రాజ్యాన్ని పరిపాలించిన వీర రుద్రమ మాట ఏమిటి? "ఆడది రాజ్యమేలడమా?" అని అహంకారంతో కొందరు పొగరుబోతులు అవహేళనం చేస్తే, తన కత్తి పదునును వారికి రుచి చూపించి, వారిచేత దాసోహం అనిపించింది. అక్కడక్కడ ముక్కలై, చెల్లాచెదురుగ పడియున్న తెలుగు ప్రాంతాలను ఒకటిగా చేర్చి, తెలుగుజాతికి వెలుగై, తెలుగు వారందరిని ఒక త్రాటిమీద ఆమె నడిపించింది. శిల్పం, చిత్రకళ, సంగీతం, సాహిత్యం ఇత్యాది లలిత కళలను పోషించి, ఎన్నో శిల్పమందిరాలను ఆమె కట్టించింది; చెరువులు తవ్వించింది. కాని, ఈ లోకానికి ఎంత మరుపు? ఆమెను ఎన్నిసార్లు స్మరించింది ఈ లోకం? ఇదీ ఒక లోకమే! శ్రీ ఎన్. టి. రామారావుగారు వారి హయాంలో రుద్రమదేవిని మరచిపోకుండా ఆమె విగ్రహాన్ని కొంతమంది ఇతర దేశప్రముఖుల విగ్రహాలతో పాటు టాంక్‌బండ్‌మీద నెలకొల్పారు. వారు చేసిన ఈ కార్యానికి వారికి జోహారులు అర్పించవచ్చు. కాని, గుర్రంమీద సవారి చేస్తున్న ఆ శిల్ప మూర్తిలో రుద్రమ హుందాతనం, తేజం, పౌరుషం, సాహసం మొత్తం మీద ఆమె వ్యక్తిత్వం లోపించినట్టు నాకు అనిపిస్తూ ఉంటుంది.

## దీపాల దిన్నెలు - భోగం దాని మెట్టలు - లంజ దిబ్బలు

ప్రేమ వాహినులను ప్రవహింపజేసి, ప్రజలు శాంతి యుతంగా ప్రపంచంలో జీవితం గడపడానికి బౌద్ధమతం నిజంగా దోహదం చేసింది. మానవునిలో మాధవుణ్ణి చూడ గల శక్తిని, ఓర్పును, సహనాన్ని బౌద్ధం పెంపొందించింది. గౌతముని బోధలవలెనే బౌద్ధ శిల్పంలోగూడ శాంతి సౌఖ్యాలు మనకు గోచరిస్తాయి. ఆ తెల్లని ప్రతి పాలరాతి బొమ్మ శాంతి గీతాలను ఆలపిస్తూ, ఎంతో ముచ్చట గొల్పుతూ ఉంటుంది. మరి అంతటి పవిత్ర ఆశయాలను ప్రబోధించే ఆ కళా ఖండాలను నాశనం చేయడానికి - అదీ మతంపేరిట నాశనం చేయడానికి ఆ చేతులెలా ఆడాయో? ఆ సుందర శిల్పాలతో అలరారుతుండిన ఆ పవిత్ర స్థలాలలో ఒకనాడు "బుద్ధం శరణం గచ్ఛామి" అని ఆలపిస్తూ, ఆ స్థూపాల చుట్టూ ప్రదక్షిణలు చేస్తూ, ఆ శాంతమూర్తి తథాగతుని ఆరాధిస్తూ ఉండేవారు. కోటిదీపాల కాంతితో కన్నులను మిరుమిట్లు గొల్పే ఆ పవిత్ర స్థలాలకు "దీపాల దిన్నె"లని పేరు పెట్టారు. బుద్ధ దేవుని పవిత్ర ధాతువును ఒక బంగారు దబ్బీలో ఉంచి, దాని చుట్టూ ఆనాడు ఒక సుందరమైన స్థూపాన్ని నిర్మించారు. కాని, తర్వాత కొందరు మత దుర హంకారులు బౌద్ధమతాన్ని ఆ ప్రాంతంనుండి పారద్రోలడమే కాక, "ధర్మం శరణం గచ్ఛామి" అన్న ఆ పవిత్ర మంత్రం అక్కడ వినిపించకుండా చేసి, ఆ పవిత్ర స్థలాన్ని "భోగందాని మెట్టలు" అన్నారు. "లంజ దిబ్బ"లని దూషించారు. చివరకు "ఆ కుక్క పిచ్చిదని చెప్పి చంపు" అన్న విధంగా ఈ పేర్లు పెట్టి ఆ సుందర స్థూపాలను, మందిరాలను, విహారాలను- ఒక్కటేమిటి అన్నింటిని నాశనం చేశారు. కొందరు ఆ తెల్లని పాలరాళ్ళను కాల్చి, వారిండ్లకు సున్నం వేసుకొన్నారు. మరి కొందరు ఆ స్థూపాల ఇటుకలతో ఇళ్ళు కట్టుకొన్నారు.

అక్కడ మిగిలిన శిల్ప సౌందర్యమంతా భూమాత ఒడిలో సేద తీర్చుకొంటూ "ఏనాటికైనా వెలుగు చూడనా?" అన్నట్టు అజ్ఞాతవాసం చేసింది, చేస్తూంది. ఈ వినోద చరిత్రను మార్చి, ఆ "ఆవేదనాశ్రువులను ఆనంద బాష్పాలు"గా మార్చాలన్న సంకల్పంతో ప్రభుత్వం కొన్ని చోట్ల మ్యూజియంలు పెట్టి ఆ శిథిలావశేషాలను భద్రపరు స్తున్నది.

ఆ శిథిల స్థూపాలు ఈనాడు గూడా ఇంత సొగసుగా ఉంటే అనాడు అవి ఎంత శోభాయమానంగా ఉండేవో ఊహించలేం.

ఇది మతం పేరిట మానవుడు దాసవుడై చేసిన ఘోరం. మనుష్యునిలో స్వార్థం, ఈర్ష్య, ద్వేషాలు తొలగి పోయేవరకు మతమేదైనా, ప్రవక్తలెవరైనా మనకు మిగిలేది ఈ విధ్వంసమే. ఆంధ్రలో బౌద్ధమతం విరివిగా వ్యాపించి యుండినప్పుడు బౌద్ధులు ఈ యారామాలకు "దీపాల దిన్నెలు'' అని భక్తితో పేరు పెట్టి యుండవచ్చును.

అంగభోగం, రంగభోగం అని భోగం రెండు విధాలైంది. బౌద్ధ స్త్రీలు భక్తితో బుద్ధదేవుని సంగీత నృత్యాలతో సేవిస్తూ ఉండేవారు గనుక ఆ స్థలాలకు 'భోగం దాని మెట్టలు' అన్న పేరు వచ్చి ఉండాలి.

బౌద్ధ మతాన్ని కొందరు అగౌరవనీయంగా దూషించడం వల్ల దానికి అగౌరవమైన పేర్లు పెట్టి, ఆ సంస్కృతిని, ఆ ఆరామాలను నాశనం చేయదలచారు. అందుకే వాటికి "లంజదిబ్బ"లని పేరు పెట్టారు.

నేల విడిచి సాము చేస్తున్నట్టు నృత్య కళను విడిచి బౌద్ధం గురించి నేనెందుకు వ్రాస్తున్నానా అని మీలో కొందరికి ఒక అనుమానం రావచ్చును, అప్రస్తుతం అని గూడా అనిపించవచ్చును.

అయితే నాట్యశాస్త్రం, అభినయశాస్త్రం, రస శాస్త్రిలను చదవడంకాక అనుభవపూర్వకంగా అర్థం చేసుకొనాలనుకొనే కళాకారుడు అమరావతి, నాగార్జున, సాంచీ, సారానాథ్ మొదలైన శిల్పాల్లోని ఈ మూడు శాస్త్రిలను అధ్యయనం చేయాలి.

అజంతా, ఎల్లోరా గుహల్ని వీరు ఒక్కసారైనా సందర్శించి, అక్కడ కొంత సమయం గడపాలి. అమరావతి స్థూపంలోని కథల్లో అతి చిన్న శిల్పమూర్తులు వివిధ భావాలలో కనిపిస్తాయి. ఆ భావప్రదర్శనం, ఆ కనుగవలు, ఆ హస్తపాద విన్యాసాలు, ఆయా రసభావాలు ఎలా ఉన్నాయో తెలుస్తుంది. ఇవి కళాకారులకు ఎంతగానో ఉపకరిస్తాయి. ప్రతి శిల్పాన్ని నిశితంగా పరిశీలిస్తే, ఆ స్థానకాలు, కాళ్ళ కదలికలు, ఆకాశ, భూచారీ విన్యాసాలు, వివిధ కరణాలు, అంగహారాల కూర్పు మొదలైనవన్నీ మనకు ప్రాయోగికంగా గోచరిస్తాయి.

జాతక కథల్లో అనేక రసాలను పోషిస్తూ ఈ శిల్పాలను చెక్కారు. భావవికాసాన్ని స్వయంకృషితో అధ్యయనం చేయడానికి ఇవన్నీ మనకెంతో ఉపకరిస్తాయి.

సశాస్త్రీయంగా నాట్యకళను అభ్యసించిన స్త్రీమూర్తుల శిల్పాలు ఇక్కడ ఉన్నాయి. శిల్పులు ప్రాయోగికమైన నృత్యకళను వీటిలో పొందుపరచారు. వీటిని పరిశీలించి, పరిశీలిస్తే కళాకారులకు నృత్యకళ కరతలామలక మౌతుంది.

రావణుడు కైలాసాన్ని ఎత్తిన ఒక చక్కని శిల్పం ఎల్లోరా గుహల్లో ఉంది. రావణుడు కైలాసగిరిని ఎత్తుతున్నప్పుడు అక్కడ ఉండిన పార్వతిదేవి మొదలైన దేవతాగణాల ప్రతిస్పందనలు ఆ శిల్పంలో గోచరిస్తాయి. ఆ కైలాసగిరి కదులుతూంటే వారి వారి గుణగణాలను బట్టి వారిలో కలిగే నవరస విన్యాసాలు - శృంగారం, వీరం, అద్భుతం, హాస్యం మొదలైనవి - ఎలా ఉన్నాయో తెలుస్తుంది. సంచారుల తీరు, గతి గమనం, లయ విన్యాసం మొదలైనవి అవగతమౌతాయి. ఈ విధంగా వ్రాస్తూ పోతే ఇదొక పెద్ద గ్రంథమౌతుంది. ఆ ఒక్క శిల్పం ఒక రస సృష్టి. ఆ కఠిన శిలలో కొన్ని వందల సంవత్సరాల క్రితం ఒక శిల్పి ఈ విధమైన శిల్పాన్ని సృష్టించాడంటే అతడెంతటి మహనీయ కళాకారుడో మనం ఊహించలేము. ఈ శిల్పాన్ని సృష్టించడానికి ఆ శిల్పికి నమూనాలుగా ఉండిన కళాకారులు ఎంత గొప్పవారై యుండాలి? వీరికి విద్యనేర్పిన గురువులు ఎంతవారై ఉండాలి? వారు అధ్యయనం చేసిన శాస్త్ర గ్రంథాలను రచించిన గ్రంథకర్తలు ఎంత గొప్ప నాట్యశాస్త్ర వండితులై ఉండాలి? ఇదంతా కొన్ని వందలసంవత్సరాల క్రితం జరిగిన వాస్తవ చరిత్ర - చాలా అద్భుతమైన చరిత్ర!

బౌద్ధ ఆరామాలలో గల జాతక కథల శిల్పాలలోని భావ ప్రకటనలను వర్ణిస్తూ ఏ కవి కూడా ఒక సంపూర్ణ కావ్యాన్ని వ్రాయలేదేమోనని నాకు అనిపిస్తుంది. ఇంత వరకు ఏ కవీ వ్రాయలేదు.

ఆ శిల్పాలను మెచ్చుకొంటూ ఏవో నాలుగు పద్య పాదాలు వ్రాసి, చెప్పలు చరచుకొంటే లాభంలేదు. ఆ శిల్పాల లోని కథలను మన కళ్ళకు కట్టేటట్టు రచిస్తూ, ఆ తాళలయ గతులకు తన పద్యాలలో వాటికి రూపకల్పన చేయగలగాలి. మామూలుగా చూస్తే అవి కదలలేని మూక శిల్పాలు. కాని, వాటితో మనం మాట్లాడ గలిగితే ఆనాటి సంగీత సాహిత్యాలు, ఆ భాష, ఉచ్చారణ, కవిత్వం, వేషధారణ, అలంకరణ, కేశాలంకరణ, సాంఘిక పరిస్థితులు మొదలైన వాటి గురించి అవి చెప్తాయి.

ప్రాంతీయ భాషలు, ప్రాంతీయ కళలు అభివృద్ధి చెందకముందు భారత దేశమంతటా నాట్యకళ ఒకే తీరులో అభివృద్ధి చెందినట్లు మనం ఈ శిల్పాలను పరిశీలించి చెప్ప వచ్చును. ఈ శిల్పాలను పరిశీలిస్తే ఆనాటి సాంఘిక చరిత్ర మన కళ్ళముందు గోచరిస్తుంది. ఒక చిన్న వర్ణన చిత్ర శిల్పంలో వంద రూపాలు, వందల భావాలు - ఇలా ఎంతని వర్ణించగలం? వర్ణించడానికి భాష చాలదు. మన గురువులు ఆనాటి ఆధ్యాత్మిక సందేశాన్ని మనకు చెప్పగలిగినా దానిని అర్థం చేసికొని, అభ్యసించి, ఆచరించడానికి మన జీవిత కాలం సరిపోదు. అందుకే ప్రతి కళాకారుడు తన జ్ఞానాభివృద్ధికి ఈ బౌద్ధ క్షేత్రాలను దర్శించాలి. దర్శించేటప్పుడు వీటిని వివరించగల వ్యక్తి ప్రక్క నుండాలి.

ఆ శిల్పాలకు మన భాష రాదు. వాటి భాషలో వాటితో మనం మాట్లాడగలగాలి. వాటి భావాన్ని మనం అర్థం చేసుకొనాలి. ఇందుకు తగిన శక్తి సామర్థ్యాలు మనం అలవరచుకొనాలి. ఈ తపన మనకు ఉండాలి. తపస్సు చేయాలి, తరించాలి. మన విజ్ఞానవేత్తలు, తత్వవేతలు చెప్పింది ఇదే.



మండపేట వాస్తవ్యురాలు శ్రీమతి పందిరి వేంకటరత్నం
భామవేషంలో - మార్దంగికుడు, సూత్రధారులతో

# యోచన - ఆలోచన

నేను గుంటూరులో ఉండగా శ్యామా కౌండిన్య చేత అనేక నృత్య ప్రదర్శనలు ఇప్పించాను. ఈ ప్రదర్శనలన్నీ శాస్త్రీయ నృత్యకళా ప్రచారంకోసం ఇచ్చినవే గాని, ధనార్జన కోసం కావు. ఒక్కొక్కప్పుడు నా సొంత డబ్బు వీటికోసం కర్చుపెట్టవలసి వచ్చేది. ఆంధ్రదేశంలో శాస్త్రీయ నృత్య కళను ప్రచారం చేయడమే ఆనాటి నా ప్రధాన లక్ష్యం. మన నృత్యకళ మరుగున పడిపోయి, ఉత్తమ శ్రేణికి చెందిన కళా కారులందరూ నృత్యకళనుండి విరమించుకొని, తెరమరుగుకు వెళ్ళిపోయిన రోజులవి. మనకు ఒక విశిష్టమైన నాట్యకళ ఉంది. అది ఆరాధించబడింది. ఆ కళ అంతరించిపోకూడదు. అది అంతరించిపోతే తెలుగు జాతికి ఎంతో నష్టం వస్తుంది. ఇలాంటి భావాలే నా మెదడులో మెదలుతూ ఉండేవి. అందు కనే నేను విశేషంగా ఆంధ్రదేశంలో పర్యటించాను. లెక్కకు మించి నన్ని సభలు సమావేశాలలో అభినయ పూర్వక ప్రసం గాలు చేశాను. నా అభినయం చూడ్డానికి, నా ప్రసంగాలు వినడానికి అనేకమంది ప్రేక్షకులు వచ్చేవారు. కళాశాలలు, ఉన్నత పాఠశాలలు, రోటరీ క్లబ్బులు, లైన్సుక్లబ్బులు, మహిళా సమాజాలు మొదలైనచోట్ల ప్రధానంగా ప్రదర్శ నలు ఇచ్చేవాణ్ణి. వీటివల్ల నాకేం లాభం? అని నేనెప్పుడూ యోచించలేదు. నా ప్రదర్శనలవల్ల ఆంధ్రదేశానికి, తెలుగు ప్రజలకు, తెలుగు జాతికి ప్రయోజనం కలగాలన్నదే నా ఆలోచన. ప్రజలకు కళా విజ్ఞానాన్ని ప్రబోధించగలిగానా? లేదా? అన్నదే నా యోచన,ఆలోచన. ఆ రోజుల్లో నాకు డబ్బు కొరతలేదు, ఆర్థిక యిబ్బందులు లేవు, కళా ప్రచారమే నా జీవితధ్యేయం. ఆనాటి నుండి ఈనాటి వరకు అదే నా జీవిత ఆదర్శం. ఆ కాలంలో నాట్యకళ గురించి అధ్యయనం చేసిన వారు తక్కువ. నాట్యకళ గురించి ఉపన్యసించగలవారులేరు. ఆడుతూ, పాడుతూ నృత్యకళను గురించి వివరించగలవారు అసలే లేరు. నేనే మొదటి వాణ్ణి అని గర్వంగా చెప్పుకోగలను.

ఈ ప్రదర్శనలకు విద్యార్థినీ విద్యార్థులు, యువకులు, వృద్ధులు, స్త్రీలు పురుషులు, ఆబాలగోపాలం వచ్చేవారు. వారికి నేను నాట్యంచేసి చూపించడమేకాదు - నాట్యం ఎలా చేయాలి? నాట్యం అంటే ఏమిటి? నృత్త మంటే ఏమిటి? నృత్య మంటే ఏమిటి? అభినయ మంటే ఏమిటి? సాత్వికాభి నయమంటే ఏమిటి? శుద్ధసాత్వికం అంటే ఏమిటి? ఇవన్నీ ప్రేక్షకులకు వివరించి చెప్పేవాణ్ణి. ఒక పాటలోని మాటల అర్థాన్ని ఎలా ముద్రలతో చెప్తారు? అసలు ముద్రలంటే ఏమిటి? పాటలోని భావాన్ని ముఖంలో ఎలా ప్రదర్శించాలి? ఇలా ప్రతి విషయాన్ని ప్రాయోగికంగా ప్రదర్శించి చూపించే వాణ్ణి. అందువల్ల నా ఉపన్యాసాలకు పిలవకుండానే చాలా మంది వచ్చేవారు. తరచుగా ఈ ప్రదర్శనలను ఇస్తూండడం వల్ల పిలిస్తే భావం, అభినయం నాలో పలికేవి.

ఆంధ్రదేశానికి రాకపూర్వం చాలాకాలం నాగపూర్‌లో ఉండినందువల్ల మొదట్లో ధారాళంగా తెలుగులో మాట్లాడలేక పోయేవాణ్ణి కాని, ఈ ప్రదర్శనలవల్ల రాను రాను సరళంగా మృదువైన భాషలో ప్రసంగించడం అలవాటయింది. గంటల కొలదీ చక్కని సంగీతాన్ని మధురంగా గానంచేస్తూ, అర్థాభి నయం, భావాభినయం ప్రదర్శించడం కొట్టినపిండి అయింది. తెలుగు భాష సొంపు, సొగసూ, కమ్మదనం, మాధుర్యమూ తెలుసుకొనే అవకాశం కళాప్రియులకు కలిగింది. సాధారణ నాట్య ప్రదర్శనలు చూసే ప్రేక్షకులకు ఈ యవకాశం కలగదు. అందువల్ల నా ఉపన్యాస ప్రదర్శనలకు అనేకమంది వచ్చి మన నృత్యకళ విశిష్టతను, పరిపూర్ణతను తెలుసు కొనేవారు. ఈ విధంగా నెలకు 25 రోజులు పర్యటించి

ఉపన్యాసాలు ఇస్తూ ఉండేవాణ్ణి. ఒరిస్సా రాష్ట్రంలోని కటకం మొదలుకొని దక్షిణాన నెల్లూరు వరకు విపరీతంగా పర్యటించాను. ఒక్కొక్కప్పుడు రోజుకు రెండు మూడు ప్రదర్శనలు ఇవ్వవలసి వచ్చేది. ఆ కాలంలో ఒక కార్యదీక్ష, ఉత్సాహం ఉండడంచేత దేశమంతా పర్యటిస్తూ ఉపన్యాసాలు ఇవ్వడం కష్టమనిపించలేదు. కాని, కొంత కాలానికి నా అనారోగ్యానికి ఇది కారణ మయింది.

అనాడు బి.ఏ., ఎం.ఏ చదువుకొంటూ ఉండిన విద్యార్థులు కొందరు ఈనాడు పెద్ద ఉద్యోగస్తులైనారు. వారు ఎవ్వరైనా ఇప్పుడు కలుసుకొంటే - అనాడు వారు నా ప్రదర్శనల వలన పొందిన అనుభూతుల్ని నాతో చర్చిస్తూంటే నా గతకాల స్మృతులు నాకు ఆనందాన్ని కలిగిస్తూ ఉంటాయి.

నాట్య ప్రదర్శన ఇచ్చి డబ్బు సంపాదించాలన్న ఆలోచన నాకెప్పుడూ లేదు. అందువల్ల కొందరు ధనవంతులు తమ యింటి వివాహాది శుభకార్యాలలో నాట్యం చేయమని, అడిగినంత డబ్బు ఇస్తామని పిలిచినా నాకు మనస్కరించక నేను వెళ్ళేవాణ్ణి కాను నా నాట్య ప్రదర్శనలు కళా ప్రచారం కోసమే. ఇదే నా జీవిత ఆదర్శం.

నాట్యకళ విశిష్టతను, దాని లోతులను విద్యావేత్తలకు గూడ చెప్పగలిగాను. అప్పటివరకు పండితులు నాట్య శాస్త్రాలను చదవడమే కాని, వాటి ప్రయోగాన్ని వారు తెలుసుకో లేదు. అందువల్ల నా ప్రదర్శనలు చూసి వారు ఆనందించి, నన్ను మెచ్చుకొంటూ ఉండేవారు. వారి మెప్పులతో నేను ఒక కళాకారునిగా ఉన్నత శిఖరాలను అధిరోహించానని ఆనందించానే కాని, నా ఆర్థిక స్థితి గురించి ఆలోచించలేదు. నేను కళాలోకంలో విహరిస్తూ ఉండడం వల్ల ఈ లోకం పోకడలు తెలుసుకోలేకపోయాను.

అనాటి విద్యావేత్తల, ఉన్నత ప్రజల ఆదరాభిమానాలు వేరుగా ఉండేవి. అంతకు ఒక దశాబ్ది పూర్వం ఈ నాట్యకళను సంఘం ఎంతో నీచంగా చూసింది. కాని దాని దృక్పథం మారింది. ఆ సంఘమే ఈ నాట్యకళను ఆదరించి, అభిమానించడం మొదలుపెట్టింది. దీనివల్ల నాకెంతో సంతృప్తి కలిగింది. నా జీవితం ఎల్లకాలం ఇలా ప్రజల ఆదరాభిమానాలతో గడిచిపోతుందని కలలు గన్నాను. అదే నేను చేసిన పొరపాటని ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంది గాని, కళ కోసమే నేను పుట్టానన్న సంతృప్తి నాకుంది.

నృత్యకళ విషయంలో గాని, నృత్య అభినయాల విషయంలో గాని ఏదైనా సమస్య వస్తే, అది ఎంత జటిలమైనదయినా సరే - దాని పరిష్కారం నాకు గోచరించేది. అంతటి మనోధర్మం నా ప్రదర్శనాలవల్ల నాలో అభివృద్ధి చెందింది. ఇది నిజంగా సరస్వతీదేవి వరప్రసాదమే. అందుకే కౌమార దశలోనే నాట్యశాస్త్ర గ్రంథాన్ని వ్రాయగలిగాను. నాకు ప్రభుత్వ బహుమతి గూడ లభించింది.



వందిరి వేంకటరత్నం

నా నాట్యకళా ప్రచార ప్రారంభంలో శ్రీ మైలాంగం గురుస్వామి నాకు పరిచయమైనాడు. ఈయన వెంకటగిరి సంస్థానంలో మార్దంగికుడుగా ఉండేవాడు. వీరి వంశీయులు నాట్యాచార్యులు. నాట్యకళకు ఆ సంస్థానంలో ఆదరణ తగ్గడం వల్ల ఆయనకు ఆ యాస్థానంలో పదవి పోయింది. కొన్నాళ్ళు డోలు వాయిద్యంతో కాలక్షేపం చేస్తూ వచ్చారు. నా నాట్యకళా ప్రచారానికి ఆయన సహకారం కోరాను, ఆయన అంగీకరించారు. మా యిద్దరికి ఆనాటి నుండి నాట్యకళా ప్రచారం

తప్ప వేరొక ఆలోచన ఉండేది కాదు. ఈయన ఒక మృదంగమే కాక అవసరాన్ని బట్టి తబలా, డోలు, మాదల్, ఢోలక్ యిత్యాది వాద్యాలను కూడా వాయించి నాతో సహకరించేవాడు.

నా ప్రదర్శనలకు పండితులతోబాటు సామాన్య ప్రజలు గూడ వచ్చేవారు గనుక వారి తృప్తి కోసం కొన్ని జానపద అంశాలను ప్రదర్శించేవాణ్ణి. శ్రీ నండూరి సుబ్బారావుగారి ''నన్ను డిచి పెట్టెళ్ళినాడే", శ్రీ కొనకళ్ళ వెంకటరత్నం గారి "మొక్కజొన్న తోటలో'' వీరిని ఎక్కువగా ఆకర్షించేవి. కరుణ రసానికి నండూరివారి పాట; హాస్య, శృంగార రసాలకు కొనకళ్ళవారి పాట నేను పాడుతూ, ఆడుతూంటే ప్రజలు సమ్మోహితులయ్యేవారు. నా ప్రచారంలో నాట్యశాస్త్రం ప్రధాన విషయం గనుక సంస్కృత శ్లోకాలు, శాస్త్రీయమైన వర్ణాలు, పదాలు పాడి అభినయిస్తూంటే ఈ సామాన్య ప్రేక్షకులు కొంత విసుగు కనబరచేవారు. వారి సంతృప్తికోసం, వారిని ఆకట్టుకొనడంకోసం మధ్యమధ్య ఈ యంశాలను ప్రదర్శిస్తూ ఉండేవాణ్ణి. ఈ రెండు పాటలూ నావల్ల ఎక్కువ ప్రచారం పొందాయి. ఇంకెవరు ఈ పాటలు పాడి అభినయించినా ప్రేక్షకులకు నచ్చేవికావు. ఈ విషయం నండూరివారికి, కొనకళ్ళవారికి తెలిసింది. వారు ప్రత్యేకంగా ఆహ్వానించారు. వారి పాటలు వారి ముందు పాడి అభినయించాను. వారు ఆనందబాష్పాలు రాల్చారు. నన్ను కౌగిలించుకొని, ఆనందపరవశులయ్యారు. "నటరాజూ! ఈ పాటలను మేము వ్రాసినప్పుడు ఈ పాటల్లో ఇంత భావం ఇమిడి యుందని మేము ఊహించలేదు. ఎంత గొప్ప భావాన్ని వాటిలో చొప్పించి, వాటికి నూతన చైతన్యాన్ని కలిగించావయ్యా! చిన్నవాడివైనా మా హృదయాలను కదలించావు. నృత్య సరస్వతి నీకు గొప్ప భవిష్యత్తును ప్రసాదించాలని కోరుకొంటున్నాం!" అని నన్ను దీవించారు. ఒక కళాకారుడు ఇంతకు మించి ఏం కోరుకోగలడు?

ఈ రెండు పాటల్ని ఎన్ని వందల, వేల సార్లు పాడి అభినయించానో నాకే తెలియదు. పామరులే కాదు, పండితులు గూడా నన్ను మెచ్చుకొన్నంత ప్రసిద్ధమయ్యాయి. తర్వాత కొన్నాళ్ళకు నేను హైదరాబాద్లో స్థిరపడి ''వేంకటేశ్వర కళ్యాణం'' నృత్యనాటకాన్ని ప్రదర్శిస్తున్నప్పుడు వేంకటేశ్వరుని వేషంలో నేనున్నప్పుడు ఈ పాటల్ని పాడి అభినయించమని ప్రేక్షకులనుండి చీటీలు వచ్చేవి. ప్రేక్షకుల ఆనందం కోసం, వేషం తీసివేసిన తర్వాత ఈ పాటలు పాడి, అభినయించక తప్పేది కాదు. నండూరివారు ఒకసారి శ్రీ గుడిపాటి వేంకటాచలం గారికి లేఖ వ్రాస్తూ నా గురించి, నా అభినయం గురించి ప్రత్యేకంగా అందులో వ్రాశారట. ఈ విషయం ఆయనే స్వయంగా నాతో చెప్పారు.

నేను మొదటినుండి కళను నమ్ముకొన్నాను గాని అమ్ముకోలేదు. ఈ తృప్తి ఒక్కటే నాకు చాలు.

నేను బండారు రాజావారి ఆస్థాన నర్తకునిగా ఉండినప్పుడు వారు నాకు కొన్ని ఎకరాల భూమిని ఇనాంగా ఇస్తామన్నారు. "అది నాకెందుకు మహరాజ్? నా కళను తమరు చూసి, ఆనందిస్తే అదే నాకు పదివేలు!" అన్నాను. ఆ భూమి ఇప్పుడు ఎన్ని లక్షల విలువ చేసేదో!

ఎందరో పెద్దలు, పండితులు, ధనవంతులు నన్ను నాట్యప్రదర్శనలు ఇమ్మనమని ఆహ్వానిస్తూండేవారు. వారిలో చాలామంది సహృదయులు, పలుకుబడి గలవారు. అందువల్ల నేనొక పద్ధతి అవలంబించాను. నేను వెళ్ళబోయే చోట ఎవరైనా ఒకప్పుడు నాట్యంలో ప్రసిద్ధులై, ప్రస్తుతం విశ్రాంతి తీసుకొంటున్న కళావేత్తలుంటే, వారితో నాట్య విషయాలు ముచ్చటించడానికి వారి సందర్శన భాగ్యం కలిగించాలని ఒక షరతు పెట్టాను. కొన్నిచోట్ల వారు ఎంత ప్రయత్నించినా నా కోరిక ఫలించేది కాదు. ఆ కళామూర్తులు నన్ను కలుసుకొనడానికి అంగీకరించేవారు కారు. "నాలోని కళ ఏనాడో చచ్చిపోయింది, ఆ చిరంజీవి యిప్పుడు నాతో ఏం మాట్లాడుతాడు?" అని కొందరు నిరుత్సాహంగా మాట్లాడేవారు. మొదట్లో ఇలాంటి ఇబ్బందులు ఎదురయినా - నా గురించి, నా రచనల గురించి తెలుసుకొన్న తర్వాత నాతో మాట్లాడడానికి చాలా మంది కళాకారులు అంగీకరిస్తూ వచ్చారు. వారంతటవారే కొందరు కళాకారులు నన్ను ఆహ్వానించారు. వీరిలో కొందరు కళానిధులు. వారి పాండిత్యానికి అచ్చెరువు పోయి, అంజలి ఘటించేవాణ్ణి. వారి కళారాధన,

కళాపోషణ, ప్రత్యేక శిక్షణ, ఆదారాలు, కట్టుబాట్లు, కాల క్రమేణా కళలో వచ్చిన మార్పులు, చేర్పులు, వారి సంప్రదాయాలు-ఇలా ఎన్నెన్నో విషయాలు వారినుండి గ్రహిస్తూ వచ్చాను. తుదకు వారు నాట్యకళనుండి విరమించడానికి గల కారణాలు, వారి దుస్థితి మొదలైనవి గూడ తెలుసుకొన్నాను. ఈ విధంగా వారితో చర్చించి, సుమారు గత 150, 200 సంవత్సరాల చరిత్రను నేను సేకరించగలిగాను. నాట్యకళలో అన్నింటిని సంపూర్ణంగా ఎరిగిన ఎందరో కళామూర్తులు చరిత్రహీనులైనారని బాధ పడ్డాను. వీలయినంత వరకు వీరిలో చాలామందిని లోకానికి నా రచనల ద్వారా పరిచయం చేశాను.

వీరిలో కొందరు నృత్తంలో అంటే- కొన్ని జతుల్ని, తీర్మానాల్ని, మొహరాల్ని అద్ధంలో ప్రసిద్ధులు. నృత్త ప్రాముఖ్యత ఏమిటి? నృత్తాన్ని ఎలా కూరుస్తారు? జతులను తాళం, లయ, తాళప్రస్తారం, గతి, జాతి, ఛందస్సుల్లో ఏ పద్ధతిని కూర్చాలి? ఇలాంటి విషయాలను వారిని అడిగి తెలుసుకొన్నాను.

నృత్యం గీత ప్రాధాన్యం గలది. ముద్రల ద్వారా అర్థాభినయాన్ని ప్రదర్శించడం ఆంగికం. ముఖాభినయం ద్వారా భావాన్ని ప్రదర్శించాలి. అయితే, వీటి మధ్య గల వ్యత్యాసాలు ఎలా ఉంటాయి? సాత్వికం, శుద్ధ సాత్వికం, ముఖరాగం వీటి మధ్య గల భేదాలు ఏమిటి? ఈ విధంగా ఏకపాత్ర కేళికా విధానం గూర్చి వారి పూర్వులు వారికి ఏం చెప్పారు? వారు ప్రత్యక్షంగా తెలుసుకొన్న, నేర్చుకొన్న సాధన క్రమం ఏమిటి? ఇలా ఎన్నో విషయాలు వారితో చర్చించేవాడిని. ఈ చర్చల ద్వారా వివిధ ప్రాంతాల మధ్య గల స్వల్ప భేదాలను గూడ గ్రహించాను. అయితే, వీరిలో చాలా మంది చాలా కాలం క్రిందటే నృత్యకళ నుండి విరమించారు. చాలా విషయాలు అభ్యాసంలో లేక మరచిపోయారు. సంప్రదాయ వ్యాఖ్యానాలు ఎన్నో మరుగున పడిపోయాయి. ఆ గ్రంథాలెన్నో నాశనమయ్యాయి. కొందరు చాలా విషయాలను మర్మం లేకుండా చర్చించేవారు. అందువల్ల నా పర్యటన ఒక్కొక్కసారి ఉత్సాహంగా ఉండేది, ఒక్కొక్కసారి నిరుత్సాహంగా ముగిసేది. ఆనాడు నేను ఎదుర్కొన్న పరిస్థితులు అలా ఉండేవి. అంతకు రెండు మూడు దశాబ్దులకు పూర్వం ఎవరైనా నాలాగ పరిశోధించియుంటే ఇంకా ఎన్నో విషయాలను సేకరించగలిగేవారు.

'నాది' అని చెప్పుకొనడానికి నా కొక ఇల్లు లేక పోవడం వల్ల నేను వివిధ ప్రాంతాలలో సేకరించిన నాట్యకళా చరిత్రలోని అనేక అపురూపమైన పుటలు చెల్లా చెదురైనాయి. కళాలోకానికి వాటిని అందివ్వలేకపోయాను. కాని, ధారణా శక్తి మంచిది కావడంవల్ల కొన్ని ప్రధానాంశాలను మీకు అందివ్వగలుగుతున్నాను.

నేను ముఖ్యంగా నాట్యకళలో నిష్ణాతులైన వృద్ధ కళాకారులనే కలుసుకొనేవాణ్ణి. వారిలో చాలామంది 80 ఏళ్ళు దాటినవారు, వారిలో చాలామంది శ్రీమంతులు, భూస్వాములు, విద్యావేత్తలు, పండితులు మొదలైనవారి సమక్షంలో ప్రతిదినం నృత్యకేళికలు చేస్తూండేవారట. అందువల్ల సంపూర్ణంగా భరతశాస్త్రంలో పాండిత్యాన్ని సంపాదించవలసిన అవసరం వారి కుండేది.

వారు చెప్పిన వివరాలు, వివరణలు ఏ చారిత్రక గ్రంథాల్లో గాని, శాస్త్ర గ్రంథాల్లో గాని మనకు దొరకవు. అవి వారి అనుభవాలు. అక్షరాలలో పెట్టగలవి కావు, ప్రాయోగికంగా చేసి చూపించవలసినవి. ఒక తరం నుండి ఇంకొక తరానికి అనుభవపూర్వకంగా వచ్చేవి. మెకంజీ దొరగారు సేకరించిన తాళపత్రగ్రంథాల్లోగూడ ఈ విషయాలుండవు. భరత శాస్త్రానికి సంబంధించిన తాళపత్ర గ్రంథాలు కొన్ని ఉంటే ఉండవచ్చును.

వృద్ధ కళాకారుల ద్వారా నేను సేకరించిన అనేక శాస్త్ర విషయాలను "ఆంధ్రనాట్యాన్ని" తీర్చి దిద్దడంలో వినియోగించాను. వీలయినంతవరకు నా గ్రంథాల్లో భద్రపరచాను. ఇందుకు నేను గర్వపడుతున్నాను.

నాకు కుటుంబ ఇబ్బందులు లేవు, సంసార సమస్యలు లేవు. కనుక నా కాలాన్నంతా నృత్యకళా పరిశోధనకు, ప్రచారానికి వినియోగిస్తూ వచ్చాను. నేను పర్యటించిన చోట ఏదైనా గ్రంథాలయముంటే దానిలో ప్రాచీన నాట్య శాస్త్ర గ్రంథా లున్నయా అని వెతికేవాణ్ణి. ఉంటే వాటిని చదివి,

అవసరమైన విషయాలను వ్రాసుకొనేవాణ్ణి. ఆంధ్రుల నృత్య సాంస్కృతిక చరిత్ర వ్రాయాలన్న ఆశయం నాకుండేది. అందువల్ల మారు మూలల్లోని కుగ్రామాలలో నివసించే జానపద కళాకారుల్ని మొదలుకొని, పట్నాలలోని ఆస్థాన నృత్యకారులవరకు వీలయినంతమందిని సందర్శించి, వారి విద్యగురించి, వారి అనుభవాలగురించి అడిగి తెలుసుకొంటూ వచ్చాను. నేను నాగపూరులో ఉండగా కలుసుకొన్న కళా వేత్తలు వేరు, వారి అనుభవాలు వేరు, వారి సంప్రదాయాలు వేరు. వారు పలు సంప్రదాయాలకు చెందినవారు. వారి సాధనా పద్ధతుల్ని, భావ ప్రకటనల్ని, వాటికి గల కారణాల్ని వారి నడిగి తెలుసుకొన్నాను. సంఘం, సాంఘిక దృక్పథం, ఆర్థిక పరిస్థితులకు కళపైని, కళాకారులపైని గల ప్రభావం గురించి వారినుండే ప్రత్యక్షంగా తెలుసుకొన్నాను.

మత ప్రవక్తలు వారి మత ప్రచారానికి కళలను, కళా కారుల్ని ఏరకంగా వినియోగించుకొన్నారో ఈ కళాకారులే నాకు చెప్పారు. కళలన్నింటిలో నాట్యకళ అత్యంత ఆకర్ష ణీయమైంది. అభ్యసించడానికి ఇది కష్టతరమైన విద్యే అయినా మన మతాల ప్రచారానికి, మన సంస్కృతిని చాట డానికి చిరకాలం నుండి ఎక్కువగా ఉపయోగపడుతూ వచ్చింది. అన్ని కులాలలోను, జాతుల్లోను, మతాలలోను నాట్యకళాకారు లున్నారు. వారి వారి సంస్కారాన్ని బట్టివారు వారి కళలను అభివృద్ధి చేసుకొన్నారు.

నా పర్యటనలలో కాటిపాపలు, సాధనాశూరులు, విప్రవినోదులు, వీధిభాగవతులు, వీధినాటక ప్రదర్శకులు, కలాప కళాకారులు, ఏకపాత్రకేళిక, కచ్చేరీ కళాకారిణులు, ఆగమనర్తకులు మొదలైనవారి నెందరినో కలుసుకొన్నాను. వారి కళలను విశ్లేషించాను. నా యభిప్రాయం ప్రకారం మన నృత్యకళ అయిదు విధాలైనది. అవి - 1) గిరిజన నృత్యాలు, 2) జానపదులుచేసే నృత్యాలు, 3) జానపదుల కోసం వృత్తి కళాకారులు చేసే నృత్యాలు, 4) శాస్త్రీయ కేళికలు, 5) ఆలయ నృత్యాలు (ఆగమశాస్త్ర నృత్యాలు).

**1. గిరిజన నృత్యాలు :** ఇవి నేటికీ సజీవంగా ఉన్నాయి.

**2, 3. జానపద కళలు :** ఇవి సజీవమైనవే కాని సినిమాలు, టి.వీ ప్రదర్శనలవల్ల వీటిలో నేడు కొన్ని మార్పులు వస్తున్నాయి.

**4. శాస్త్రీయ కేళికలు :** ఆంధ్రదేశంలో స్త్రీకళా మూర్తులు ఆరాధించిన లాస్యనర్తనం ఇది. దీన్ని గురించి ఇక్కడ వివరణ అవసరం.

ఆంధ్రుల లాస్యనర్తనం గురించి నే నెక్కువగా పరిశోధించాను. అనేక గ్రంథాలతో, శాసనాలతో, కైఫియత్ లలో దీన్ని గురించి, దీనిని పోషించిన ప్రభువుల గురించి, దీనిని సుందరంగా తీర్చిదిద్దిన కళావేత్తల గురించి చదివాను. సుమారు 150 మంది వృద్ధ కళాకారులను కలుసుకొని, వారితో ఈ శాస్త్రీయ కేళికలలోని నృత్త, నృత్య, అభిన యాల తీరులను గురించి చర్చించాను. చాలామంది ఉత్తమ కళామూర్తులతో కళావిషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరి పాను. వాటిలో చాలా ఉత్తరాలు పోయాయి. మిగిలియున్న వాటిలో కొన్ని ముఖ్యమైన లేఖలను ఈ గ్రంథంలో ప్రచు రిస్తున్నాను. 1954 నాటికి దక్షిణాత్యుల నాట్యకళ గురించి చాలా విషయాలు సేకరించాను. అదృష్టవశాత్తు మదరాసు ప్రభుత్వం (తెలుగు భాషా సమితి) నాట్యశాస్త్ర గ్రంథాల పోటీ నిర్వహించింది. నేను వెంటనే ఒక గ్రంథం వ్రాసి పోటీకి పంపాను. దానికి మొదటి బహుమతి లభించింది. అయితే, వారు గ్రంథానికి పుటల పరిమితి పెట్టారు. అందు వల్ల నేనా గ్రంథాన్ని కుదించి వ్రాయవలసి వచ్చింది. అందువల్ల నేను సేకరించిన చారిత్రక విషయాలు పూర్తిగా అందులో రాలేదు [అనేక అనివార్య పరిస్థితుల వల్ల, నా నివాస స్థల మార్పులవల్ల నేను సేకరించిన కొంత చరిత్ర ప్రచురణకు నోచుకోకుండా పోయింది.

స్త్రీలు ప్రదర్శిస్తూ వచ్చిన లాస్యం ముఖ్యంగా మూడు విధాలుగా ఉండేది. అవి: 1. దేవుడు కల్యాణ మంటపం వద్ద కొలువుదీరి యున్నప్పుడు ప్రదర్శిస్తూ వచ్చినది. 2. నృత్య పోషకులైన రాజుల దర్బారుల్లో ప్రదర్శిస్తూ వచ్చినది. 3. ఆలయములోని దైవాన్ని నృత్య పూజతో ఆరాధించేది. (ఇదే ఆలయ నృత్యం.)

**ఆలయ నృత్యం (ఆగమశాస్త్ర నృత్యం) :** ఇది చాలా శాస్త్రీయంగా అభివృద్ధి చెందింది. ప్రతి దైవానికి ఒక ప్రత్యేక పద్ధతి ఉండేది. ప్రత్యేకమైన నృత్యాన్ని ఒక ప్రత్యేక రాగంలో ఒక ప్రత్యేక తాళంతో ప్రదర్శించే వారు. దీనికి కారణ మేమిటి? ఆ నృత్యపూజ ఎలా రూపొందింది? ఆ రాగ తాళ నృత్య భావానికి ఆ దేవతా మూర్తి తత్వానికి ఏదైనా సంబంధ ముందా? ఇలా కొంత పరిశోధించాను. అయితే, ఈ పరిశోధన నా వంటి కళాకారునికి సుసాధ్యం కాదని గ్రహించాను. ప్రభుత్వం కాని, విశ్వ విద్యాలయాలు గాని, పెద్ద కళా సంస్థలుగాని ఈ పనికి పూనుకోవాలి. పూర్వం ఆరాధించిన వారికే ఈ కళ వివరంగా తెలియకుండా పోయింది. ఇది మన దేశ సంస్కృతికే గొప్ప నష్టం.

ఆలయ పద్ధతులలో సంగీత, నాట్య శాస్త్రాలను అభ్యసించి, శాస్త్రకారుల పరీక్షలో ఉత్తీర్ణులైన వారే ఆలయ నృత్య పూజలు చేసేవారు. ఈ విధంగా ఆలయ నృత్యపూజా విధానం గురించి మా గురువుగారు చెప్పగా నేను కొంత పరిశోధన చేశాను. దీని ప్రత్యేకను గుర్తించాను. కొంత నేర్చుకొన్నాను. ఆంధ్రలో కొన్ని సంస్కృతి ప్రచార నాట్య బృందా లుండేవి. స్త్రీల సంస్కృతి ప్రచార బృందాలవారు ఆలయాల్లో ఆస్థానాలలో, పండిత సభల్లో, తిరునాళ్ళలో, ఉత్సవాలలో, ఊరేగింపులలో ప్రదర్శన లిచ్చేవారు. పురుష బృందాలవారు భాగవత ప్రదర్శనం ద్వారా మత ప్రచారం చేసేవారు. వీరు దేశమంతా పర్యటిస్తూండేవారు.

నేను గుంటూరులో ఉండగా విశాఖపట్నంలోని సంగీత సభలవారు నన్ను ఆహ్వానిస్తూ ఉండేవారు. నేను వెళ్ళి, శాస్త్రీయ నృత్య ప్రదర్శనలిచ్చాను, ఉపన్యసించాను. అవి అక్కడి పెద్దల్ని ఆకర్షించాయి. శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథం, కంచెర్ల దత్తు, ఆంధ్రా యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ కృష్ణ మొదలైన పెద్దలు నన్ను మెచ్చుకొనడమే కాక నన్ను విశాఖపట్నంలో ఉండమని కోరారు. కాని, అప్పుడు నాకు మళ్ళా నాగపూర్ మీదికి మనసు మళ్ళింది. నేను నాగపూర్ ప్రయాణానికి సిద్ధమౌతూండగా ఒకనాడు శ్రీ వద్దాది బాపిరాజుగారు ప్రత్యేకంగా నా కోసం గుంటూరు వచ్చారు. రానున్న రెండు నెలల వేసవి సెలవుల్లో నృత్య తరగతులు నిర్వహించమని వారు నన్ను కోరారు. విశాఖ పట్నంలోని మెయిన్ రోడ్డులో వారికి ఒక విశాలమైన భవనం ఉంది. అందులో నృత్యతరగతులు నిర్వహించ వచ్చు నన్నారు. వారి కోరికను తిరస్కరించలేకపోయాను. గుంటూరులో ఎండలు ఎక్కువ. విశాఖ చాలా చల్లగా ఉంటుంది. కనుక విశాఖ వెళ్ళడానికి నిర్ణయించుకొన్నాను.



మారంపల్లి సోదరీమణులు
వైదేహి, ఇందువదనలు
ఆంధ్రప్రదేశ్ ఏర్పాటయిన తరువాత
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు
తొలిసారి నిర్వహించిన
"కూచిపూడి నాట్య సదస్సు'' లో పాల్గొని
పూర్తిగా సంస్కృతంలో గొల్ల కలాపానికి వ్యాఖ్యానం చెప్పి
ఢిల్లీ సంగీతనాటక అకాడమీ పెద్దలను సమ్మోహితులను
జేసిన నర్తకీమణులు.

బాపిరాజుగారి ఇల్లు ఒక సరస్వతీ నిలయం. వారి అర్ధాంగి ఒక అన్నపూర్ణ. ఆమె ఆదరణ అసమానమైనది. వారింటికి ఎందరో సిద్ధులు, పండితులు, కవులు, కళా కారులు వస్తూండేవారు. ఆ యిల్లు ఒక కళా నిలయంగా కళకళలాడుతూ ఉండేది. విద్వత్ సభలు, సమావేశాలు, శాస్త్రి చర్చలు అక్కడ జరుగుతూ ఉండేవి. బాపిరాజుగారి సోదరుని కుమార్తెలు చిరంజీవులు ఉమా, సుమతులు నా వద్ద నాట్యం అభ్యసించారు. అనేక నాట్యప్రదర్శనలను ఆంధ్రదేశంలోనే కాక, బొంబాయి మొదలైన ఇతర ప్రాంతా లలో గూడ ఇచ్చారు. ప్రస్తుతం చిరంజీవి ఉమ (ఉమా రామారావు) హైదరాబాద్ తెలుగు విశ్వవిద్యాలయ నృత్య శాఖకు పెద్దగా ఉంది. చిరంజీవి సుమతి (సుమతీ కౌసల్) నాట్యంలో ప్రసిద్ధి గాంచింది. ఎన్నో ప్రదర్శన లిచ్చింది. 'నృతశిఖర'ను స్థాపించి ఎందరికో నృత్యం నేర్పించింది. విశాఖలోనే శ్రీ ఎమ్.ఎస్. నాయక్ గారి కుమార్తె చిరంజీవి చంద్రకళ నా వద్ద నృత్యకళ అభ్యసించింది. చిన్నతనంలోనే ముచ్చటైన నాట్యప్రదర్శన ఇచ్చింది. తర్వాత సినీరంగంలో ప్రవేశించింది. తరవాత విరమించుకొంది. విశాఖలో ఇంకా చాలామంది నావద్ద నృత్యం నేర్చుకొన్నారు గాని వారు వివా హాలు చేసికొని నాట్యంనుండి విరమించుకొన్నారు.

ఆ రోజుల్లో విశాఖలోని సీతమ్మధార రమణీయమైన ప్రాంతంగా ఉండేది. అక్కడ గురుదేవుడు రవీంద్రనాథ టాకూరిగారి శాంతినికేతనం వంటి ఒక నృత్యనికేతనాన్ని స్థాపించాలని, మన ఆంధ్రుల నాట్యకళను విశ్వవ్యాప్తం చేయాలని ఒక ఆశ నాకు కలిగింది. ఆ రోజుల్లోనే పొట్టి శ్రీరాములు గారి ఆత్మత్యాగంవల్ల ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. శ్రీ విశ్వనాథంగారు తొలి ఆంధ్రరాష్ట్రి ప్రభుత్వంలో ఒక మంత్రి అయ్యారు. నేను ఆశించిన నృత్యనికేతనానికి కొంత ఆర్థిక సహాయం చేయడానికి నిశ్చయించుకొన్నారు. కొంత

గ్రాంటు కేటాయిస్తున్నట్టు నాకు చెప్పారు. కాని, ఆంధ్రుల నాట్యకళకు అదృష్టం లేకపోయింది. ఆ మంత్రివర్గం పడి పోయింది. నృత్యనికేతన స్థాపన ప్రయత్నం ఆగిపోయింది. అది నా జీవితంలో ఒక తీరని కోరిక.

విశాఖపట్నంలో ఉండగా ఒకసారి మాడుగుల సంస్థా నానికి వెళ్ళే అవకాశం కలిగింది. ఆ ప్రాంత నృత్యకళ గురించి భూపతిదేవులవారు ఎన్నో విషయాలు వివరించి చెప్పారు. వృద్ధ నృత్యకళాకారిణి శ్రీమతి గంధం లక్ష్మీ కాంతమ్మగారిని కలుసుకొన్నాను. ఆమెనుండి అనేక నృత్య విషయాలు సేకరించాను.

నేను విశాఖపట్నంలో ఉండగా ఒకసారి ముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు, గవర్నరు శ్రీ త్రివేది గారు ఆంధ్రా యూనివర్శిటీకి వచ్చారు. ఆ సందర్భంగా నా అభినయపూర్వక ప్రసంగాన్ని వారు విన్నారు. శ్రీ సంజీవ రెడ్డిగారు నన్ను ప్రత్యేకంగా అభినందించారు. నాటినుండి నేటివరకు ఆయన నన్ను అభిమానిస్తూనే ఉన్నారు. నేను హైదరాబాద్‌లో స్థిరపడ్డాక నన్ను ఎన్నో విధాలుగా ప్రోత్స హించారు. ఉజ్జయినీ కాళిదాసు సమారోహంలో మేము స్వర్ణ కలశాన్ని గెల్చుకొని వచ్చాక నన్ను వారు సమ్మానించారు. మా నృత్యనికేతనానికి వచ్చి, మా విద్యార్థులను అభినందిం చారు. నా కళారాధనను ఆయన మెచ్చుకొని, "రామకృష్ణా! నీకేం కావాలో అడుగు, నేను చేసిపెడతాను'' అన్నారు. కాని, నాకు ఏం కావాలో నాకే తెలియక, మీ అభిమానం ఉంటే చాలు అన్నాను. మంచి అవకాశాన్ని జారవిడుచు కొన్నానే అని ఇప్పుడు అప్పుడప్పుడు బాధపడుతూఉంటాను. నాగపూర్‌లో రాజ గణపతిరావు పాండ్యాగారు ఒకసారి ఇలాగే అన్నారు. వారినీ ఏమీ అడగలేదు. ఇది రెండవసారి. మంచి అవకాశాన్ని పోగొట్టుకొనడం.

శ్రీ సంజీవరెడ్డిగారి వద్ద శ్రీ బి. ఎల్. నరసింహులు గారు అంతరంగిక కార్యదర్శిగా ఉండేవారు. వీరు చాలా ఉత్తములు. వీరమ్మాయి చిరంజీవి రమ నా శిష్యురాలు. అయినా, వారినుండి ఎటువంటి సహకారాన్ని పొందలేక పోయాను.

విజయనగరం ఒక విద్యల నగరం. జమీందారీలు రద్దు అయినప్పుడు ఆ సంస్థానం గూడ ప్రభుత్వపరమైంది. అప్పుడు నా శ్రేయోభిలాషి అయిన శ్రీ విస్సా అప్పారావు గారి అల్లుడుగారు అక్కడ ప్రత్యేక నిర్వాహణాధికారిగా నియమితు లయ్యారు. ఆయన తర్వాత నా శిష్యురాలు చి॥

శ్యామా కౌండిన్య తండ్రిగారు ఆ స్థానంలో నియమితు లయ్యారు. వీరిద్దరూ నాకు చాలా సన్నిహితులయినందున నేను తరచుగా విజయనగరం వెళ్తూ ఉండేవాణ్ణి. ఆ సంస్థానంలో మంచి గ్రంథాలయ ముంది. ఆ గ్రంథాలయంలోని అనేక నాట్యకళకు సంబంధించిన గ్రంథాలను చదువుతూ ఉండేవాణ్ణి. ఆ ప్రాంతం తూర్పు భాగవతానికి ప్రసిద్ధి చెందింది. ఆ నగరంలో అనేక నట్టువ మేళాలు ఉండేవి. ప్రసిద్ధ కళాకారిణి శ్రీమతి అప్పలరాజాగారు అక్కడివారే. ఆమె నా నాట్యకళా పరిశోధనకు ఎంతో సహాయం చేశారు. ఆ ప్రాంతంలోని వృద్ధ నాట్యకళా మూర్తుల జీవిత చరిత్రలు, ఛాయా చిత్రాలు సేకరించి, పంపి ఇచ్చారు. నా 'నవజనార్ధన' పారిజాత గ్రంథంలో వీరిని గూర్చి కొంత వ్రాశాను. శ్రీమతి అప్పలరాజాగారు నిర్యాణ ప్రభుత్వ సంగీత నృత్య విద్యాలయ ప్రిన్సిపాల్ గా పనిచేశారు.

నేను విశాఖపట్నంలో నుండిన రోజుల్లోనే శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలకు చెందిన పలు ప్రాంతాలు సందర్శించాను. ఈ ప్రాంతాలలోని తూర్పు భాగవతం చాలా ప్రసిద్ధి గాంచింది. వీరి బాణీ చాలా ప్రత్యేకమయినది. వీరి మద్దెల వాద్యం చాలా ప్రాచీనమైన బాణీలో ఉంటుంది. వీరి వాద్యంలో నాదం నిండుగా ఉండి, సంపూర్ణంగా వికసిస్తుంది. వీరి మృదంగ బాణీ ఉత్తరాది వారి 'పఖవజ' బాణీకి చేరువగా ఉంటుంది. అందుకే నేను 'పేరిణి శివతాండ'వాన్ని పునః సృష్టి చేస్తున్నప్పుడు ఈ ప్రాంతానికి చెందిన ప్రసిద్ధ మార్దంగికుడు శ్రీ దూపం సూర్యలింగం గార్ని హైదరాబాదు రప్పించి, వారి సహాయంతో జతులు కూర్చాను. పేరిణి శివతాండవ జతులు అంత ఉద్ధతంగా, ఉత్తేజంగా ఉండడానికి తూర్పు భాగవత మృదంగ బాణీ ఎంతో ఉపకరించింది. ఈ విషయాలు నా "పేరిణి శివతాండవం" గ్రంథంలో ఉటంకించాను.

తూర్పు భాగవత కళకు శ్రీకాకుళం జిల్లాకు కూడా మంచి పేరుంది. పాలకొండ పట్నానికి చేరువలో గల బొద్దూరు గ్రామం భాగవతం ఆటకు ప్రసిద్ధిగాంచింది. ఈ గ్రామంలోని వేదపండితులైన బ్రాహ్మణ కుటుంబాల వారు మూడు, నాలుగు తరాలుగా ఈ కళను ఆరాధిస్తున్నారు. వీరిలో రంప, వల్లూరు, ఉప్పల వంశీయులు ముఖ్యులు. ముట్నూరు నరసింహ శాస్త్రిలుగారు రచించిన శ్రీకృష్ణ లీలలు, భక్త మార్కండేయ భాగవతాలను ప్రదర్శిస్తూ ఉంటారు. నేటితరంలో రంప సింహాచలం శర్మ, రంప సుబ్బారావు శర్మ, రంప వెంకట కన్నయ్య శర్మ, రంప రాజేశ్వరరావు శర్మ వల్లూరు సత్యనారాయణ, ఉప్పల సత్యనారాయణ, ఉప్పల వెంకటరావు మొదలగువారు ప్రసిద్ధులు. వీరి ఆట కొంతవరకు ఉభయ గోదావరి జిల్లాల ఆటను పోలియున్నా వీరి మృందంగ వాయిద్యం ఉత్తరాది ధృపద బాణీలో ఉంటుంది. వీరు ఎక్కువగా ఆది, అట తాళాలను ఆశ్రయించి నృత్త, నృత్యాలను ప్రదర్శిస్తారు.



వారి పినతల్లి
మారంపల్లి చిన వేంకటరత్నం

ఈ ఉత్తర కోస్తా జిల్లాలలోని నృత్యకళ గురించి కొంత ఇక్కడ ఈ సందర్భంలో వివరించదలచాను. ఈ ప్రాంతానికి చెందిన టెక్కలి, మందసా, బొబ్బిలి, మాడుగుల, విజయనగరం మొదలైన సంస్థానాలలోని లాస్య నర్తనం ఇంచుమించు ఒకే తీరులో ఉండేది. అంతేకాదు, పర్లాకిమిడి, చిన్నకిమిడి, పెద్దకిమిడి, కళ్లికోట మొదలైన

ఒరిస్సాలోని సంస్థానాలలోని శ్రీ కళాకారులు ఈ లాస్య పద్ధతినే అనుసరిస్తూ వచ్చారు. దక్షిణాన తుని వరకు ఈ బాణీ వ్యాపించింది అని చెప్పవచ్చును. అయితే, ఉభయ గోదావరి జిల్లాల లాస్యనర్తనం - దీనికి కొంచెం భిన్నంగా ఉంటుంది. ఈ జిల్లాలలో ముఖ్యంగా కోనసీమ ప్రాంతంలో శుద్ధ లాస్యం (కూర్చొని రసభావాలను అభినయించడం) ప్రసిద్ధి గాంచింది. గుంటూరు, నర్సారావుపేట ప్రాంతాలలో కొన్ని స్వల్ప భేదాలు ఉన్నప్పటికి మొత్తం మీద లాస్య నర్తనం ఒకే విధమైందని చెప్పవచ్చును. అలాగే నెల్లూరు, శాళహస్తి, కార్వేటి నగర ప్రాంతాలలో కొన్ని భేదా లున్నప్పటికీ అక్కడి లాస్యం ఒకే విధంగా ఉంటుంది. ఈ ప్రాంతాలకు చెందిన కళాకారుల గురించి, నాట్యాల గురించి వేరొకచోట ప్రస్తావిస్తాను.

కృష్ణా జిల్లా, దివిసీమలోని నందిగడ్డ వారి లాస్య బాణి ఒక ప్రత్యేక పద్ధతిలో ఉండే దని శ్రీ అమ్ముల విశ్వ నాథం భాగవతారుగారు చెప్పారు. వారి అమ్మమ్మ చాలా ప్రసిద్ధి చెందిన నర్తకీమణి. విశ్వనాథంగారి అమ్మగారు కొన్నాళ్ళు నాట్య ప్రదర్శనలిచ్చి, విరమించుకొన్నారట. శ్రీ విశ్వనాథంగారి తల్లిగారిని నందిగడ్డ కృష్ణవేణిగారిని నేను ప్రత్యేకంగా కలుసుకొని మాట్లాడాను.

ఆంధ్రదేశంలోని బ్రాహ్మణులలో అనేక శాఖలవా రున్నారు. వీరిలో ద్రావిడ శాఖ వారి గురించి ఇక్కడ ప్రస్తావించడం అవసరం. వీరు తమిళనాడు నుండి పూర్వం ఎప్పుడో ఆంధ్రదేశం వచ్చి స్థిరపడ్డారు. వీరి స్వస్థలం తంజావూరు జిల్లాలోని 'వలంగైమాన్' అనే ఒక గ్రామం. వీరిలో అయిదు అంతర్శాఖలున్నాయి: 1. పేరూరు పెద్ద ద్రావిడులు, 2. దివిలి ద్రావిడులు, 3. ఆరామ ద్రావిడులు, 4. పేరూరు ద్రావిడులు, 5. తుమ్మగుంట ద్రావిడులు.

అమలాపురానికి చేరువలో పేరూరు గ్రామ ముంది. పూర్వం సుమారు 60 ద్రావిడ కుటుంబాలు ఈ గ్రామంలో ఉండేవి. వేదం, ఇతర శాస్త్రాలలో వీరు ఘటికులు. వీరినే పేరూరు పెద్ద ద్రావిడు లంటారు.

పశ్చిమగోదావరి జిల్లాలోని తణుకు వద్ద గల కాకర పర్రులో స్థిరపడ్డవారు ఆరామ ద్రావిడులు. వీరు అపరకర్మ, ఆయుర్వేదం, నాట్యం సంగీతం, పగటివేషాలలో ఒకప్పుడు ప్రసిద్ధులు. రావూరు, పొదిలి, నరసింహదేవర మొదలైన ఇంటి పేర్లుగలవారు నాట్యాచార్యులుగా ఉండేవారు వీరిలో రావూరు కోటయ్య, నరసింహదేవర నరసింహంగార్లు ప్రసి ద్ధులు. కాకరపర్రు అర్ధశతాబ్దికి పూర్వం పగటివేషాలకు ప్రసిద్ధిగన్నది. అనేక మంది అక్కడకు వెళ్ళి ఈ విద్యను నేర్చుకొనేవారు. ఆనాటి పగటివేషధారులలో మామిళ్ళపల్లి వెంకన్నగారు చాలా గొప్పవారు.

పేరూరు ద్రావిడులలో నాట్యాచార్యులు లేకపోయినా భరతశాస్త్ర పారంగతులు చాలామంది ఉండేవారు. వీరి మెప్పును పొందడానికి చాలామంది గణికలు తహతహలాడే వారు. ప్రఖ్యాత లాస్యకళాకారిణి వాల్మీకి వేంకటపారిజాత పుష్పావతిగారిది పేరూరే. ఈమె తెల్లగా చాలా అందంగా ఉండేది. అభినయంలో ఈమె దిట్ట. నట్టువరాలిగా ఒక మేళాన్ని నిర్వహించేది. అమ్మాణి అనే మరొక నాట్యకళా కారిణి ఇక్కడ ఉండేది. ఈమె భాగవతం కళలో ప్రసిద్ధి గాంచింది.

ఆంధ్రదేశంలో పూర్వం ముఖ్యంగా మూడు నృత్య బాణీలు ఉండేవి. అవి: 1. కాకరపర్రువారి బాణి, 2. కూచి పూడివారి వాణి, 3. మైనంపాటివారి బాణి. అందే కాకర పర్రులో నుండిన ఆరామ ద్రావిడ బ్రాహ్మణుల నృత్య బాణి చాలా ప్రసిద్ధమైందిగా గుర్తించబడిందన్నమాట.

'కృష్ణతాండవం' అనే గ్రంథ పరిచయంలో కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు ఈ మూడు బాణీల గురించి తెల్పారు 'వేయిపడగలు'లో కూచిపూడి బాణీ గురించి వివరించారు.

మైనంపాటి వారి బాణి రాయలసీమ జిల్లాలోను, నెల్లూరు జిల్లాలోను ప్రసిద్ధిగాంచింది గాని, ఇది నేడు పూర్తిగా మరుగునపడిపోయింది. కాకరపర్రువారి బాణీ పూర్తిగా అంత రించిపోలేదు. కోనసీమలో ఇంకా కొంతమంది ఈ బాణికి చెందినవా రున్నారు. ఈ బాణీలోని కొన్ని విశేషాలు నవ జనార్దన పారిజాతంలో గోచరిస్తాయి. కూచిపూడి బాణీ నూతన జీవితాన్నిపొంది, వికసించి, నేడు ప్రసిద్ధ నాట్యంగా

విరాజిల్లుతూంది. అయితే, పూర్వం-అంటే సుమారు 40 ఏళ్ళ క్రితం వరకు ఇది పురుషోన్ముఖంగానే వర్ధిల్లింది.

పూర్వం కళాకారుల్లో సీ, నా భేదా లుండేవి కావు. ఒకరి విద్యను ఇంకొకరు గౌరవించేవారు. తెలియని విషయాలు వేరొకరి నుండి నేర్చుకొనేవారు. విద్యను సంపూర్ణంగా నేర్చుకోవాలనే పట్టింపు వీరందరికీ ఉండేది. అందువల్లనే ఎక్కడో ఉండిన కేరళదేశ ప్రభువైన స్వాతి తిరునాళ్ళ రచనలు. యువరంగని పదాలు ఆంధ్ర నృత్య కళాకారు లభ్యసించారు. మైనంపాటి, సింహపురి వారి జావళీలు, క్షేత్రయ పదాలు దక్షిణాదిలో ప్రచారం పొందాయి.

ఉస్మానియా యూనివర్సిటీ, ఆర్ట్సు కాలేజీకి ప్రొఫెసరు శ్రీనివాసాచారిగారు ప్రిన్సిపాల్‌గా ఉండగా, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి ఆహ్వానంపైన నేను మొదటిసారి హైదరాబాదు వచ్చి అభినయపూర్వక ఉపన్యాసం చేశాను. ఆనాడు నా ప్రదర్శన ఆర్ట్సు కాలేజీ మెయిన్‌హాల్లో జరిగింది. నేను ముందుగానే ఆ హాలు ప్రతిధ్వనిస్తుందని గ్రహించి, అతి సున్నితంగా, మెల్లగా మైక్‌లో మాట్లాడి, పాటలుపాడి, అభినయించాను. "ఇంతవరకు ఈ హాలు ఉపన్యాసాలకు పనికిరా దనుకొన్నాను. కాని, అది నిజం కాదని నేడు రామకృష్ణగారు నిరూపించారు" అని శ్రీనివాసాచారిగారు నన్ను మెచ్చుకొన్నారు. డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు అప్పుడు ఎం.ఏ.లో విద్యార్థి. ఆ తర్వాత మేమిద్దరం సన్నిహితుల మైనాం. పుల్లాభొట్ల సీతారామ భట్టాచార్య, శ్రీ లక్ష్మీరంజనం, డాక్టర్ రామరాజు, శ్రీ ఏ.ఆర్. కృష్ణ, శ్రీ గోపాలరాజు భట్టు, శ్రీ పి. రామారావుగారు మొదలైన వారితో పరిచయం, స్నేహం ఏర్పడ్డాయి మరికొన్నాళ్ళకు శ్రీ ఎం. నాగభూషణ శర్మ మొదలైనవారు స్నేహితులైనారు.

నేను, ఏ.ఆర్. కృష్ణగారు కలిసి తెలంగాణా అంతటా పర్యటించాం. ఆయన నాటక కళ, నాటక బృందాల గురించి; నేను నాట్యకళ, జానపద నృత్యాలు, నాట్యకళాకారుల గురించి సమాచారం సేకరించడానికి కలిసి వెళ్ళేవాళ్ళం. ఒకసారి ధర్మపురి వెళ్ళినప్పుడు అక్కడి వేదపండితుల గోష్ఠి వినే అవకాశం కలిగింది అక్కడి నృసింహస్వామి వారి మందిరంలో అభినయ పూర్వకంగా నేను నాట్యకళపైని ఉపన్యసించాను. కొందరు వేదాధ్యాయన పరాయణులు నా విద్యను చూసి నన్ను ఆశీర్వదించారు. అప్పు డింకా ఆ ధర్మపురి క్షేత్రంలో నృత్య పూజా కళాకారు లుండేవారు.



నాడు గద్దిభుక్త జీవరత్నమ్మ
బొబ్బిలి ఆస్థాన ఆఖరి నర్తకీమణి.
నృత్య సంగీతాల్లో మహా విద్వాంసురాలు.
వీణ వాయించేవారు. చక్కగా గాత్రం పాడేవారు.
నృత్య అభినయాలను ప్రదర్శించేవారు.
ముఖ్యంగా "మనవి చేకొనిరారా చక్కని స్వామి"
పదపర్ణం ప్రదర్శన ఈమె ప్రత్యేకత.
ఈమె వృద్ధాప్యాన్ని నృత్యనికేతనంలో గడిపి
అక్కడే స్వర్గస్థులయ్యారు

ఒకసారి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారి అధ్యక్షతలో ఆంధ్ర సారస్వత పరిషత్తువారి మహాసభలు ఆలంపురంలో జరిగాయి. ఎందరో మహానుభావులు, కవులు,

పండితులు ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాలనుండి వచ్చారు. దానిని అఖిలాంధ్ర మహాసభ అనవచ్చు. అంత గొప్పగా జరిగిన మరొక ఆంధ్ర మహాసభను నేను మరి చూడలేదు. ఒకనాటి సాయంత్రం అక్కడకు విచ్చేసిన పెద్దల సమక్షంలో నా ప్రదర్శన జరిగింది. ''చిన్న వాడివైనా, మహాసముద్రం వంటి నృత్య కళపైని బాగా ఉపన్యసించావు. సోదాహరణంగా ప్రదర్శించావు. మాకు తెలియని విషయాలు అనేకం చెప్పావు ఆంధ్రులకు గర్వకారకుడవు కావాలి'' అంటూ ఆ పెద్దలు నన్ను ఆశీర్వదించారు. అది యొక మరువలేని, మరువరాని, ఒక పవిత్ర అనుభూతి. ఈ సభలద్వారా నేను ఆంధ్రులందరికీ పరిచయమయ్యాను. ఇక అప్పటినుండి నాకు ఆహ్వానాలు ఎక్కువయ్యేయి. నా ప్రసంగాలు జోరుగా జరిగాయి.

క్షేత్రయ్య పదాలపైని పరిశోధనలు చేసిన శ్రీ విస్సా అప్పారావు 'క్షేత్రయ్య పదాలు' అనే గ్రంథాన్ని ప్రచురించారు. తర్వాత మొవ్వలో క్షేత్రయ్య ఉత్సవాలు జరిపి, సదస్సును నిర్వహించారు. క్షేత్రయ్య పదాల సంగీతంగురించి శ్రీ మంచాల జగన్నాథరావుగారిని, అభినయం గురించి నన్ను గ్రంథాలు వ్రాయమన్నారు. నాకు వారు అప్పగించిన పని అంత సులువైనది కాదు. తీరిక సమయాలలో కొన్ని ముఖ్యమైన పదాలను ఎన్నుకొని ప్రయోగ వాఖ్యానం వ్రాస్తూండేవాణ్ణి. ఇంతలో వారు వ్యాధిగ్రస్తులైనారు. చూడ్డానికి వెళ్ళాను. ఆ యంతిమ దశలోగూడ వారు ''క్షేత్రయ్య పదాలు - అభినయ గ్రంథం?'' అని అడిగారు. ''వ్రాస్తున్నా బాబు గారు" అన్నా. కాని, నా రచన పూర్తి కాకుండానే వారు కన్నుమూశారు. తర్వాత నా గ్రంథాన్ని కొంత భాగం మాత్రం ప్రచురించగలిగాను.

ప్రసిద్ధ గాయకురాలు శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారు గొప్ప రామభక్తురాలు. ఆమె తన అంతిమ జీవితాన్ని త్యాగరాజువారి దివ్యసమాధి వద్ద గడిపి తరించారు. నేను మొవ్వ గ్రామం వెళ్ళినప్పుడల్లా మువ్వగోపాలుని వద్ద నా శేష జీవితాన్ని గడపాలన్న కోర్కె కలుగుతూ ఉంటుంది. నా కోరిక తీరుతుందో లేదో!

మొవ్వలో ఒక నృత్యపాఠశాలను కొంత కాలం నడిపి, పోషకుల ప్రోత్సాహం లేక దానిని మూసివేసిన శ్రీ మండవ నాగేశ్వరరావుగారి స్నేహం నాకు లభించింది. క్షేత్రయ్య పదాలను ప్రచారం చెయ్యాలి. మువ్వగోపాలునికి ఒక సుందర మందిరాన్ని నిర్మించాలి - ఇవే మా యిద్దరి ఆశయాలు. ఇవి నెరవేరుతాయో లేదో?



వృద్ధాప్యంలో జీవరత్నమ్మ

కొన్నాళ్ళ క్రిందట మొవ్వలోని శివాలయ ధ్వజస్తంభం పునః ప్రతిష్ఠించబడింది. శ్రీ వి సుందర రామయ్యగారు ఈ కార్యాన్ని నిర్వహించారు. నృత్యపూజా విధానం తెలిసిన నన్ను ఒక నృత్య కేళికను ఆ సందర్భంలో నిర్వహించమన్నారు. నేను నిర్వహించాను. శాస్త్రీయ పద్ధతిలో ఆనాడు అక్కడ జరిగిన మా నృత్య కేళికను చూసి, ముగ్ధులైన సుందర రామయ్యగారు నాతో ఆంధ్రు నృత్యకళా విశిష్టతను గురించి చర్చించి, చిన్న కోరిక వెలిబుచ్చారు. "ఆంధ్రులకు గొప్ప నృత్యకళా సంపద ఉంది. సుదీర్ఘమైన చరిత్ర ఉంది. కాని లోకానికి పూర్తిగా తెలియదు. వీటిని గురించి ఆలోచించి ఏదైన శాశ్వతంగా ఉండే కార్యాన్ని చేయండి" అంటూ నా చేతిలో ఒక చెక్కు పెట్టారు. వారిచ్చిన విరాళంతోనే ఈ గ్రంథాన్ని వ్రాసాను, ప్రచురిస్తున్నాను.

మువ్వ గోపాలుని ఆశీర్వాదంతో, సుందరరామయ్యగారి ప్రోత్సాహంతో మన ఆంధ్రుల నాట్యకళా చరిత్రను ఈవిధంగా సమర్పించుకొంటున్నందుకు నాకు చాలా ఆనందంగా ఉంది.

నాగపూరులో వేమూరి సూర్యనారాయణ అనే ఒక కళాప్రియు డుండేవాడు. వారి పూర్వులది విజయనగరం. వారు హరికథలు చెప్పేవారు. సంగీతం బాగా తెలిసినవారు. నాటకాలు వ్రాసేవారు, వేసేవారు, వేయించేవారు. ఈ సూర్యనారాయణగారికి సంతానం లేదు. మాకన్నా పెద్దవాడు కనుక మమ్మల్ని తన బిడ్డల్లాగా చూసేవాడు. నేను నారాయణ తీర్థులవారి తరంగాలకు నృత్త, నృత్యాలు కూరుస్తున్నప్పుడు కూచిపూడి గ్రామం, కూచిపూడి నృత్యం, కూచిపూడి భాగవతాల గురించి ఈయన వివరించి నాకు చెప్పారు. దాంతో నాకు కూచిపూడి విద్యపైని మోజు కలిగింది. కాని, నేర్చుకొనే అవకాశం అప్పుడు లేకపోయింది. తర్వాత నేను విశాఖపట్నంలో ఉండగా విస్సా అప్పారావుగారి ప్రోత్సాహంతో కూచిపూడి కళానిధి బ్రహ్మశ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారిని ఆహ్వానించి, కూచిపూడి నాట్యం నేర్చుకొన్నాను. ఆయనకు వడ్డాది బాపిరాజు ఆతిథ్య మిచ్చారు. అప్పటికే శ్రీ శాస్త్రిగారు వయోవృద్ధులు. ఆయన జ్ఞాన వృద్ధులు. భరత విద్యలో తల పండిపోయినవారు. కూచిపూడి కళాకారుల కట్టుబాట్లు, నియమనిష్ఠలు, ప్రదర్శన విధానాలు, పాత్రపోషణ, ఏకపాత్ర కేళికలు మొదలైన విషయాల నెన్నింటినో ఆయన వద్ద నేర్చుకొన్నాను. ఆయనకు నాట్యంలో తెలియని విషయం లేదని, ఆయన ఒక అద్భుత కళాచార్యుడని నేను గ్రహించాను. నాకు మరపురాని ముఖ్య వ్యక్తుల్లో ఆయన ఒకరు. ఆ తర్వాత ఆయన సారథీ స్టూడియో అధినేత శ్రీ సి. వి. ఆర్. ప్రసాద్‌గారి కుమార్తెకు కూచిపూడి విద్య నేర్పుతూ హైదరాబాద్‌లోనే దైవసాన్నిధ్యం చేరుకొన్నారు.

ఆ రోజుల్లోనే శ్రీ చింతా కృష్ణమూర్తిగారి ఆధ్వర్యంలో ఒక నాట్య బృందం భాగవత ప్రదర్శన లిస్తూ ఉండేది. ఒక ప్రదర్శనలో శ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మగారిని 'ఉష'గా తొలిసారి చూశాను. ఆయన ఆట అద్భుతం, నటన చాలా అద్భుతం. అభినయం మరింత అద్భుతం. కూచిపూడికే కాదు, ఆంధ్రదేశానికే ఆయన సరస్వతీదేవి వరప్రసాదం.



పందిరివారి బృందంలో సూత్రధారుడు

మన భరత శాస్త్రాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి, మన ప్రాచీన నాట్య ప్రయోగాలను బాగా గుర్తెరిగిన వెంపటి చిన సత్యంగారు ఎన్నో నూతన ప్రయోగాలు చేస్తున్నారు. వీరు, వీరి శిష్యులు, కోరాడ నరసింహారావు గారు, తదితరులు కూచిపూడి నాట్య వైభవాన్ని దేశ విదేశాలలో చాటి చెప్పారు. చెప్తున్నారు. కూచిపూడిలో నున్నటువంటి శ్రీ పి.వి.జి. కృష్ణ శర్మ, వేదాంతం పార్వతీశం గార్లకు ఎన్నో ప్రాచీన నాట్య సంప్రదాయాలు తెలుసు. వీరిరువురినుండి అనేక విషయాలను సేకరించవచ్చును. వారి అనుభవాలను గ్రంథస్థం చేయవచ్చును. ఈ కార్యం శ్రమతో కూడుకొన్నదే అయినా మన నాట్యకళాభ్యుదయానికి ఇది చాలా అవసరం.

ఎవరైనా నృత్యకళపైని పరిశోధన చేయాలనుకొంటే వారు ముందుగా ఈ క్రింది సూచనలు పాటించాలి :

గురు ముఖంగా వారు ప్రాయోగికంగా నృత్యాన్ని అభ్యసించాలి. అడుగులు, అడవులు, క్రమము, వాటికి కావల

నిన పాట అక్షరాలు, భంగిమలు పట్టే విధం, నృత్త, నృత్య హస్తాలు, ముద్రలు, ఆంగిక, వాచిక, సాత్విక, ఆహార్యాభినయాలు, రసాభినయం, నృత్యనాటకాలు, ఏకపాత్రాభినయం, కేళికలు, వాటిలో గల భేదాలు నేర్చుకొనాలి. ఆ తర్వాత పరిశోధన సులువు అవుతుంది. పరిశోధన శాస్త్రీయంగా ఉంటుంది. పరిశోధన్ను సంపూర్ణంగా చేయడానికి వీలవుతుంది. లేకపోతే, పండితులు మెచ్చుకొన్నా సామాన్యులకు నిరుపయోగమౌతుంది. శాస్త్రం, సంప్రదాయం - ఈ రెండింటిని ఎరిగినవారు గ్రంథాలు వ్రాస్తే అవి వివరంగా ఉంటాయి.

మన గత చరిత్రకు శాసనాలు, కైఫియత్‌లే ఆధారాలు. నృత్యకళా చరిత్ర కొంత ఆలయ శిల్పాలలో నిగూఢంగా వుంది. నాట్యశాస్త్రం, అభినయదర్పణం, భరతార్ణవం, సంగీత రత్నాకరం, నృత్తరత్నావళి, రసమంజరి, ప్రతాపరుద్రీయం మొదలైన గ్రంథాలవల్ల మనం శాస్త్రాన్ని తెలుసుకోగలుగుతాం. కాని, ప్రయోగాన్ని సరిగ్గా తెలుసుకొనలేం. ఈ శాస్త్రాలలోని సూత్రాలను ఎలా ప్రయోగించాలో తెలిపే గ్రంథాలు గురువులవద్ద ఉండేవి. కాని, అవి నేడు లేవు. అందువల్ల మనమే శాస్త్ర, సంప్రదాయాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి, ప్రాయోగిక గ్రంథాలను నూతనంగా వ్రాయవలసి యుంటుంది. అయితే, నేను చెప్పినంత సులువు కాదు ఈ కార్యం. మన విశ్వవిద్యాలయాలలోని గ్రంథాలయాలలో, ఇతర గ్రంథాలయాలలో ఎన్నో ప్రాచీన యక్షగానాలు, సంగీత రచనలు మొదలైనవి ఉన్నాయి. కాని, వాటిని ప్రయోగించేవిధం మనకు తెలియదు. ప్రయోగ వ్యాఖ్యానాలు దొరకడం లేదు. కాని, వీటిని తెలిసిన వృద్ధ కళాకారులు ఇంకా కొందరు జీవించి యుండవచ్చును. పూర్వం వీడియో, ఆడియోల్లో భద్రపరచే సౌకర్యాలు లేవు. నేడు మనకు ఉన్నాయి. కనుక వీటి ప్రయోజనాన్ని మనం పొందవచ్చును. వీటి ద్వారా ప్రయోగ తీరులను రికార్డు చేయడం చాలా వ్యయంతో కూడుకొన్నవని. అందువల్ల రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు, విశ్వవిద్యాలయాలు, స్వచ్ఛంద సంస్థలు ఈ కార్యాన్ని చేపట్టాలి, లేక ఆర్థిక సహాయాన్ని అందివ్వాలి.

మనకు స్వతంత్రం రాకపూర్వం మధ్యప్రదేశ్‌లో రాయఘడ్ అనే ఒక స్వతంత్ర సంస్థాన ముండేది. ఆ ప్రభువు నృత్యకళా ప్రియుడు, కళారాధకుడు, నృత్య విద్యను అభ్యసించినవాడు, నృత్య కళలోని లోతుల్ని తరచి చూసినవాడు. కథక్ నర్తకులకు, పండితులకు, ఆచార్యులకు ఆయన ఆస్థానం ఒక నిలయంగా ఉండేది. ఆయన తబలా వాయిద్యంలో ఆరితేరినవాడు. అందువల్ల ఆయన వీరి సహాయ సహకారాలతో అనేక నూతన నృత్త జతులను తబలాపైని సృష్టించడమే కాక, తన ఆస్థాన నర్తకులైన కల్యాణ్‌జీ, కార్తిక్‌జీల చేత ఈ జతులకు రూపకల్పన చేయించాడు. అనేక నూతన కళా రూపాలను ఆయన సృష్టించాడు.

మనకు స్వతంత్రం వచ్చాక రాయఘడ్ సంస్థానం భారతదేశంలో విలీనమైంది. తర్వాత ఈ రాయఘడ్ ప్రభువు మరణించాడు. ఆశ్రయం లేని పక్షుల్లాగ ఆస్థాన పండితులు, ఆచార్యులు, నర్తకులు అందరూ చెల్లా చెదరయ్యారు. కైరాఘర్‌లోని ఇందిరా సంగీత విశ్వవిద్యాలయంలో కల్యాణ్‌జీ మహారాజా కథక్ ప్రొఫెసర్‌గా నియమితు డయ్యాడు. కార్తిక్‌జీ భూపాల్‌లో స్థిరపడ్డాడు. రాయఘడ్ ప్రభువు సృష్టించిన ఆ నూతన జతులు వీరిద్దరికే తెలుసు ప్రాయోగికంగా తెలియని పండితులు, శాస్త్రకారులు వీటిపైని ఎన్ని గ్రంథాలు వ్రాసినా అవి నిష్ప్రయోజనమే. ఆ నూతన జతులను ఎవరైనా వీడియో తీశారో లేదో నాకు తెలియదు తీయకపోతే అవి అంతరించిపోతాయి.

పూర్వం ప్రతి సంస్థానంలోను ఆస్థాన పండితులు, కవులు, గాయకులు, నర్తకులు మొదలైనవా రుండేవారు. వీరు వివిధ కళలను ఆరాధించేవారు. ప్రభువుల పోషణలో వాటిని అభివృద్ధిపరచేవారు. వీరు ఇతర సంస్థానాలకు వెళ్ళి, అక్కడి కళలను గురించి తెలుసుకొంటూ ఉండేవారు. వారి కళలకు మెరుగులు దిద్దుకొనేవారు.

దాందా, బస్తర్, సిరువంచ మొదలైన కొన్ని సంస్థానాలలో తెలుగుకు ప్రాముఖ్య ముండేది. సిరువంచ ప్రభువులు నృత్యకళా ప్రియులు. ఉత్తరాది, దక్షిణాది కళాకారు లనేకు

మంది ఈ సంస్థానాన్ని సందర్శించి, ప్రభువులవారిని కళలతో మెప్పించి. పారితోషికాలు పుచ్చుకొనేవారు. కనుక, అక్కడ నృత్య సంగతులకు సంబంధించిన గ్రంథాలు ఏమైనా ఉంటే ఉండవచ్చును.

సుమారు 30 సంవత్సరాల క్రిందట ఢిల్లీలో జరిగిన అఖిల భారత నాటక కళా సమావేశానికి వెళ్లాను. అక్కడ దేవేంద్రనాథ్ శతపతిగారితో పరిచయం కలిగింది. ఈయన, ఒరిస్సా మాజీ ముఖ్యమంత్రి నందినీశతపతిగారి భర్త, కాళింది చరణ్ పాణిగ్రాహిగారి అల్లుడు. వీరితో ఒరిస్సాలోని నాట్య కళగురించి ముచ్చటించాను. ఒరిస్సాలోని నాట్యకళావేత్త లను కలుసుకొనడానికి ఆయన నన్ను కటక్‌కు ఆహ్వా నించారు. వెళ్ళాను.

అప్పటికి 'ఒడిస్సీ' నృత్యం ప్రఖ్యాతి పొందలేదు. శతపతిగారి ద్వారా కవిచంద్ర కాళీచరణ్ పట్నాయక్‌గారిని కలుసుకొన్నాను. ఆయనొక వృద్ధ శాస్త్రవేత్త, గొప్ప వంది తుడు. నాట్యం గురించి ఆయనతో ఎన్నో విషయాలు చర్చిం చాను. ఆయన అభినయ పూర్వకంగా 'ఒడిస్సీ' నాట్య విష యాలను నాకు వివరించి చెప్పారు. ఆంగిక, సాత్వికాభి నయాల గురించి చివరకు చర్చించాం. ఆయన సిగ్గును ఆంగి కంగా అభినయించి, చూపించారు. నేను సాత్వికంగా నేత్రా లతో మాత్రం భావ స్ఫూరకంగా సిగ్గును అభినయించి, చూపించాను. ఆయన నన్ను అభినందించారు.

ఆనాటి సాయంత్రం ఒరిస్సా రాష్ట్ర మంత్రి శ్రీమతి బసంతమంజరీదేవి అధ్యక్షతను ఒక సభ జరిగింది. నేను అభినయపూర్వక ప్రసంగం చేశాను. వారందరూ నన్ను ఎంతో మెచ్చుకొన్నారు.

నేడు 'ఒడిస్సీ' నాట్యం ప్రపంచ ప్రఖ్యాతి పొందింది. ఎంతో అభివృద్ధి చెందింది. ఈ 30 ఏళ్ళలో అది సాధించిన ప్రగతిని చూస్తే నాకు ఆశ్చర్యం వేస్తుంది. ఒరిస్సా కళా కారులు ఎంతో పట్టుదల గలవారని, కార్యదీక్షాపరులని, త్యాగశీలురని దీనివల్ల విదితమౌతుంది. వారి కళా ప్రచా రానికి, దాని అభివృద్ధికి వారు చేసిన కృషి అద్భుతం, అద్వితీయం. నిరుపమానం. ఆ కళాకారుల్ని, ఆ నాట్యా చార్యుల్ని మనం తప్పకుండా అభినందించాలి.

మహరి నర్తనం, ఘోట్‌పురి నర్తనం అని ఓఢ్ర దేశ నాట్యం రెండు విధాలుగా ఉండేది. స్త్రీల ఆలయ నాట్యం మహరి. పురుషులు ఆరాధించిన నర్తనం ఘోట్‌పురి. ప్రస్తుతం మహరి తెరమరుగయింది. ఘోట్‌పురి నర్తనమే 'ఒడిస్సీ' పేరుతో ఏక పాత్ర కేళికగా రూపొంది, ప్రచారం లోకి వచ్చి, విశ్వవిఖ్యాతి గాంచింది.

నాగపూర్‌లోని బెంగాలీ సోదరులు ఆహ్వానించగా కలకత్తానుండి శ్రీ రోబిన్‌రాయ్ అనే నాట్యాచార్యుడు అక్కడికి వచ్చారు. ఆయన మణిపురి నృత్యాన్ని బాలబాలిక లకు నేర్పుతూ ఉండేవాడు. అయితే ఆ నాట్యాన్ని వారు కేవలం వాద్య సంగీత ఆధారంగా చేసేవారు. పాట ఉండేది కాదు. అప్పుడప్పుడు విశ్వకవి రవీంద్రుని కవితలకు నృత్యం ప్రదర్శించేవారు. వారికి మన వలె సాత్విక సంచారుల అభి నయ పద్ధతి అలవాటులో లేదు. ఆయన పరిచయం నాకు కలిగింది. ఆయనతో నాట్య విషయాలు ఎన్నో చర్చించాను. ఆయన నాకన్నా పెద్దవాడు. అనుభవజ్ఞుడు. వంగదేశ నర్తన రీతుల గురించి, మణిపురి నాట్యకళ గురించి, కలకత్తాలో అభివృద్ధిచెందుతూండిన కళారీతుల గురించి, ఉదయశంకరుగారి నాట్యాల గురించి వివరిస్తూ, నాకు ఆయన ఎన్నో విషయాలు చెప్పాడు. నేను ఆంధ్రుల నాట్యాల గురించి, నా కళారాధన గురించి ఆయనకు వివరిం చాను. ఇటువంటి చర్చలవల్ల నాకెంతో మేలు కలుగుతూ ఉండేది

పూర్వం మహారాష్ట్రలో శాస్త్రీయ నృత్యం లేదు. పొవాడ్, లావణి, తమాషా అనే నాట్యాలను వారు ప్రదర్శించే వారు. ఈ నాట్యాలు జానపదాలే అయినప్పటికీ, ఆ కళా కారులు చాలా సమర్థులు. గంటల తరబడి వారు సాధన చేసేవారు. రాత్రంతా గంటల తరబడి నర్తనమాడేవారు. మన నాట్యానికి మృదంగం జీవం, వారి నాట్యానికి డోల్‌చీ ప్రాణం. నిపుణులైన డోల్‌చీ వాయిద్యకారు లుండేవారు. వారు దానిని వాయిస్తూంటే మన శరీరం పులకరించి, నాట్యం చేయా లనిపిస్తుంది. అంత హాయిగా, అంత విన సొంపుగా ఉంటుంది వారి వాద్యం. మన భాగవతాలలో

పాడినట్లు వారు మధురంగా పాడేవారు, ఆడేవారు. ఆ యాటా ఆ యభినయం సహజ సౌందర్యంతో సొంపు లీనుతూ ఉండేవి. కొందరు స్త్రీలు గూడా చక్కగా పాడి, అభినయించేవారు. వారి కంఠాలు కిన్నెరలు. వారి గాత్రం అద్భుతం. పూర్వం నేను పిల్లలకు నేర్పి నప్పుడు హిందూస్థానీ, మరాఠీ పాటలకు కూడా మన బాణీలో నృత్యాభినయాలు నేర్పేవాణ్ణి. దివాణాలలో, ఆస్థానాలలో పూర్వం ప్రదర్శిస్తూండిన కళారీతులు వేరు. ఆ యాటలు కథక్ నృత్యాల్లా ఉండేవి. నేను మాత్రం దక్షిణాది బాణీని అనుసరించి, నృత్య అభినయాలను బండారు సంస్థానంలో ప్రదర్శిస్తూ ఉండేవాణ్ణి అందువల్ల నా ప్రదర్శనలు నిత్యనూతనంగా ఉండేవి.

ఒకనాటి సాయంత్రం నేను సాధన ముగించి, విశ్రాంతి తీసుకొంటున్నాను. దివాణం నుండి కబురు వచ్చింది. ఒక పెద్ద నర్తకీమణి కాశ్మీర్ నుండి వచ్చిందట. రాత్రికి ఆమె కచ్చేరీ దివాణంలో ఏర్పాటయిందిట. తొందరగా రమ్మనమని ఆ వార్తాలోని విశేషం.

నేను స్నానం, భోజనం తొందరగా ముగించుకొని, నూతన వస్త్రాలు ధరించి, చక్కగా ముస్తాబై కచ్చేరికి వెళ్ళాను. ఆమె సభలోకి ప్రవేశించింది. ఒక దివ్యలోక సుందరి సభలోకి ప్రవేశిస్తున్నట్టు నా కనిపించింది. ఆమె వెండి తీగ లాగుంది. తెల్లని శరీరచ్ఛాయ, తెల్లని వస్త్రధారణ, మెడలో తెల్లని ముత్యాలదండ. ముక్కున తెల్లని రవ్వ, చెవులకు తెల్లని రవ్వల కమ్మలు. ఆమె అప్సరస, అతిలోక సుందరి, అందాలరాశి. ప్రాణం పోసుకొన్న పాలరాతి విగ్రహంలా సభలోకి ప్రవేశించింది. "పియా ఝూమ ఝూమ నిందియా ఆయిరే" అని ఠుమ్రీని ఆలపించి, అభినయిస్తూంటే, ఆ కనుగవ కదలిక, తనూలత స్వాధీనం తప్పుతున్నట్టు ఆమె అభినయిస్తూంటే ఎక్కడెక్కడికో నేను పయనిస్తూ, ఏదో, ఎక్కడికో ఒక దివ్యలోక సందర్శనానికి చేరుకొన్నాను. నాలాగే సభలోని వారందరూ వారివారి సంస్కారాన్ని బట్టి వారి అనుభూతుల్లోకి వెళ్ళిపోయారు. ఇదే విధంగా కచ్చేరి కొనసాగింది. ఇంతలో తెలవారింది. ఒకొక్కరే సుషుప్తిలో నుండి తేరుకొన్నారు. కొందరికి తృప్తి, కొందరికి అసంతృప్తి, కొందరికి ఆనందానుభూతి, కొందరికి వియోగం, కొందరికి విరహం, ఇలా పరిపరి విధాలైన అనుభూతుల్ని ప్రేక్షకులు పొందారు. ఆమె అభినయం అంత ఉన్నతంగా, సహజంగా, సౌందర్యవంతంగా, సుకుమారంగా, లాలిత్యంగా ఉంది. కొన్నాళ్ళ వరకు నేను ఆమె అభినయాన్ని మరువలేకపోయాను. ఆమె పాట నాకు వినిపిస్తూండేది, ఆనందం కలిగిస్తూండేది.

ఆనాటి సభకు గవర్నర్ సంస్థానాధీశుడు గూడ వచ్చారు. సభలో పెద్దలు అనేకమంది ఉన్నా ఆమె ఎక్కువగా నన్ను చూస్తూనే అభినయించిందిట! కేళిక ముగిసిన తర్వాత, నే నెవరు అన్నట్టు నావైపు చూసి రాజావార్ని కనులతోటే ప్రశ్నించిందట. "రామకృష్ణా!" అన్నారు రాజావారు. నాకు పూర్తిగా మెలకువ వచ్చింది. ఈ లోకంలోకి వచ్చాను. "రామకృష్ణా! ఆమె పాడుతుంది. నువ్వు నాట్యం చేయి" అన్నారు ఆయన. ఆమె నవ్వుతూ నావంక చూసి "హేపియా! ఝూమ, ఝూమ! నిందియా ఆయిరే" అని పాట అందుకొంది. నేను నిద్రావస్థను ప్రదర్శించాను. అలా అలా సముద్రపు టలల్లాగ నాలో భావతరంగాలు పుట్టుకొచ్చాయి. వాటన్నింటినీ అభినయించాను. అందరూ "భేష్ భేష్" అంటూ చప్పట్లు కొట్టారు. "మహారాజా! ఈయనకు ఈ యభినయం దేవుడు ప్రసాదించిన వరం" అంటూ ఆమె నా తలపై చేయి పెట్టి దీవించింది. నా జన్మ ధన్యమైంది. ఇది జరిగి అర్ధ శతాబ్ది గడిచినా ఈనాడు ఈ గ్రంథం వ్రాస్తూంటే ఆ దృశ్యం నా కనులముందు కనిపిస్తూంది.

ఏరీ ఆ రాజులు? ఆ రసికులు? ఆ కళాపోషకులు? ఆ సహృదయ కళాకారులు ఏరి? లేరు! అందరూ వెళ్ళిపోయారు! ఆ రోజులు మరి రావు అలాంటి సభలు మరి జరగవు. ఇలా తలచుకొంటూంటే నేను ఒంటరివాణ్ణయినట్టు బాధ కలుగుతుంది. కన్నులు చెమ్మగిల్లుతాయి. అదే నా జీవితంలో ఓవరి దర్బారు ఆట. కాని, ఆ దివ్యానుభూతి నన్ను విడిచిపోలేదు. తీరిక దొరకినప్పుడల్లా అనాటి దృశ్యాలే నా కనులముందు కదలాడుతూంటాయి. ఆ యనుభూతుల్ని నేను నెమరువేసుకొంటూ ఉంటాను. ఒక్కొక్కసారి నా హృదయం పరమానందభరితమౌతుంది. ఒక్కొక్కసారి ఆవేదనతో నిండిపోతుంది. ఇవి గతకాల స్మృతులు.

ఈనాడు పాడాలంటే ఆనాటి కంఠంలా పలకడం లేదు. నాట్యం చేయాలంటే శరీరం సహకరించడం లేదు. అభి నయించాలంటే కళ్ళు అలసిపోయాయి. ఆనాటి నా అందం హరించుకుపోయింది. ఆ తల్లి - నృత్య సరస్వతిని స్మరించు కొనడానికి మాత్రం అంబ కొంత ఓపికను ప్రసాదించింది. అదే పదివేలు.

నేను విశాఖపట్నంలో ఉండగా ఒకసారి అనకాపల్లిలో పెద్ద ఎత్తున సాహిత్య సభలు జరిగాయి. నన్ను ఆహ్వా నించమని శ్రీ నండూరి సుబ్బారావుగారు దాని నిర్వాహకు లకు ప్రత్యేకంగా చెప్పారుట. వారు నాకు తంతి పంపారు. నేను మెయిల్లో బయలుదేరాను. అనకాపల్లిలో మెయిలు ఆగ గానే నే నున్న బోగీవద్దకు ఒకాయన వచ్చి, "నమస్కారం రామకృష్ణగారూ! రండి. మిమ్మల్ని కలుసుకొన్నందుకు చాలా సంతోషం" అంటూ ఒక తెల్ల గులాబీని నా కంది చ్చాడు. కారు దగ్గరకు తీసికొని వెళ్ళాడు. "నన్నెలా గుర్తు పట్టారు?" అని ఆశ్చర్యంగా అడిగాను. "తెల్లని దుస్తు లతో, నవ్వు ముఖంతో ఎవరు ఫస్టు క్లాస్ కంపార్టుమెంటులో నుంచి దిగితే ఆయనే నటరాజ రామకృష్ణ" అని నండూరి సుబ్బారావుగారు చెప్పారు" అన్నాడా పెద్దమనిషి.

ఆ సభకు ఎందరో గొప్ప గొప్ప కవులు వచ్చారు. కవితా గానం చేశారు. నేను అభినయ పూర్వకంగా ప్రసం గించాను. ఆ సభకు గుంటూరు జిల్లా, పెద్ద పుల్లేరు నుండి ఒక ప్రముఖ వైష్ణవ పండితుడుగూడా వచ్చాడు. ఆయన పేరు జ్ఞాపకం లేదు. ఈ పెద్ద పుల్లేరునే వ్యాఘ్రపుర మని కూడా అంటారు. కూచిపూడి వారు నేడు ప్రదర్శించే దశావ తారాల పాటను ఈ పూరికి చెందిన కవే వ్రాశాడంటారు. ఈ వైష్ణవ కవి వర్యుడు ఒక్కొక్కరి కవితాగానం గాని, ఉప న్యాసం గాని ముగిసినంతనే వారిని ఆశువుగా పద్యంతో వర్ణిస్తూ వచ్చాడు. నన్నుగూడా వర్ణించాడు. ఆ ఆశు పద్యం పూర్తిగా గుర్తులేదు. కాని జ్ఞాపకమున్నంతవరకు ఆ పద్యం ఇలా నడిచింది:

"నటరాజ రామకృష్ణుని, నటనా కౌశలముగని నా హృదిలోనన్ తటకిట తోం తటకిటతో, మటందు వాణీ తాండవ మాడెన్!"

ఈ విధంగా ఎన్నో సభల్లో ఎందరో కవులు నన్ను ఆశీర్వదిస్తూ పద్యాలు చెప్పారు. ఎందరో సన్మాన పత్రాలు చదివారు.

వేంకట పార్వతీశ్వర కవుల రచనలు నన్ను ఎంతో ఆకర్షించాయి. ముఖ్యంగా వారి "ఏకాంత సేవ". ఆ రోజుల్లో వాటిని పెక్కు సభల్లో పాడుతూ అభినయించే వాణ్ణి, ''విరి దండ మెడలోన వేయుటయేగాని కన్నార నీరూపు గాంచనే లేదు...." ఇవి మూడు పద్యాలు. వీటిని ఎన్నిసార్లు ఎన్ని సభల్లో పాడుతూ అభినయించానో లెక్క లేదు. అయినా తనివి తీరలేదు. నేను కాకినాడలో అభినయిస్తూండగా శశాంక చూశాడు. ఇతర సభికులతో బాటు అతడూ ఆనందించాడు. ఈ పద్యాలను ప్రతి సభలోను అభినయిస్తూండమని నన్ను ప్రత్యేకంగా కోరాడు. ఆ పద్యాలు ఎందువల్లనో సభికుల హృదయాలను దోచుకొనేవి. ఆ పద్యాలలోని భావమా, నా యభినయమా - వారి మనసును దోచుకొన్నది? రెండూ అని చెప్పాలి.

శశాంక నా యభినయంగురించి వారి నాయనగారితో చెప్పాడట. ఆయన నన్ను చూడాలని కోరారుట. ఒకసారి నేను కాకినాడ వెళ్ళినప్పుడు శశాంక నన్ను పిఠాపురం తీసి కొని వెళ్ళాడు. కొందరు మిత్రులతో కలిసి వెళ్లాను. అది సంధ్యాసమయం. వారింటికి వెళ్ళగానే "నాయనా రామకృష్ణా! వచ్చావా?'' అంటూ ప్రేమపూర్వకంగా నన్ను కౌగిలించు కొన్నారు ఓలేటి పార్వతీశంగారు. ఆయన అమృత హృద యుడు, ప్రేమమూర్తి. ఆయన కాళ్ళకు నమస్కరించి, క్రింద కూర్చున్నాను. ఆయన మడత కుర్చీలో కూర్చుని, "నా పద్యాలు ఆలపించవోయి!" అన్నారు. ఇంక ఆలస్యం చేయకుండా "విరిదండ మెడలోన....'' అంటూ పద్యం ఆల పించాను. ఆయన ఆసక్తితో వింటూ కూర్చున్నారు. ఇంతలో చీకటి పడింది. హరికేన్ లాంపు వెలిగించి, శశాంక నా ముందుంచాడు. ఆ వెలుగులోనే పార్వతీశంగారు నా యభి నయం చూశారు. వారి కంట ఆనంద బాష్పాలు ప్రవహిం చాయి. నా అభినయం ముగిసింది. ''బాబూ! నా కన్నులు సార్థకమయ్యాయి! శ్రీకృష్ణుని దివ్యదర్శనం చేయించావ్! నా జన్మ ధన్యమయింది'' అంటూ నన్ను అక్కున చేర్చుకొని

తల నిమురుతూ, కొన్ని నిమిషాలు ఆయన అలా ఉండి పోయారు. ఇలా ఎందరో పెద్దలు నన్ను ఆ రోజుల్లో దీవించారు. వారందరూ సహృదయులు.

ఆ శశాంకుడు ఈనాడు లేడు. చిన్నవయస్సులోనే చంద్రలోకానికి వెళ్ళిపోయాడు. ఒక మంచి మిత్రుణ్ణి కోల్పోయాను.

మరి కొన్నాళ్ళకు శ్రీ బాలాంత్రపు వేంకటరావు గారిని కలుసుకొన్నాను.

ఒకసారి విశాఖపట్నంలో జరిగిన ఒకయజ్ఞం సందర్భంలో పండిత సభలు, కవితాగోష్ఠులు జరిగాయి. ఆ సభలకు కుర్తాలం స్వాములవారు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు రాయప్రోలు సుబ్బారావు,వేదులసత్యనారాయణ, పురిపండా అప్పలస్వామి మొదలగు పెద్దలు శ్రీ వద్దాది బాపిరాజుగా రింట్లో సమావేశమయ్యారు. ఆ స్వామీజీ కూడా వచ్చి నా అభినయం ప్రదర్శించమన్నారు. వారి సన్నిధిలో శృంగారసం అభినయించడంకన్నా భక్తిభావం అభినయించడం మంచిదని ఒక క్షణంలో నిర్ణయించుకొని "రావోయి మా యింటికి, గోపాలకృష్ణా! రావోయి మా యింటికి...." అన్నపాట రాగమాలికలో యెత్తుకొని అభినయించాను. "నిగనిగలాడు నీ నీలదేహపు కాంతి, నాకు చూపి పోరా నవ మోహనాకార" అని చివరి చరణాన్ని మోహన రాగంలో అభినయిస్తూంటే ఆ స్వామిజీతో బాటు ప్రేక్షకులందరూ ముగ్ధులయ్యారు.

"భేష్! అడుగో చిన్నికృష్ణుడు. తన చిరుపాదాలకు పసిడిమువ్వలు ధరించి, మన మధ్య ఆడుతున్నాడయ్యా! ఎంతటి అనుభూతి కలిగించావయ్యా! రామకృష్ణా! చిరకాలం వర్ధిల్లు. ఈ కళారాధనలో తరించు! ఇదీ యొక యాగమే! ఇదీ యోగమే!" అంటూ ఆ స్వామీజీ మంత్రాక్షితులు వేసి నన్ను ఆశీర్వదించారు.

ఒకసారి విజయనగరంలో ఒక కార్యక్రమం సందర్భంలో శ్రీ సంపత్కుమారుని కలిశాను. అప్పుడు ఆయన చేసిన "ఆంధ్ర జాలరి" నృత్యం చూశాను. అదొక అపూర్వ కళాసృష్టి. అదొక వినూత్న కళారూపం. ఆ నృత్యంవల్ల అతనికే కాదు, ఆంధ్రదేశానికే పేరు వచ్చింది.

విజయనగరాన్ని విద్యల నగరమని ఊరికే అనలేదు. అక్కడ గురుజాడ అప్పారావు, ఆదిభట్ల నారాయణదాసు, ద్వారం వేంకటస్వామిగార్ల వంటి మహామేధావులు ఉండేవారు. వీరిలో వాయులీనసార్వభౌముడు శ్రీ ద్వారం వేంకటస్వామి నాయుడుగార్ని కలుసుకొని, వారి వాయిద్యం వినే అదృష్టం నా కొకటి, రెండుసార్లు కలిగింది. అక్కడ భరతాచార్య శ్రీ దువ్వూరి జగన్నాథ శర్మగా రుండేవారు. వారు నాట్యాచార్యులే కారు- మంచి విద్యావేత్త, పరిశోధనా పండితుడు; విజయనగర సంస్థాన చరిత్ర వ్రాసినవారు. ఆయన్ని తరచు కలుసుకొనే అదృష్టం నాకు కలిగింది. ప్రసిద్ధ నాట్యకళాకారిణి శ్రీమతి మద్దెల రాముడమ్మగారు విజయనగర సంస్థానంలో ఆస్థాన నర్తకిగా ఉండేవారు. ఆమె కొన్ని ప్రత్యేక రచనలు పాడి, అడి నాకు చూపించారు. నేను నాగపూర్‌లో ఉండగా సేఠ్ రామనాథ్ గారింట్లో ఒక వివాహ సందర్భంలో శ్రీమతి 'కళావరురింగు' ప్రదర్శించిన నృత్యాభినయాలు చూశాను. ఈమె తెలుగు పాటల్నేగాక హిందుస్థానీ ఠుమ్రీలు, గజల్స్ పాడి అభినయించేవారు. వీరి మేళంలో ఉండిన శ్రీమతి కోటిపల్లి సన్యాసమ్మగారు మాత్రం మన ప్రాచీన బాణీలో పదాలు, వర్ణాలు, జావళీలు అభినయించేవారు. వీరు కూడా విజయనగర వాస్తవ్యులే.

హరికథా పితామహులు ఆదిభట్ల నారాయణ దాసుగారిని చూసే అదృష్టానికి నేను నోచుకోకపోయినా, వారునివసించిన గృహాన్ని చూసి సంతోషించాను. వారు అచ్చతెలుగులో వ్రాసిన "ఒమరు ఖయాం" రుబాయితులు చదివాను. వాటిని అర్థం చేసుకొనడానికి కష్టపడవలసి వచ్చింది. వీరు పార్సీ భాషను అభ్యసించి, 'ఒమరు ఖయ్యాం'ను అచ్చతెలుగులో వ్రాసేరు. మరి వారెంత శ్రమ పడ్డారో! శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి తెలుగుసేత కూడ చదివాను. తర్వాత రాయప్రోలు సుబ్బారావుగారి తెలుగు అనువాదం చదివాను. శ్రీ నారాయణదాసుగారు కవి హృదయాన్ని తర్జుమా చేయడం ఒక ఎత్తు, ఆ తర్జుమాను అచ్చ తెలుగులో చేయడం మరొక ఎత్తు. వీరి తర్జుమాను పలు సార్లు చదివాను.

ఆ రోజుల్లో రాయప్రోలు వారి అల్లుడు శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు విజయనగరం కాలేజీలో లెక్చరర్‌గా

ఉండేవారు. వీరు అలంకార శాస్త్రాన్ని బాగా అధ్యయనం చేశారు. కనుక వీరిని కలుసుకొనడానికి విజయనగరం వెళ్ళే వాణ్ణి. క్షేత్రయ్య పదాల్లోని నాయికా నాయకుల గురించి మేం చర్చించుకొనేవారం తర్కించుకొనేవారం.నా క్షేత్రయ్య పదాభినయం వారి కిష్టం. అందువల్ల అనేక క్షేత్రయ్య పదాలు అభినయించి, నాయికను నిరూపించి చూపించేవాణ్ణి. అమరుకంలోని శ్లోకాలను వారు సన్నభినయించమని కోరే వారు. ఇలా అడిగేవారు నేడు ఎవరున్నారు గనుక? నేను వాటిని అభినయించేవాణ్ణి. విజయనగరం వెళ్ళడమంటే విజ్ఞాన విందుకోసం, విలాసంగా వినోదయాత్ర చేసినట్టు నాకు ఉండేది.

పూండి జమీందారుగారు శ్రీ వరదా నారాయణరావు గారు అహ్వానించగా బరంపురం వెళ్ళి, తిరుగుప్రయాణంలో టెక్కలి మీదుగా శ్రీ తిమ్మరాజు శివరావుగారి అతిథిగా శ్రీకాకుళం వెళ్ళాను శివరావుగారు ఒక చిన్న జమీందారు, కళాప్రియులు. వారి శ్రీమతి చక్కగా వీణ వాయించేవారు, కుమార్తె నాట్యం చేసేది. వారి సహకారంతో అరసవిల్లి, శ్రీకూర్మ పుణ్యక్షేత్రాలు సందర్శించాను. ఈ రెండుచోట్ల గం ఆలయాలలో పూర్వం నృత్య పూజ ఉండేది.

శ్రీమతి బడే వేంకటరత్నం అనే ఒక వృద్ధ దేవ నర్తకిని శ్రీకూర్మంలో కలుసుకొన్నాను. ఆమె అనా రోగ్యంతో విశ్రాంతి తీసుకొంటున్నారు. నా కోర్కెను తిరస్క రించలేక దైవోపచారాలలో పాడే కొన్ని పాటల్ని, అష్ట దిక్పాలుర గద్యలు, శబ్దాలు మెల్లగా పాడి వినిపించారు. అది నా అదృష్టం.

ఆనాటి సాయంత్రం నిగడాం వాస్తవ్యులు శ్రీ దూడల శంకరయ్యగారి భాగవతాన్ని ప్రత్యేకంగా ఏర్పాటుచేయగా, ప్రదర్శనకు వెళ్ళాను. ఈయన గొప్ప భాగవత కళా కారుడు. ఈయన ఆట చాలా బాగుంది. వీరికి ధర్మవరపు గురువులు మద్దెల వాయించారు. ఆట మధ్యలో శంకరయ్య గారు "మంటలు, మంటలు" అన్నారు. గురువులుగారు బాణీ మార్చి మద్దెల వాయిస్తూంటే గుడిలో గంటలు మ్రోగినట్లే వినబడింది. అదొక అద్భుతమైన ప్రక్రియ. ఆ తర్వాత ఆతడు శంఖం, డోలు, టక్కు, టమారం, రుంజ మొదలైన అనేక వాద్యాలను అద్భుతంగా వాయించాడు. అదొక అపురూపమైన విద్య. ఈ విద్యలో ఇతడు శంక రయ్యగారి శిష్యుడే. అందుకే ఇతణ్ణి పేరిణి శివతాండవానికి మృదంగ వాద్యకునిగా ఆహ్వానించాను. ఇతడు, శ్రీ సూర్య లింగంగారు పేరిణికి ప్రారంభంలో మృదంగంతో సహకరిం చారు. శంకరయ్యగారు "వందిత సత్యభామ" బిరుదాం కితులు, అనేక విద్యలలో ఆరితేరినవారు.

శ్రీ వరదా ఆదినారాయణ భాగవతారుగారిది విజయ నగరం. వీరు భాగవత ఆటలో నిష్ణాతులుగా పేరుబడ్డవారు. వీరు నృత్య అకాడమీ ఆర్థిక సహాయంతో విజయనగరంలో భాగవత గురుకుల నిర్వహించారు. ఆ రోజుల్లో వీరిని కలి శాను, వీరి పాట విన్నాను, ఆట చూశాను. చాలా బాగు న్నాయి.

భామవేషంలో శ్రీ బొంతలకోటి జగన్నాథంగారిది అందెవేసిన చెయ్యి. యంత్రంలా వీరి కంఠం సుళ్ళు తిరిగేది. వీరి పాట చాలా గొప్పగా ఉండేది.

శ్రీ భాస్కరభట్ల అప్పలనరసింహంగారి గాత్రం విన వలసిందే గాని వర్ణించడానికి వీలులేదు. అదేమి సాధనో గాని వీరి కంఠం కిన్నెరలా మోగేది.

గానకోకిల శ్రీ వానపల్లి పరదేశిగారి పాటా, ఆటా చాలా బాగుండేవి. ఇలా ఇంకా ఎంతో మంది భాగవతాలు నేను శ్రీకాకుళం జిల్లాలో చూశాను, మృదంగ వాయిద్యాలు విన్నాను. అయితే, వీరి భాగవతాలలో ఆట తక్కువ, పాట ఎక్కువ. అలుపు లేకుండా వీరు రాత్రంతా పాడేవారు. వేలాది మంది జనం వీరి ప్రదర్శనలకు వచ్చేవారు. సమర్థవం తంగా హాస్యం చెప్పేవారు గూడ ఈ భాగవతాల్లో ఉండే వారు.

అర్ధలంకోటా వేసుకొని, చెక్కనగలు ధరించి ఆడు తూంటే ఆ దీపాలకాంతిలో వారు తళతళ మెరిసిపోయేవారు. విజయనగరంలో పైడితల్లి సంబరాలు జరుగుతూంటే ఈ భాగవతాలను చూడాలి. ఒక్కొక్క పందిరివద్ద వేలాది మంది జనం కూడతారు. వీధి కొక భాగవతం ఆట. ఒకరి బృందంతో వేరొకరు పోటీపడి మరీ ఆడేవారు. చలికి కూడా

జంకకుండా వారు పాడుతూ, ఆడేవారు. పోను పోను వారి కంఠాలు ఎంతో సున్నితంగా, మధురంగా వినిపించేవి. విజయనగరమంతా వీరి కంఠాలు మారుమ్రోగేవి. ఆ బంగారు తల్లి వీరి ఆట చూసి ఎంత ఆనందించేదో!

శ్రీ బొంతలకోటి జగన్నాథంగారు బాగా ముసలివారైన తర్వాత కదలలేనిస్థితిలో వారుండగా వారి గానాన్ని కేంద్ర సంగీతనాటక అకాడమీ వారు రికార్డు చేశారు. అప్పటికి వారి కంఠస్వరం బాగా క్షీణించింది. అయినా వారి కంఠస్వరం గిరగిరా గిరికీలు కొడుతూంటే ఆ అకాడమీ వారు ఆశ్చర్యపోయి "ఈయన మంచి వయస్సులో ఉండగా ఇంకా ఎంత బాగా పాడేవారో గదా! దురదృష్టం - అప్పుడు వీరి పాట రికార్డు చేయలేక పోయాం!" అంటూ విచారించారు. అప్పటికి గానకోకిల వరదేశి మరణించాడు. ఆయన పాట వీరు విని యుంటే ఏమనుకొనేవారో!

ఈ కాలంలో అలా పాడేవారుగాని, మద్దెల వాయించే వారుగాని లేరు.

లయబ్రహ్మ ఆదిభట్ల నారాయణ దాసుగారు కాళ్ళకు గజ్జెలు కట్టుకొని, హరికథ చెబుతూ నాట్యం చేసేవారు. ఒక సారి వారు హరికథ చెబుతూండగా ప్రక్కనుండి వెళుతున్న బి.ఎన్.ఆర్. రైలు ఇంజన్ కూత పెట్టిందట. వెంటనే ఆయన "శంభో" అంటూ కంఠం పూరించారట. అప్పుడు ఆ రైలు కూత మరెవ్వరికీ వినబడ లేదట. అంతటి గొప్ప గళం ఆయనది. ఆ కాలంలో గాత్ర, సంగీతాల సాధన అలా ఉండేది. ఆడేవారికి రూపం బాగా లేకపోయినా భాగవత ప్రదర్శకులకు గాత్రం గొప్పగా ఉంటే ప్రేక్షకులకు చాలు. తాళ ప్రస్తారం తెలిసిన మార్దంగికు లుండేవారు.

ఆ కాలంలో చేబ్రోలు సన్యాసి అనే ఒక భాగవత కళాకారు డుండేవాడు. ఈయన వేషం చూడడానికే చాలా మంది ప్రేక్షకులు వచ్చేవారట. వారిని చూసే అదృష్టం నాకు లేకపోయింది.

రాత్రి భాగవతం ప్రదర్శించిన వారు ఆ మర్నాటి ఉదయం గ్రామ పెద్ద యింటివద్ద సమావేశమై, పండితులతో శాస్త్ర చర్చ జరిపేవారు. అందువల్ల ఈ భాగవతులు శాస్త్రీయంగా విద్య నభ్యసించేవారు.

ఈ శాస్త్ర చర్చ భాగవతులకు ఆ రోజుల్లో ఒక పరీక్ష వంటిది. ఆ పరీక్షలో వారు నెగ్గితే వారిని మళ్ళీ ప్రదర్శనకు పిలిచేవారు. లేకుంటే ఆ గ్రామంలో అదే వారి ఆఖరి ప్రదర్శన.

ఒకసారి ఒక గ్రామంలో దూడల శంకరయ్యగారు భాగవతం ఆడుతున్నారు. భామ తెర వెడలిన తర్వాత ఒక దరువు ఆడి, మద్దెల వాయించడానికి మార్దంగికునికి ఆయన ఒక అవకాశం ఇచ్చారు. ఆయన వాయిస్తున్నారు. ఇంతలో సభలో నుండి ఒకడు లేచి "నేను మద్దెల వాయిస్తాను, మీరు నాతో పోటీగా ఆడతారా?" అని సవాలు చేసేడు. మనమంతా తోటి కళాకారులం. మన మధ్య పోటీ ఎందుకు? కావాలంటే నేను సరదాగా ఒక దరువు పాడతాను, మీరు వాయించండి'' అని శంకరయ్యగారు సర్ది చెప్పబోయారు. "అలా కాదు; మీకు దమ్ముంటే నా సవాలును స్వీకరించండి'' అన్నాడా వ్యక్తి. "మీరు గట్టిగా పట్టుబడితే నేను సిద్ధమే. కాని, ఒక షరతు. నా పాటకు మీరు సరిగ్గా వాయించలేకపోతే, మద్దెల విప్పేసి, సభనుండి వెళ్ళిపోవాలి" అన్నారు శంకరయ్యగారు. అందు కా వ్యక్తి అంగీకరించాడు. శంకరయ్యగారు ఒక దరువులోని పల్లవి ఎత్తుకొని పాట ప్రారంభించారు. ఆయన ఎత్తుకొన్న జాగాకు ఆ కొత్త మార్దంగికుడు రాలేక పోయాడు. అప్పుడా వ్యక్తి మద్దెల విప్పేసి సభ నుండి వెళ్ళిపోవలసి వచ్చింది. ఆనాటి భాగవత ఆటలు ఇలా ఉండేవి. ఒకడు రెండు మద్దెళ్ళు నడుముకు కట్టుకొని వాయిస్తే, ఇంకొకడు మూడు మద్దెళ్ళు నడుముకు బిగించి వాయించేవాడు.

తూర్పుభాగవత కళాకారులందరూ పురుషులే. అయితే అతవ బ్రహ్మంగారు వారి కుమార్తె అంజనీదేవికి భామా కలాపం నేర్పించారు. ఆమె అంజనీ భాగవతారిణిగా మంచి పేరు సంపాదించుకొంది. కాని, వివాహం అయిన తర్వాత ప్రదర్శనల నుండి విరమించుకొంది. అది ఈ కళయొక్క దురదృష్టం. ఆమె అలా విరమించుకొనకుండా యుండి యుంటే తూర్పు భాగవత కళకు ఈనాడు మంచి పేరు వచ్చేది.

తూర్పు భాగవతులకు మంచి విద్య యుండినా పేద వారుగానే ఉండిపోయారు.

పూజ్యులు శ్రీయుతులు విస్సా అప్పారావు, వేదాల తిరువేంగళాచార్యులు, జంధ్యాల పాపయ్య శాస్త్రి, జమ్మల మడక మాధవరామశర్మ, స్వామి శివశంకర శాస్త్రి, కాశీ కృష్ణమాచార్యులు మొదలైన అనేకమంది పెద్దలతో నాకు గుంటూరులోనే పరిచయం కలిగింది.

దక్షిణ భారత నృత్యకళలో క్షేత్రయ్య పదాలకు గల విశిష్ట స్థానం గురించి ప్రచారం చేయడానికి విశాఖపట్నంలో ఒక సమితి ఏర్పాటయింది. ప్రముఖ నాట్యకళా విద్వాంసుడు శ్రీ ఈ. కృష్ణయ్యరును ఒకసారి ఈ సమితి విశాఖకు ఆహ్వానించింది. ఆయన ఆనాటి సభలో ఉపన్యసించిన తర్వాత నేను కొన్ని క్షేత్రయ్య పదాలను అభినయించాను. ఆయన నా యభినయానికి ముగ్ధులై, నన్ను మదరాసు సభలకు ఆహ్వానించారు. రెండు మూడు సార్లు ఆ నృత్య సభలకు వెళ్ళి తరవాత విరమించుకొన్నాను. ఆ సభల్లో నాకు అనేకమంది నృత్య కళాకారులతో పరిచయం ఏర్పడింది. మదరాసు నగరానికి చెందిన శ్రీమతి మైలాపూరు గౌరిదేవి, శ్రీయుతులు చొక్కలింగం పిళ్ళె, రామయ్య పిళ్ళె ఇంకా ఎందరో నృత్య కళాకారుల్ని ఆ సభల్లో కలుసుకొన్నాను.

ఆ రోజుల్లోనే ఒకసారి పిఠాపురం మహారాజావారి బంగళాలో నా యభినయ సభ జరిగింది. శ్రీయుతులు పాకాల రాజమన్నారు, గిడుగు వేంకట సీతాపతి, విస్సా అప్పారావు, ఈ కృష్ణయ్యరు, సిలోన్ రంజనిదేవి గారులు మొదలైన వారెందరో ఆ సభకు విచ్చేశారు. ఇలాంటి పెద్దలతో పరిచయం కలగడం నా జీవితంలో మరువలేని దివ్యానుభూతి.

ఆ రోజుల్లోనే నేను హైదరాబాద్‌లో అభినయ పూర్వక ఉపన్యాసాలు ఇవ్వడానికి వచ్చాను. అప్పుడు శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారు హైదరాబాదు రాష్ట్రానికి ముఖ్య మంత్రిగా ఉన్నారు. వారు ఒకటి, రెండు చోట్ల నా యభినయాన్ని చూసి, చాలా మెచ్చుకొన్నారు. నన్ను వారింటికి ఆహ్వానించారు. ప్రభుత్వం తరఫున నెలకొల్పబోయే సంగీత నృత్యకళాశాలకు నన్ను ప్రిన్స్‌పాల్‌గా ఉండమని వారు నన్ను కోరారు. ఆనాడు సికింద్రాబాద్, హైదరాబాద్ జంట నగరాలలో రెండు మూడు సంగీత సభలే ఉండేవి. నృతకళ అంతగా ప్రచారం లేదు. నృత్యకళా ప్రచారానికే నేను ఈ జంటనగరాలకు వచ్చాను కనుక, వారి కోరికను వినయతతో తిరస్కరించాను. అప్పుడు శ్రీ వింజమూరి వరద రాజయ్యం గారు ఆ సంగీత నృత్య కళాశాలకు ప్రిన్స్‌పాల్‌గా నియమింపబడ్డారు. వారు కొద్దికాలమే ఉండి, విరమించుకొన్నారు. తర్వాత శ్రీ జి. ఎక్. దంతాలే ప్రిన్స్‌పాల్ అయ్యారు.

ఇంతలో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. అందువల్ల హైదరాబాద్‌లో నాట్యకళా ప్రచారానికి "నృత్య నికేతనం" నెలకొల్పడానికి సన్నాహాలు మొదలుపెట్టాను. ఆ సమయంలోనే నా తొలి గ్రంథం "నృత్యాంజలి'' ముద్రణ పూర్తయింది. శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు దానికి తొలిపలుకు వ్రాశారు. తర్వాత ఆయన గవర్నరుగా కేరళ రాష్ట్రానికి వెళ్లారు.

నేను నృత్యనికేతనం స్థాపించాను. కాని, నేర్చుకొనడానికి ఆడపిల్లలెవరూ ముందుకు రాలేదు. ప్రయత్నించగా, ప్రయత్నించగా ఒక్కమ్మాయి వచ్చి చేరింది. తర్వాత మెల్ల మెల్లగా చాలా మంది వచ్చి చేరారు. ఇప్పుడు జంటనగరాలలో వీధికొక నృత్య పాఠశాల ఉంది. అనేక మంది నేర్చుకొని, ప్రదర్శన లిచ్చి ప్రఖ్యాతు లవుతున్నారు. నాకెంతో సంతోషంగా ఉంది.

1958 లో నృత్యనికేతనం కోసం చిక్కడపల్లిలో ఒక భవనాన్ని నిర్మించాను. అందులో నృత్య సరస్వతి నారాధిస్తూ, నృత్యకళను ప్రచారం చేయాలనుకొన్నాను. కళాకారు లెందరో అక్కడికి వస్తూ ఉండేవారు. ఎందరో శిష్యులు తయారయ్యారు. వీరితో కొన్ని బాలేలు (నృత్య నాటకాలు) తయారు చేయాలన్న సంకల్పం కలిగింది. శ్రీ వేంకటేశ్వర కల్యాణం తయారు చేశాను. అద్భుతంగా ప్రేక్షకుల్ని ఆకట్టుకొంది. దేశం నలుమూలలా ప్రదర్శన లిచ్చాను. కుమార సంభవాన్ని తయారు చేశాను. ఉజ్జయినీలో ప్రథమ బహుమతేగాక సర్వతోముఖ ఉన్నత ప్రదర్శనగా ప్రత్యేక బహుమతి కూడా వచ్చింది. తర్వాత మేఘ

సందేశం, కృష్ణలీలలు, గీతగోవిందం, హిందీ బాలాజీ మొదలైన బాలేలు నిర్మించాను, ప్రదర్శించాను. పేరు ప్రఖ్యాతులు వచ్చాయి కాని, ఆర్థికంగా బాగా నష్టం వచ్చింది. నృత్య సరస్వతికి ఆ భవనం నచ్చలేదేమో, అందువల్లనే నేను ఆ భవనాన్ని అమ్మివేయవలసి వచ్చింది. ఆనాటినుండి నేను అద్దెకొంపలోనే కాలక్షేపం చేస్తున్నాను.

నాకు కొన్ని సంవత్సరాలుగా అన్ని విధాలా తోడ్ప డుతున్న ఇద్దరు ఆత్మీయులు ఉన్నారు. వారు జి. సూర్య నారాయణ, గిడుగు రామమూర్తి గార్లు. వీరిద్దరూ నా కష్టా లలో ఆదుకొంటూ వచ్చారు. అండగా నిలిచి ఉన్నారు. వీరి సహాయసహకారాలను, ఆత్మీయతాభిమానాలను ఎన్నడు మరచిపోలేను. వీ రివురిగురించి ఎంత వ్రాసినా చాలదు. శ్రీసూర్యనారాయణ గారి అర్ధాంగి మీనాక్షమ్మ గారికి నా ధన్యవాదాలు అర్పించుకొనడం నా ధర్మం.

నేను ఎన్నో గ్రంథాలు వ్రాయడానికి నన్ను ఎంతో ప్రోత్సహించినవారు గిడుగు రామమూర్తిగారు. వారి పరి చయం నాకు కలగకపోయుంటే నా భావాలు నాలోనే ఉండిపోయేవేమో? చెప్పలేను. వీ రిరువురికి, వీరి కుటుంబా లకు నా ధన్యవాదాలు.

బాసర జ్ఞాన సరస్వతి అంటే నాకెంతో భక్తి ఉంది. ఆ యమ్మ ఆలయంలో కూర్చుని, ఆమెను కీర్తిస్తూ ఉండా లని నాకుంది. ఆమె నాకు ప్రసాదించిన ఈ నృత్యకళా విజ్ఞానంతో ఆమె నిర్దేశించిన కార్యాన్ని పూర్తి చేయాలని ఉంది. కాని, నా ఆరోగ్యం అంత బాగా లేదు. శరీరం సహక రించడం లేదు. తన కార్యాన్ని నేను పూర్తి చెయ్యాలంటే ఆమే నా కా శక్తి నివ్వాలి. అదే నా నిత్య ప్రార్థన. ఆమె దయ.

నేను హైదరాబాదు వచ్చిన కొత్తలో ఆర్కియాలజీ డైరెక్టర్ డాక్టర్ శ్రీనివాసాచారిగారితో పరిచయం ఏర్ప డింది. వారు గొప్ప చరిత్రకారుడు, విద్యావేత్త. విదేశాల నుండి వచ్చే పెద్దలను ఆయన అజంతా, ఎల్లోరా మొదలైన కళాత్మక ప్రదేశాలకు తీసికొని వెళ్ళేవారు. ఈ గుహల్లో ఏ చిత్రం ఏ శిల్పం ఎక్కడ ఉందో ఆయనకు తెలుసు. ఆయా శిల్పాల చిత్రాల విశిష్టత, చరిత్రలను ఆయన సందర్శకులకు వివరించేవారు. ఎల్లోరాలోని కైలాస గుహలోని నవరస శిల్పం గురించి వారితో తరచు చర్చిస్తూ ఉండేవాణ్ణి. వీరి పరిచయంవల్ల మన ప్రాచీన శిల్పం, చిత్రలేఖనం గురించి ఎన్నో విషయాలు, విశేషాలు తెలుసుకోగలిగాను. ఒకనాడు పల్నాడు గురించి మేం చర్చిస్తూండగా, ఆయన అక్కడి చారిత్రక శిల్పాల గురించే కాక మాచర్లలో ప్రసిద్ధి గాంచిన ఒక నర్తకీమణి గురించి ప్రస్తావించారు. "ఆమె పేరు విని, ఆమెను చూడాలని మాచర్ల వెళ్ళాను. అయితే, ఆమే నా దగ్గరకు వచ్చింది. చాలా వృద్ధురాలు. చేతి కర్ర సహాయంతో ఆమె అతి కష్టం మీద నడచుకొంటూ వచ్చింది. ఆమె అందం చూసి, ఆశ్చర్యపోయాను. ఆమె అపురూప సౌందర్య వతి. మంచి సంస్కార మున్న కళాకారిణి. ఆమెతో శాస్త్రీయ విషయాలు ఎన్నో చర్చించాను" అని ఆయన చెప్పారు. ఆమె పేరు చంద్రముఖి. ఆమె గొప్ప నాట్యశాస్త్ర పండితు రాలు గనుకనే "చంద్రవంకలో స్నానం, చెన్న కేశ్వరుని దర్శనం, చంద్రముఖి నాట్య సందర్శనం" అన్నారు. ఈ మూడు చేయనిదే మాచర్ల తీర్థ యాత్ర ఫలించదని ప్రజలు పూర్వం అనుకొనేవారు.

డాక్టర్ శ్రీనివాసాచారిగారి నోటంట ఈ మాట విన్న తర్వాత నాకూ ఆమెను చూడాలనిపించి, మాచర్ల వెళ్ళాను. చంద్రవంక నదిలో స్నానం చేశాను. చెన్న కేశుని దర్శించు కొన్నాను. ఆ ప్రక్కనే ఉన్న వీరభద్రుని ఆలయం సందర్శిం చాను. చంద్రముఖి దర్శన భాగ్యం కోసం అక్కడ విచారిం చాను. కాని ఆ కళామూర్తి కన్ను మూసిందని అక్కడి వారు చెప్పారు, విచారించాను. ఒక కన్నీటి బొట్టు రాల్చాను. మరికొంత కాలానికి శ్రీ సిద్ధాబత్తుని లక్ష్మీ ప్రసాదుగారి ద్వారా ఆమె గురించి కొన్ని వివరాలు, ఆమె ఛాయా చిత్రం సేకరించ గలిగాను. ఆమె ఛాయాచిత్రం చాలా పాతదయినా ఆమె ముఖసౌందర్యం చూసి ఆనందించాను. ఆమె నాట్యం ప్రదర్శిస్తూంటే, ఆమె కదలికల్లో, లయ విన్యాసాలలో ఎంత సుందరంగా నాట్యశాస్త్రం రూపుదిద్దుకుందో ఊహించి, తృప్తిచెందాను. అందుకే ఆమె ఒక 'నాసుడి' అయింది అని అనుకొన్నాను.

నా నాట్య. భాగవత కళల పరిశోధనలలో ఆంధ్ర దేశంలోని శ్రీకళామూర్తుల ఛాయాచిత్రాలను నలుమూలల నుండి సేకరించాను. గ్రంథ విస్తరణ భీతితో అందరి ఛాయా చిత్రాలను ఈ గ్రంథంలో ప్రచురించడం లేదు. ముఖ్యులలో కొందరివి మాత్రం వేస్తున్నాను. మరికొందరివి నా ఇతర గ్రంథాలలో ప్రచురించాను. వీలయినంతవరకు వారి వివరాలు కూడా అందించాను. ఇంకా మిగిలియుంటే మరొక గ్రంథం వ్రాసి దానిలో ప్రచురిస్తాను. ఇవన్నీ గత 45 ఏళ్ళలో నేను సేకరించిన వివరాలు. ఏడు కోట్ల జనాభాగల ఆంధ్రదేశంలో రెండు వేల సంవత్సరాలుగా వికసించిన నాట్యకళ - ఎంత పరిశోధించినా తరగడంలేదు. భావితరాలవారు ఇంకా పరిశోధించవలసి యుంటుంది.

నా దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్రలో "దేవదాసి" అన్న పదాన్ని నేను విరివిగా ప్రయోగించాను. కాని, నేను తర్వాత పరిశోధనలు చేస్తున్నప్పుడు 'దేవదాసి' అన్న పదం ఎక్కడా కనబడలేదు. ప్రఖ్యాత శాసన పరిశోధకులు శ్రీ బి. ఎన్. శాస్త్రిగారితో ఈ విషయం ప్రస్తావించగా, ఆయన పరిశోధించిన శాసనాలలో ఏదో ఒక్కదానిలో తప్ప, మరెందులోను ఈ పదం కనబడలేదని వారు నాతో అన్నారు. అంతే కాదు. 'దేవదాసి' అన్న పదాన్ని ఆంధ్రలాస్య వర్తకులు నిరసించారు. అందువల్ల 'దేవదాసి' అన్న పద ప్రయోగం తెలుగువారి ఆచారం కాదని నేను అర్థం చేసుకొన్నాను. అందువల్ల ఇటీవల వ్రాసిన గ్రంథాలలో ఈ పదాన్ని నేను వాడలేదు. పూర్వ అలవాటువలన నేను ఎక్కడైనా వాడి యుంటే అది నా పొరపాటుగా పాఠకులు పరిగణించాలని కోరుకుంటున్నాను.

హైదరాబాదు మిత్రుల్లో చెప్పుకోదగ్గవాడు శ్రీధర బాబు. ఇతడు కొన్నాళ్ళు జర్మనీలో ఉండి వచ్చినవాడు. భారతీయ తత్త్వశాస్త్రం బాగా అభ్యసించిన వాడు. అతి చిన్నవయసులోనే చనిపోయాడు. ఒకసారి కంచి పెద స్వాముల వారు హైదరాబాదు వేంచేశారు. వీరికి తెలియని శాస్త్రాలు లేవు. వారిని సందర్శించడానికి నేను, శ్రీధర్ బాబు ఒకనాడు వెళ్ళాం. వారితో ఆలయాలలోని నృత్య పూజ గురించి మేము చర్చించాం. వారు వాటిని ప్రదర్శించి చూపించమన్నారు. ప్రదర్శించాను. వారు చూసి ఆనందించారు. మళ్ళా మర్నాడు ఉదయమే వారి వద్దకు వెళ్ళాం. చిన స్వాములవారిని కలుసుకోమన్నారు. కలుసుకొన్నాం. ఈ విద్యకు సహాయం చేయ మని మేము చిన స్వాములవారిని కోరాం. కాని, దైవం అనుకూలించలేదు. మా ప్రయత్నం ఫలించలేదు. నిరాశతో తిరిగి వచ్చాం. ఆ తర్వాత మరెక్కడా ఈ నృత్య పూజాంశాలను ప్రదర్శించలేదు. నేనెవరికి నేర్పలేదు. నాకు కంచి పెద స్వాములవారి నుండి ఒక అభినందన పత్రం మాత్రం లభించింది.

నా నృత్య చరిత్రా పరిశోధనలో నేను ఎందరో మహానుభావుల్ని కలుసుకొన్నాను. వారినుండి నృత్య చరిత్రకు, శాస్త్రానికి సంబంధించిన విషయాల నెన్నింటినో తెలుసుకొన్నాను. వారిలో చాలామంది నేడు లేరు. భావి తరాల వారికి తెలియాలని, నాకు జ్ఞాపక మున్నంతవరకు వారి గురించి సందర్భానుసారం ఈ గ్రంథంలో తెలియజేస్తున్నాను. ఎవరైనా ఆంధ్రుల నృత్యకళ గురించి పరిశోధించి, గ్రంథం వ్రాయదలచుకుంటే, నా యీ గ్రంథం వారికి ఉపయోగపడాలి అని నా ఆశ. ఆంధ్రులు జీవించి యున్నంత కాలం ఈ చరిత్ర కొనసాగుతూనే ఉంటుంది. అయితే, గత 2000 సంవత్సరాల ఆంధ్రుల నృత్య కళా చరిత్రలో ఎంత చరిత్ర మరగున పడిపోయిందో నేను చెప్పలేను. నా శక్తికొలదీ గత 50 సంవత్సరాలుగా ఆంధ్రుల నృత్య కళపైని పరిశోధన చేస్తూ వచ్చాను. నేను విన్నవి, కన్నవి నా గ్రంథాల్లో పొందుపరుస్తూ వచ్చాను.

ఆంధ్రులకు ఒక విశిష్టమైన నృత్య కళ ఉంది అని ఆంధ్రులు గుర్తించగలిగితే నా కృషి ఫలించిందని, నా జీవితం ధన్యమైందని నేను భావిస్తాను. నేను ఏమైనా కొన్ని విషయాలు వ్రాయకపోయినా, ఎవరిగురించైనా పరుషంగా వ్రాసియున్నా నేను క్షంతవ్యుణ్ణి.

స్వర్గీయ తెన్నేటి విశ్వనాథంగారి షష్ఠి పూర్తి మహోత్సవాలు విశాఖపట్నంలో రెండు రోజులు జరిగాయి. మొదటి రోజున మారంపల్లి సోదరీమణులు వైదేహి, ఇందు

వదనలు గొల్ల కలాపాన్ని ప్రదర్శించారు. ఆ సాయంత్రం చిరంజీవులు ఉమా, సుమతుల నృత్య ప్రదర్శనను నేను నిర్వహించాను. రెండవ రోజున భాస్కరభట్ల అప్పల నర సింహంగారు తూర్పు భాగవతం ప్రదర్శించారు.

మారంపల్లి సోదరీమణులు గొప్ప విద్వాంసురాండ్రు. వారు పంచ కావ్యాలను చదువుకొన్నారు. భరత, సంగీత శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించారు. గొల్ల కలాపంలోని శ్లోకాలకు వారు సరళమైన భాషలో, స్వచ్ఛమైన ఉచ్చార ణతో, నిర్దుష్టంగా వ్యాఖ్యానించారు. వైదేహి జ్యేష్ఠురాలు. చిన్నామె ఇందువదన నట్టువాంగం వేస్తూ, పాడుతూంటే వైదేహి నాట్యం చేసింది. అక్కగారు శ్లోకాలకు వ్యాఖ్యానం చెబుతున్నప్పుడు ప్రేక్షకులలో ఎక్కడో కొందరు విసుగు చెందినట్టూ ఇందువదనకు గోచరించగానే ఆమె రాగాలాపన చేసి,"కార్యక్రమాన్ని ముందుకు సాగ"నిమ్మనమని అన్నట్టుగా సూచన యిచ్చింది. వారి ప్రదర్శనకు నేను ముగ్ధుడ నయ్యాను. తర్వాత నాకు వారితో పరిచయం ఎక్కువయింది. వారి ఆట పాటల గురించి నేను మరింత ఎక్కువగా తెలుసు కొన్నాను. వారు ప్రదర్శించే దశావతారాలు పది తాళ ఛందో రీతుల్లో ఉన్నాయి. ఆ యపురూప సంగీత రచనను అడగ్గా వారు నా కిచ్చారు. దాన్నే మా విద్యార్థులకు నేర్పిస్తున్నాం. మారంపల్లి రాజవంశీయులు వీరిని ఎంతో గౌరవించేవారు.

రెండవ రాత్రి భాస్కరభట్ల అప్పల నరసింహ భాగవతార్‌గారు భామాకలాపం ప్రదర్శించారు. ఆయన ప్రదర్శన చూడ్డం అదే నాకు మొదటిసారి. పంజాబ్ మెయి ల్లాగ వారి కంఠం వేగంగా పలుకుతూంటే, వినడానికి నా కెంతో హాయి అనిపించింది. ఆయన పాట అమృతధారగా సాగింది. వారి పాటకు తగ్గట్టుగా మార్దంగికుడు మద్దెల వాయించాడు. ఇక హాస్యగాని హాస్యం ఎలా ఉందో వర్ణించి చెప్పలేను. అదొక విశిష్ట ప్రక్రియ. కలాప గ్రంథ మెంత ఉందో వారి హాస్యంకూడ అంత ఉంది. భామ పద్యానికి పద్యం. దరువుకు దరువు, వచనానికి వచనం చెబుతూ ఆయన ప్రేక్షకుల్ని పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వించాడు. ఆయన బాగా చదువుకొన్నవాడు, మంచి సంస్కారవంతుడు. సమయస్ఫూర్తి కలవాడు. ఈ రెండు రాత్రుళ్ళు ఆనందంగా గడిచాయి.

అప్పుడు ఇంకా కాలేజీలో చదువుకొంటున్న చిరం జీవులు ఉమా, సుమతుల నాట్య ప్రదర్శనానికి గాత్రానికి ఏలూరు నుండి శ్రీమతి సావిత్రమ్మగారు వచ్చారు. ఆమెది అమరగానం, ఎన్నటికీ మరువలేనిది.

నార్ని కేదారీశ్వరుడు ఒక కళాతపస్వి. కళాపోష కుడు, నాట్య కళాకారుడు. చక్కగా నాట్యం చేసేవాడు. ఆయన సత్కారాలను అందుకొనని ఆంధ్ర, ఉత్తరాది, దక్షి ణాది కళాకారులు లేరనే చెప్పవచ్చును. పరమ శివుడు తన కున్నదంతా భక్తుని కిచ్చినట్లు ఇతడు అడిగిన వారందరికీ దానం చేశాడు. ఆస్తి కర్పూరంలా హరించుకుపోయింది. ఇత రొక అభినవ శ్రీకృష్ణదేవరాయలు. ఆయన జీవించి యున్నంతకాలం ఆయన్ని స్మరించని కళాకారులు, కవులు, పండితులు రాజమండ్రిలో లేరు. ప్రభుత్వానికి ఒక భవనం, కొంత ధనం యిచ్చాడు - రాజమండ్రిలో సంగీత కళాశాల ఏర్పాటు చేయునిమిత్తం.

నేను పిప్పరలో జమీందారుగారి అతిథిగా ఉండగా ఒకనాటి రాత్రి కోనసీమ కళాకారిణి శ్రీమతి వాల్మీకి పారి జాత పుష్పావతిగారి భామా కలాపం తణుకులో ఉందని తెలి సింది. వెంటనే మేము కొంతమందిమి కారులో వెళ్లాం. రాత్రి పదయింది.పందిరి కిటకిటలాడుతోంది మొదటి వరుసలో జాగా దొరికింది. అక్కడ అందరూ కవులు, పండితులే ఉన్నారు. ఆమెతో మాట్లాడాలని కబురుచేశాను. ఆట ముగి సిన తర్వాత తాపీగా మాట్లాడవచ్చునని ఆమె సమాధానం పంపింది.

ఆట మొదలయింది, తెర తొలగింది. ఆమె అమరా వతి పాల శిల్పంలా ఉంది. ఆహార్యం అతి సామాన్యం. గజియం వేసుకోలేదు. తెల్లని పైజమాపైని, తెల్లని చీరను మోకాళ్ళవరకు కాశిబోసి కట్టింది. మధ్య పావడితో వాలుజడ వేసుకొంది. ఒక చేతికి వాచి ఉంది. రెండవ చేతికి జత బంగారు గాజు లున్నాయి. మెడలో ఒకే ఒక కంఠహారం, నడుముకు బంగారు మువ్వల వడ్డాణం. అంతే ఆమె

ఆహార్యం. అయితేనేం, ఆమె తీవి, రూపం, శరీరచ్ఛాయ అపురూపంగా ఉన్నాయి. ఆమె నిజమైన కళామూర్తి.

ఆమె గాత్రం కిన్నెర గానం. ఆమె రాత్రంతా పాడుతూ ఆడినా ఆమెను ఇంకా ఆడ మని కోరారు. ఆమె పాడుతున్న కాలిందీ గాత్రం ఇంకా వినుతూనే ఉంది. ఆమెలో అలుపు సొలుపు కానరాలేదు. దశావతారాలు ప్రదర్శించమని నేను ప్రత్యేకంగా కోరాను. ఆమె ఆడింది. ఆమెకు కొంత దక్షిణ చెల్లించి, పిప్పర తిరిగి వచ్చేశాం. ఆమెతో అనాడు మాట్లాడడానికి గాని, మరల ఆమె ప్రదర్శన చూడ్డానికి గాని నాకు వీలుపడలేదు. ఆమె భాగవతాన్ని ప్రదర్శించడమే కాదు,అభినయ కేళికలు గూడ చేసేదట! రాజమండ్రి అభినయ సదస్సుకు 1970 లో ఆమెను ఆహ్వానించాం. కాని, అనారోగ్యం వల్ల రాలేదు.

దివి సీమలోని శ్రీకాకుళంలో కొందరు దేవగణికలు ఉన్నారని విని వెళ్ళాను. కళామూర్తులందరూ గతించారని విని, ఆంధ్ర విష్ణువును దర్శించి నిరాశతో తిరిగి వచ్చాను.

మేడూరులో సుబ్బలక్ష్మి, రత్నాలు అనే ఇద్దరు ప్రసిద్ధ గణిక లుండేవారట వారి ఆట కచ్చేరి ఉందంటే దూర ప్రాంతాల నుండి కూడా ప్రేక్షకులు వచ్చేవారట. అందుకని ఆ వూరు వెళ్ళాను కాని, అక్కడ గూడా నిరాశే ఎదురయింది.

పశ్చిమ గోదావరి జిల్లాల్లో గణపవర ముంది. అది ఒకప్పుడు 'గణికవరం'. అక్కడి గణికలందరు విద్వాంసు రాండ్రట. వారి గురించి వాకబు చేశాను. ఇద్దరు వృద్ధ గణి కలు తప్ప అందరూ గతించారని, ఈ వృద్ధులు వారి ఆట పాటలను పూర్తిగా మరచి పోయారని తెలిసింది. మళ్ళీ నిరాశ. ఇలా చాలా చోట్ల నాకు నిరాశ ఎదురయింది. నా పరిశోధన మూడు దశాబ్దులకు ముందు జరిగియుంటే బాగుం డేది అన్నారు కొందరు. నేనేం చేయను? అప్పటికి నేను పుట్ట లేదే!

ఒకసారి విజయనగరం మహారాజావారి కళాశాల వార్షి కోత్సవానికి నన్ను ఆహ్వానించారు, వెళ్ళాను. హోటలులో నాకు బస ఏర్పాటు చేశారు. ఆ రాత్రి ఒంటరిగా ఉండడం వల్ల ఒక గ్రంథం చదువుతూ కాలక్షేపం చేశాను. వాచీ చూశాను. అర్ధరాత్రి 12 అయింది. మేను వాల్చాను. ఆ ప్రశాంత వాతావరణంలో సన్నని గాత్రం, మువ్వల రవళి. మృదువైన మద్దెల దరువులు, తాళధ్వనులు వినబడ్డాయి, వాటిని ఆలకిస్తూ పడుకొన్నాను. కొంత సమయం గడిచే సరికి—

''రేపల్లె లోపల నందునింట, చిన్న
గోపన్న పుట్టాడంట, విన్నారటే, ॥రేపల్లె॥
''రామ లాలీ రామ లాలీ
రామ, రామయ్య, రామచంద్ర లాలీ ॥రేపల్లె॥ అనే

పాట వినబడింది. మరి పడుకోబుద్ధి పుట్టలేదు. వెంటనే గది తలుపు తెరచి, నౌకర్ను పిలిచి "ఆ పాట ఎక్కడ్నుంచి?'' అని అడిగాను. ఊరి చివర గొల్లభాగవతులు ''జలక్రీడలు" ఆడుతున్నారని అతడు చెప్పాడు. తల్లి ఊయల నూపుతూ, పిల్లవాణ్ణి జోలపాటతో నిద్రపుచ్చుతున్నట్టు ఆ పాట గాలిలో తేలియాడుతూ ఉంది. ''నన్ను అక్కడికి తీసికొని వెళ్ళు'' అన్నాను. "మీరు? అక్కడికా?'' అని ఆశ్చర్యపోయాడు ఆ నౌకరు. ''నేను వెళ్ళాలి, పద'' అంటూ బయలుదేరాను. ఇద్దరం జట్కాబండి చేసుకొని అక్కడికి వెళ్ళాం. మేము వెళ్ళేసరికి ఆ పాట అయిపోయింది. నలుగురు గొల్లభామలు కృష్ణుని బాల్యక్రీడలు అభినయిస్తున్నారు. యశోదా,కృష్ణుడు వారగా నిల్చుని ఉన్నారు.

ఆ భామల ఆహార్యం వింతగా ఉంది. నలుగురు నాలుగు (రంగుల) రకాల అలంకరణ చేసుకొన్నారు. వారు యశోదతో చిన్నికృష్ణుని చిలిపిచేష్టలను చెప్పుకొంటున్నారు. తర్వాత యశోదా, కృష్ణుల మధ్య సంవాదం జరిగింది. అంతా గేయ రూపంలోనే జరిగింది. మేము దూరంగా జట్కాలో కూర్చునే చూశాం.

వారికి ఉన్న రంగుల స్ఫూర్తి మెచ్చదగింది. వారి ఆభరణాలు బంగారుపూతతో చెక్కతో చేసినవి. వాటిపై నున్న అద్దాలు తళతళ మెరిసిపోతున్నాయి.

వారు ఆ వేదికపైని నాట్యం చేస్తూంటే అది నందుని ఇల్లే అనిపించింది. ప్రాచీన భాగవత ఆట, అలంకరణా చూసినందుకు నాకు చాలా సంతోషం కలిగింది. ఆ గోపికలు ఒకర్నిమించి ఒకరు సంగతులు వేసి పాడారు, నృత్యం చేశారు. వారికి జవాబుగా కృష్ణుడు ఆడిన ఆట, యశోదమ్మ హుందాతో ఆడిన ఆట ఎంతో క్రమబద్ధంగా నాకు గోచరించాయి.

ఆనాటి ఆ బృందంలో సుమారు 20 మంది కళాకారులు పాల్గొన్నారు. ఆ రాత్రంతా వారు ఆడి, పాడి, ప్రేక్షకులను ఆనందపరచి అలసిపోయారు. వారికి ముట్టిన ప్రతిఫలం అతి స్వల్పం. మరెందుకు ఈ శ్రమ? వారు ఆనందించడం, ఇతరుల ఆనందపరచడం-అదే వారి జీవిత ఆశయం. అలా ఆడకపోతే వారు జీవించలేరు. వారు అలా ఆడుతూ ఊహాలోకాల్లో తేలిపోతారు. పూదోటల్లో విహరిస్తారు. రాణివాసాల్లో జీవిస్తారు. వారు వారి జీవిత కష్టాలను మరచిపోతారు. రేపటి గురించి వారు ఆలోచించరు. ఆ సమయంలో వారు పురాణ పురుష్యులవుతారు. అదే వారి సంతృప్తి అదే వారికి ముక్తి, అదే వారికి మోక్షం.

ఇలాంటి బృందాలు ఉత్తర కోస్తా జిల్లాలలో అనేకముండేవి. అందుకే సంగీత నాటక అకాడమీ భాగవత సదస్సును విజయనగరంలో నిర్వహించింది. ఆ సదస్సులో వివిధ కళాకారులు సుమారు 500 మంది పాల్గొన్నారు. శ్రీ ద్వారం బాపురావు ఆ సదస్సుకు సారథ్యం వహించారు. సుమారు 50 మంది భామ వేషధారులు వారి వారి బాణీలలో పాడి, ఆడి చూపించారు. ఆ సదస్సు ఒక మరువరాని అద్భుతం. రెండు రోజుల సదస్సు ఇట్టే ముగిసింది. రెండు రోజులు ఆ సదస్సుకు చాల లేదు. అలాంటి సదస్సు మళ్ళీ జరపాలన్నా జరపలేం. ఆనాడు ఆ సదస్సులో పాల్గొన్న కళాకారులలో చాలా మంది ఈనాడు లేరు. ఆ కాలంలో వీడియో రికార్డింగ్ లేకపోయింది. అదే చాలా విచారకరమైన విషయం. ఆ సదస్సుకు ఢిల్లీనుండి కేంద్ర సంగీత అకాడమీ పెద్దలు వచ్చారు. వారు ఫిల్మ్ తీసినట్టు జ్ఞాపకం. ఈ కళాకారుల గాత్రం, మృదంగ వాయిద్యం వినదగ్గవి. వేషధారణ చూడ దగ్గది. వీరికి ఆదరణ తక్కువ, పోషణ లేదు. ఈ విద్య చాలా కష్టమైంది. ఈ కారణాలవల్ల చాలామంది ఈ కళనుండి విరమించుకొన్నారు.

ఆనాటి సదస్సు అయిదుగురు మార్దంగికుల ఏకకాల మేళ ప్రాప్తితో ప్రారంభమయింది. ఉరుములు, మెరుపులతో చిటపట ధ్వనులతో, సముద్ర ఘోషలా ఆ మద్దెళ్ళు పలికాయి. ఈ నాటికీ ఆ మార్దంగికుల వాయిద్యాన్ని మరచిపోలేకున్నాను.

నాగపూరులో నా నాట్యానికి సహకార గానం చేస్తూండిన మా సంగీత గురువుగారు శ్రీ రామంబవు సర్‌దేశ్ పాండే గారి గురించి ఈ సందర్భంలో ప్రస్తావించకుండా ఉంటే ఈ గ్రంథం అసంపూర్ణమౌతుంది.

వారి గాత్రం మధురాతి మధురం. దివాణంలోని హాలులో వారు పాడుతున్నప్పుడు, పాట ముగించిన తర్వాత గూడ ఆ హాలంతా కోటివీణలు మ్రోగుతున్నట్లుండేది. ఆయన తంబూరా శ్రుతిలో పాడుతూంటే వింటున్న కొద్దీ వినాలనిపించేది. ఆయన కంఠం అంత మధురమైంది. ఆయన గాత్రం భావయుక్తమైంది. నేను ఆంధ్రదేశం వస్తూన్నప్పుడు నాతో రమ్మనమని ఆయన్ని కోరాను. కాని, కొన్ని గృహ సంబంధమైన ఇబ్బందులవల్ల ఆయన రాలేకపోయారు.

మధ్యప్రదేశ్ రాయపూరులో ఆంధ్ర విద్యావేత్త శ్రీ యోగానందంగారు ఒక విశ్వవిద్యాలయాన్ని స్థాపిస్తున్న రోజుల్లో నేను అక్కడికి వెళ్ళాను. ఒకనాటి సాయంత్రం షికారుగా ఆ యూరి చెరువు గట్టున కూర్చుని, కొలనులోని తామరలను చూస్తూ, గతకాల స్మృతులను తలచుకొంటూ ఉన్నాను. దూరంనుండి మహంతుగారి గోపాల మందిర గుడి గంటలు మెత్తగా వినిపిస్తున్నాయి. నేను ఊహాలోకాల్లో తేలిపోతున్నాను. ఇంతలో నా తలపైని ఎవరో చేయి వేశారు, తల నిమిరారు, "రామకృష్ణా!" అని పిలిచారు. ఆ వృద్ధుణ్ణి నేను వెంటనే గుర్తుపట్టలేదు. ఆ కంఠం ఎక్కడో

విన్న కంఠం, ఆ కంఠ స్వరంలో ఆత్మీయత ఉంది. నాకు అక్కడ అంత ఆత్మీయులు ఎవ రుంటారు! మా సంగీతం గురువుగారు! నమస్కరించాను. "గురూజీ! ఇక్కడికి ఎలా వచ్చారు?" అని అడిగాను. "మన మధ్య ఉన్న అనుబంధం తీసుకొని వచ్చిం" దన్నారు. గతకాల అనుభవాలు, అనుభూతులు జ్ఞాపకం వచ్చాయి. మనస్సు సంతోషంతో నాట్యమాడింది.

చీకటి, గుడిలో దీపాలు వెలిగించేవరకు ఎన్నో విషయాలు చర్చించుకొన్నాం. తనివితో తర్వాత మాటలు రాక కొంతసేపు నిశ్శబ్దంగా ఉండిపోయాం.

తర్వాత మా మేష్టారు నన్ను కౌగలించుకొని, "ఇప్పుడు నేను ఏకాకిని. భవబంధాలు తెగిపోయాయి. వస్తాను రామకృష్ణా! మళ్ళీ ఎప్పుడు, ఎక్కడ కలుసుకొంటామో?" అంటూ ఆయన కంట తడిపెట్టారు.

నేను ఇంకా ఆంధ్రలో ఒకచోట స్థిరపడనందున ఆయన్ను ఆంధ్రదేశానికి రమ్మన మని ఆహ్వానించలేకపోయాను. ఆయన అలా వెళ్ళి, చీకట్లో కలిసిపోయేవరకు చూస్తూ నిలబడిపోయాను. అప్పుడు నేను పొందిన ఆవేదనను హృదయ మున్న కళాకారులు అర్థం చేసుకోగలరు, అనుభవించగలరు గాని, నేను అక్షరాలలో వర్ణించలేను.





మాచర్ల చంద్రముఖి

వీరశైవం, వైష్ణవం పల్నాటిసీమలో విజృంభించిన కాలంలో బ్రహ్మనాయుడు ఈ రెండు మతాలవారి మధ్య సామరస్యం చేకూర్చి, ప్రజల్లో సోదరభావాన్ని పెంపొందించడానికి ప్రయత్నించాడు. ఆయన సాగించిన ఉద్యమంవల్ల ఆంధ్రదేశంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఈ యుద్యమానికి గుర్తులుగా నిలిచినవే మాచెర్లలోని చెన్నకేశవ, వీరభద్ర ఆలయాలు. అక్కడ చెన్నకేశుని ఆరాధనకు తమజీవితాన్ని అంకితం చేసిన నృత్యకళాకారిణులలో ఈ తరానికి చెందిన కళాకారిణి శ్రీమతి చంద్రముఖి. వారికాలంలో నర్తకీమణులు ప్రత్యేక ఆహార్యం, అలంకారాలు ధరించకపోయినా వారు సహజ సౌందర్యవంతులు. నృత్యాభినయాల్లో నిష్ణాతులు కనుక వారి ప్రదర్శనలు జనాన్ని విశేషంగా ఆకర్షించేవి.

# అయ్యాలు - మియ్యాలు - తకతెయ్యాలు

నేటి కాలంలో పాలమూరు జిల్లాలో పశువులకు వేయ డానికి గడ్డి దొరకక, తాగడానికి గుక్కెడు మంచినీరు దొరకక ప్రజలు ఎన్నో కష్టాలకు గురౌతున్నారు. పిడికెడు అన్నంతో పొట్టనింపుకొనడానికి, ఇతర జిల్లాలలో కూలినాలి చేసుకొనడానికి వలస వెళ్ళిపోతున్నారు.

నైజాం హయాంలో ఈ ప్రాంతంలో నృత్య, సంగీత, శిల్ప, చిత్రకళ, కవిత్వం మొదలైనవి విశేషంగా పోషింప బడ్డాయి. ఆ కాలంలో జటప్రోలు, కొల్లాపురం, ఆత్మకూరు, వనపర్తి, గోపాలపేట, గద్వాల సంస్థానాధీశులు లలితకళ లను పోషించి, కవిపండితులను ఆదరించారు.

వనపర్తి సంస్థానాధిపతులు శ్రీరంగాపురంలో నిర్మిం చిన దేవాలయాలు సుందరశిల్పాలతో నేటికీ కన్నులపండు వుగా శోభిస్తున్నాయి.

జటప్రోలు సంస్థానాధీశులు నిర్మించిన మదనగోపాల, వేణుగోపాల ఆలయాలు రాయలనాటి శిల్పకళకు ప్రతిబిం బాలుగా నేటికీ నిలిచి ఉన్నాయి. ఈ యాలయాల్లోని సుందర నృత్యభంగిమలను తిలకిస్తే ఆనాటి నృత్యకళావైభవాన్ని గురించి మనం తెలుసుకోగలం. ఈ ప్రభువులు ఆనాటి మహమ్మదీయ సంప్రదాయాల ప్రభావం నుండి ప్రాచీన హైందవ మతాన్ని, లలితకళలను కాపాడడానికి ఎంతో కృషి చేశారు.

ఆత్మకూరులో ఆనాటి కోటలు, పేటలు ఈనాడు లేకపోయినా అక్కడి ప్రజల్లో ఆనాటి సంస్కారం, కళా ప్రియత్వం ఈనాటికి కనిపిస్తాయి. ఆత్మసంస్కారం ఏదో ఒక దానివల్ల వచ్చేది కాదు. తరతరాల సాంఘిక ప్రభావం వల్ల తెలియకుండానే మానవునిలో వచ్చే సంస్కారమే ఆత్మ సంస్కారం. పూర్వం ఈ ప్రాంతంలో జైనమతం విశేషంగా వ్యాప్తి చెందిందని అక్కడున్న కొన్ని ప్రాచీన శిల్పాలు, బస్తీల పేర్లవల్ల చెప్పవచ్చును.

గద్వాల రాజుల కళాపోషణ గురించి ఇంతకుముందు రచించిన గ్రంథాలలో చాలచోట్ల వివరించాను.

'అయ్యాలు, మియ్యాలు, తకతెయ్యాలు' అనే ఒక నానుడి పాలమూరు జిల్లాలో పూర్వం ముండేదట. అయ్యాలు అంటే కవులు, పండితులు, శాస్త్రజ్ఞులు, ఆధ్యాత్మిక ప్రబో ధకులు మొదలగువారు. వీరికి సంఘంలో ఒక గౌరవస్థాన ముండేది. విశేషంగా గౌరవింపబడేవారు. కొందరు మహా విద్వాంసుల పాదధూళిని సామాన్య ప్రజలేకాక రాజవంశీ యులుగూడ భద్రపరచుకొని, నొసట ధరిస్తూ ఉండేవారట! మియ్యాలు అనగా ముస్లిం ప్రభువులు. వీరు గౌరవనీయులు. తకతెయ్యాలు అంటే నృత్య, సంగీతాది శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించిన గణికలు. వీరికి గూడ సంఘంలో గౌరవస్థాన ముండేది.

ఈ ముగ్గురకు సంఘంలో గౌరవముండేది కనుకనే ఈ నానుడి ప్రచారంలోకి వచ్చింది.

ఏనాడైతే నాట్య విద్యకు గౌరవం తగ్గిందో ఆనాటి నుండి ఈ నాట్యకళాకారులు ఆ విద్యకు దూరమవడమేకాక ఆ పేరు పెట్టుకొనడం కూడా మానివేశారు. ఇందువల్ల అపూర్వమైన, తరతరాలుగా వస్తూండిన, వారి పూర్వులు ఆరాధించిన నాట్యవిద్య అంతరించిపోయింది. ✱





కేంద్ర సంగీతనాటక అకాడమీ కార్యదర్శి శ్రీమతి ఉషామాలిక్ 24 సెప్టెంబర్ 1994న
జ్యోతిని వెలిగించి సమావేశాన్ని ప్రారంభించారు.
డా. బి. శారద, శ్రీ యు.మల్లిఖార్జున శర్మ, లయన్ పి.ఎస్. రెడ్డి, డాక్టర్ సునీల్ కొఠారీ ఉన్నారు.




కేంద్ర సంగీత నాటక అకాడమీ వైస్ చైర్మెన్ డాక్టర్ ప్రేమలతా శర్మ
ప్రసంగిస్తున్న దృశ్యం.



హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటి మాజీ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ భద్రిరాజు కృష్ణమూర్తి
24.10.94న 'ఆంధ్రనాట్యం' సదస్సును ప్రారంభించి ఉపన్యసిస్తున్నారు.



ఆంధ్రుల లాస్య నృత్య చరిత్రలోని 108 విశిష్ట స్త్రీ కళామూర్తుల తైలవర్ణ చిత్రాలను
ఆవిష్కరిస్తున్న శ్రీమతి ఉషామాలిక్.



ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల శాఖ తరపున సాంస్కృతిక వ్యవహారాలమండలి కార్యదర్శి శ్రీ మల్లిఖార్జున శర్మ పదివేల రూపాయలను సదస్సు ఖర్చుల నిమిత్తం డాక్టర్ నటరాజ రామకృష్ణకు అందిస్తున్నారు.




'ఆంధ్రనాట్యం' ప్రచారం నిమిత్తం సింహగర్జన చేస్తున్న భరత కళాప్రపూర్ణ శ్రీ కోరాడ నరసింహారావు




శ్రీ కె.వి. రమణ ఐ.ఏ.ఎస్., 'ఆంధ్రనాట్యం' ప్రత్యేక సంచికను ఆవిష్కరణ చేస్తున్నారు. యువచలన చిత్ర దర్శకుడు యస్వీ కృష్ణారెడ్డి, కళాబంధు శ్రీ కళానుబ్బారావు, లయన్ ఏ.ఎస్. రెడ్డి ఆశీనులై వున్నారు.



ఆంధ్రనాట్యం ప్రదర్శించిన యువ కళాకారిణులు భావన, నీహారిక, సునీల, కృష్ణప్రియ

# మణులు - మాణిక్యాలు

తాండవ నది. ఎంత చక్కని పేరు! తన చిరుపాదాలకు బంగారు మువ్వలను అలంకరించుకొని, వాటిని మధురంగా పలికిస్తూ, కాళీయుని పడగపైన తాండవమాడి, రేపల్లెవాసుల హృదయాలను చిన్నికృష్ణుడు రంజింపజేసినట్లు; మేఘావృతమైన ఆకాశంనుండి వినవచ్చిన ఉరుముల మెరుపుల సంగీతానికి పులకించి, పురివిప్పి మయూరి నాట్యం చేసినట్లు; వర్షాకాలంలో ఉరుకులు, పరుగులతో మధురధ్వనులను పలికిస్తూ, నర్తన మాడుతూ ఈ నది ఒకప్పుడు ఆ తీరవాసుల హృదయాలను రంజింపచేసి యుంటుంది. అందుకే ఆ నది చిన్నదైనా, ముచ్చటగా 'తాండవ' నదిగా ప్రఖ్యాతి చెందింది. ఎగువను ఆనకట్ట కట్టడం వల్ల నేడు ఈ నది నీరులేక వెలవెలబోతూంది. ఈ నది విశాఖ, తూర్పుగోదావరి జిల్లాలకు నేడు సరిహద్దుగా ఉంది. ఈ నదికి ఉత్తరతీరాన్న పాయకరావు పేట, దక్షిణతీరాన్న తుని పట్నం ఉన్నాయి.

సుమారు నాలుగు దశాబ్దుల క్రితం ఉభయగోదావరి జిల్లాలు నృత్యకళకు ప్రసిద్ధిచెంది, విలసిల్లాయి. ఈ జిల్లాలలోని ఆలయాలలో నృత్యపూజ ఉండేది. ఇదే ఆరాధన నృత్యకళ. ఈ ప్రాంతాలలోని శ్రీమంతులు, రాజులు, రారాజులు, మహారాజులు నృత్యకళను ఆదరించి, పోషించారు. ఆంధ్రగీర్వాణ భాషలు, పంచకావ్యాలు, సంగీత నాట్యశాస్త్రాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసిన నర్తకీమణులు ఈ ప్రాంతాలలో, ముఖ్యంగా కోనసీమలో ఉండేవారు. గజ్జె కట్టి పండిత సభలలో అభినయ కేళికలు చేసేవారు వృద్ధ పండితురాండ్రు వీరికి నాయకత్వం వహించి, కేళికలు నిర్వహించేవారు. ఈ ప్రాంతాలలో ఒక ప్రసిద్ధ, ప్రత్యేక కళగా అభినయం అభివృద్ధిచెందింది సంస్కృత పండితులకు, వేద విద్వాంసులకు ఈ కోనసీమ ఒక కాణాచి.

ఈ సీమలోని ర్యాలిలో మోహినీ కేశవమూర్తి మురముళ్ళలో నిత్యకళ్యాణ వీరేశ్వరుడు, పలివెలలో కొప్పేశ్వరుడు, విశ్వేశ్వర అగ్రహారంలో విశ్వేశ్వరుడు వెలసియున్నారు. ఈ దేవాలయాలలో నృత్యపూజలు జరుగుతూ ఉండేవి. ద్రాక్షారామంలోను, సామర్లకోటలోని భీమారామంలోను నృత్యపూజ ఉండేది. పిఠాపుర కుంతి మాధవునికి, కుక్కుటేశ్వరునికి నృత్య సేవ జరిగేది. పిఠాపురంలోనే పురూహితిక పీఠం, పవిత్ర పాదగయ ఉన్నాయి. కుంతి మాధవుని సేవలో నవజనార్దన పారిజాత మనే భామాకలాపం ప్రదర్శింపబడుతూ ఉండేది.

తూర్పుగోదావరి జిల్లాలో గోదావరి నది ఉత్తర తీరాన గల 1 ధవళేశ్వరం, 2. ఆలమూరు, 3. కపిలేశ్వరపురం, 4. మడికి, 5. జొన్నాడ, 6. మాచర, 7. కోరుమిల్లి, 8. మండపేట, 9. కోటిపల్లి గ్రామాలలో నారద మహాముని ప్రతిష్ఠించిన జనార్దన విగ్రహా లున్నాయి. వీటికి ఆలయాలు వెలిశాయి. ఈ తొమ్మిది జనార్దన ఆలయాలలోను "సత్యభామా కలాపం" ప్రదర్శింపబడుతూండేది. అందుకే ఈ భామా కలాపానికి 'నవజనార్దనం' అన్న పేరు వచ్చింది.

ఆ కాలంలో మండపేట ఒక కళానిలయం. సంగీత సరస్వతి దుగ్గిరాల మాణిక్యం నృత్య సరస్వతిని ఆరాధించిన స్థల మిది. మూడుసార్లు ఒకే వేదిక పైన 9 మంది సత్యభామలు నవజనార్దనాన్ని వారి బృందాలతో ప్రదర్శించి యజ్ఞ ఫలం పొందాలని ఆశించారు. దుగ్గిరాల మాణిక్యమ్మ గారి ఆధ్వర్యంలో రెండుసార్లు ఈ క్రతువును మండపేటలో నిర్వహించారు. కాని, మాణిక్యమ్మ గారు గతించినందున మూడవసారి ఈ క్రతువు జరగలేదు. వారికి ఆ యజ్ఞఫలం దక్కలేదు. ఈ దుగ్గిరాల వంశస్థులు బహుశా తెనాలి

చేరువలో గల దుగ్గిరాల నుండి వచ్చియుండవచ్చును. దుగ్గిరాల వంశస్తులు మంచి నాట్యకళా విద్వాంసులే కాని తెనాలి వద్ద గల దుగ్గిరాల గ్రామంలో నాట్య కళ ఉండినట్టు కన్పడదు. తర్క, వేదాంతాలు అధ్యయనం చేసి, పండిత సభల్లో పాల్గొనిన నర్తకీమణులు ఒకప్పుడు ఈ మండపేటలో ఉండేవారు. తూర్పుగోదావరి జిల్లా, కోనసీమలోని ముమ్మిడివరంలో అన్నాబత్తులవారు భరత విద్యలో ప్రసిద్ధులైనట్టే, పశ్చిమగోదావరి జిల్లాలోని మారంపల్లి గ్రామంలో చిత్రజల్లు వంశీయులు ప్రసిద్ధులు. ఈ యుభయుల నుండి సేకరించిన విషయాల ననుసరించి సుమారు 150 సంవత్సరాల ఆంధ్రుల నృత్యకళా చరిత్రను, నాట్య సాధన తీరులను, గురు శిష్య సంప్రదాయాలను, ప్రదర్శన తీరులను, కళా పోషణను, పండిత సత్కారాలను, కళాకారులు పొందిన గౌరవ మర్యాదలను నేను తెలుసుకొన్నాను. ఈ విధంగా పరిశోధిస్తే కాకతీయ ప్రభువుల, విజయనగరాధీశుల, తంజావూరు, మధుర, పుదుక్కోట రాజుల కాలాలలో వివి
ప్రాంతాలలో కళావికాసం ఎలా పెంపొందిందో మన
తెలుస్తుంది.

విజయనగరాధీశుల కాలంనుండి తంజావూరు, మధుర రాజ్యాలు తెలుగు రాజుల పాలనలోకి వచ్చాయి. అందువల్ల తెలుగు కళలే ఆ ప్రాంతాలలో వికసించాయి. అంతకు పూర్వం ఆ ప్రాంతాలలో నుండిన కళారీతులు ఆంధ్ర కళా రీతులతో సమ్మిళితమై ఒక నూతన వికాసం ఆ కళలలో ఆవిర్భవించింది. తెలుగుదేశ ఆట పాటలకు ప్రాముఖ్యం పెరిగింది. విజయనగర సామ్రాజ్య పతనానంతరం ఆంధ్ర దేశం ముక్క చెక్కలైనా అనేక ప్రాంతాలలో నృత్య సంగీత కళలు నూతన రూపాలలో వెలుగొందుతూ వచ్చాయి. అయితే వీటన్నింటికి మూలాధారం ప్రాచీన ఆంధ్ర సంప్రదాయమే. అయితే ఈ కళలు 20 వ శతాబ్ది ప్రారంభంనుండి క్షీణిస్తూ వచ్చాయి. తుదకు హీనస్థితికి వచ్చాయి. ఒకప్పుడు



ప్రాచీన నర్తన రీతుల గూర్చి యోచన

అత్యంత గౌరవ మర్యాదలు పొందిన కళాకారుల కుటుంబాల వారు ఈ కళలనుండి పూర్తిగా విరమించుకొన్నారు. కాని వీరిలో కొందరు ఈ కళలనే నమ్ముకొని, ఆరాధిస్తూ వచ్చారు.

మనకు ప్రత్యేకంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడి, ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ స్థాపించబడిన నాటికి అనేక మంది మహానిదులైన కళావేత్తలు గతించారు. ఏ కొద్దిమందో మిగిలారు. వీరి విద్య యొక్క విలువను తెలిసిన పెద్దలు ఆ అకాడమీలో లేకపోయారు. ఆ తర్వాత వీరి విలువను తెలుసుకొని, వీరి విద్యను కాపాడాలని ఈ అకాడమీ పెద్దలు యోచించే సమయానికి వీరిలో మరికొందరు అంతరించారు. మిగిలినవారు నిరాశా నిస్పృహలకు లోనై, వారి విద్యను లోకానికి అందించడానికి నిరాకరించారు. ఏలూరులో చదలవాడ సామ్రాజ్యమ్మ ఉండేవారు. ఆమె గొప్ప మేధావి, నాట్య కళావేత్త. ఆమెను కలుసుకొని, ఆమె నాట్య సంప్రదాయం గురించి చర్చించాలని అనేకసార్లు ప్రయత్నించాను. ఎప్పుడు కబురు పంపినా "ఆ కళా సామ్రాజ్యమ్మ ఎప్పుడో చనిపోయిం"దని ఆమె సమాధానం పంపేది. చివరకు, ఆమె పాడ నక్కరలేదు, ఆడ నక్కరలేదు, కొద్ది నిమిషాలు మాట్లాడితే చాలు అని కబురు చేశాను. ఆమె ఎలాగో అంగీకరించింది. నేను వెళ్ళాను.

ఆమె పండు ముసలి, శరీరం, ముఖం ముడతలు పడి యున్నాయి. కంఠం బలహీనంగా ఉంది. అయితేనేం ఆమె దృక్కులు, ముఖవళికలు, ఆమె హస్తాలు నాతో ప్రసంగించాయి. ఆమె గొప్ప వేదాంతి. ఆమె వద్ద సెలవు తీసికొని, నమస్కరించాను. నేను వస్తూంటే, "బాబూ! మా విద్య వేరు, మా సాధన వేరు. మా శరీరం మాట్లాడేది. ఈనాటి 'ఓగె మోడీ విద్యవంటిది కాదు మా విద్య" అని ఆమె చెప్పింది. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారి సన్మానాన్ని స్వీకరించవలసి ఆమెను అకాడమీ తరపున ఆహ్వానించాను. "నా విద్య ఈనాటి పెద్దలు ఏం చూశారని నన్ను గౌరవిస్తారు? నేను రాను బాబూ!" అంటూ మృదువుగా తిరస్కరించింది. "ఈనాటిలా నా పుత్రుడు 20 సంవత్సరాల క్రిందట యుండి యుంటే నా కళా తపస్సు శాశ్వతంగా నిల్చి యుండేదేమో! కాని, ఆనాడు మద్దెల శబ్దం వినబడితేనే నరికి పోగు లేస్తానని వాడు గర్జించేవాడు. అందుకే ఈ కళనుండి విరమించుకొన్నాను" అని ఆమె బాధపడుతూ చెప్పింది. ఇది 25 సంవత్సరాల క్రిందటి ముచ్చట.

ఒకసారి గద్వాల వెళ్ళాను. ఆ రాజాస్థానంలో నాట్యకళ పూర్వం పోషింపబడింది. కొందరు పెద్దల సహాయంతో కొంత మంది వృద్ధ కళా వేత్తలను కలుసుకొన్నాను. ఆ సంస్థానానికి చెందిన, దేవాలయంలో నృత్యపూజ చేసిన ఒక వృద్ధ కళాకారిణిని కలుసుకొన్నాను. ఆమె గొప్ప విద్యావంతురాలు. మహామేధావి. ఆమె సర్వము త్యజించి, మారుమూల నున్న తన స్వగృహంలో తన పూర్వ కాల స్మృతులను నెమరు వేసుకొంటూ జీవితం గడుపుతూంది. నన్ను ఆ యింటికి తీసికొని వెళ్ళిన పెద్దలు "ఈమేనండి మేము చెప్పిన పుల్లానాని. ఈమె నాట్యంలో మహా విద్వాంసురాలు" అని ఆమెను నాకు పరిచయం చేశారు. నేను నమస్కరించాను.

"బాబూ! ఆ చివరి మాట మరచిపోండి. నేను ప్రస్తుతం పుల్లమ్మను మాత్రమే" అని ఆమె అంది. "మీరు ఒకప్పుడు గొప్ప పండితురే గదా?" అన్నాను "బాబూ! నా గత జీవితాన్ని ఏనాడో మరచిపోయాను. ఆ రోజులు గుర్తులేకండి. మా మహారాజు రాం భూపాల దేవుల కాలంనాడు మా కుండిన గౌరవం వేరు, ఆ మర్యాదలు వేరు, ఆ పండిత సభలు వేరు, ఆ యాదరణ వేరు, ఆనాటి విద్యా ప్రదర్శనలు వేరు. మేము ఎక్కడికి వెళ్ళినా జోడు కాగడాల వారు మా ముందు నడిచేవారు.... అవన్నీ యిప్పుడెందుకు బాబూ? చావలేక నేడు బతుకుతున్నాను" అంటూ ఆమె కంట తడి పెట్టింది. ఆమెకు తినడానికి తిండి, ఉండడానికి ఇల్లు ఉన్నాయి. కాని, కళాకారుల జీవితం ఇదే కాదు గదా? చివరకు ఆమెను ఒక పాట పాడి అభినయించమని ప్రాధేయపడ్డాను. "ఆ విద్య ఏనాడో మరచిపోయాను. ఇక ఆ విద్య తిరిగి రాదు. క్షమించండి" అంది. నేను ఎక్కడికి వెళ్ళి, ఎంతమంది వృద్ధ కళాకారులను కలిసినా ఇలాంటి నిరాశా నిస్పృహలే నాకు వినిపించాయి.

అయితే, ఇలాంటి పరిస్థితులలోగూడ తరతరాలనుండి తమ పూర్వులు ఆరాధిస్తూ వచ్చిన కళలను విడిచిపెట్టకూడ

దని, ఆ విద్యల విలువలను లోకానికి తెలియజేసి, వాటి కాంతిని లోకంలో ప్రసరింపజేయాలని, తమ జీవితాంతం వరకు ఆ కళలను ఆరాధించి, ఆ ప్రాచీన సాంప్రదాయక విలువలను లోకానికి తెలియజేయాలని ఆశించి, కృషి చేసిన వారిలో పేర్కొనదగినవారు భరత కళాప్రపూర్ణ అన్నాబత్తుల బులి వేంకట రత్నమ్మగారు. ఈమె ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమిలో సభ్యురాలు. ఈమెకు "భరత కళాప్రపూర్ణ" బిరుదునిచ్చి, ఆ అకాడమి సమ్మానించిన సందర్భంలో ఆమెను అభినందించడానికి కొందరు మిత్రులం కలిసి ఆమె బసకు వెళ్ళాం. ఆమెకు వస్త్రా, పువ్వులూ ఇచ్చి, నమస్కరించాను. ఆమె కొంత సేపు మౌనంగా ఉండిపోయి, తర్వాత 'నటరాజుగారూ! ఈ గౌరవం నేనారాధించిన నృత్య సరస్వతికి చెందుతుంది. నాకంటే గొప్పవారైన కళావేత్తలు ఎందరో వారి ఇండ్లలో మగ్గుతున్నారు. వారందరి విద్యను అకాడమీ గుర్తించి, వారికి సహాయం చేసి, మా విద్యకు సముచిత స్థానం అకాడమీ కల్పించిన నాడు నేను ఆనందించగలను. ఆ కృషి మీరు చేయాలి" అని ఆవేదనతో అన్నారు. తత్ఫలితమే 1970లో రాజమండ్రిలో జరిగిన అభినయ సదస్సు, 'ఆంధ్రనాట్యం' యొక్క ఆవిర్భావం.

లక్ష్మీ సరస్వతుల ఇద్దరి అనుగ్రహం పొందినవారు శ్రీమతి బులి వేంకట రత్నంగారు. అందువల్ల ఆమె ఎప్పుడూ ధనమాశించి కేళికలు చేయలేదు. మేము ఎప్పుడు సమావేశమైనా, లేఖలు వ్రాసుకొన్నా మన ప్రాచీన, సనాతన నృత్య కళాభివృద్ధి గురించే చర్చించేవారం.

ఒకసారి మేము కారులో రాజమండ్రి నుండి ముమ్మిడివరం వెళ్తున్నాం. ఆమె మార్గమధ్యంలో కారు ఆపించి, "నటరాజుగారూ! కనుచూపుమేరవరకు కనిపిస్తున్న ఆ పచ్చని పొలాలన్నీ మావే. నృత్యసరస్వతి మాకు ప్రసాదించినవే. అవి తింటూ కూర్చున్నా మరి మూడు తరాల వరకు తరగని ఆస్తి మాకుంది. నేను నాట్యకళను ఆరాధించి, సంపాదించవలసిన అవసరం నాకు లేదు కాని, మా విద్య మాతో అంతరించిపోకూడదు. మా అభినయ విద్య ప్రచారంలోకి రావాలి. లోకం దీన్ని గుర్తించాలి. ఆంధ్రుల లాస్యనర్తనం కలకాలం నిలవాలి. ఇదే నా ఆశయం" అన్నా రామె.

* * *



**శ్రీమతి అన్నాబత్తుల చినవేంకటరత్నం**

ఈమె భరత కళా ప్రపూర్ణ శ్రీమతి అన్నాబత్తుల బులి వేంకటరత్నమ్మ గారి మూడవ అక్కగారు. మేజువాని, కారువా అనే నాట్య ప్రక్రియలలో ప్రసిద్ధి చెందినవారు. పేరు కీర్తి, ఐశ్వర్యం చాలా సంపాదించారు కాని వృద్ధాప్యంలో ఈ ప్రాపంచిక జీవితంపై విరక్తి చెంది జీవసమాధి పొందారు. 50 సంవత్సరాలకు పూర్వం తూర్పుగోదావరి జిల్లాలోని నర్తకీమణుల వేషధారణను ఈ చిత్రంలో చూడవచ్చును.

* * *

మారంపల్లి, చిత్రజల్లు కళాకారుల గురించి ఇదివరకు నా గ్రంథాలలో ప్రస్తావించాను. వారి గురించి ఎంత వ్రాసినా తక్కువే. చిత్రజల్లు పెద్ద వెంకటరత్నం, చిన్న వెంకటరత్నం అక్కచెల్లెళ్ళు. చిత్రజల్లు వైదేహి, ఇందువదనలు వారి సోదరి కృష్ణవేణి కుమార్తెలు. వీరందరూ గొప్ప విద్వాంసురాండ్రు. వైదేహి, ఇందువదనలు నాట్య

కచ్చేరీలు చేయడం ప్రారంభించారు, పెద్దవారిద్దరు కేళికల నుండి విరమించుకొన్నారు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ నృత్యోత్సవాలు నిర్వహించిన నాటికి పెద్ద వెంకటరత్నంగారు తప్ప ఇతరులు గతించారు. అందువల్ల ఈమెను ఆ ఉత్సవాలలో సమ్మానించారు. అప్పటికి ఆమె వయస్సు 90 సంవత్సరాలు. ఈమె దృష్టి బాగా సన్నగిల్లింది. ఆమెను తీసికొని వచ్చి మైక్ ముందు కూర్చోబెట్టారు. ఆమె తన విద్యను ప్రదర్శించాలని ఆరాటపడి, ఒక ఋక్కుతో వేదపఠనం ప్రారంభించింది. ఆమె గానానికి అందరూ నివ్వెరపోయారు. ఇంతలో ఆమె కంఠం ఆగిపోయింది. ఆమె పాఠం మరచిపోయింది. ఎంత ప్రయత్నించినా జ్ఞాపకం రాలేదు. ఆమె విరమించుకొంది. అందువల్ల ఆమెను తీసికొని వెళ్ళి వారగా ఒకచోట కూర్చోబెట్టారు. ఒక పత్రికా విలేఖరి ఆమె వద్దకు వెళ్ళి, ఆమె పాదాలకు నమస్కరించి, రెండు అశ్రువులు రాల్చి వెళ్ళిపోయాడు. ఒక శతాబ్ది క్రితం మహావిద్వాంసురాండ్రుగా పండితులచేత ప్రశంస అందుకొన్న చిత్రజల్లువారి వంశంలో చివరి నర్తకీమణి ఈమె. అటువంటి మహానాట్య విద్వాంసులు నేడు మనకు లేరు.

వీరితో పరిచయం కలిగిన తర్వాత నేను అనేకసార్లు మారంపల్లి వెళ్ళాను. ఆ ఊరు రాజులు సహృదయులు, సంస్కారవంతులు, నృత్యసంగీతప్రియులు. వారే ఈ చిత్రజల్లు కళాకారిణులను పోషించారు. ఈ చిత్రజల్లు కళాకారిణులు ఏక కుటుంబంగా, కలిసి మెలిసి ఉండేవారు. నేను ప్రత్యేకంగా నాట్యకళా పరిశోధన గురించి కృషి చేస్తున్నానని వారు తెలుసుకొని వారు నన్నెంతో గౌరవంతో ఆదరించేవారు. వీరు కూడా జైనుల వలె చీకటిపడక ముందే సంధ్య



కూర్చున్నవారు గొల్లప్రోలు గ్రామస్తులు శ్రీ మార్కండేయులు
డా. నాటరాజ రామకృష్ణ. పిఠాపురం వాస్తవ్యులు
శ్రీ అల్లంరాజు సుందరం

వేళ భోంచేసేవారు. వారింట్లో అనేకసార్లు భోం చేశాను. నా పరిశోధనలో పశ్చిమగోదావరి జిల్లాలోని ప్రాచీన నాట్య కళ గురించి ఈ చిత్తజల్లు వారిద్వారా ఎన్నో విషయాలు తెలుసుకొన్నాను. తూర్పు గోదావరి జిల్లాలోని నాట్యకళకు సంబంధించిన అనేక విషయాలు తెలుసుకొనడానికి పిఠా పురం వాస్తవ్యులు శ్రీ అల్లంరాజు సుందరం బాబాయిగారు, ముమ్మడివరం వాస్తవ్యులు శ్రీమతి అన్నాబత్తుల బులివెంకట రత్నంగారు, రామచంద్రపురం వాస్తవ్యులు శ్రీమతి చింతా చిన గనిరాజుగారు నాకెంతో సహాయం చేశారు. శ్రీమతి గనిరాజుగారి మేనత్త శ్రీమతి చింతా భద్రంగారు గొప్ప నాట్యకళా విద్వాంసురాలు. ఆమెను చూసే అదృష్టం నాకు లేకపోయింది. ఆమె అప్పటికే గతించింది. ఈమె అనాత వరం పండితులవద్ద నాట్య విద్యను అభ్యసించారు. మండపేట వాస్తవ్యులైన దుగ్గిరాల మాణిక్యం గారి వద్ద పందిరి వేంకట రత్నంగారు నాట్య విద్యను అభ్యసించారు. భరతాభినయాలు భాగవత విద్యలలో శ్రీమతి పందిరి వేంకటరత్నం ప్రసిద్ధులు. నృత్యోత్సవాలలో ఈమె సభావందన నర్తనాన్ని ప్రదర్శిం చారు. ఈమె కంఠం కంచు గంటలా మ్రోగింది. అందరూ ఆశ్చర్యచకితులయ్యారు.

పూర్వం బొబ్బిలి ఆస్థాన నర్తకిగా నుండిన శ్రీమతి జీవరత్నమ్మ ఆ నృత్యోత్సవాలలో తన అభిమాన వర్ణమైన "మనవి చేకొని రారా" అన్న పదవర్ణాన్ని గంటకు పైగా పాడుతూ ప్రదర్శించారు. 60 సంవత్సరాల వయస్సు దాటిన ఆమెయొక్క అనాటి ప్రదర్శన సభికుల్ని ఆనంద సాగరంలో ముంచివేసింది. అంతకు 30 సంవత్సరాల పూర్వం ఆమె నృత్యకళ నుండి విరమించుకొంది. అయినా ఆమె బంతిలా ఎగురుతూ, ఉనిలో అడుగులు వేస్తూ, పాడుతూ, ఆడితే ఎవరు ఆశ్చర్యపోరు! అనాడు వీడియో అందుబాటులో లేదు ఉండియుంటే ఆ నర్తన విధానం మనకు దక్కేది. ఆమెవద్ద కొందరు ఆ పదవర్ణాన్ని నేర్చు కొన్నారు. ఎంతైనా శిష్యులు శిష్యులే గదా? విజయనగరం వాస్తవ్యురాలు "కళావరురింగు" ఒకతరంగాన్ని, మీరాభజన్ను ఆ నృత్యోత్సవాలలో ఒకనాడు ప్రదర్శించింది. కృష్ణమంది రంలో మీరాబాయిలా ఆమె ప్రేక్షకులకు గోచరించింది. "కాంతో యాన్యతి" అనే పుష్పబాణ విలాస శ్లోకాన్ని శ్రీమతి అన్నాబత్తుల బులివేంకటరత్నం ప్రదర్శించింది. చివరిగా తూర్పు భాగవత కళాకారుడు శ్రీ బొంతలకోటి జగన్నాథం గారు వారి బాణీలో భామాకలాపంలోని ఒక దరువు పాడ్డం ప్రారంభించారు. వారి కంఠస్వరం గిటకీలు కొడుతూ, పంజాబ్ మెయిల్లాగ వారిపాట 5 నిమిషాలు పరుగెత్తింది. 'అది వారి కంఠమా లేక యంత్రమా?' అని ప్రేక్షకులు ఆశ్చర్యపోయి, అసక్తితో వింటున్నారు. అనాటి కార్య క్రమానికి అధ్యక్షత వహించిన శ్రీ వేదాంతం రాఘవయ్య గారు "కాలతీతమయింది, పాటను ఆపండి' అన్నారు. ఆ తర్వాత ఆ అధ్యక్షులవారే రెండుగంటలు ఉపన్యసించారు. అందరూ ఆశ్చర్యపోయారు. ఆ యుత్సవాల్లో "భరతకళా ప్రపూర్ణ" బిరుదును అందుకొన్న తొలి నాట్యాచార్యుడాయన. అనాటి ఆయన అంతర్యం ఈనాటికీ నాకు అర్థం కావడం లేదు. రాఘవయ్యగారి గురుభక్తి గొప్పది. వారి నాట్య గురువులు స్వర్గీయ చింతా వేంకటరామయ్యగారు. వారితో కలిసి వీరు అనేక భాగవత ప్రదర్శనలలో వేషం కట్టారు కాని, ఆ యుత్సవాలనాటికి వారు సజీవులుగా లేకపోయి నందున వారి పుత్రరత్నం శ్రీ చింతా కృష్ణమూర్తిగారు వేదికపై ఆసీనులై యుండినందున వారికి రాఘవయ్యగారు సాష్టాంగ నమస్కారం చేసి, గురుభక్తిని చాటుకొన్నారు.

* * *

నెల్లూరుకు చేరువలో పెన్నానదీ తీరంలో గం జొన్నవాడ గ్రామంలో కామాక్షమ్మ దేవాలయ ముంది. ఆ దేవికి పూర్వం నృత్యపూజ జరుగుతూ ఉండేది. ప్రభుత్వం వారు నృత్యపూజలను నిషేధించిన తర్వాత ఆ ఆలయానికి చెందిన కళాకారులు నెల్లూరుపట్నంలో స్థిరపడ్డారు. వీరిలో మణెమ్మగారొకరు. ఈమె తన జీవితాన్ని నృత్యపూజతో ప్రారంభించింది. తర్వాత సినీమారంగంలో ప్రవేశించి, నాటకకళలో స్థిరపడింది. ఈమె వీణను బాగా వాయించేది. ఈమె గాత్రం కడు చక్కనిది. నేను నెల్లూరు వెళ్ళిన క్రొత్తలో నాకు ఈమె పరిచయం కలిగింది. మళ్ళీ నృత్య కళను ఆరాధించాలన్న ఉత్సాహం ఈమెకు కలిగింది గాని,

కుటుంబ పరిస్థితులు ఈమెకు అనుకూలించలేదు. కొన్నాళ్ళ క్రిందట ఈమె గాత్రాన్ని రికార్డు చేద్దామని లేఖ వ్రాశాను. కాని అప్పటికే ఈమె వృద్ధురాలైంది. "గురువుగారూ! కనీసం మా ఇలవేల్పు కామాక్షమ్మకు మంగళహారతి పాడ చాడు. ఆమె నా నృత్య ప్రదర్శన చూచి నన్ను స్వయంగా అభినందించింది. ఆమె గొప్ప త్యాగశీలి అని అంతకుముందే నేను విన్నాను. ఆమె యెడల నాకు గౌరవ ముండేది. ఈ ప్రదర్శనతో నాకు ఆమె పరిచయం కలిగింది. ఆమె పాడు



శ్రీమతి నెల్లూరు నాగమణిమ్మ, డా॥ నటరాజ రామకృష్ణ, శ్రీమతి రాఘవకుమారి,
నాగమణిమ్మ గారి మనుమరాలు

దానికి కూడా నా కంఠం సహకరించడంలేదు" అని ఆమె సమాధానం వ్రాసింది. ఆమె చివరదశలో ఆమెను ఎవ్వరూ పట్టించుకోలేదనుకొంటాను. కళాకారుల చివరిదశ ఇలాగే ఉంటుంది కాబోలు!

ఈ గ్రంథం వ్రాస్తున్న సమయంలో పాత కాగితాలు తిరగవేస్తూంటే ఇటువంటి హృదయ విదారకమైన గాథలు మరికొన్ని వెలికివచ్చాయి. నా కళ్లంట నీళ్ళు కారాయి. ఠుమ్రీ గాయకురాలు చంపాబాయిది కూడ ఇటువంటి బాధాకరమైన గాథే. ఈ యాదర్శమూర్తితో ఒకానొక విచిత్రపరిస్థితిలో నాకు పరిచయమయింది. నేను నాగపూర్‌లో బి.ఏ. చదువుతూండగా మా మిత్రుడు జమీందారు శ్రీ జయస్వాల్ గారింటిలో ఒక పెళ్ళికి వెళ్లాను. మిత్రుల కోర్కెపై నృత్య ప్రదర్శన ఇవ్వడానికి అంగీకరించాను. ఆమె పాట కచ్చేరి చేయడానికి వచ్చింది. ఆమె తబలా వాద్యకారుడే నా నృత్య ప్రదర్శనకు తబలా వాయిం తూంటే ఆమె కంఠం బంగారుతీగెలా సాగింది. కంఠాన్ని భావయుక్తంగా మలిచిపాడడం ఈమెనుంచే నేను చాలా వరకు నేర్చుకొన్నాను. నేను నాగపూరునుండి వచ్చేసే ముందు ఈమెను కలియాలని వెళ్ళాను గాని ఆమె లేరు. ఆమెను మరల కలిసే భాగ్యం నాకు కలగలేదు. నేను హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా ఈమధ్య యుండినప్పుడు ఆమె గాత్రాన్ని రికార్డు చేయించాలని ప్రయత్నించి, నాగపూరులో చాలామందికి లేఖలు వ్రాశాను కాని, సమాధానం రాలేదు. ఆమెకు ఆమె బంధువు ఎవరో విషప్రయోగం చేశారని ఈమధ్య ఒక మిత్రుని ద్వారా తెలిసింది. చాలా బాధపడ్డాను. చివరకు ఆమె ఛాయాచిత్రం గూడా నావద్ద లేకపోయింది. నాలో నేను ఏదైనా ఠుమ్రీ పాడుకొంటున్నా, రేడియోలో ఎవరైనా ఠుమ్రీ పాడినా ఆమె కంఠస్వరం నాకు వినిపిస్తుంది. కొన్ని క్షణాలు నేను మౌనంగా ఉండిపోతాను.

# లక్ష్మణ రేఖ

నాలుగైదు దశాబ్దుల క్రితం ఏలూరు పట్నం ఒక ప్రసిద్ధ లాస్యనర్తక పీఠంగా విరాజిల్లింది. అభినయకళలో పేరుగాంచిన కళావేత్తలు చాటపర్రు సుందరి, కందికట్టు మాణిక్యం, చదలవాడ సామ్రాజ్యం, బండి శ్రీరాజితం' పువ్వుల పాపాచలం మొదలైన వారెందరో నర్తకీమణులు, నాయకురాండ్రు అక్కడ ఉండేవారు. నాట్యకళపైన సంఘంలో వచ్చిన మార్పుల ప్రభావానికి తట్టుకోలేక వీరిలో కొందరు నాట్యకళనుండి పూర్తిగా విరమించుకొన్నారు. వీరి గురించి శ్రీమతి పువ్వుల లక్ష్మీకాంతమ్మ, వాల్మీకి చూడామణి గార్లు వివరంగా చెప్పారు. అందువల్ల వీరి గురించి కొంత ఇక్కడ వ్రాస్తున్నాను. నా పరిశోధన నిమిత్తం ఉత్తరాన కటక్ నుండి దక్షిణాన మదరాసు వరకు చాలాసార్లు పర్యటించాను. నా పర్యటనలలో ఎందరో నాట్యవిద్వాంసులు, నాట్యప్రియులు ఎన్నో విషయాలు చెప్పారు. వాటిని కూడ ఇక్కడ ఉటంకించదలచాను.

ధైర్యంగా సంఘాన్ని ఎదిరించి, పోరాడి, కళాప్రదర్శనలిచ్చి, విరమించుకొన్న ఒక వృద్ధ కళాకారిణి భావాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను నేను కలిసిన ఇతర కళాకారుల భావాలు వేరు, ఈమె భావాలు వేరు. ఈమె మనోభావాలు యదార్థమైనవని నాకు అనుపించడంవల్ల వాటిని మీకు తెలియజేస్తున్నాను.

"సంఘంలో సభ్యత, అసభ్యతల మధ్య మన కంటికి కనబడని ఒక సున్నితమైన సన్నని తెర ఉంది. అది లక్ష్మణరేఖ తన్న చాలా సూక్ష్మమైనది.

"సీతాదేవి లక్ష్మణుడు గీసిన గీత దాటకుండా యుండి యుంటే ఆమె కష్టాల పాలయ్యేది కాదు. రామాయణ కథ మారిపోయేది. అలాగే నృత్య సరస్వతి, సభ్యాసభ్యతల మధ్య ఒక సన్నని గీత గీసింది ఆ గీతను దాటనంతకాలం కళాకారులకు ఏ లోటూ ఉండదు, వారి కీర్తి ప్రతిష్ఠలకు భంగం రాదు. కాని, కొందరు కళాకారులు ఆ గీతను అతిక్రమించారు వారికి కష్టాలు ప్రారంభమైనాయి, కళకు క్షీణ దశ వచ్చింది. సంఘంలోని పెద్దలు కొందరు - అందే రసికులు, ధనవంతులైన రసికులు ఈ కళాకారుల్ని బురద గుంటలోనికి లాక్కుపోయారు. ఈ కళారాధన కన్నా ఈ రసికుల ప్రాపకమే వారికి హాయిగా నుండినట్లు అనిపించింది.

"ఎందరో కవులు, పండితులు నాట్య ప్రదర్శనల గురించి వ్రాశారు, వ్రాస్తున్నారు. అవి స్వకపోల కల్పితాలే గాని అనుభవపూర్వకమైనవి కావని నా అనుభవపూర్వకమైన అభిప్రాయం.

"అభినయం, అంగికం, వాచికం, ఆహార్యం అని నాలుగు విధాలైనది నాట్యం అని పెద్దలు పేర్కొన్నారు. వీటిలో అంగికం హద్దు మీరితే చాలా ప్రమాదం. ఈ ప్రమాదాన్ని గ్రహించడం కష్టం. లక్ష్మణ రేఖ దాటి సీతమ్మ ఆ యసురునికి భిక్ష పెట్టినందు వల్లనే కష్టాల పాలైంది.

"సభ్యతా సభ్యతల మధ్య గల రేఖను కళాకారులు దాటకుండా వారి ప్రదర్శనల నిచ్చియుంటే, నచ్చిన వారే వాటిని చూసి ఆనందించి వెళ్లేవారు. మారుతూ వచ్చిన సాంఘిక వాతావరణంలో ఆ రేఖను దాటనివారు నాట్యకళ నుండి విరమించుకొన్నారు దాటి ప్రదర్శనలు ఇచ్చినవారు బురదలో కూరుకుపోయారు. కళలో ఏనాడు ఆత్మ సందర్శనం పోగొట్టుకొని, విలాస జీవితానికి కళాకారులు అలవాటు పడ్డారో అనాడే కళకు అనర్థం వాటిల్లింది. కళకు అర్థం, అంతరార్థం పరమార్థం ఇటు కళాకారులు. అటు కళాపోషకులు ఈ పరమార్థాన్ని విస్మరించి, హద్దులు మీరారు."

"మీరు కచ్చేరీలు ఎక్కువగా చేసేవారా?" అని అడిగాను.

"అందుకు సందేహ మెందుకండీ? నేను చాలా చాలా కచ్చేరీలు చేశాను. చాలా పొగరుబోతునని, గర్విష్ఠినని పేరు గూడా పొందాను. అందువల్ల కొందరు అదేదో తెలుసుకొనాలని నన్ను ప్రత్యేకంగా ఆహ్వానించేవారు. కళా జీవితంలో నేను ఓట మన్నది ఎరుగను. ఎవరిని చూచినా వారి గుణగణాలను పసికట్టే శక్తిని చిన్నప్పుడే అలవరచుకొన్నాను.

"ఈ సందర్భంలో మీకు రెండు ముచ్చట్లు చెప్పాలి. ఒకసారి మా వూరునుండి ఒక మహా విద్వాంసురాలు, పేరెందుకు లెండి, ఒక కచ్చేరీకి వెళ్ళారు. ఆ కాలంలో ఏదైనా కచ్చేరీని అంగీకరించే ముందు ఆ కార్యకర్తల గురించి వివరంగా తెలుసుకొని, వారి ఆహ్వానాన్ని అంగీకరించేవారు, లేక తిరస్కరించేవారు. ఆమె అలా తెలుసుకోకుండా కచ్చేరికి వెళ్ళింది. ఆమె సరస్వతీ స్తోత్రం ముగించి, ఆట ప్రారంభించగానే ఒక రసికుడు 'పాలకొల్లు బత్తాయిలు' పాట ఆడమన్నాడట. ఆమె నివ్వెరపోయి నిలబడి పోయిందట. ఇంతలో ఇంకో రసికుడు 'పోనీ, ఈతవళ్ళ పాట పాడి అభినయించ' మన్నాడట. ఆమె నిశ్చేష్టురాలై పోయింది. 'ఈ రెండు పాటలు నీకు రావేమో, పోనీ! పచ్చబొట్టు పొడిపించు బావా! అయినా పాడి అభినయించ' మన్నాడట మరొక రసికాగ్రేశ్వరుడు. ఆమె మహా విద్వాంసురాలు, సంస్కృత పండితురాలు. అమరుకం, శృంగార మంజరి, పుష్పబాణ విలాసం, శాకుంతలం మొదలైన గ్రంథాలలోని శ్లోకాలను అభినయించగల దిట్ట ఆమె. అందువల్ల ఆమె 'బాబూ! ఈ పాటల్ని అభినయించడం నాకు మా గురువుగారు నేర్పలేదు. ఈసారి వచ్చినప్పుడు వీటిని నేర్చుకొని ఆడతాను. సెలవు ఇప్పించండి' అని చెప్పి, గజ్జెలు విప్పి, విడిదికి వచ్చేసిందట. ఈ విషయం నాకు తెలిసి, అలాంటి కచ్చేరి కోసం ఎదురు చూశాను. ఒకసారి ఆవూరి వారే నన్ను ఆహ్వానించారు. మిర్చి, మసాలా అంతా తయారు చేసికొని వెళ్ళాను. ఆ సభలో పెద్ద పెద్ద విద్వాంసులు, పండితులు, రసికులు కూడా ఉన్నారు అని గ్రహించాను. సాంప్రదాయానుసారం ప్రార్థన ముగించి, గజ్జెలను కళ్ళకు అద్దుకొని, కట్టుకొని, కచ్చేరి ప్రారంభించడానికి సిద్ధంగా ఉన్నాను. 'ఆమెకు మనకు కావలసిన పాటలు రావేమో? శ్లోకాలు, తరంగాలు ఆడుతుందేమోరా!' అని వారిలో వారు అనుకొంటూంటే విన్నాను. 'అదేటండి! మీకు కావలసినవి పాలకొల్లు బత్తాయిలేనా! ఈతవళ్ళేనా! కిచిడీలు, చేగోశీలేనా! పచ్చబొట్లు పొడిపించమంటారా? పడవలు తొయ్యమంటారా? మీకేం కావాలో సెప్పండి, ఆడుతా!'' అన్నాను. నా దండకం విని వారంతా నిశ్చేష్టులయ్యారు. నిశ్శబ్దం ఆవరించింది. చివరకు ఒక సంస్కారవంతునిలో చేతనం వచ్చి, 'చూడు పిన్నమ్మా పాడు పిల్లాడూ పాడి, ఆడ'మన్నాడు. పాడేను, ఆడేను. అరగంట గడిచినా నా ఆట ఆగలేదు. ఆడుతూనే ఉన్నాను. కాని, వారికి కావలసిన ఆంగిక విన్యాసం ఒక్కటిగూడ నేను ప్రదర్శించలేదు. వారు అలా చూస్తూ ఉండిపోయారు. చివరకు నాకే విసుగేసి, గత్తు అది, ముగించాను.

"ఇక్కడ మీకు మరొక ముచ్చట చెప్తాను వినండి. ఈ ముచ్చటలో పొందిన అనుభూతి, అనుభవం ఎన్నటికి మరువరానిది, మరువలేనిది. ఒకసారి గుంటూరులో ఒక నృత్యపోటీ జరిగింది. ఆ పోటీకి వివిధ ప్రాంతాల నుండి నృత్యకళాకారులు, నాయకురాండ్రు వచ్చారు. గొప్ప శాస్త్ర వేత్తలు న్యాయనిర్ణేతలుగా వచ్చారు. అది అసాధారణమైన సభ. ఆ పోటీలో నెగ్గిన వారికి సువర్ణపతకం ఇవ్వడానికి నిర్ణయించారు. అప్పటికప్పుడు పండితులు పాటను నిర్ణయించి, ఇవ్వాలి. ఆ కాలంలో కళావేత్తలు విశేషంగా అభిమానిస్తూండిన 'దానికె తగు జాణర, నీవు దయయుంచరా ఈవేళ' అన్న పదవర్ణాన్ని వారు నిర్ణయించారు. పోటీ ప్రారంభమైంది. తమ శక్త్యానుసారం ఒక్కొక్క కళాకారిణి 20, 25, 30, 40 నిమిషాల చొప్పున ఆ పదవర్ణాన్ని అభినయించారు. చివరకు ఒక నర్తకీమణి 30, 40, 50, 60, 75 నిమిషాలు ఒక్క పల్లవినే అభినయించింది. తర్వాత గంటన్నర అయినా శివపూజ ముగియలేదు. న్యాయనిర్ణేతలు ఆమె ఆటను ఆపించి, ఆమెకు ప్రథమ బహుమతి బంగారు

పతకం ఇచ్చారు. ఆ యాటకు నా కన్నులు ఆనందబాష్పాలు రాల్చాయి. నేను వేదికమీదకు వెళ్ళి, ఆమె పాదాలకు నమస్కరించి, ఆనందబాష్పాలతో అభిషేకించాను. అందరూ ఆశ్చర్యపోయారు. కాని, కొందరు ఆమెది తమ బాణీ కాద న్నారు. మరికొందరు గుసగుసలాడేరు. ఆమెది ఏ బాణీ అయితేనేం? ఆమె అభినయసరస్వతి, ఆమె ఎవరోకాదు, మా ఏలూరు కందికట్టు మాణిక్యమ్మ. ఇలాగుండేవండీ ఆనాటి మా ఆట, మా పాట. మా మాట మార్దవం, మా పాట మార్దవం అయితే సమయానుకూలంగా కటువుగా కూడా ప్రవర్తించేవారం. అందు కొక ముచ్చట చెప్తాను.



శ్రీమతి తిరుపతి రంగనాయకమ్మ

ఈమె భరతనాట్యాన్ని దక్షిణాది పద్ధతిలో అభ్య సించారు. అంటే ఈమె పాడుతూ ఆడే తెలుగువారి పద్ధతిలో కాక, వేరొక దువలిత పాడగా ఆడే పద్ధతిలో నాట్యం చేసేవారు. సంగీత సరస్వతి, భరతశాస్త్ర కోవిదురాలైన శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మ గారి శిష్యురాలు ఈమె.

* * *

"మేమందరం ఆటపాటలు మానేసి యింట కూర్చున్నాం. శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మవంటివారు మాత్రం పాట కచ్చేరీలు చేస్తూండేవారు. ఆమె 5,6 భాషలో పండితురాలు. ఆమె ఒకసారి పాటకచ్చేరీ చేయడానికి ఒక మహిళా సమా జానికి వెళ్ళారు. ఆమె వేదికపైని కూర్చుని ప్రక్క వాయి ద్యాల శ్రుతి చూసుకొంటున్నారు. ప్రేక్షకుల్లోని ఒక స్త్రీ నోరుండబట్టక ఆమె గురించి ఒక పరుష వాక్యం పలికింది. ఆ పలుకు ఆమె చెవికి సోకింది. ఆమె ఒక మడియ నిశ్చ బ్దంగా ఉండిపోయింది. ఆమె అభినయ కళావేత్త గనుక తన శరీరాన్ని, ధరించిన దుస్తుల్ని చూసుకొని, సభను ఒక్కసారి చూసింది. తన గురించి బెణుకు విసిరిన స్త్రీ అలంకరణను ఒకసారి చూసింది. తన అలంకరణ చూసు కొంది. తర్వాత ఆ స్త్రీని ఉద్దేశించి, 'ఔనమ్మా! నేను వేశ్యనే. మా కళలు మా వద్దనే ఉండిపోయాయి గాని, మా వృత్తి మాత్రం మీవంటివారి వద్దకు చేరుకొంది........' అని ఆమె కచ్చేరీ ప్రారంభించింది. ఆ బెణుకులు విసిరిన స్త్రీ తలవంచుకోవలసి వచ్చింది. అలా ఉండేవి ఆనాటి కచ్చేరీలు."

## బొబ్బిలి జీవరత్నమ్మ

నేను నా పరిశోధనా పర్యటనలలో ఎందరో కళా వేత్తలను, కళా మూర్తులను కలుసుకొన్నాను. నా పరిశో ధనవరకే వారితో నాకు పరిచయముండేది. వారిని నేను నాకు కావలసిన విషయాలు అడగడం, వారు చెప్పడం, నేను వ్రాసుకొనడం జరిగేది. ఇంతకు మించి, వారి హృదయపు లోతులకు వెళ్ళి, వారి అంతరంగిక విషయాలు తెలుసుకొనే అవకాశం నాకుండేది కాదు. అనాటి వారి పరిస్థితి అట్టిది. సంఘంలోని దృష్టి, దృక్పథం అలాగుండేవి. వారి వద్దకు వచ్చిన వ్యక్తి నిజంగా విషయగ్రహణకు వచ్చాడా? లేక తమని అపహాస్యం చేయడానికి వచ్చాడా? అని శంకించి, ఆ వచ్చిన వ్యక్తిని పరికించి, ఆ కళాకారులు తెలిసికొనడానికి ప్రయత్నించేవారు. అంతకు పూర్వం మిస్ మేయో మన భారతదేశం వచ్చి, మన మతం, మన సమాజం, మన ఆచార వ్యవహారాలు, కళలు, సాహిత్యం మొదలైనవి పరిశోధించి 'మదర్ ఇండియా' అనే గ్రంథం వ్రాసింది. ఆమె ఎందు లోను మంచిని గ్రహించలేకపోయింది. ఆమె గ్రంథ

ప్రభావం ఆనాటి సమాజంపైని ఉండేది. అందువల్ల నృత్యకళ నుండి విరమించుకొని, సంఘానికి దూరంగా ఉంటూండిన ఈ కళాక్షేత్రంనుండి విషయం రాబట్టడం కష్టంగా ఉండేది, ఒక్కొక్కప్పుడు బ్రహ్మప్రళయమయ్యేది.

అలాంటి సమయంలో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఏర్పాటయింది. ఆ కాలంలోనే నేను నా పరిశోధన నిమిత్తం పర్యటిస్తూండేవాణ్ణి. మా పూజ్య గురువులు నాయుడు పేట రాజమ్మగారు ఒకసారి జీవరత్నమ్మగారి గురించి చెప్పారు. కనుక ఆవిడ్ని కలుసుకోవాలని బొబ్బిలి వెళ్ళాను.

గడ్డిబుక్క చిరంజీవి, సంజీవి, సువర్ణ అని ముగ్గురు గొప్ప నర్తకీమణులు బొబ్బిలిలో ఉండేవారు. చిరంజీవి, సంజీవి రాజావారి ఆస్థాననర్తకులు. రాజావారి ఇలవేల్పయిన గోపాలుని ఆలయంలో సువర్ణ దేవగణికగా ఉండేది. మాడుగుల సంస్థానం జైపురం సంస్థానంలో విలీనమైన తర్వాత బుగత గోపన్న, రామయ్య అనే యిద్దరు మాడు గుల ఆస్థాన నాట్యాచార్యులు, ప్రయోక్తలు బొబ్బిలి సంస్థానం చేరుకొన్నారు. వీరు భరత శాస్త్రంలోనే కాక కవిత్వం, సంగీతం, తాళప్రస్తారాలలోగూడ మంచి నిధులు. పంచముఖి, షణ్ముఖి తాళాలను కూర్చి, ప్రదర్శించేవారు. వీరి కుమార్తె నీలాద్రివేణి, సువర్ణ ఆలయంలో నృత్యపూజ చేసేవారు. వీరు బొబ్బిలి ఆస్థానం చేరుకొన్న సమయంలోనే చిరంజీవి, సంజీవులు నాట్యప్రదర్శనల నుండి విరమించు కొనడంతో జీవరత్నమ్మగారు బొబ్బిలి ఆస్థాన నర్తకి అయ్యారు. ఆమె తన విద్యను సీతారామమ్మ అనే నర్తకికి నేర్పారు. ఆస్థానం నుండి తాను విరమించుకొన్నారు. సీతారామమ్మ ఆ యాస్థానంలో ఒకటి, రెండు కచ్చేరీలు చేసిన తర్వాత ఆమెను బొబ్బిలి రాజావారు బెంగుళూరు నాగరత్నమ్మగారి వద్ద తర్ఫీదుకమ్మని మదరాసు పంపిం చారు. మదరాసువారి ఆటకు, బొబ్బిలివారి ఆటకు తేడా ఉంది. మదరాసువారిది మూకనాట్యం. ఆడేవారు పాడరు. బొబ్బిలివారు పాడుతూ ఆడేవారు. సీతారామమ్మ మదరాసు నుండి తిరిగి వచ్చిన కొంతకాలానికే నాట్యం నుండి విర మించుకొంది. అందువల్ల బొబ్బిలి ఆస్థానంలో బాగా ఆడే నర్తకీమణులు కరువయ్యారు. రాజావారు జీవరత్నమ్మను మళ్ళీ ఆస్థాన నర్తకిగా రమ్మనమని ఆహ్వానించినా ఆమె వెళ్ళలేదు. ఆమె అప్పటికే మెట్టవలస నాయుడుగారిని పెళ్ళి చేసుకొని అక్కడ స్థిరపడ్డారు. ఇల్లు విడిచి బయటకు రాలేదు. మా గురువుగారు ఈమె గురించి చెప్పినప్పటినుండి ఈమెను చూడాలన్న ఉత్సుకత నాలో ఏర్పడింది.

ఒకసారి కటక్ నుండి వస్తూ, పూండీ జమిందారు శ్రీ వరదా నారాయణరావు ఆహ్వానంపైని పూండీ వెళ్ళాను. అక్కడి నుండి వస్తూ జీవరత్నమ్మగారిని చూడాలని బొబ్బిలి వెళ్ళాను. ఆమె గురించి వాకబు చేయగా అప్పటికే ఆమె భర్త చనిపోయాడు, ఆమె ఆస్తి హరించుకొని పోయింది. అందువలన ఆమె మరల బొబ్బిలి వచ్చి తన తమ్ముని వద్ద ఉంటున్నదని తెలిసి, అతని ఇంటికి వెళ్ళాను. అతడు బీదవాడు. అయినా మతి చలించి, పిచ్చిదానివలె నున్న తన అక్కను అతడు చేరదీశాడు. నా బాల్యంలో మా గురువు గారు వర్ణించిన జీవరత్నమ్మ గారి రూపాన్ని ఊహించుకొంటూ అతని ఇంట్లో అడుగు పెట్టాను. ఆమె గురించి అడిగాను. "అయ్యా, మీకు ఇప్పుడు వీధిలో ఎదు రయ్యిందే - ఆమే నండి జీవరత్నమ్మ" అన్నాడు. నాకు ఆశ్చర్యం వేసింది. అతని మాటలు నమ్మలేకపోయాను. కాని, నమ్మక తప్పలేదు. ఆమెను పిలవమన్నాను. అతడు పిల్చాడు. ఆమె వచ్చింది. ఆమెతో కొద్ది నిమిషాలు మాట్లాడి ఒక పాట పాడమన్నాను. "పాటే ఏమిటి, అభినయంగూడా చేస్తాను'' అంటూ ఒక చరణం పాడింది. మళ్ళీ ఆ చరణమే పాడి, ఆపివేసి, ఇటూ అటూ చూస్తూ, ఎవరినో తిట్టడం మొదలుపెట్టింది. మరి కాస్సేపటికి మళ్ళీ ఆ చరణం పాడి, అభినయించింది.

"బాబూ! ఇదీ ఆమె స్థితి. మతి స్థిరంగా ఉండదు. ఒకప్పుడు చాలా తెలివైంది. గొప్ప ఆస్తిపరురాలు. రాజా వారి దర్బారులోకి వెళితే ఎవరినైనా మాట్లాడ నిచ్చేదా? తెల్లని మైజారు దక్కా మస్లిన్ దుస్తులు వేసుకొని, చక్కగా సింగారించుకొని, సెంటువాసనలు వెదచల్లుతూ, తెరలు కట్టిన గూడు బండీలో దర్బారుకు వెళ్తూంటే దారి పొడుగునా

ప్రజలు నిలబడి చూస్తూండేవారు. అలాంటి ఆమె ఎలా అయిపోయిందో చూశారా?" అంటూ అక్కడకు వచ్చిన ఒక వృద్ధ వైష్ణవ పండితుడు నాతో అన్నాడు. నాకు చాలా జాలి వేసింది. వెంటనే కొంత డబ్బు తీసి, ఆమెకు ఇవ్వబోయాను. "బాబూ! నా కెందుకూ డబ్బు? ఒకరినుండి డబ్బు తీసుకోవడం నాకు అలవాటు లేదు" అంటూ నిరాకరించింది. అక్కడున్న ఆ వృద్ధ వైష్ణవ పండితుడు ఆమెకు నచ్చ చెప్పగా, కొంతసేపు ఆమెలో ఆమె చర్చించుకొని, చివరికి ఆ డబ్బు తీసుకొంది.

నేను హైదరాబాదు తిరిగి వచ్చిన తర్వాత, అకాడమీ మీటింగులో ఆమె దుస్థితి గురించి చెప్పి, ఆమెకు వృద్ధాప్య వేతనం ఇవ్వమని కోరాను.

"ఆమె ఆస్థానంలో ఆడిందో లేదో- ఎవరు చూశారు?" అని కొందరు, ''ఇలా పింఛన్లు ఇస్తూపోతే మనకు వచ్చే గ్రాంటు ఈ దానధర్మాలకే సరిపోదు'' అని మరికొందరు, ''ఆమె పేరు మేం ఎప్పుడూ విననే లేదు" అని మరికొందరు నా ప్రతిపాదనకు అడ్డు తగిలారు. నేను గట్టిగా వాదించడంతో కాస్సేపు తర్జనభర్జనలు జరిగాక చివరకు నెలకు రూ. 25/-లు ఆమెకు ఇవ్వడానికి అకాడమీ కార్యవర్గ సభ్యులు అంగీకరించారు.

బొబ్బిలి రాజావారి పట్టాభిషేక మహోత్సవ సమయంలో వారు కొత్తగా నిర్మించిన గోల్‌బంగ్లాలో మదరాసు గవర్నర్ సర్ ఆర్థర్ హోప్ సమక్షంలో ఈమె వర్ణం ఆడింది. ఆ పాశ్చాత్యుడు ఈమె నాట్యానికి ముగ్ధుడై మరొక సారి ఆ వర్ణం ఆడమన్నాడట. ఒకసారి బొబ్బిలి సంస్థానంలో ఈమెకు తొలి తాంబూలం ఇవ్వలేదుట. అందుకు అవమానంగా భావించి, కోపించి, గజ్జెలు విప్పివేసి, మరింక కేళికలు చేయనని శపథం చేసిన ఈ జీవరత్నమ్మకు వృద్ధాప్య వేతనం ఇవ్వడానికి ఎన్నో తర్జనభర్జనలు జరిగాయి. ఆమె ఆస్థాన నర్తకిగా నుండినప్పుడు ఇటువంటి పాతికలు ఎన్ని దానధర్మాలు చేసిందో! ఇదే విధి విలాసం! ఓడలు బండ్లు, బండ్లు ఓడలు అవుతాయి అంటే ఇదేనేమో! ఏమయితేనేం, ఆమెకు పింఛను వచ్చేటట్టు చేయటంలో కృతకృత్యుణ్ణయ్యాను.

1958 విజయదశమినాడు సాయంత్రం వేంకటేశ్వర స్వామివారి గుడికి వెళ్ళి వచ్చేసరికి చీకటి పడింది. నా ఇంటి వాకిలి ముందు ఎవరో ఒకామె కూర్చుని ఉంది. "ఎవరమ్మా నీవు?" అని అడిగాను. ''నేను బొబ్బిలి మామ్మను. లక్ష్మీదేవి నన్ను నృత్య సరస్వతివద్దకు వెళ్ళమంది. అంతే. వచ్చేశాను" అంటూ ఆనందపారవశ్యంతో చెప్పింది. అప్పుడు ఆమె బొబ్బిలి జీవరత్నమ్మ అని గుర్తుపట్టాను. ఆనాటి నుండి ఆమె జీవించియుండినంతకాలం, సుమారు పది సంవత్సరాలపాటు మా నృత్యనికేతనంలో నాతోపాటే ఉన్నారు.

ఆమె ద్వారా అనేక నాట్య సాంప్రదాయక పద్ధతులను నేను తెలుసుకొన్నాను. ఎన్ని గ్రంథాలు చదివితే ఆ యనుభవాల గురించి తెలుసుకోగలం? వారి వారి పూర్వుల విద్యలలోని లోతులను తెలుసుకోగలుగుతాం? ఆ గురుశిష్యుల సంబంధాలు, మర్యాదలు, కట్టుబాట్లు, శిక్షణ పద్ధతులు, వారి జీవితసరళి, సాధన -ఇలా ఎన్నో విషయాలను ఆమె ఉదయం మేల్కొన్నప్పటినుండి రాత్రి నిదురించేవరకు చెప్తూండేవారు. ఒక్కొక్కనాడు అర్ధరాత్రి సమయాలో ఆమెకు ఏదైనా నాట్యకచ్చేరి విషయం జ్ఞాపకమొస్తే కథలు, కథలుగా ఎన్నో విషయాలు చెప్తూండేది. ఇంతలో తెల్లవారిపోయేదికూడ. ఒక్కొక్కసారి హార్మోనియం తీసుకొని, వాయిస్తూ గంటలతరబడి పాడి, వినిపించేది. కొన్ని సమయాలలో నాకు కొంచెం ఇబ్బందిగా ఉండేది కాని, ఆమె మనస్సును నొప్పించడం ఇష్టంలేక అలా ఆమె పాట వింటూ కూర్చునే వాడిని. ఒక్కొక్కసారి ఆమె ఏవేవో సందర్భం లేని సంగతులు మాట్లాడేది. ఒకసారి ఒక ఆయుర్వేద వైద్యుడైన స్నేహితుడు వస్తే అతనితో సంప్రదించి, చికిత్స చేయించాను. ఆమె మానసికంగా బాగుపడింది. అప్పటినుండి మా నృత్య నికేతనంలోని పిల్లలకు పాఠాలు చెప్పడం మొదలుపెట్టారు. వారంతా ఈమెను "మామ్మ" అని పిలిచేవారు. నేను 'అమ్మా!' అనేవాడిని. ఆమె నన్ను 'బాబూ!' అనేది.

ఆమె చక్కగా పాడి, అభినయించేది. అమరేష్ అనే ఒక యువకుడు మా నృత్యనికేతన్‌లో మార్దంగికుడుగా

ఉండేవారు. అతడు మృదంగం వాయిస్తూంటే ఈమె నాట్యం చేసేది. ఇద్దరూ పోటీపడి వారి విద్యలను ప్రదర్శించేవారు. అతని వాద్యంలో లోపాలుంటే ఈమె సరిచేసేది. ఆమె విద్యలోని లోతుపాతులను తెలుసుకొనడం మొదట్లో కష్టంగా ఉండేది. ఆమెది కొన్నితరాల విద్య. ఆమె మా వద్ద కొన్ని సంవత్సరాలుండినందువల్ల ఆమె నాట్య విద్యలోని కొన్ని సాంప్రదాయక రహస్యాలను నాకు చెప్పారు. అది నా అదృష్టం. నా శిష్యుల అదృష్టం. మా యిద్దరి అనుబంధం ఎంతగా వృద్ధి పొందిందంటే-కొత్తవారు మమ్మల్ని చూచి, తల్లీకొడుకులు అనుకొనేవారు.

బొబ్బిలి నుండి కొంతమంది కవులు, పండితులు ఆమెను చూడడానికి మా నృత్యనికేతన్‌కు వచ్చేవారు. ఆమె యెడల వారికెంతో గౌరవముండేది. వారు వెళ్ళిపోతూ ఆమెకు కొంత ధనమిచ్చేవారు. ఆమె అభిమానవంతురాలు గనుక పుచ్చుకొనేది కాదు. "తప్పు తప్పు, అది మా బాబుకు ఎంత అగౌరవం?" అని నిరాకరించేది. నేను ఎప్పుడైనా నచ్చచెబితే వారిచ్చే కానుకలు స్వీకరించేది.

నేను నిర్వహించిన నృత్యనాటకాల వల్ల నా ఆస్తంతా తరిగిపోయి చాలా యిబ్బందులలో పడ్డాను. అప్పుడు జరిగిన చిన్న ముచ్చట. ఒకనాడు నేను ఏదో వ్రాసుకొంటున్నాను. అమ్మ వచ్చి, తలుపు వద్ద కొంత సేపు నిశబ్దంగా నిల్చుంది. నేను తల ఎత్తి "ఏమిటమ్మా?" అన్నట్టు చూశాను. "మిమ్మల్ని ఒకటి అడగాలని వచ్చాను ......" అంది. "అడగమ్మా" అన్నాను. "చిరిగిపోయిన మీ పంచలు రెండుంటే ఇయ్యి బాబూ!" అంది. సరే నన్నాను. ఆ సాయంత్రం ఇచ్చాను. తర్వాత ఆ విషయం నా కోర్టు గొడవల్లో మరచిపోయాను.

ఆమె ఇల్లు విడిచి వెళ్ళేది కాదు. నేను ఆమెను ఎప్పుడూ ఏ పనికీ బజారుకు పంపేవాణ్ణి కాను. ఒకనాటి మధ్యాహ్నం నేను ఏదో పని మీద తొందరగా వెళ్తున్నాను. ఆమె కూరల సంచితో త్రోవలో ఎదురైంది. నేను మొదట ఆమెను సరిగ్గా చూడలేదు. ఆమె నన్ను దాటి వెళ్ళింది. ఎవరా అని వెనక్కు చూశాను "అమ్మ!" నేనిచ్చిన పాత పంచలు రెండింటిని కలిపికుట్టుకొని, చీరగా కట్టుకొని ఉంది. నా మనస్సు చివుక్కుమంది. సొంత తల్లినైతే అంత నిర్లక్ష్యంగా చూసేవాడినా? నా హృదయం బాధ పడింది. కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. నేను వెంటనే వెనుతిరిగి, మా యింటికి ఎదురుగా నున్న బట్టల వ్యాపారి వద్దకు వెళ్ళి, నాలుగు చీరలు, నాలుగు రవికెలకు సరిపోయే తెల్లగుడ్డా అరువుగా తీసికొని ఆమె కిచ్చాను. ఇంకెప్పుడూ అలాంటి చిరిగిన బట్టలు కట్టుకోవద్దని ఆమెకు చెప్పాను.

ఒకనాడు పొద్దునే టీ తాగి, కోర్టు పని మీద వెళ్ళి మధ్యాహ్నం నా మిత్రుడు రామచంద్రాచారితో తిరిగి వచ్చాను. చాలా ఆకలిగా ఉంది. ఎదురుగా నా శిష్యురాలు స్వర్ణలత (అన్నపూర్ణ అసలు పేరు) వచ్చింది. "భోజనం పెట్టమ్మా!" అన్నాను. ఆమె అలాగే మాట్లాడకుండా నిల్చుంది. ఆమెకు నా మాట వినబడలేదేమోనని "స్వర్ణా! అన్నం వడ్డించు"అన్నాను.ఆమెకళ్ళుతుడుచుకొంటూ లోపలికి వెళ్ళిపోయింది. ఆమె వెంట నేను వెళ్ళి "ఏమయిందమ్మా?" అని అడిగాను. "ప్రొద్దున్న నుండి పొయ్యి అంటించలేదు మాష్టారు గారూ! బియ్యం నిండుకొన్నాయి"అంది మెల్లగా. "మరి మీరు?" "నేను మామ్మా అందరం (ఇంకా కొందరు శిష్యురాండ్రు) ఉపవాస మున్నాం" అంది నవ్వుతూ.

వెంటనే నా జేబు తడుముకొన్నాను. ఒక పావలా బిళ్ల దొరికింది. ఒకప్పుడు లక్షలు, వేలు దాచిన గాడ్రెజ్ అల్మారా వెతికాను. మరి మూడు పావలా బిళ్ళలు దొరికాయి. మిత్రుడు రామచంద్రాచారికి ఆ రూపాయి చిల్లర యిచ్చాను. అతడు ఒక రొట్టె కొని తెచ్చాడు అందరం తలో రెండు ముక్కలు తిని, కడుపునిండా నీళ్ళు తాగాం. ఆ పూట గడిచింది. అలాంటి గడ్డు పరిస్థితిలో గూడ బొబ్బిలి జీవరత్నమ్మ, మరి కొందరు శిష్యురాండ్రు నన్ను విడిచి వెళ్ళలేదు.

ఒకనాడు కొత్త వకీళ్ళను తీసికొని కోర్టుకు వెళ్ళవలసి వచ్చింది. నేనూ. నా మిత్రుడు నిండే ఒక టాక్సీని తీసికొని, వకీళ్ళ ఇళ్ళకు వెళ్ళి, వారిని తీసికొని వెళ్ళాం. ఆనాడు మా వ్యాజం ఆలస్యమయింది. మళ్ళా వాయిదా పడింది. చేతిలో

డబ్బులేక టాక్సీని పొద్దున్న నుండి కోర్టులోనే ఉంచాం. తిరిగి అదే టాక్సీలో వకీళ్ళతో కోర్టునుండి బయలుదేరాం. అప్పటికి సాయంత్రం మూడయింది. కాఫీ టైమయింది. తిన్నగా కోఠీ తాజ్‌మహల్ హోటలుకు వెళ్ళాం. నలుగురు నాలుగు రకాల టిఫిన్‌కు ఆర్డరిచ్చారు. నా జేబు తడుము కొన్నాను. నాకు భయం వేసి, ముఖం మాడిపోయింది. నేను ఒక దోసె మాత్రం తిని కాఫీ తాగాను. తక్కిన వాళ్ళు రెండు, మూడు రకాల టిఫిన్ తిన్నారు. పావం, వాళ్ళకి బాగా ఆకలి వేసి యుంటుంది. అప్పుడు నాకు ఇంట్లో ఉన్న అమ్మ, అన్నపూర్ణ ఆకలి ముఖాలతో కనిపించారు.

అందరం కాఫీ టిఫిన్లు ముగించాం. వకీళ్ళను వారి ఇళ్ళ వద్ద దిగబెట్టాం. ఇంటికి వచ్చాం. ఇంటి వద్ద ఎవరి వద్ద డబ్బుల్లేవు. టాక్సీకి బాగా చెల్లించాలి. ఏం చేయాలి? ఆలోచించాను. నా చేతివాచి, ''నేనున్నాను'' అన్నట్టుగా నాకు కనిపించింది. దాన్ని తీసి సిందే కిచ్చాను. అతడు ఆ టాక్సీ లోనే వెళ్ళి, మార్వాడీ వద్ద ఆ వాచీని తాకట్టు పెట్టి, టాక్సీకి డబ్బు చెల్లించి వచ్చాడు. ఖరీదైన నా వాచీకి,నాకూ ఆనాటితో రుణం తీరిపోయింది. అయితే, అది చాలా ఖరీదైన వాచీ అవడం వల్ల అది నా యింటి ఖర్చుకోసం ఒక వంద రూపాయలు మిగిల్చి వెళ్ళింది. అది చేసిన ఉపకారం మరువ లేనిది. అందువల్ల మరి కొన్నాళ్ళు నా ఇంటిని అమ్మివేసిన తర్వాత మార్వాడీకి వడ్డీతో గూడ డబ్బు చెల్లించి ఆ చేతి వాచీని విడిపించుకొన్నాను. నాకూ నా అద్దాల మేడకు రుణం తీరిపోయింది. అద్దె యింటికి మారాలి. నాతో ఉండిన ఇద్దరు ముగ్గురు శిష్యురాండ్రు "మాష్టారుగారిని వదిలి వెళ్ళా"లని కంట నీరు కార్చారు. "అమ్మా! నా కష్టాలను మీరు అను భవించలేరు. బొబ్బిలి వెళ్ళిపొండి'' అని జీవరత్నమ్మగారికి కొంత డబ్బు ఇవ్వబోయాను. "బాబూ! మీ అమ్మ నయుంటే మీరు ఈ మాట అనేవారా? కొడుకు కష్టాల్లో తల్లి కొడుకును విడిచి వెళ్తుందా? నేను వెళ్ళను. ఇంకెప్పుడూ నన్ను వెళ్ళ మనకండి. నేను మీతోనే ఉండి, మీవద్దే చనిపోవాలి'' అంటూ ఆమె కళ్ళు తుడుచుకొంది. చివరకు నేనూ, జీవరత్నమ్మ గారు మిగిలాం.

ఆమె ఎప్పుడూ తెల్లచీరెలు కట్టేది. అందువల్ల ఆమె కోసం అరడజను ఫిన్లే తెల్లచీరలు కొన్నాను. ఆమెకు "కస్ కస్" సెంట్ చాలా యిష్టం. అందువల్ల ఒక ''కస్ కస్'' సెంట్ సీసా చిన్నది కొన్నాను. వీటిని ఆమెకు తెలియ కుండా ఆమె పెట్టెలో పెట్టాను. నా అద్దాల మేడను ఖాళీ చేయవలసిన రోజు దగ్గరకు వచ్చింది. ఆమెను ఒకనాడు దగ్గర కూర్చోబెట్టుకొని "అమ్మా! ఈ యిల్లు అమ్మివేశాను. రేపు మనం ఒక అద్దె ఇంటికి మారాలి. మీ బట్టలు సర్దు కోండి'' అని చెప్పాను. అంతవరకు ఈ విషయం ఆమెకు తెలియదు. అందువల్ల ఆమె నిశ్చేష్టురాలైంది. "అద్దె ఇంటికి మారాలా?'' అంది.

ఆ మర్నాడు అద్దె ఇంటికి మారాం. ఆమె ఆ యింట్లో పాలు పొంగించింది. దేవుని పటానికి పూజ చేసింది. ఆమె నవ్వు ముఖం మారిపోయింది. కళావిహీనమైంది. కొద్ది రోజుల్లో ఆమె అద్దె ఇంటికి అలవాటు పడుతుందని నేను అనుకొన్నాను. కాని, ఆనాటి నుండి ఆమె ఆరోగ్యం క్షీణిస్తూ వచ్చింది. అందువల్ల ఆమెను గాంధీ ఆస్పత్రిలో చేర్పిం చాను. మరి రెండు మూడు రోజుల్లోనే ఆమె ఆ యద్దె యింటిలో ఉండడం ఇష్టంలేక, ఈ లోకాన్నే విడిచి వెళ్ళి పోయింది.

కోర్టు చుట్టూ తిరిగినా నా యిల్లు నాకు దక్కలేదు. ఆస్తిపోయింది. బ్యాంక్‌లోని నా డబ్బు పూర్తిగా కరిగి పోయింది. అయినా నేను ఏడ్వలేదు. కాని, జీవరత్నమ్మగారు పోయిన్నాడు నా దుఃఖం ఆగలేదు. కన్నీరు మున్నీరుగా వరదలై పారింది. నా చేతులమీదుగా ఆమెను నారాయణ గూడాలో సమాధి చేశాను. ఎక్కడ బొబ్బిలి? ఎక్కడ హైదరాబాదు? నేను ఎవరు? ఆమె ఎవరు? ఏమిటో అనుబంధం! ఇవేనేమో దైవలీల లంటే!

అద్దాలమేడలో నేను నృత్యనాటకాలను నిర్వహిస్తున్న ప్పుడు, ప్రతి సాయంత్రం అనేకమంది స్నేహితులు, అభి మానులు, కళాహృదయులు మా నృత్య నికేతనానికి వచ్చే వారు. కారులుతీరి కారులు నిలిచేవి. నేను అద్దె ఇంటికి మారిన తర్వాత ఆ మిత్రులు, ఆ యభిమానులు, ఆ కళా

హృదయులు ఏమయ్యారో నాకు తెలియదు. జీవరత్నమ్మ నన్ను విడిచి వెళ్ళిపోయింది. నేను ఒంటరిగా మిగిలి పోయాను. కీడులో మేలుంటుంది అంటారు. అది నిజం. నన్ను నేను తెలుసుకొనడానికి ఆ యొంటరితనం సహాయపడింది. నాలో పట్టుదల పెరిగింది. కళలో ఇంకా ఉన్నత శిఖరాలను చేరుకొనాలని నిశ్చయించుకొన్నాను.

అంతవరకూ ఉండిన ఈతిబాధలు తొలగిపోయాయి. అప్పులవాళ్ళ వత్తిడిలేదు. మనస్సు నిర్మలమయింది. అంతా పోయింది. అయినా జీవితపుతీరు మారలేదు. పూర్వంలాగే తిరుగుతున్నాను. ''అంతా పోయింది. వట్టిమనిషి మాత్రం మిగిలాడు'' అని కొందరు అనుకొన్నారు. అది నిజమే అయినా నా జీవిత విధానం, నా దర్జా మారలేదు. అందువల్ల నావద్ద ఇంకా ఎంతో డబ్బు ఉందని చాలామంది అనుకొనేవారు. అది నా అలవాటు, అది నా జీవితసరళి అని వారికి తెలియదు.

నృత్యనాటకాల ప్రదర్శనలు ఆగిపోయినా, పిల్లలకు నృత్యపాఠాలు చెప్పడం ఆగిపోలేదు. ఈ విషయంలో రాఘవకుమారి నాకు తోడుగా ఉండేది. ఆమె ఉన్నత కుటుంబంలో జన్మించింది. ఆమె తాతగారు పిఠాపురం రాజావారైన గంగాధర రామారావుగారికి గురువులు. ఇబ్బంది లేకుండా రోజులు గడుస్తున్నాయి. కాని, వంటరిగా కూర్చున్నప్పుడు జీవరత్నమ్మగారన్నమాటలు నాలో ప్రతిధ్వనించేవి.

''అద్దె ఇంటికి మారాలా?'' అని ఆమె ఆనాడు అన్నమాటలకు అంతరార్థం ఆనాడు నాకు తెలియకపోయినా కాలక్రమేణా తెలియవచ్చింది. ఇల్లు పోయిందన్న బెంగతోనే ఆమె చనిపోయిందని ఆఖరి క్షణాల్లో ఆమె వద్ద నుండిన రాఘవకుమారి తల్లిగారు నాతో అన్నారు.

ధనం, ధనంవల్ల లభించే గౌరవమర్యాదలు క్షణికమైనా, వాటి ప్రభావం చాల గొప్పది. జీవరత్నమ్మగారి మాతృహృదయం నా యిల్లు పోయినందుకు ఎంత క్షోభించిందో!

దరిద్రమంటే ఏమిటో నా జీవితంలో రెండుసార్లు బాగా అనుభవించాను. నా చిన్నతనంలోనే నృత్యం నేర్చుకొనాలన్న పట్టుదలతో ఇల్లు విడిచి వచ్చాను. ఇల్లిల్లూ తిరిగాను. తినడానికి తిండిలేక, ఉండడానికి వసతి లేక, కట్టుకొనడానికి గుడ్డలేక కటిక దరిద్రం అనుభవించాను. నాగపూర్‌లో డిసెంబర్ చలికి తట్టుకొని జీవించాను. నా ధ్యేయం నృత్యకళారాధన. అందువల్ల ఈ దారిద్ర్యాన్ని నేను లెక్క చేయలేదు. ఇప్పుడు మళ్ళా నా నృత్య నికేతన్‌కు సదనమైన నా అద్దాలమేడను అమ్మివేసిన తర్వాత మళ్ళా కష్టాలకు లోనయ్యేను. ఆకలంటే ఏమిటో మళ్ళా తెలియవచ్చింది.

పేదవారికి దానం చేయడం నాకు చిన్నప్పటినుండి అలవాటే. కాని కష్టాల్లో ఉన్న కళాకారులను, ముఖ్యంగా లక్ష్మీప్రసన్నం లేని పేద కళాకారుల్ని చూస్తే నా హృదయం ద్రవించిపోతుంది. అట్టివారికి సహాయం చేయాలని నా మనస్సు ఆరాటపడుతుంది. అందుకే నేను అకాడమీలో సభ్యునిగా నుండినప్పుడు ఎందరో ఆంధ్ర కళాకారులకు సహాయం చేశాను. నైజాం నవాబుల హయాంలో, దివాణాలలో నుండిన నాట్యాచార్యులెవరైనా ఉన్నారా అని ఒకసారి వాకబు చేశాను. అప్పటివారందరూ గతించారు. కాని, ఎనభై ఏళ్ళ పండు ముసలివాడైన శ్రీ ఖాజా బక్స్ ఉన్నాడని నాకు తెలిసింది. అతడు ఉత్తమ కళాకారుడు. ఆయన్ను మా నృత్య నికేతనానికి ఒకసారి ఆహ్వానించాను. ఆయన పూర్వులు మంచి కళాకారులు. వారు లక్నోనుండి వచ్చి హైదరాబాదులో స్థిరపడ్డారు. వారు మంచి స్థితిలో ఉండేవారు కాని, ఖాజా బక్స్ ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నట్టు ఆయన మాటలవల్ల గ్రహించాను. ఆయన తడబడుతున్న కాళ్ళతో, వణుకుతున్న చేతులతో మా నృత్య నికేతన్‌లోకి వచ్చారు.

ఆయన ఆ స్థితిలో ఏం పాడగలడు అని అనుకొన్నాను. ఆయనతో కళల గురించి చర్చిస్తూండగా ఆయన ఒక ఠుమ్రీని ఆదా చేసి చూపించారు. ఆ పాటకు ఆశ్చర్యపోయాను. ఆ తర్వాత ఆయనకు ఉపకారవేతనం ఇవ్వాలని అకాడమీకి సిఫార్సు చేశాను. ''వెతికి, వెతికి ఇలాంటి

వారిని ఎలా తీసుకొని వస్తారండి?" అని అకాడమీలోని పెద్దలు కొందరు గొణుక్కొన్నారు. అయినా, ఆయన అల్ప సంఖ్యాక వర్గానికి చెందినవాడు గనుక ఆయనకు అకాడమీ ఉపకార వేతనం ఇవ్వక తప్పలేదు. ఒక సంవత్సరం గడిచింది. ఆనాడు విజయదశమి. ఆనాడు ఉదయమే మహంకాళి గుడికి వెళ్ళిన తర్వాత ఖాజాబక్ష్ మా ఇంటికి వచ్చాడు. నేను గుడిలో పూజ చేయించి వచ్చేసరికి చాలా ఆలస్యమైంది. అయినా ఆయన నా కోసం వేచియున్నాడు. నేను రాగానే ఆయన లేచి, నిలబడి సలాం చేసి, నా చేతిలో అరకిలో గులాబ్‌జామ్‌లు పెట్టాడు. "దాదా! మీ కెందుకి శ్రమ?" అన్నాను. "బాబూ! నీ దయవల్ల నేను సుఖంగా కాలక్షేపం చేస్తున్నాను. సంవత్సరానికి ఒక్కసారైనా మిమ్మల్ని కలుసుకోకపోతే ఎలా? ఖాళీ చేతులతో మీ వద్దకు ఎలా రాగలను? ఈ పేదవాని చిరుకానుక ఇది. వద్దనకండి" అన్నాడాయన. కాదనలేకపోయాను తర్వాత ఆయనకు నాకు తోచిన దక్షిణ ఇచ్చి ఒక రిక్షా చేయించి, ఇంటికి పంపించాను.

ఆ కళాకారుడు జీవించి యున్నంతకాలం మరచిపోకుండా దసరా ములాఖత్‌కు వస్తూండేవాడు.

# నృత్యనాటకంలో అంతర్నాటకం

నేను 1958 లో హైదరాబాద్‌లోని చిక్కడపల్లిలో నృత్య నికేతనం స్థాపించాను. పిల్లలకు నృత్యశిక్షణ ఇస్తూండేవాణ్ణి. ఆంధ్రదేశంలో నృత్య విద్య చాలా తక్కువగా ఉండేది. నృత్య నాటకాలు లేనే లేవు. అందువల్ల నృత్య నాటకాలు తయారుచేసి, ప్రదర్శించాలన్న కోరిక కలిగింది. వేంకటేశ్వర కల్యాణం నృత్య నాటకంగా వ్రాయించాను. ఆంధ్రదేశంలో పలు ప్రాంతాల నుండే కాక, వంగదేశం, బెంగుళూరు, మంగళూరు, మదరాసు మొదలైన ప్రాంతాలనుండి యువ కళాకారులు, వివిధ వాద్యకులు వచ్చి మా బృందంలో చేరారు. ఆడపిల్లల తల్లిదండ్రులకు నాపైన గల విశ్వాసంతో, గౌరవంతో వారు తమ పిల్లల్ని పంపారు. నా శిక్షణలో వారి పిల్లలు కళలో ఎంతో వృద్ధి చెందగలరని వారు ఆశించారు. వారు వేతనాలకోసం వచ్చిన కిరాయి కళాకారులు కారు. అందువల్ల వారిని నా కన్నపిల్లల్లాగ చూడవలసిన బాధ్యత నాకు కలిగింది. వారికి సకల సౌకర్యాలు నేను చూడక తప్పలేదు. వారికి ఏ లోటూ లేకుండా చూస్తూండేవాణ్ణి. వారికి నాట్యం నేర్పుతూ ప్రదర్శన లిప్పించేవాణ్ణి.

మా నాట్య బృందం చాలా పెద్దది గనుక మగవారికి ఒక వసతి గృహం, ఆడవారికి ఒక వసతి గృహం ప్రత్యేకంగా ఏర్పాటు చేశాను.

కళాకారులు ఆరోగ్యంగా ఉంటే తప్ప రంగస్థలం పైన రాణించరు. అందువల్ల వారికి మంచి పుష్టికరమైన ఆహారం, ఫలాహారమే పెట్టాలి అని నిశ్చయించుకొన్నాను. మా బృందంలోని సభ్యులందరు సహోదరుల్లాగ కలిసిమెలిసి ఉండేవారు. తల్లి దండ్రులకు దూరంగా ఉండేవారు గనుక వారిని నెలకొకసారైనా సినిమాకి పంపేవాణ్ణి. విదేశీ నాట్య బృందాలు వస్తే - వారి ప్రదర్శనాలకు వీరిని పంపేవాణ్ణి, అధ్యాపకులను ఏర్పాటు చేసి, వారికి తెలుగు, సంస్కృతం, ఆంగ్లం, సంగీతం నేర్పించేవాణ్ణి, అందువల్ల వారు వారిండికి వెళ్ళడానికి ఇష్టపడేవారు కారు. తల్లిదండ్రులు వచ్చి పిలిచినా వెళ్ళేవారు కారు. వారు మా సంస్థ యెడల అలాంటి ఆత్మీయతను పెంచుకొన్నారు వారి తల్లిదండ్రులు నా వద్దకు వచ్చి "మాష్టరుగారూ! మా అమ్మాయిలు మాకోసం బెంగపెట్టుకొంటారేమో అని భయం పడ్డాం కాని, మా దగ్గర కన్నా మీ దగ్గరే ఆనందంగా ఉన్నారు. పుష్టిగా ఉన్నారు. ఇంక మాకు ఏ చింతా లేదు" అనేవారు.

మా ప్రదర్శనలు ఎక్కడ జరిగినా ప్రేక్షకులు ముగ్ధులై ఆనందించేవారు. శ్రీ రాధాకృష్ణగారు మా నృత్య నాటకానికి సంగీతం కూర్చారు. ఆయన నాకెంతో తోడ్పడ్డారు. చాలా నిజాయితీ గల వ్యక్తి. ఆయన నా కష్టా సుఖాలలోపాలు పంచుకొన్నారు. నాకు కొండంత అండగా ఉండేవారు. అంతా సజావుగా సాగిపోతూండేది.

కాని, కొన్నాళ్ళ తర్వాత మా బృందంలోని ఆడపిల్లల ముఖాలలో తేజస్సు తగ్గినట్టు నాకు కనిపించింది. దీనికి కారణమేమయ్యుంటుంది అని ఆలోచించాను. ఈ మధ్య ఆడ పిల్లల వసతి గృహానికి ఒక కొత్త వార్డెన్ను నియమించాను. ఆమె నిర్వహణలో, వంటలో తేడా వచ్చిందేమోనన్న సందేహం నాకు కలిగింది. నాకు అక్కడనుండే రెండు పూటలా భోజనం వచ్చేది. ఆ భోజనంలో నాకు తేడా కన్పించ లేదు. ఒకనాడు ఆడపిల్లల్ని అందరిని పిలిచి, "మీరు తినే వంట బాగుంటోందా?" అని అడిగాను. వారు ఒకరి ముఖం ఒకరు చూసుకొన్నారే గాని ఏం మాట్లాడలేదు. ఎంత అడిగినా ఏమీ ఫిర్యాదు చేయలేదు. దీని భావమేమి తిరుమలేశా? అని ఆలోచించాను. కాని, నాకేమీ అర్థం కాలేదు. మరి కొన్ని రోజులు గడిచాయి. పిల్లల ముఖాలు ఇంకా క్షీణించాయి.

ఒక రోజు ఉదయం పిల్లలందరూ సాధనకు వచ్చారు. నేను ఏదో పనిమీద వెళ్తూ, ఆకస్మికంగా ఆడపిల్లల వసతి గృహంలోకి వెళ్ళాను.

పిల్లలందరూ ఆరోగ్యంగా ఉండాలని మంచి గేదె పాలు 10 లీటర్లు ఆ వసతి గృహానికి రోజూ పోయించేవాణ్ణి. నేను వసతి గృహంలోకి వెళ్ళేసరికి వార్డెన్‌గారు వంటింట్లో మఠం వేసుకొని కూర్చొని, పాలమీదనున్న మీగడను దేవు కొని, ఇడ్లీలమీద వేసుకొని, హాయిగా ఆరగిస్తున్నారు. సాధారణంగా ఎవరూ ఆ వసతి గృహానికి వెళ్ళని సమయ మది. నేను చాటుగా నిలబడి ఈ దృశ్యమంతా చూశాను. తర్వాత ఆమె నన్ను చూసి కంగారుపడింది. బిక్క చచ్చి పోయింది. ''బాబుగారూ! రెండు రోజుల్నుండి జ్వరంతో బాధపడుతున్నాను. నోరంతా చెడిపోయింది. అందుకని కాస్త మీగడ వేసుకొని రెండు ఇడ్లీలు తింటున్నాను" అంది. ఆమె మాట్లాడుతూండగా పాలగిన్నెవైపు చూశాను. పాల మీద మీగడంతా మాయమయినట్టు గ్రహించాను. "పిల్లల ఆరోగ్యం కాస్త చూస్తూండండి'' అని ఆమెను హెచ్చరించాను. "ఏమి పిల్లలో ఏమిటో! వారిండ్లలో వారు సున్నితంగా పెరిగినట్టున్నారు. నాజూకు తిండి తింటారు. కష్టపడ లేరు'' అంది. నేను మాట మార్చి వసతిగృహంలోని సౌకర్యాల గురించి మాట్లాడి వచ్చాను.

మరి రెండు రోజుల తర్వాత ఒకనాటి ఉదయం ఆడపిల్లలకు ''ఆలమందల మేపి అలసిపోతివేమో, పాలు, మీగడ, జున్ను, పాయసాన్నము ఇవిగో॥ నిగనిగలాడే నీ నీలపుకాంతి, నాకు జూపి పోరా నవమోహనాకారా॥'' అనే పాటకు అభినయం నేర్పుతున్నాను. వారిలో ఎవరి ముఖం కూడా వికసించలేదు. ''అదేమిటి, అలా అలసిపోయినట్టు ముఖాలు పెట్టారు?'' అన్నాను.

నేను రెండు రోజులక్రితం వారి వసతి గృహానికి వెళ్ళిన సంగతి వారు తెలుసుకొన్నట్టున్నారు. వారికి ఇప్పుడు మంచి అవకాశం దొరికింది, అసలు విషయం బయట పెట్ట డానికి. వారందరిలో అన్నపూర్ణ (స్వర్ణలత) చురుకైన పిల్ల. ఆమె వెంటనే, "ఆడి ఆడి మేము అలసిపోతిమి గాని, పాలు మీగడ జున్ను వరుల పాలయ్యెగా! మరి మే మెట్లు నిగనిగ లాడగలము?" అంటూ అభినయించింది. అందరం నవ్వు కొన్నాం. ఆనాటినుండి ఆమెను ఆ వసతి గృహానికి పెద్దగా చేశాను. మరి రెండు రోజుల తర్వాత ఆ వార్డెను నా వద్దకు వచ్చి, ''బాబోయ్! ఏమో అనుకొన్నాను. వీళ్ళు పిల్లలు కారు, బ్రహ్మ రాక్షసులు! నేనింక ఒక్క క్షణం ఇక్కడ ఉండను. ఇవిగో తాళాలు" అంటూ కొట్టు గది తాళాలు నా కిచ్చి వెళ్ళిపోయింది.

అన్నపూర్ణ ఎప్పుడూ నవ్వుతూ ఉండేది. కోప్పడినా నవ్వేది. కాని, జీవరత్నమ్మగారు చనిపోయినప్పుడు మాత్రం బాగా ఏడ్చింది. అందర్నీ ఏడ్పించింది. సునంద అనే అమ్మాయి అందరినీ అమ్మలాగ ఆదరించేది. అప్పుడు, ఇప్పుడు ఆమె అంతే.



# కిన్నెరసాని

కిన్నెరసాని - ఇది ముద్దులు మూటగట్టే ముచ్చటైన పేరు.

గంధర్వులు, యక్షులు, కిన్నెరలు, కింపురుషులు, సిద్ధులు మొదలైనవారు, చరిత్ర కందని రోజుల్లో ఎప్పుడో హిమాలయాలవద్ద, అస్తమిస్తున్న సూర్యుని బంగారు కిరణాల కాంతిలో హిమాలయ పర్వతశ్రేణులు వింత కాంతులతో మెరిసిపోతూంటే ఆ నటరాజు ప్రకృతి శోభకు పులకించి పోయి, ఆనందంతో సంధ్యాతాండవం చేస్తూండగా తిలకించు సమయాన ఆ దివ్య నాట్యానికి బ్రహ్మ తాళం, విష్ణువు మృదంగం, ఇంద్రుడు మురళి, సరస్వతి వీణ వాయించగా, నారద తుంబురులు లక్ష్మీదేవితో కలిసి పాడగా, రత్న ఖచిత సింహాసనం మీద ఆశీనయై అంబ తిలకించిన సమయాన ఒక కిన్నెర తన్మయత్వంతో మైమరచి ఆ దివ్యగానంలో తన కంఠం చేర్చి, పాడి, ఆడి మధురానుభూతిని పొంది కరిగి సెలయేరై పారినట్లు—

వర్షాకాలంలో పర్వతశ్రేణులనుండి కిందకు దూకుతూ, ఉరుకుతూ, శ్రుతి మెత్తని ధ్వనులు పలికిస్తూ, తీయగా పాడుతూ కిన్నెరసాని పరుగులెత్తుతూంటే ఏ తెలుగు కవి చెవిసోకదు ఆ మధురగానం! ఆ కిన్నెరసాని ఒక చిన్న నదిగా అవతారమెత్తి, వర్ష ఋతువులో ఆ పర్వత ప్రాంతంలో ప్రవహిస్తూంటే వేయి కిన్నెరలు మోగుతున్నట్టే ఉంటుంది - వేయి కంఠాలు శ్రుతిపక్వంగా మధురంగా గానాలాపం చేస్తున్న దివ్యానుభూతి ఎవరికైనా కలుగుతుంది.

అందుకే మరువలేని అత్యంత మధురమైన "కిన్నెరసాని" అనే ఖండకావ్యాన్ని మన విశ్వనాథవారు రచించారు.

"దణ దంగిడాం దదోం కిణకిణ్ణాం కిన్నె
రటు మ్రోగి ఇటు మ్రోగి,మృదుల తాండవము జేసి"

అని ఆయన అన్నారు.

కిన్నెరసాని నది చిన్నదే. కిన్నెరసాని ఖండకావ్యం చిన్నదే. కాని, కవి హృదయం కిన్నెరలా ఎంతో చక్కగా ఆ కవితలో ధ్వనించింది. ఈ ఖండకావ్యాన్ని నేను ఎన్నో సార్లు చదివాను.

ఈ కవితకు ఒక నృత్యం రూపొందించాలని నిశ్చయించుకొన్నాను. నాగపూరును శాశ్వతంగా విడిచి వచ్చాక విశాఖలో ఉండగా ఒకసారి విశ్వనాథవారిని కలుసుకొనే అవకాశం దొరికింది. అప్పుడు ఆయనకు నా కోరిక చెప్పాను. వారు సంతోషంగా అంగీకరించారు.

విశాఖలోనే ఒక కార్యక్రమం ఏర్పాటు చేశాను. ఆ కార్యక్రమంలో 'కిన్నెరసాని'తోపాటు, 'ఎంకి-నాయుడు బావ'', మరికొన్ని కొత్త పాటలకు వద్దాది వారి ఆడపడుచులు కుమారి సుమతి, కుమారి ఉమ నాట్యం చేశారు.

'కిన్నెరసాని'లోని ప్రతి పాటలోని ప్రతి చరణం తర్వాత వాద్య సంగీతం సమకూర్చి, వారిచేత ఆడించాను. కిన్నెరసానిగా కుమారి సుమతి, గోదావరి తల్లిగా కుమారి ఉమ నటించారు. ఆనాటి కిన్నెరసాని ప్రదర్శన ఒక కొత్త తరహా నృత్యరూపకం. దాన్ని అర్థం చేసుకొన్నవారు 'అద్భుతం' అన్నారు, 'నూతన కళా సృష్టి' అన్నారు. అర్థం కాని వారు నృత్త, నృత్యాలు చూసి ఆనందించారు. కాని, ఆ రోజు ప్రదర్శనను విశ్వనాథవారు చూసే అదృష్టం నాకు లేకపోయింది.

''ఎంకి-నాయుడు బావ'' నృత్యరూపకం కూడా బాగా కుదిరింది. ఎంకిగా కుమారి మోహన, నాయుడు బావగా కుముదవల్లి రాజాల చిన్నవాడు బాగా నటించారు. ప్రేక్షకులు ఆనందించారు. నండూరి ఎంకి పాటలో కొన్ని పాత, కొత్త పాటలకు నేను నృత్యం కూర్చాను. జానపదుల హృదయాలను ప్రతిబింబించేవి పాత పాటలు. కొత్తపాటలు భావ గీతాలుగా ఉండడంవల్ల పాత పాటలు ఆకర్షించినంతగా కొత్త పాటలు ప్రేక్షకుల్ని ఆకర్షించలేదు. ప్రేక్షకులు పాత జానపద గీతాల్నే మెచ్చుకొన్నారు.

ఆ కార్యక్రమానికి ఎంకి పాటల రచయిత శ్రీ నండూరి సుబ్బారావుగారు ప్రత్యేకంగా వచ్చారు. వారు "ఎంకి - నాయుడుబావ" నృత్యరూపకం చూసి, తన్మయులై గబగబా రంగస్థలం మీదకు వచ్చి మైకు అందుకొని, "గుండె గొంతుకలోన కొట్లాడుతాది" అని పాడడం మొదలు పెట్టారు.

పై రెండు నృత్యరూపకాలలోను స్త్రీ పాత్రలకే ప్రాముఖ్యం ఎక్కువగా చేకూరింది.

ఈ రెండు నృత్యరూపకాలకు ముందు "ఎల్లోరా స్వప్నం" ప్రదర్శించాం. ఇందులో శివుని పాత్రకు ప్రాముఖ్యం ఎక్కువ. భక్తులు పాడిన స్తోత్రాలకు శిలారూపంలో ఉండిన శివుడు ద్రవించి, వచ్చి, తాండవ మాడేడు. ఈ పాత్ర ధరించిన రాజన్ రాజా ఏక దాటిగా సుమారు నూరు భ్రమరాలు ప్రదర్శించాడు. సభికులను సంభ్రమాశ్చర్యాలలో అతడు ముంచి, తేల్చాడు. ఇటువంటి ప్రదర్శనను చూడడం విశాఖ ప్రేక్షకులకు తొలిసారి. అందరూ ఆనందించి, నన్ను అభినందించారు. ఆనాటి ప్రదర్శనలను ప్రసిద్ధ దేశభక్తులు శ్రీ మూర్తిరాజుగారు చూచారు, సంతసించారు. మూర్తి రాజుగారు రాజన్ రాజాను సినిమాల్లో నటించమని ప్రోత్సహించారు. అది ఆంధ్రుల నాట్యకళకు దురదృష్టం. రాజన్ రాజా మరి రెండేళ్ళు నా వద్ద విద్య నేర్చుకొని యుంటే గోపీకృష్ణను మించిపోయేవాడు.

# వింత ఆచారాలు

## 1. కులతప్పు

అర్ధ శతాబ్ది క్రితం కొన్ని కులాలలో ఒక వింత ఆచార ముండేది. ఒక సంసార స్త్రీ ఏదైనా ఒక పొరపాటు చేస్తే, ఆమె కుటుంబాన్ని కులం నుండి వెలివేసేవారు కులతప్పు (జుల్మానా) చెల్లిస్తే మళ్ళా కులంలో చేర్చుకొనేవారు.

ఆ కుల పెద్ద ఒక సభను ఏర్పాటు చేసి, ఆ కులం వారందరిని సభకు పిలిపించేవాడు. తప్పు చేసిన ఆ స్త్రీని సభకు రప్పించేవాడు. ఆమె వారి ముందు తన తప్పును అంగీకరించేది. ఒక సురాభాండం చుట్టూ ఆ కుల పెద్దలు కూర్చొనేవారు. సభ ప్రారంభమయ్యేది. ఆ స్త్రీ చేసిన నేరాన్ని ఆ కుల పెద్ద ఆ సభికులకు వివరించేవాడు. ఆమె చేత ఆమె చేసిన తప్పును అతడు ఒప్పించేవాడు. సభికులు తీర్పు చెప్పేవారు. శిక్షగా కొంత జుల్మానా విధించేవారు ఆమె ఆ రుసుమును చెల్లించాక ఆమెను మళ్ళా తమ కులంలో చేర్చుకొన్నట్టువారు ప్రకటించేవారు. అప్పుడు ఆమె ఆ భాండంలోని సురను చిన్న చిన్న పిడతలలో పోసి, మోహిని దేవతలకు అమృతం పంచి యిచ్చినట్టుగా, యిచ్చేది. అందరూ సురాపానం చేసిన తర్వాత ఆమె తప్పు రద్దు అయ్యేది.

## 2. పెళ్ళి పిలుపు

వివాహాలకు ఈ రోజుల్లోలాగ వింత వింత పద్ధతుల్లో శుభలేఖలు అచ్చువేసినా ఆ రోజుల్లో అనగా అర్ధ శతాబ్ది క్రిందట పెళ్ళివారు ముఖ్యమైన వారి ఇంటికి ప్రత్యేకంగా వెళ్ళి, ఆ యింటి పెద్ద సమక్షంలో ఆ శుభలేఖను చదివి వినిపించి, ఆ తర్వాత ఆ యింటి వారందరిని పేరు పేరున పెళ్ళికి ఆహ్వానించాలి. పొరపాటున ఏ యొక్కరి పేరునైనా మరచిపోతే ఆ యింటివారు ఆ పెళ్ళికి వెళ్ళేవారు కారు.

## 3. మగపెళ్ళివారిని ఆహ్వానించడం

మగ పెళ్ళివారికి ప్రత్యేకంగా ఒక విడిదిని ఆడపెళ్ళివారు ఏర్పాటు చేసేవారు. ఉదయం కాఫీ, ఫలహారాలు మొదలుకొని రాత్రి భోజనాలవరకు ప్రతిసారి ఆడపెళ్ళివారి పెద్దలు బాజాభజంత్రీలతో విడిదికి వెళ్ళి కాఫీ,ఫలహారాలకు,

భోజనాలకు రమ్మనమని మగపెళ్ళివారికి బొట్టుపెట్టి, తాంబూలమిచ్చి పిలిచేవారు. అప్పుడుగాని మగపెళ్ళివారు కదిలేవారు కారు.

మరొక వింత ఆచారం. విందు భోజనానికి అన్ని పదార్థాలను విస్తట్లో వడ్డించి, నెయ్యి అభికరించిన తర్వాత ఇంక తినడం ప్రారంభించే ముందు పంక్తిలోనివాడు ఎవడో ఒకడు ఏదో ఒక నెపంతో ఒక తగవు తెచ్చేవాడు. అందుకు అధ పెళ్ళివారి పెద్ద క్షమాపణ చెప్పుకొనేవరకు ఎవరూ భోంచేసేవారుకారు. ఒక్కొక్కప్పుడు ఆ తగువు ముదిరి పెళ్ళివారు భోంచేయకుండా వెళ్ళిపోయేవారు. ఆ వడ్డించిన విస్తళ్ళు పెంటకుప్పపాలయ్యేవి.

## 4. గుడిలో దీపం ఆర్పడం

పూర్వం ప్రతి తగువుకు న్యాయస్థానానికి వెళ్ళేవారు కారు. ఎవరికైనా ఏదైనా అన్యాయం జరిగితే, అతడు ఆ యూరిపెద్ద వద్దకు వెళ్ళి చెప్పుకొనేవాడు. ఆ యూరి పెద్ద ఆ కక్షిదారు లిద్దరిని పిలిచి, ఇద్దరి వాదనలు విని, తీర్పు చెప్పేవాడు. మాటవరుసకి ఒక చిన్న తగువు. ఒకడు ఇంకొకడికి కొంత అప్పు యిచ్చేడు. అతడు ఎప్పటికీ ఆ అప్పు తీర్చడం లేదు. అప్పు ఇచ్చినవాడు గ్రామ పెద్దకు ఫిర్యాదు చేశాడు. అప్పు పుచ్చుకున్నవాడు ఆ అప్పు ఎప్పుడో తీర్చివేశానన్నాడు. ఇందుకు సరైన సాక్ష్యాలు లేవు. మరి తీర్పు చెప్పడం ఎలా?

ఆ ఊరిలోని పెద్దల నందరిని ఆ ఊరి పెద్ద ఆ ఊరిలోని హనుమంతుని గుడికి ఆహ్వానించేవాడు. గుడిలో దేవుని ముందు ఒక దీపం పెట్టేవాడు. వారు చెప్పింది నిజమని చెప్పి ఆ దీపాన్ని ఆర్పమని ఆ కక్షిదారుల్ని ఆ గ్రామ పెద్ద ఆదేశించేవాడు. అబద్ధం చెప్పి, దేవుని ముందు దీపం ఆర్పే ధైర్యం సాధారణంగా ఎవరికీ ఉండేది కాదు. దీంతో నిజం బయటపడేది.

## 5. 'మారుమనువు'

కొన్ని కులాలలో పూర్వం విధవరాళ్ళు మారుమనువు చేసికొనేవారు. దీన్నే పూర్వం "చీర-రవికె" అనేవారు. ఈ పునర్వివాహాన్ని ఆ కుల పెద్దలు కూడ ఆమోదించేవారు.

## 6. ఉండిలు

ఇదొక వింత విషయం. అనాదినుండి భారతదేశం కులాల వారీగా విడిపోయింది. ఇది దేశ ఐక్యమత్యానికి ఎంత అపకారం చేసిందో మనందరికీ తెలిసిన విషయమే. ప్రతి కులం మళ్ళీ చిన్న చిన్న శాఖలుగా విడిపోయింది. అలాంటి శాఖల్ని 'ఉండి' అనేవారు. ప్రతి ఉండికి ఒక కులపెద్ద ఉండేవాడు. సాధారణంగా ఈ గౌరవం ఆ ఉండిలోని ధనవంతుడికి లభించేది. లేకపోతే, వారిలో బాగా చదువుకొన్నవాడికి లభించేది. ఆ ఉండిలోని వారిమధ్య ఏవైనా తగవులు వస్తే ఈ కులపెద్ద వారందరిని సమావేశపరచి ఆ తగవులను పరిష్కరించేవాడు.

ఒక ఉండివారు మరొక ఉండివారిని వివాహాది శుభకార్యాలకొక్కడ భోజనాలకు ఆహ్వానించేవారుకారు. కార్తీక మాస వనభోజనాలకొక్కడ ఒకరినొకరు పిలుచుకొనేవారు కారు.

ఒక ఉండిలోని వారు వేరొక ఉండిలో చేరదలుచుకొంటే ఆయా కులపెద్దలతో సంప్రదించి, వారి అనుమతితో మారేవారు. ఇలాంటి ఆచారాలు ఆనాడు సామాన్యమైనవే అయినా వింతగా ఉండేవి.

## 7. అంటు

పూర్వం ఉత్తర భారతదేశ రాజ దివాణాలలో ఒక వింత ఆచారముండేది. సంవత్సరం పొడుగునా 365 రోజులు ఈ రాజ దివాణంలో ఏదో ఒక ఉత్సవం జరిగేది. ప్రతిరోజు ఎవరో ఒకరు అతిథిగా వచ్చేవారు. వారికి విందు భోజనాలు ఏర్పాటయ్యేవి. అందువల్ల రసోయిఘర్‌లోనుండి నేతి ఘుమ ఘుమలు వస్తూండేవి. ఉత్తర భారతదేశం గనుక పూరీలు తప్పనిసరి.

పూరీలపిండి కలపడం నాయీబ్రాహ్మల పని. అందువల్ల వారు ఉదయమే లేచి, స్నానం చేసి, చలువచేసిన ఇస్త్రీ బట్టలు కట్టుకొని, గోధుమపిండిని పిసికి, మర్దించి, చిన్న చిన్న ఉండలుగా చేసేవారు తర్వాత గుండ్రంగా పూరీలు వత్తేవారు. ఆ వత్తిన పచ్చిపూరీలను వంటబ్రాహ్మలు నేతిలో వేయించేవారు. పచ్చిపూరీలను బ్రాహ్మణులకు నాయీ

బ్రాహ్మలు యిచ్చేవరకు ఆహారం అడు ఉండేదికాదు కాని, ఆ నాయీ బ్రాహ్మలు వాటిని వేయించకూడదు, వేయించిన వాటిని తాకకూడదు. వాటిని ఎవరు ముట్టుకొంటే "అంటు!" ఇదేమిటో నాకు అర్థమయ్యేది కాదు.

## 8. విందు భోజనంలో వింతలు

రాజస్థాన్‌లోని కొందరి ఇళ్ళలో విందులు వింతగా ఉండేవి. ఏ పదార్థంలో గూడ ఉప్పు వేయకుండా వండేవారు. ఏ పంక్తి భోజనంలో వడ్డన ముగిసిన తర్వాత చివరకు 'రుక్మిణి'ని వడ్డించేవారు. ఆ రుక్మిణిని - అంటే ఉప్పును అన్ని పదార్థాలలో కలుపుకొన్న తర్వాత ఒకరిని ఒకరు తాకకుండా భోంచేసేవారు.

నాగపూర్‌లో ఉండగా నా మిత్రుని తమ్ముని పెళ్ళికి వెళ్ళాను. వారు జమీందార్లు, కోటీశ్వర్లు. వారు జయస్వాల్లు. వారి సహపంక్తిని నేను భోజనానికి కూర్చున్నాను. వడ్డన పూర్తయింది. ఇంక నెయ్యి వడ్డిస్తే భోజనం ప్రారంభించవచ్చును. ఇంతలో వడ్డన చేసే బ్రాహ్మణుడు ఒక మండుతున్న నిప్పును తీసికొని వచ్చి, పంక్తి మొదట్లో ఉంచి, దాని పైన నెయ్యి వేశాడు. అది మండి, పొగ వచ్చింది. అప్పుడు ఆ జయస్వాల్ కుటుంబికులందరు ఒక స్తోత్రం చదివారు. బహుశా అగ్నిదేవుని ప్రార్థించి ఉంటారు. ఆ తర్వాత నెయ్యి వడ్డన జరిగింది. అందరం భోజనాలు ప్రారంభించాం.

మహారాష్ట్రులు చాలా ఆధునిక దృక్పథం కలవారు. పెళ్ళి అవగానే పెళ్ళికొడుకు మగవారి పంక్తిలో భోజనానికి కూర్చుంటే, పెళ్ళికూతురు వారందరికీ వడ్డించేది.

## 9. కున్బీలు

మహారాష్ట్ర దేశంలో కున్బీలు, మరాఠాలు అనే రెండు ప్రధాన తెగలవారున్నారు. వీరు బ్రాహ్మణులు కారు. ఛత్రపతి శివాజీ తెగకు చెందినవారు మరాఠాలు. వ్యవసాయదారులైన మన కాపులు, బలిజలు మొదలైనవారివంటివారు కున్బీలు. వీరిలో కూడ కొన్ని శాఖలు ఉన్నాయి.

మహారాష్ట్ర బ్రాహ్మణ స్త్రీలు తలపైని ముసుగు వేసుకోరు. ఇతర కులాలవారు ముసుగు వేసుకొనేవారు. 9 లేక 10 గజాల చీరలను వీరు కాసెబోసి బహు రమణీయంగా కట్టుకొంటారు. పండుగ దినాల్లో వీరు ముక్కుకు ముత్యాల నత్తు, మెడలో ముత్యాల ఆభరణాలు ధరించి, పళ్ళాలు, పూలసజ్జలను చేతులతో పట్టుకొని దేవాలయాలకు వెళ్తూంటే చూడ ముచ్చటగా ఉండేది. అయితే, నేడు వీరిలో కొందరు ఆంధ్ర వనితల్లాగ ఆరు గజాల చీరలను నాయుడు గూడకట్టు కట్టుకొంటున్నారు. కాని, పల్లెవాసులు మాత్రం పూర్వంలాగే 9, 10 గజాల చీరలను కట్టుకొంటున్నారు.

ఈ మరాఠాలు, కున్బీల మధ్య పూర్వం భేదాభిప్రాయా లుండేవి.

శివాజీ తెగవారయిన మరాఠాలు తాము క్షత్రియులమని చెప్పుకొంటే, అసలు శివాజీ క్షత్రియుడే కాదని, ఆతడు సింహాసనం అధిష్ఠించినప్పుడే కొందరు అభ్యంతరం చెప్పారని కున్బీలు వాదించేవారు. కాశీ నుండి పెద్ద పండితులు వచ్చి, శివాజీ క్షత్రియుడని తేల్చి చెప్పారని మరాఠాలు వాదించేవారు.

కున్బీలలో ధనవంతులు, విద్యావంతులు మరాఠాలుగా పరిగణించబడ్డారని కొందరంటారు.

ఈ విషయం తేల్చుకొనడానికి ఒకసారి నాగపూర్‌లో సమావేశం జరిగింది. అదేమిటో చూడాలని మేము కొందరు మిత్రులం కలిసి వెళ్ళాము. పొద్దున ప్రారంభమైన సభ సాయంత్రం వరకు వాదోపవాదాలతో కొనసాగుతూనే ఉంది. మరాఠీ భాష యుద్ధ ఘోషలా ఉంటుంది. ఇంక చూడండి- ఆ రోజున ఇరుపక్షాలవారు వీరావేశాలతో ఊగిపోతూ వాదించుకొంటుంటే అదొక రణరంగంలా నాకు దోచింది. ఒకరు ఝాన్సీరాణిని ఉదాహరిస్తే, వేరొకరు అహల్యాబాయిని ఉదహరించారు. ఈ విధంగా మహారాష్ట్ర దేశ చరిత్రను వారు తిరుగతోడేరు. ఇంక మేం వినిగిపోయి అక్కడినుండి వెళ్ళిపోయాం. వారందరూ ఒకటయ్యారో, చీలిపోయారో నాకు తెలియదు.

# అనేకత్వంలో ఏకత్వం

రాజస్థాన్‌లోని కోట ప్రాంతంనుండి రసపుత్రులు కొందరు కాకతీయుల కాలంలో ఆంధ్రదేశానికి వచ్చి, రాజ్యాలు స్థాపించారు.

రాజరాజనరేంద్రుని కాలంలో తమిళనాడు నుండి కొందరు ద్రవిడ బ్రాహ్మణులు వచ్చి, సాగరసీమలో స్థిరపడి వేదం, వైద్య, భరత శాస్త్రాలను ప్రచారం చేశారు.

మహారాష్ట్ర రాజుల కాలంలో ఆరె మరాటీలు చాలా మంది ఆంధ్రదేశం వచ్చి స్థిరపడి, వివిధ వృత్తులు చేపట్టారు. వీరిలో కొందరు బొమ్మల ప్రదర్శనలు, కొందరు నాటకాలు ప్రదర్శించి సురభివారుగా ప్రసిద్ధి గాంచారు. ఆంధ్రలోని కటికవారుగూడ వీరే.

ఆంధ్రదేశంలోని బొందిలీలు బుందేల్‌ఖండ్ నుండి వచ్చినవారు.

వీరందరూ ఆంధ్రులలో కలిసిపోయి, కొన్ని శతాబ్దులుగా సహ జీవనం సాగిస్తూన్నా వారు వారి సంస్కృతీ సంప్రదాయాలను నేటికీ కాపాడుకొంటున్నారు.

వీరే కాక గోండులు, రాజగోండులు, లంబాడీలు ఆంధ్రులలో కలిసిపోయారు. ఆంధ్ర దేశంలోని కొండ ప్రాంతాలలో కోయలు, గదబలు, సవరలు నివసిస్తూ వారి వారి సంస్కృతిని కాపాడుకొంటున్నారు.

ఇన్ని సంస్కృతుల సమ్మేళనమే ఆంధ్ర సంస్కృతి. ఈ సువిశాలమైన ఆంధ్ర సంస్కృతి హైందవ సంస్కృతికి ఒక ప్రతిరూపం.

ప్రాంతాలు వేరైనా, భాషలు వేరైనా, సాంఘికాచారాలలో భేదాలున్నా అందరూ హిందువులే గనుక ఒక తెగవారు వేరొక తెగవారితో కలిసి ఏక కుటుంబంగా సహజీవనం సాగిస్తున్నారు

అల్లా ఉద్దీన్ దండయాత్రతో మహమ్మదీయులు ఆంధ్రదేశంలో అడుగుపెట్టారు. గోలకొండ పాదుషాల కాలంలో వీరు ఆంధ్రులతో కలిసిపోయారు. తెలుగువారి సంస్కృతిని వీరు అర్థం చేసుకొని గౌరవించారు.

ఈ విధంగా రూపొందిన తెలుగువారి హృదయ కాసాన్ని మనం చక్కగా అధ్యయనం చేస్తే, భరతశాస్త్రం విలోని చిత్రాభినయం మనకు గుర్తుకువస్తుంది విషయం ఒకటే అయినా అది అనేక రీతుల్లో, అనేక వర్ణనలతో, అనేక భావాలతో ఎలా శోభిస్తూ వచ్చిందో అలాగే మన లలిత కళలు - సంగీతం, కవిత్వం, చిత్రలేఖనం, శిల్పం, మొదలైనవి - పలు విధాలుగా శోభిస్తున్నాయి.

గిరిజనులు మొదలుకొని జానపదులు, పట్నవాసుల వరకు అందరూ వారి భావాలను వారి ప్రాంతాలననుసరించి రూపొందించుకొన్నందున వాటిలో వైవిధ్యం ఉంది గాని, వైరుధ్యం లేదు. అందువల్ల ఆంధ్ర సాంస్కృతిక చరిత్రను తెలుసుకొనాలంటే ఈ యంశాల నన్నిందిని పరిశీలించవలసి యుంటుంది. ఎన్నో ఆచార వ్యవహారాలు ఆంధ్రుల సంస్కృతిలో జీర్ణించుకొని పోవడం వల్ల ఆంధ్రులకు విశాల దృక్పథం ఏర్పడింది. ఎందరో రాజులు, రాజవంశీయులు అవలంబించిన మతాలు, ఆదరించిన కళారీతులు, వారి పోషణ పద్ధతులు, వారి ఆర్థిక విధానాలు, వారి ప్రజల జీవిత విధానాలు మొదలైన అనేక విషయాలను పరిశోధకులు పరిశీలించవలసి ఉంటుంది.

పై వాటి అన్నింటి సమ్మేళనమే ఆంధ్రుల సంస్కృతి.



# సాగరసీమ కళావేత్తలు

**రంజకం కుప్పాయి :** శ్రీకృష్ణదేవరాయల వారి ఆస్థాన నర్తకీమణి. ఈమె తండ్రి విద్వత్ప్రభారాయ రంజకం శ్రీరంగరాజు. రాయలు వారి కొలువులోని అల్లసాని పెద్దన్న, తెనాలి రామకృష్ణుడు మొదలైన అష్టదిగ్గజాలు, ఇతర కవులు, పండితులు, తాతాచార్యులు వంటి మేధావులు సభలో ఉండగా కుప్పాయి నాట్యమాడి ఆస్థాన నర్తకి అన్న పదవిని అలంకరించింది. ఆమె గొప్ప నాట్య విద్వాంసురాలు కనుకనే 'రంజకం' అన్న బిరుదు పొందింది.

**ముద్దు చంద్రరేఖ:** నాట్యకేళిక చేయడానికి రఘునాథ నాయకుని దర్బారుకు తన ఇంటినుండి ముత్యాల పల్లకిలో పగటి దివిటీలవారు, బిరుదు పొగడరుల వారు స్తోత్రం చేస్తూ వెంటరాగా వెళ్ళేది.

**రామభద్రాంబ :** రఘునాథునితో సమానంగా ఏనుగు నెక్కి రాజవీధిలో వ్యాహ్యాళికి వెళ్ళిన ఆస్థాన కవయిత్రి. ఈమె సంస్కృతాంధ్రభాషల్లో సమానంగా కవిత్వం చెప్పిన గొప్ప విద్వాంసురాలు.

**మధురవాణి :** గంటకు నూరు పద్యాల చొప్పున వ్రాసిన మహాకవయిత్రి. ఎంతటి సరస్వతీ ప్రసన్నురాలో గదా! అందుకే రఘునాథుని ఆస్థానాన్ని అలంకరించింది.

**రంగరాజమ్మ :** అష్ట భాషల్లో కవిత్వం చెప్పిన అష్ట భాషా ప్రవీణ. సిందు కొలువులో విజయరామవుని చేత స్వర్ణాభిషేక గౌరవం పొందిన గొప్ప ప్రతిభావంతురాలు.

**కాశీ కమలాక్షి :** ఈ శతాబ్ది ప్రారంభంలో సర్వాలంకార భూషితయై, బోయీలు పల్లకిని మోయగా శోభాయమానంగా కలాప కచ్చేరీలకు వెళ్ళిన గొప్ప కళాకారిణి.

**పెండేల సత్యభామ :** తన పాండిత్య ప్రతిభకు, తన కలాప విద్యకు జోడు తాంబూలాల సత్కారాన్ని పండిత సభల్లో పొంది విదుషీమణి.



శ్రీమతి చాటపర్రు బాలాత్రిపురసుందరి

**శ్రీమతి చాటపర్రు సుందరి :** సుందరి, బాలా త్రిపుర సుందరి. ఈమెకు సాటి ఎవరూ లేరు. పేరులోనే కాదు రూపు రేఖల్లో గూడ కడు సుందరి. అర్ధ శతాబ్ది క్రితం ఇంత సుందరి యైన నాట్య కళాకారిణి ఆంధ్రదేశంలో లేదు. ఈమె గొప్ప అభినయ కళావేత్త. బరంపురం మొదలుకొని మదరాసు వరకు ఇంత అభినయ కళాకారిణి లేదన్న కీర్తి ఈమె పొందింది. ఈమె స్వస్థలం ఏలూరు. ఏలూరు జమీందారులకు దీటుగా ఆ జమీందారులకు నాలుగు బురుజుల కోట ఉండే ఈమె రెండు బురుజుల మేడ కట్టించింది. నేడు కూడా ఈ మేడను చూడవచ్చు. ఆనాటి స్వర్ణాభరణాలకు, అలంకరణకు ప్రతీక ఈ ఛాయా చిత్రం.



శ్రీమతి కందికట్టు మాణిక్యం



శ్రీమతి బండి శ్రీరాజితం (ఏలూరు)

శ్రీమతి కందికట్టు మాణిక్యం : కళాకారుల్లో మాణిక్యం. ఎంతటి విద్వాంసురాలో అంతటి సౌమ్యురాలు. తా నెరిగినదే సంపూర్ణ విద్య అన్న భావన లేకుండా ఇతర గురువులవద్దకు, ఇతర సంప్రదాయాలను నేర్చుకొనడానికి తన శిష్యురాండ్రను పంపిన విశాల హృదయురాలు. శ్రీమతులు పువ్వుల లక్ష్మీకాంతం, వాల్మీకి చూడామణి ఈమె శిష్యురాండ్రలలో ముఖ్యులు. శ్రీమతి పువ్వుల లక్ష్మీకాంతం సజీవులు. గుంటూరులో ఒకసారి జరిగిన కళావేత్తల పోటీలలో మహా విద్యావేత్తల, కళారాధకుల సమక్షంలో "దానికే తగు జాణర, నీవు దయయుంచర ఈ వేళ" అనే తోడి వర్ణాన్ని అభినయించి స్వర్ణపతాకాన్ని బహుమానంగా పొందిన గొప్ప కళాకారిణి శ్రీమతి కందికట్టు మాణిక్యం. ఆ కాలంలో అవార్డు లంటూ ఉండియుండే ఈమె ఎన్ని అవార్డులు పొంది యుండేదో చెప్పలేను.

శ్రీమతి బండి శ్రీరాజితం : శాంత స్వరూపిణి, నిగర్వి. విద్యకు తగ్గ వినయ సంపన్నురాలు. అర్ధ శతాబ్ది క్రితం ఏలూరులో నుండిన నలుగురు గొప్ప నాట్య విద్వాంసురాండ్రలలో ఈమె ఒకరు. ఈమె విద్య, వినయ సంపదల గురించి ఈమె మనుమడు శ్రీ కాంతశ్రీ నాకెంతో చెప్పారు.

శ్రీమతి చదలవాడ సామ్రాజ్యం : ఏలూరుకు చెందిన ఒక గొప్ప నాట్యకళాకారిణి. ఈమె విద్య గురించి శ్రీమతి చెన్నగంటమ్మ గారి ద్వారా విని, వీరిని కలుసుకోవాలని చాలా కష్టపడ్డాను. ఒక సంవత్సరం ప్రయత్నించి కలుసుకొన్నాను. ఆమె తన విద్య గురించి ఎన్నో విషయాలు నాకు చెప్పారు. కాని, ఆమె ఛాయాచిత్రం నాకు లభించలేదు.

శ్రీమతి పువ్వుల లక్ష్మీకాంతమ్మ : బహుముఖ ప్రజ్ఞాశాలి. నాట్యంతో ఈమె జీవితం ప్రారంభమైంది. శ్రీమతి కందికట్టు మాణిక్యంగారి ప్రియ శిష్యురాలిగా ఎన్నో నృత్య ప్రదర్శనలు ఈమె ఇచ్చింది. ప్రసిద్ధ కళాకారిణిగా పేరు తెచ్చుకొంటున్న రోజుల్లో కళావంతుల సంస్కరణోద్యమం, దేవదాసీ చట్టం వచ్చాయి. అందువల్ల ఈమె నృత్యంనుండి విరమించుకోవలసి వచ్చింది. కాని, కళా పిపాస ఈమెను వదలలేదు. అందువల్ల ఈమె నాటక రంగంలో ప్రవేశించి కొన్ని వేల నాటకాలలో పాల్గొన్నారు. తర్వాత చలన చిత్ర రంగంలో ప్రవేశించి, సుమారు రెండువందల చిత్రాలలో నటించారు.



శ్రీమతి పువ్వుల లక్ష్మీకాంతమ్మ

ఈ శతాబ్ది లోనే, దానధర్మాలు చేసిన కళాకారుల్లో నేను ఎరిగినవారు ఇద్దరున్నారు. వారిలో ఒకరు విజయనగరం వాస్తవ్యులు స్వర్గీయ లక్ష్మీనరసమ్మ. కళావరు రింగుగా ఆమె ప్రసిద్ధి పొందారు. ఆమె విజయనగరంలో తప్పించిన [illegible] కాని విజయనగరవాసుల్లో కొందరి దాహాన్ని నేటికీ తీరుస్తున్నాయి. శ్రీ ఘంటసాల వేంకటేశ్వరావు గారికి సంగీత సాధన నిమిత్తం ప్రథమంగా తంబూరాను బహూకరించిన మహా కళాకారిణి శ్రీమతి కళావరు రింగు. ఆమెలాగే గొప్ప ధర్మపరురాలు శ్రీమతి పువ్వుల లక్ష్మీకాంతమ్మ. ఆమె దానధర్మాల గురించి వ్రాయాలంటే అదొక పెద్ద పరిశోధక గ్రంథమౌతుంది.

శ్రీమతి వాల్మీకి చూడామణి అనే ఒక మహా కళాకారిణి [illegible] శ్రీమతి కళగారి వద్ద కొండపల్లిలో విశ్రాంతి తీసుకొంటున్నారని నా మిత్రుడు శ్రీ పటేల్ ఒకసారి చెప్పాడు. వృద్ధ నాట్య కళాకారుల్ని కలుసుకొని వారి విద్య గురించి తెలుసుకోవడం నా అలవాటు. అందుకని ఒకసారి విజయవాడనుండి కొండపల్లికి కారులో వెళ్ళాను. కొండపల్లి కోట పూర్వ వైభవాన్ని తలచుకొంటూ శ్రీమతి కళ గారింటికి వెళ్ళాను. ఆ వృద్ధ కళామూర్తి శ్రీమతి చూడామణి నన్ను తమ గుమ్మంవద్ద చూసి ఆశ్చర్యపోయారు. నా రచనలు ఆమె చదివారట, నా గూర్చి పత్రికలలో చదివారట, నా ఛాయాచిత్రాన్ని చూశారట. అందువల్ల నన్ను గుర్తు పట్టారు. తలవని తలంపుగా నన్ను చూసి ఆనందానుభూతితో అశ్రుపూరిత నేత్రాలతో నన్ను ఇంట్లోకి ఆహ్వానించారు. ఆ నృత్య సరస్వతి దయవల్లనే నన్ను చూడకలిగినట్లు ఆమె సంతోషాన్ని వెలిబుచ్చారు.



శ్రీమతి వాల్మీకి చూడామణి

ఆమె నిజంగా ఒక చూడామణి, ఒక నాట్య చూడామణి. ఆమె సంగీత జ్ఞానం, ఆమె అభినయ చాతుర్యం, ఆమె భాషా జ్ఞానం, ఆమె సంస్కారం నన్నెంతో ఆశ్చర్యపరిచాయి. అంత వృద్ధాప్యంలో గూడ ఆ మహా విద్వాంసురాలి ముఖంలో తేజస్సు గోచరించింది.

ఆనాటి వారి సాధన, ప్రదర్శనలు, సమ్మానాలు, సంఘం, సంస్కారం మొదలైనవాటిగురించి ఎన్నో విషయాలు ఆమె వివరించి చెప్పారు. ఆమె అలా చేప్తూంటే నా కళ్ళముందు ఒక సినిమా రీలు తిరిగింది. సుమారు వంద సంవత్సరాల క్రితంనాటి చరిత్ర నా కనులకు దర్శనమిచ్చింది. ఆమె తన స్వహస్తాలతో మిగిలిన వివరాలన్నీ

ప్రాసి పంపుతామన్నారు. కాని, విధి వ్రాత వేరుగా జరిగింది. ఆమె ఇంతలో సరస్వతీ సాన్నిధ్యాన్ని చేరుకొన్నారు ఆమె ఈ రోజుల్లో జీవించి యుండి యుంటే ఈ కళా లోకానికి ఎంతమేలు జరిగేదో కదా!

ఇటువంటి వృద్ధ కళాకారులతో ప్రసంగిస్తూంటే వీరి ముందు మన మెంత, మన విద్య ఎంత అని అనిపిస్తుంది.



తొలిసారి నేను చూసిన శ్రీమతి కోనె చిట్టిరాజు

75 సంవత్సరాలకు పూర్వం రెండు సాంప్రదాయక భాగవతబాణీలు పిఠాపురంలో ఉండేవి. ఒకటి పెండేలవారి బాణి, రెండవది కోనెవారి బాణి. ఈ రెండు బాణీలకు కొంత వ్యత్యాస ముండేది. వరుసగా ఏడు రాత్రుళ్లు కోనెవారు నవ జనార్దనాన్ని ప్రదర్శిస్తే పెండేలవారు వరుసగా తొమ్మిది రాత్రుళ్ళు నవ జనార్దనాన్ని ప్రదర్శించి, పదవ రాత్రి భాగవత దశమస్కంద పారాయణతో ముగించేవారు. ఈ ఆచారం కోనెవారి కుండినట్లు కనబడదు. శ్రీమతి చిట్టి రాజుగారి అమ్మమ్మగారు వరుసగా ఏడు రాత్రుళ్ళు శ్రీ రావు గంగాధర రామారావుగారి సమక్షంలో ఈ కలాపాన్ని ప్రదర్శించారట. శ్రీ రావు గంగాధర రామారావుగారు సంగీత నృత్యప్రియులు. వీరి కుమారులు శ్రీ రావు సూర్యారావుగారు సాహిత్యప్రియులు. అందువలన శ్రీ రావు గంగాదర రామారావుగారితోనే వారి దివాణంలో నృత్యకళ అంతరించి పోయిందని చెప్పవచ్చును ఆఖరిసారిగా 5 సంవత్సరాల క్రితం వారి దివాణ ప్రాంగణంలో నేను నవ జనార్దన పారిజాతాన్ని కుంతి మాధవుని ఉత్సవ విగ్రహాల సమక్షంలో ఆడించాను. ఆనాటి పిఠాపుర కోట వైభవం ఈనాడు మచ్చుకైనా లేదు.



గొల్లవేషంలో శ్రీమతి చిట్టిరాజు

కోనె వారి బాణీకి చెందిన చివరి నర్తకిమణి శ్రీమతి చిట్టిరాజు. ఈమె భామాకలాపం, గొల్లకలాపాలలో ప్రసిద్ధి గాంచారు. 50 సంవత్సరాలకు పూర్వం భామ వేషధారణ ఎలా ఉండేదో ఈమె ధరించిన వేషం, ఆభరణాలను చూస్తే తెలుస్తుంది. ఈ ఆభరణాలలాగే ఈమె ఆటా పాటా కూడా చాలా నాజూకుగా ఉండేవి.

ఈమె కలాపాలనే కాక జీవ [illegible] మొరుకల కురంజని కూడా చక్కగా ప్రదర్శించేవారు. ఈ ప్రక్రియ నేడు కనబడదు



గొల్లవేషంలో శ్రీకృష్ణునితో గోపికగా
శ్రీమతి చిట్టిబాయి

ఉప్పాడను [illegible] శ్రీ [illegible] పిల్లయ్యగారు ఈమెను నాట్య [illegible]. కాని, ఈమె తాత శ్రీ కపటం నాగన్నదాసుగారు పాడుతుండగా, వంత పాడుతూ, నట్టువాంగం చేస్తూ ఈమెకు సహాయపడేవారు. ఈమె నాట్యం నుండి విరమించుకొన్నాక నేను ఈమెను చూశాను. నేను కోరగా ఈమె కొన్ని దరువులు పాడి, అది చూపించారు.

# కర్నూలు జిల్లా కళావేత్తలు

కర్నూలు, కడప, అనంతపురం, చిత్తూరు, బళ్ళారి జిల్లాలోని నర్తనరీతులకు, శ్రీకాకుళం నుండి నెల్లూరు వరకు గల కోస్తా జిల్లాలలోని నర్తన రీతులకు కొంత తేడా ఉంది. కర్నూలు, మహబూబు నగర జిల్లాలు పక్క పక్కనే ఉండడం వల్ల అక్కడి నర్తనాలు ఒకేవిధంగా ఉన్నట్టు కన్పిస్తాయి.

మహబూబ్‌నగర్ జిల్లాలోని తెలుగు జమీందారులు పోషించిన నాట్యకళల ప్రభావం కర్నూలు జిల్లా నాట్యకళ పైని ఉండేది. కర్నూలు జిల్లాలోని కోటకొండ, కపట్రాల లోని భాగవతులు ప్రాచీన రీతిలో భాగవతాల్ను ప్రదర్శించే వారు.



శ్రీమతి శేషాపానిగారు



కూర్చున్నవారు శ్రీమతులు 1. నాగరత్నమ్మ 2. సుబ్బరత్నమ్మ 3. శేషాపాని 4 లక్ష్మక్క 5 సిద్ధాపాని 6. వెంకమాంబ 7. చంద్రపాని.
నిల్చున్నవారు (స్త్రీలు) శ్రీమతులు 1. బుల్లిపావ 2. గంగావతి 3. నమ్మక్క (రంగనాయకి)
నిల్చున్నవారు (పురుషులు) పేర్లు దొరకలేదు.

కూచిపూడి కళాకారుల్ని గోలకొండ నవాబులు పోషించినట్టుగా కోటకొండ కళాకారుల్ని బనగానపల్లి నవాబులు పోషించారు. వీరుకాక అహోబల క్షేత్రానికి చెందిన కొందరు భాగవత కళాకారులు భాగవతాలను ప్రదర్శించేవారు. వీరు వైష్ణవులు గనుక చెంచులక్ష్మి, ప్రహ్లాద వంటి విష్ణు కథలనే వీరు భాగవతాలుగా ప్రదర్శించేవారు. అయితే, లేపాక్షి రామాయణం, లేపాక్షి కృష్ణ లీలలు అనే యక్షగానాలు కూడా ఈ ప్రాంతంలో రూపొందాయి.

ప్రపంచ విఖ్యాతి గన్న లేపాక్షి ఒక శిల్ప కళా నిలయం. ఈ ప్రాంతంలోని స్త్రీ కళాకారులు లాస్యనర్తనం చేసేవారు. ప్రస్తుత కాలంలో కోవెలకుంట్ల నాట్యానికి ప్రసిద్ధి గాంచింది. కర్నూలు, కడప, పొద్దుటూరు, పుల్లంపేట మొదలైనచోట్ల పూర్వం నర్తకీమణు లుండేవారు.

నా నృత్య పరిశోధన ప్రారంభం కాకముందే ఈ ప్రాంతాలలోని చాలామంది కళాకారులు గతించారు. అయితే నేను కొందరిని చూడగలిగాను. వారిలో కోవెలకుంట్ల ఎర్ర లక్ష్మమ్మ, వెల్లాల లక్ష్మీకాంతమ్మ ప్రసిద్ధులు. మహాలక్ష్మి అనే ఒక గొప్ప నర్తకి పుల్లంపేటలో ఉండేవారు. ఆమెది కాళహస్తి బాణీ. కాని, ఆమెను చూసే అదృష్టం నాకు లేకపోయింది.

వెంకటగిరి, కాళహస్తి, కార్వేటి నగరం, పుంగనూరు రాజులు నాట్యకళను పోషించారు. కాని, 1940 నాటికే ఈ కళ క్షీణించడమే కాక హీనదశకు వచ్చింది. అందువలన నాట్య కళాకారులు, నాట్యాచార్యులు ఈ కళనుండి విరమించుకొన్నారు.

కర్నూలు జిల్లా నందికొట్కూరులోని నృత్యర్పిత కుమారి విజయలక్ష్మి నా శిష్యురాలు సుమారు 120 సంవత్సరాల క్రిందటి మూడు ఫోటోలను సంపాదించి, నాకు పంపింది. వాటినే ఇక్కడ ప్రచురించాను. వాటిని తిలకిస్తే నూరు సంవత్సరాలకు పూర్వముండిన నర్తకీమణుల వేష ధారణ మనకు తెలుస్తుంది. ఈ గ్రంథంలోని ఛాయా చిత్రాలన్నింటిలో ఇవే బిడు, ప్రాచీనమైనవి.

కుమారి విజయలక్ష్మి నా వద్ద నృత్యం నేర్చుకొని ఆంధ్ర నాట్యాన్నే గాక, ప్రాచీన కర్నూలు జిల్లా లాస్య నర్తన రీతిని గూడా అక్కడ ప్రచారం చేస్తున్న కళాకారిణి.

## కరింబేడు అమ్మాణమ్మ

గోవింద స్వామయ్య, కూన స్వామయ్య అనే ఇరువురు సోదరులు కార్వేటినగర సంస్థానంలో ఉండేవారు. వీరిలో గోవింద స్వామయ్య పెద్ద వర్ణాలను రచించారు. వీటిని ప్రదర్శించడం చాలా కష్టం. వీటిని ప్రదర్శించడం ఏ నర్తకికైనా ఒక పరీక్ష. దక్షిణాది కళాకారులు గూడ వీటిని అరుదుగా ప్రదర్శించేవారు. ఈ పెద్ద వర్ణాలలోని భాష చాలా కఠినంగా ఉంటుంది. కేదారగౌళ, **మోహన**, నవరోజు వర్ణాలు ఎక్కువ వాడుకలో ఉండేవి. కార్వేటినగర రాజుల పైని రచింపబడిన మోహన వర్ణం బహుళ ప్రచారం పొందింది.



ఈ కళాకారులందరికి సంగీతము నభ్యసింపజేసిన గురువుగారు
**శ్రీ సూరి పంతులుగారు**

పూర్వం వెంకటగిరి సంస్థానంలో "చర్మకట్టు వాయిద్య" మనే పేరుతో ఒక ప్రత్యేక మేళముండేది. దీనిలో వంద మంది నృత్యకళా కారిణులు, ఇరవై యైదు మంది చొప్పున డోలు వాద్యకులు, సన్నాయి వాద్యకులు, నట్టువలు, తాళధారులు ఉండేవారు. దసరా ఊరేగింపులో రాజవీధికి ఇరువైపులా వాద్యకులు నిలబడి వాయిస్తూంటే, వెనుకనున్న నట్టువలు, తాళధారులు తాళం వేస్తూంటే మధ్య నున్న నృత్య కళాకారులు త్రికాలాలలో నాట్యమాడేవారు. ఇదొక ప్రత్యేకమైన క్లిష్టమైన ప్రక్రియ. దీని కెంతో సాధన కావలసియుండేది. ఇదికాక రాజుల దర్బారులలో నృత్త, నృత్య, అభినయ కేళికలు జరుగుతూ ఉండేవి.



కార్వేటి నగరం సంస్థానం : నర్తకీమణి
**అమ్మాణిఅమ్మ**

కార్వేటి నగరం ఆస్థాన నర్తకీమణులు
కలిచేడు గ్రామ కాపురస్థులు



మధ్య నిలుచున్నవారు
**శ్రీమతి పాటకం అమ్మాణిఅమ్మ**
ఆ కాలంలో గోవిందసామయ్య మోహన పెద్దవర్ణం అడడంలో ప్రసిద్ధురాలు.

కార్వేటినగర ప్రభువుల దర్బారులో గోవింద స్వామయ్య రచించిన పెద్ద వర్ణాలను నృత్య కళాకారిణులు ప్రదర్శిస్తూండేవారు. ఈ కళాకారిణులలో చెప్పుకోదగ్గవారు పాటకం అమ్మాణిఅమ్మగారు.వీరే ఈ పెద్ద వర్ణాలను పూర్తిగా ప్రదర్శించగలిగిన చివరి నర్తకి. ఈమె కచ్చేరికి అల్‌గోజా లేక ముఖవీణ, తిత్తి లేక పాముల బూరా (శ్రుతి) మద్దెల ప్రధాన వాద్యాలుగా ఉండేవి. తాళధారి, వంత పాటకులు ఉండేవారు.

మా గురువుగారు శ్రీమతి రాజమ్మగారు నాకు ఈ మూడు పెద్ద వర్ణాలు నేర్పారు. ఇవి చాలా నిడుపైనవే గాక ప్రదర్శనకు చాలా కష్టమైనవి. అందుకే ఈనాడు ఎవ్వరూ వీటిని అభ్యసించడంలేదు.

తూర్పు గోదావరి జిల్లాలో నవరోజు వర్ణం ఎక్కువగా ప్రచారంలో ఉండేది.



శ్రీమతి వెల్లాల లక్ష్మీకాంతమ్మ

షేక్ వెల్లాల లక్ష్మీకాంతమ్మ వంటి సౌందర్యవతిని నేను నా పర్యటనలో ఎక్కడా చూడలేదు.

''ఇంతేటి దాన నే ఉన్నదాన మువ్వగోపాల
ఆటయున్న చోట పాటలో పస లేదు
ఆట పాటలున్న అందము సున్న
ఆటపాట సొగ్గు అందము గల్గియు
ఇటుగాను నిన్నే మెప్పించు టందుకు''

అని సుమారు 300 సంవత్సరాల క్రితం క్షేత్రయ్య మువ్వపురి గోపాలునికి అంకితంగా ఒక పదంలో చెప్పాడు. ఆ పదంలోని నాయిక ఈమెనా అని నేను ఈమెను చూసినప్పుడనుకొన్నాను. ఆ పదంలో క్షేత్రయ్య వర్ణించిన నాయికలా ఈమె సంపూర్ణంగా శోభిస్తూ నాకు గోచరించింది. అప్పుడు ఆమె వయస్సు 60 ఉండవచ్చును. ఆమెను చూడాలని కడప వెళ్ళి, ప్రొద్దుటూరు నుండి ఆమెను పిలిపించాను. ఆమె దయతో వచ్చారు. ఆమె సౌందర్యం అలాగే ఉంది. ఆమె కంఠ మాధుర్యం ఏం తగ్గినట్టు లేదు. చిరునవ్వుతో కలిసి ఆమె ముఖ తేజస్సు, కన్నుల్లోని కాంతి నన్ను ఆకర్షించాయి. ''లక్ష్మీకాంతమ్మగారూ! మీరు ఒక సేరు బంగారం నగలు ధరించి నాట్యం చేసేవారుట...." అని నేను నా వాక్యం ముగించక ముందే ఆమె పక పక నవ్వుతూ సమాధానం చెప్పారు. ఆమె ఒక ప్రబంధ నాయికలా నవ్వారు. ఆమె నవ్వుతూంటే ప్రబంధనాయిక ముత్యాల పలువరుస దర్శనమిచ్చింది. ''బాబూ! మన కళాభిమానులు విచిత్రమైన మనుష్యులు. ఒక పెద్ద మనిషి ఒక కళాకారుని సమ్మానిస్తూ 'ఇతడు కళారంగంలో సింహం' అన్నాడట. 'అయితే తోక ఏది?' అని ప్రేక్షకులలో నుండి ఒకడు అడిగాడట. అలా ఉంటాయి మన అభిమానుల అనుగ్రహాలు, ఆగ్రహాలు.

"నేను సేరు బంగారం ఆభరణాలు ధరించి ఆడలేదు. ఆ రోజుల్లో ఒక గొప్ప మల్లయోధు డుండేవాడు. అతని పేరు షేర్‌ఖాన్. అతన్ని మించిన మల్లుడు ఈ రాయలసీమలో ఆనాడు లేడు. ఒకసారి అతనికి కడపలో సమ్మానం జరిగింది. ఆనాడు నేను అతని గౌరవార్థం నాట్య ప్రదర్శన ఇచ్చాను. నా ప్రదర్శన చూసి అతడు ముగ్ధుడయ్యాడు. 'వారే షేర్ లక్ష్మీకాంతమ్మా! నేను కుస్తీలో షేర్ నయితే నీవు నృత్యంలో షేర్‌వి' అంటూ తన మెడలో నుండి ఒక బంగారు పతకాన్ని తీసి నా మెడలో వేశాడు. ఆనాటి నుండి నేను షేర్ లక్ష్మీకాంతమ్మ నయ్యాను. అంతేగాని, శేరు బంగారం ధరించలేదు నేను నృత్యం నుండి విరమించు కొన్నంతవరకు నేను షేర్‌గానే చెలామణి అయ్యాను. నేను నృత్య ప్రదర్శనల నుండి విరమించుకొని చాలా కాలమయింది. కాని మీలాంటివారు నా ప్రదర్శన చూడాలనుకొంటే నేను షేర్‌నే!" అన్నారు ఆమె. "అయితే ఏదైనా అభినయించండి" అని కోరాను. "తూరుపు తెల్లవారే - రేపు వత్తువుగాని" అన్న పదం ఆమె అభినయించారు. అది అభినయమా? కాదు, అదొక దివ్యానుభూతి! రస లోకంలో నేను విహరించాను. తర్వాత "నృత్త నృత్యాలు ఇప్పుడు ప్రదర్శించగలరా?" అని అడిగాను. ''ఓ, తప్పకుండా" అంటూ సురటి రాగంలో ఒక తిల్లానా ప్రదర్శించి ఆమె చూపించారు. పూర్వం వారి గురువుగారు నేర్పిన తిల్లానా అది. ఆ తర్వాత ''సామికి సరి యెవ్వరే సఖియా! ఈ విరహ మోర్వనే'' అనే పదవర్ణాన్ని పాడి, ఆడి, అభి

నయించి చూపారు. ఒక గంటసేపు నేనూ, ఇంకా అక్కడ ఉన్నవారు ఆశ్చర్యచకితులమయ్యాం

"మీరు నాట్యకళా విద్యావంతులు గనుక అడుగుతున్నాను, నాకు షేర్ బిరుదు తగునా లేదా?" అని ఆమె నన్ను చూసి, నవ్వుతూ అడిగారు. "నా కన్నులు సార్థకమయ్యాయి. మీ తల్లిదండ్రులు అదృష్టవంతులు, మీరు ధన్యులు!" అన్నాను. ఆ మాటలకు ఆమె కన్నులు చెమ్మగిల్లాయి ఆమె కొంతసేపు నోటమాటరాక మౌనంగా ఉండిపోయింది తర్వాత తెప్పరిల్లి, "ఎంత కాలానికి ఇంత మంచి మాట విన్నాను బాబూ! ఈ మాట వినడానికే నేటివరకు జీవించి యున్నానేమో! మా మందిని, విద్యను, విజ్ఞానాన్ని, అందచందాల్ని, మా సర్వస్వాన్ని తమ వినోదం కోసం వినియోగించుకొని, చెరుకు పిప్పిని పారేసినట్టు మమ్మల్ని దూరం చేయడమే గాక ఈ సంఘంలోని పెద్దలు మాకు కళంకాన్ని గూడ అంటగట్టారు.



షేర్ వెల్లాల లక్ష్మీకాంతమ్మ

"తన సమక్షంలో నాట్యమాడి తరించిన తన బిడ్డలనే ఈ సంఘం అవమానించి, నిందిస్తూంటే ఆ మూగ దేవుడు చూస్తూ ఊరుకొన్నాడే గాని, వారిని వల్లెత్తుమాట అనలేదు. అందుకే మా ఆత్మలు ఘోషించాయి మా పెద్దలు ఉద్యమాలు చేపట్టారు. మేము మా విద్యల్ని విడిచిపెట్టి మూలకూర్చున్నాం. ఆనాడు మమ్మల్ని అపహాస్యం చేసి, చిన్నచూపు చూసిన పెద్దలే ఈనాడు వారి పిల్లలకు మా విద్యలు నేర్పించి, ప్రదర్శనలు యిప్పించి, ఆనందిస్తున్నారు. ఇవి మా కులటలకు చెందిన విద్యలే గదా! కుళ్ళు నీళ్ళను బంగారు పాత్రలో పోసినంత మాత్రాన అవి పవిత్ర జలాలవుతాయా? ఇది సంఘం మాకు చేసిన అపకారం, కళాసరస్వతికి చేసిన అన్యాయం" అంటూ ఆమె కళ్ళనీళ్ళు తుడుచుకొన్నారు.

"ఇంక ఈ కాలంలో స్టేజి ఎక్కిన వారందరూ నాట్య కళాకారులే, అందరూ నాట్యాచార్యులే, అందరూ వ్యాఖ్యాతలే, అందరూ విమర్శకులే!" అంటూ ఆమె వాపోయారు.

ఆమెను ఊరడిస్తూ ఆమె పొందిన సమ్మానాలు, సత్కారాల గురించి అడిగాను. షేర్‌ఖాను, మదరాసు గవర్నర్ సర్ ఆర్థర్ హోపు మొదలగు పెద్దలు ఇచ్చిన పతకాలనే గాక, లెక్కకు మించినన్ని పతకాలు వచ్చాయని ఆమె చెప్పారు. ఆ 60 ఏళ్ళ లక్ష్మీకాంతమ్మ విగ్రహం గొప్ప శిల్పి చెక్కిన కాంస్య విగ్రహంలా ఉంది.

వెల్లాలలోని ఒక ఆలయానికి ఆమె మంటపం కట్టించారు. ఆమె చనిపోక పూర్వం ఒకసారి నా యింటికి వచ్చారు. మా శిష్యులు నాట్యం చేస్తూంటే చూసి, "బాబూ! నేను ఏకపాత్ర కేళికలు చేయడమేకాదు, మా బృందంలోని ఇతర నర్తకులతో కలిసి రాసకేళి నృత్యం చేసేదాన్ని అని ఆమె చెప్పారు. "రాయలేలిన సీమ రత్నాల సీమ" అన్నారు కవులు. ఆ రత్నాలన్నీ నాకు తెలియవు గాని ఒక కళారత్నాన్ని శ్రీమతి వెల్లాల లక్ష్మీకాంతమ్మలో చూడగలిగాను.



యౌవనంలో శ్రీమతి రాధమ్మ



గోపాలపేట ఆస్థాన నర్తకీమణి
శ్రీమతి రాధమ్మ - నేడు - నేను దర్శించిననాడు

మహబూబ్‌నగర్ జిల్లాలోని గోపాలపేట రాజాలు నృత్య సంగీతాలను, ముఖ్యంగా కర్నాటక సంగీతాన్ని, తెలుగు వారి ఆటపాటలను ఎక్కువగా పోషించి, తెలుగు వారి సంస్కృతిని పరిరక్షించారు. స్వాతంత్ర్యానంతరం దేశ పరిస్థితులు మారిపోయాయి. స్వతంత్ర సంస్థానాలన్నీ భారత దేశంలో విలీనమయ్యాయి. మరికొద్దికాలానికి ఆ ప్రభువులు గతించారు. కోటలు శిథిలమయ్యాయి. కళల విశిష్టత నెరిగిన కళాపోషకులు కరువైనందున కళాకారులు దైన్యస్థితిలో వారి జీవితాలను వెళ్ళబుచ్చవలసివచ్చింది.

హైదరాబాద్‌లోని సెంట్రల్ యూనివర్శిటీలో నృత్య శాఖను ప్రారంభించినప్పుడు నన్ను ఆ శాఖను నిర్వహించమని కోరుతూ నన్ను ప్రొఫెసర్‌గా నియమించారు. ఎం.ఏ. (డాన్సు) నా దగ్గర యూనివర్శిటీలో చదివి, ఉత్తీర్ణులై వెళ్ళిపోయే విద్యార్థివిద్యార్థులను 'మీ ప్రాంతాలలో పర్యటించి, అక్కడ ప్రాచీన నృత్యరీతుల నెరిగిన వృద్ధ కళాకారులుండే వారి వివరాలు సేకరించి నాకు పంపండి' అని కోరాను. ఈ అన్వేషణ వల్ల వివిధ ప్రాచీన నాట్యరీతులను తెలుసుకొనే అవకాశం వారికి కలుగుతుందని చెప్పాను.

నా సలహా ప్రకారం వనపర్తికి చెందిన కుమారి విజయలక్ష్మి మహబూబ్‌నగర జిల్లా పర్యటించి, గోపాలపేటలో శ్రీమతి రాధమ్మగారిని కలుసుకొని, ఆమె విద్య గురించే కాక ఆమె జీవిత విశేషాలను గూడ సేకరించి నాకు పంపింది. ఆ తర్వాత నేను స్వయంగా గోపాలపేట వెళ్ళి రాధమ్మగారి కలిశాను. ఆమెతో మాట్లాడాను, ఆమె పాట విన్నాను, ఆట చూశాను.

ఆమె పూర్వం ఎలా ఉండేదో నాకు తెలియదుగాని ప్రస్తుతం ఆమె యొక యోగిని. వైష్ణవం పుచ్చుకొన్నారు. మడి, తడి ఆచారాలు, నియమ నిష్ఠలు పాటిస్తున్నారు. ఇతరుల చేతి తిండి తినరు. పేదరికంలో ఉన్నా ఎవరినీ ఏమీ యాచించరు. యాచించడం తన సరస్వతికే అపచారం అంటారు ఆమె. ఆమె స్వయంగా నన్ను తీసికొని వెళ్ళి గోపాలపేటలోని కోట చూపించారు. ఆమె నాట్యమాడిన దర్బారు హాలు చూపించారు. శిథిలమైన ఆ కోటలోని ఆ హాలులో నేడు గబ్బిలాలు విహరిస్తున్నాయి. కాలు పెట్టడానికి వీలులేని ఆ హాలు స్థితిని ఆమె చూసి, కంట తడి పెట్టింది. తాను ఎక్కడ నిలబడి కేళిక ప్రారంభించేవారో, దొరలు ఎక్కడ కూర్చొని ఆమె కేళికను చూచేవారో నాకు

వివరిస్తూండగా ఆమెకు ఆవేశం వచ్చింది. వెంటనే ఆమె తన దుఃఖాశ్రువులను తుడుచుకొని, ఆనందాశ్రువులతో కొద్దిగా నర్తనమాడి నాకు చూపించారు.

ఆనాడు ఈమె కళాకారిణి రాధమ్మ - ఈనాడు 80 సంవత్సరాల పంతులమ్మ. అక్కడ అందరూ పంతులమ్మ అంటూంటే ఈ నర్తకీ మణి పంతులమ్మ ఎలా అయిందా అని ఆశ్చర్యపోయాను. గోపాలపేటలో చాలామందికి అక్షరాభ్యాసం చేసినది ఈమేనట! ఎంతో మంది చిన్నపిల్లలు ఈమె వద్దకు వచ్చి ఉచితంగా చదువు నేర్చుకొంటూంటారు. అందుకే ఈమె ఆ వూరికే పంతులమ్మ అయ్యారు.

నేను ఆమె యింటికి వెళ్ళగానే "రండి బాబూ!" అంటూ ఆహ్వానించి, "బాబూ! ఆనాటి రాధ ఏనాడో చనిపోయింది. ఈ జీవచ్ఛవాన్ని చూడడానికి ఇంత దూరం వచ్చారా?" అని అడిగింది. కొద్దిసేపు నాట్య విషయాలు నేను అడగ్గానే ఆమె ఆనాటి రాధమ్మ అయింది. అరవై సంవత్సరాల క్రితం నాటి రాజులు, వారి మర్యాదలు, వారి దివాణంలోని పద్ధతులు, పండితులు, కవులు, గాయకులు, శాస్త్రవేత్తలు అడిగే ప్రశ్నలు, వీరు పొందించిన విదులు, వారితో చేసిన శాస్త్ర చర్చలు మొదలైనవన్నీ నాకు వూసగుచ్చినట్టు వివరించి చెప్పారు.

ఆమె నన్ను కోటలోనికి తీసికొని వెళ్ళి, దొరసాని గారిని పరిచయం చేశారు. ఆమె ఈమె కన్న చిన్నది. ఈమె యెడల ఆమె చూపించిన మర్యాద ఆనాటి సంస్కారానికి మచ్చుతునక. గోపాలపేట సంస్థానం చిన్నదే అయినా ఆ రాజులు పొందించిన మర్యాదలు, సాహిత్య కళాదరణ, కవి - పండిత పోషణ చెప్పుకోదగ్గవి. అందువల్లనేమో దేశంలో ఇతర చోట్ల ఎన్ని మార్పులు వచ్చినా గోపాలపేట ప్రజల మాట తీరు, మనన్న, అతిథి సత్కారం ఆచార వ్యవహారాలు, కట్టూబొట్టూ ఇంకా పూర్వంలాగే నిలిచి ఉన్నాయి.

ఇంక అక్కడి ప్రాచీన సంగీత నృత్యాలు రాధమ్మతో అంతరించిపోవచ్చును. చారిత్రక పుటలో మాత్రం మిగిలి యుండవచ్చు.



శ్రీమతి రాధమ్మ నాట్యమాడిన కోట సింహద్వారం



శ్రీమతి కృష్ణవేణి (పాలెం)

మహబూబ్‌నగర్ జిల్లాలో పాలెం అని ఒక ఊరుంది. శ్రీమంతుడైన ఒక వేంకటేశ్వర భక్తుడు ఒక ఆలయాన్ని కట్టించాడు. ఆ యాలయంలోని వేంకటేశ్వర స్వామికి నృత్యపూజ జరిగేది. శ్రీమతి కృష్ణవేణి, ఆమె సోదరి ఈ నృత్య పూజను చేస్తుండేవారు. వీరిద్దరూ భక్తి ప్రపత్తులతో ఆ నృత్య పూజను నిర్వహించి తరించారు. హైందవ దైవారాధనలో నృత్యం గూడ ఒక విశిష్టాంశమని వీరు లోకానికి చాటి చెప్పారు.

## శ్రీమతి నెల్లూరు నాగమణమ్మ



శ్రీమతి నెల్లూరు నాగమణమ్మ

ఇదివరకు కొన్ని గ్రంథాలలో ఈమె గురించి చాలా వ్రాశాను. మా గురువుగారు నాయుడుపేట రాజమ్మగారికి ఈమె ప్రథమ శిష్యురాలు. ఈమె స్వగ్రామం కలువాయి. కాని ఈమె, కొన్నాళ్ళ తర్వాత నెల్లూరులో స్థిరపడ్డారు. అంతకు పూర్వం ఈమె పెంచలకోన నరసింహస్వామివారి ఆలయంలో నృత్యపూజ చేస్తూండేవారు.

ఈమె తన విద్యార్థులకు చాలా క్రమశిక్షణతో నృత్యం నేర్పేవారు. కొన్నాళ్ళు నెల్లూరులో హరిజన బాలల వసతి గృహంలో బాలికలను నృత్యం నేర్పారు. ఈమె అడవు సామును చాలా కట్టుదిట్టంగా నేర్పేవారు.

భారత ప్రభుత్వం పంపగా నేను రష్యా, యూరప్ దేశాలు పర్యటించడానికి వెళ్ళినప్పుడు మా పేరిణి విద్యార్థులకు అడవు సామును నేర్పడానికి వీరిని ప్రత్యేకంగా ఆహ్వానించాం. పేరిణి పూర్తిగా తాండవం. తాండవంలోని జతులు చాలా కష్టమైనవి. అయినా ఈమె పేరిణి విద్యార్థులకు తగిన వ్యాయామం నేర్పి ఈ జతులను అతి సునాయాసంగా నేర్పారు. అప్పుడు నృత్య అకాడమీ వీరిని సమ్మానించింది.

తర్వాత ఈమెకు పక్షవాతం వచ్చి, ఒక కాలు, ఒక చేయి పడిపోయాయి. అయినా, ఈమె మంచం మీద కూర్చుని బాగున్న చేతితోనే విద్యార్థులకు నాట్యం నేర్పుతూ ఉండేవారు.

# శ్రీమతి పూల మహాలక్ష్మి

పూర్వం నరసారావుపేట ఒక వెలమ సంస్థానం. ఆ వూళ్ళో పూల మహాలక్ష్మి అనే ఒక ప్రసిద్ధ నర్తకీమణి ఏభై సంవత్సరాల క్రితం ఉండేది. ఆమె నృత్య విద్య గురించి అక్కడి ప్రజలు, కళాకారులు నేటికి కథలుగా చెప్పుకొంటూంటారు. ఆమె సౌందర్యరాశి, గాన అభినయ సరస్వతి, ఉభయభాషా ప్రవీణ. ప్రతి నాట్య అంశాన్ని అర్థవంతంగా, భావయుక్తంగా తాను అనుభవించి, విద్వాంసులకు పంచిన కళామూర్తి ఆమె. ఇంతటి కళామూర్తి ఆ ప్రాంతంలో వేరొకరు లేరని ప్రతీతి.

సభలోని ఏ పండితులైనా, సంస్కృతంలో గాని, ఆంధ్రంలో గాని ఏ గీతాన్నిచ్చి అభినయించమన్నా ఒక్కసారి ఆ గీతాన్ని చదివి, అర్థం చేసికొని, అప్పటి కప్పుడు రాగ తాళాలను సమకూర్చుకొని, అభినయిస్తూండిన ఒక మహావిద్వాంసురాలు ఈమె. ఒకవేళ ఆ సభలోని ఏ కవైనా ఒక శృంగార గీతాన్ని సమస్యగా యిచ్చి, అభినయించమన్నపుడు ఈమె ఆ గీతాన్ని భక్తి శృంగారంతో అభినయించి, రక్తి కట్టించేవారు. ఆ యభినయం రాధామాధవుల దివ్య శృంగారంగా ప్రేక్షకులకు గోచరించేది. ఆమె విశాల నేత్రాలముందు రాధామాధవుల శృంగారలీలలు నర్తమాడేవేమో - సభికులు తన్మయులై, ఆనందాశ్రువులు



హార్మోనియం వాయిస్తున్న

**శ్రీమతి పూల మహాలక్ష్మి, ఆమె మాతృమూర్తి**

మహాలక్ష్మిగారి కాలంలో జీవించి వుండిన విద్వాంసురాండ్రు, వీరందరి పేర్లు దొరకలేదు. కాని ఈమె శిష్యురాండ్రలో ప్రముఖురాలు **శ్రీమతి శ్రీరంజని, ఈమె నాట్యం చేసేవారు. సంగీత కచ్చేరిలు చేశారు. సినిమాల్లో వేషాలు వేశారు.**

రాశ్చేవారు. పండితులు, శాస్త్రవేత్తలు సమ్మోహితులై, మంత్రముగ్ధులై, నోట మాట రాక చూస్తూండిపోయేవారు. సభల్లోని కొందరు క్షేత్రయ్య, సారంగపాణి వ్రాసిన ఏ పద్ని శృంగార పదాన్నిచ్చి, అభినయించమన్నా, ఆమె దానిని శృంగార పదాన్నిచ్చి, అభినయిస్తూ, దానిని రాధామాధవుల దివ్య శృంగారంగా చిత్రించి, ప్రేక్షకుల్ని తన్మయులను చేసేది శృంగార భక్తికి శ్రీమతి చాటపర్రు బాలా త్రిపుర సుందరి. భక్తి శృంగారానికి శ్రీమతి పూల మహాలక్ష్మి పేరు పొందారు.

ఎందరికో ఈమె ఉచితంగా విద్య నేర్పారు. ఈమె శిష్యులలో ఒకరైన శ్రీమతి నాగమణమ్మగారు కూడా గొప్ప విద్వాంసురాలు, భక్తురాలు. తూర్పు గోదావరి జిల్లా, కపిలేశ్వరపురంలో శ్రీ ఎస్ బి పి బి కె సత్యన్నారాయణ రావుగారు స్థాపించిన పారిజాత గురుకులంలో శ్రీమతి నాగమణమ్మ నృత్య అధ్యాపకురాలుగా కొన్నాళ్ళు పని చేశారు. నాట్యంలో భక్తి భావాన్ని చొప్పించడం వారి ప్రత్యేక సంప్రదాయం. అది దివ్య భక్తి సంప్రదాయం. చైతన్య మహా ప్రభువు భక్తి తత్వాన్ని ఈ సంప్రదాయం మనకు గుర్తుకు తెస్తుంది.

అయితే దురదృష్టవశాత్తు శ్రీమతి పూల మహాలక్ష్మి అతి చిన్న వయస్సులో మరణించారు.

అతి చిన్న వయస్సులో గొప్ప కీర్తిని పొందిన శ్రీ దామెర్ల రామారావుగారు ఈ సందర్భంలో నాకు జ్ఞప్తికి వస్తారు. చిత్రలేఖనంలో దామెర్ల రామారావుగారు బహు ప్రసిద్ధులయ్యారు. ఈయన మరి కొంత కాలం జీవించి యుంటే, గొప్ప చిత్రకళాకారిణియైన తన సతీమణితో గూడ మరొక అజంతాను సృష్టించియుండేవారు. కాని, కాలం కాటువేసినందువలన ఆంధ్రులకు ఆ యదృష్టం కలగలేదు. అలాగే శ్రీమతి మహాలక్ష్మి అతి చిన్న వయస్సులోనే మనకు దూరమయ్యారు. పూజ్యులు విస్సా అప్పారావుగారి కృషి ఫలితంగా రామారావుగారి ఆర్ట్ గేలరి రాజమండ్రిలో నెల కొల్పబడింది. ఆయన చిత్రాలలో కొన్నైనా మనకు మిగిలాయి. కాని, మహలక్ష్మిగారి విషయంలో మన మా



ఆ సీతమ్మ తల్లి
"అమ్మా, వాల్మీకి రచించిన ఆ సీత ఎలా వుంటుందో నేనెరుగను గాని నిన్ను జూచిన తరువాత
ఇలాగే వుంటుందేమో" అని మెచ్చి - ఆశ్రునయనాలతో బంగారు పతకం ఇచ్చి శ్రీమతి సీనియరు
శ్రీరంజనిని శ్రీశ్రీశ్రీ విక్రమ దేవవర్మగారు మెచ్చుకున్నారట -
ఈ ఫోటోలో ఎడమనుండి రెండవవారు.

అదృష్టానికి నోచుకోలేదు. ఈమెను ఏనాడో ఆంధ్రులు మరచిపోయారు. నాగమణెమ్మగారు నాకు ఈ ఛాయా చిత్రాలు ఇవ్వకపోతే ఇంత గొప్ప కళామూర్తి 20 వ శతాబ్ది ప్రారంభంలో ఉండేవారని ఆంధ్రులకు తెలిసేది కాదు.



మహాలక్ష్మి కుమార్తె ఆదిలక్ష్మి (నరసారావుపేట)
80 వ సంవత్సరంలో నేను కలిసికొన్నప్పుడు.

ఈమె మరణించిన తర్వాత ఈమె కుమార్తెలు ఈమె కళను ప్రచారం చేయాలని ప్రయత్నించారు. కాని, చట్టం అడ్డు వచ్చింది. వీరి కుమార్తెలలో శ్రీమతి ఆదిలక్ష్మి నేటికి జీవించి యున్నారు. ఈమె 80 సంవత్సరాల వండు వృద్ధురాలు. శరీరం వడలిపోయింది. గాత్రం క్షీణించింది. నేడు ఆడలేదు, పాడలేదు. ఏ పండిత సభలకు ఆహ్వానించినా ఆమె వెళ్ళదు. నరసారావుపేటకు ఎవ్వరైనా వెళ్ళి వస్తుంది. అమరావతి పుణ్యక్షేత్రంలోని ఒక మఠంలోనే ఎక్కువ కాలం ఉంటూంటుంది. అక్కడ ఒక భక్తుల కూటంలో చేరి కాలం గడుపుతూంది. జీవితంలో ఎన్ని భోగభాగ్యాలను అనుభవించినా చివరికి స్వామివారి సన్నిధే శరణ్యం. జన్మను తరింపజేసుకొనడానికి అదొక్కటే మార్గం అని నమ్ముకొన్న గొప్ప భక్తురాలు ఈమె తల్లి మరణించిన కొన్నాళ్ళకే ఈమె సోదరి కూడా మరణించింది. తన మాతృమూర్తి సందర్శనం కోసం, ఆ పవిత్ర దినం కోసం వేచియున్నానని ఆమె అంటూంటుంది.



వయస్సులో ఆట కచ్చేరీలు చేస్తున్న కాలంలో
శ్రీమతి ఆదిలక్ష్మి



పూం మహాలక్ష్మి గారి ఇద్దరు కుమార్తెలు



శ్రీమతి జంపా ముత్యం

విజయనగర సంస్థానానికి చెందిన నర్తకీమణి ఈమె. దక్షిణ ఒరిస్సా ప్రాంతంలోని అన్ని సంస్థానాలకు వెళ్ళి, కచ్చేరీలు చేసి, సమ్మానాలు, సత్కారాలు ఈమె పొందారు. పూరీ జగన్నాథస్వామివారి రథోత్సవ సమయాలలో రథం పైన నాట్యం చేసిన గొప్ప కళాకారిణి ఈమె. ఒరిస్సాలోని గంజాం, కోరాపుట్, గజపతి జిల్లాలలోని జమీందారులు ఒడ్రులే అయినా అక్కడ చాలా మంది తెలుగువారున్నారు. అందువలన ఆ ప్రాంతాలలో జరుగుతూండిన ఉత్సవాలకు, గొప్పవారి ఇంటి వేడుకలకు విజయనగరం నుండి నాట్య కళాకారిణులు వెళ్ళి కచ్చేరీలు చేస్తూండేవారు. ఈమె కర్నాట కచ్చేరి, కోలాటం, జడకోలాటం, పలకోలాటం మొదలైన ప్రదర్శనలలో ప్రసిద్ధురాలుగా పేరు తెచ్చుకొన్నారు.

ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ ప్రారంభించిన ఆంధ్ర నాట్యం సిలబస్ కమిటీలోని తెలుగు సభ్యులలో వీరొకరు. శ్రీమతి సరిదె మాణిక్యమ్మగారు ఆలయ ఆగమ సంప్రదాయానికి, శ్రీమతి దుగ్గిరాల జగదాంబ అభినయ రీతికి, శ్రీమతి చింతా దినగనిరాజా భాగవత కళారీతికి ప్రాతినిధ్యం వహిస్తే, శ్రీమతి జంపా ముత్యం ఆస్థాన కళారీతికి ప్రాతినిధ్యం వహించి సిలబస్ రచనలో తోడ్పడ్డారు. కళాప్రపూర్ణ శ్రీ కోరాడ నరసింహారావుగారి సారథ్యంలో రూపొందిన ఈ ఆంధ్రనాట్యం సిలబసు 1982 లో నృత్య అకాడమీ ఆమోదం పొందింది. "ఆంధ్ర నాట్యం" అన్న పేరును కూడా కమిటీ స్వీకరించింది.



శ్రీమతి మద్దెల రాముడమ్మ

ఈమె విజయనగర సంస్థానానికి చెందిన నాట్య గురువు, నట్టువరాలు. ఈమె చాలా ప్రసిద్ధురాలైనందున ఈమె వద్ద విద్య నభ్యసించడానికి రాజమండ్రి, కాకినాడ, తుని, పిఠాపురం మొదలైన ప్రాంతాలనుండి అనేకమంది యువ కళాకారులు వెళ్తూండేవారు. ఈమె ఒక గొప్ప కళాపీఠం.

ఈమె బాణీలో నృత్త, నృత్య, అభినయాలు సమపాళ్ళలో పోషింపబడేవి. విజయనగరం సంస్థానంలో కూడ ఈమె కచ్చేరీలు చేస్తూండేవారు చట్టం వచ్చి నాట్య కచ్చేరీలు నిషేధింపబడిన తర్వాత ఈమె నాట్యం నుండి విరమించుకొన్నారు.

ఈమె వర్ణాలు, జతిస్వరాలు, జావళీలు మొదలైనవి ప్రదర్శిస్తూండినా వీరి బాణి దక్షిణాది బాణికి భిన్నంగా ఉండేది. వీరు పాడుతూ ఆడేవారు. వీరు విజయనగరం "కళావరు రింగు" (లక్ష్మీనరసమ్మ)కు సమకాలికులు.



శ్రీమతి చింతా చినగనిరాజు

ఈమె రామచంద్రపురానికి చెందిన ఒక పండిత వంశంలో జన్మించింది. కచ్చేరీ ఆటను, కలాప విద్యను ఈమె తన మేనత్తగారైన శ్రీమతి చింతా వీరభద్రంగారి వద్ద నభ్యసించారు. శ్రీమతి వీరభద్రంగారు ఆంధ్ర గీర్వాణ భాషలందే గాక భరతాభినయములందు గూడ ఒక మహా పండితురాలు. ఆనాడు కోనసీమలోని ఏ అగ్రహారంలో ఏ శుభకార్యం జరిగినా ఈమె కలాప కేళికలను ప్రత్యేకంగా ఏర్పాటు చేసేవారు. అటువంటి విద్వాంసురాలి వద్ద విద్య నభ్యసించిన శ్రీమతి చిన గనిరాజు చిన్నతనంలోనే ఒక నట్టువ మేళానికి నాయకత్వం వహించి, ఎన్నో ప్రదర్శన లిచ్చింది. ఈమెది చక్కని గాత్రం, ముచ్చటైన అభి నయం, బహు మృదువైన పలుకు. 1982 లో నృత్య అకాడమీ వారు నియమించిన "ఆంధ్ర నాట్యం" సిలబస్ కమిటీలో ఈమె యొక్క ముఖ్య సభ్యురాలు.



శ్రీమతి కోటిపల్లి సీతమ్మ

సుమారు 25 సంవత్సరాల క్రిందట శ్రీమతులు కోటిపల్లి సీతమ్మ, సుబ్రహ్మణ్యం అనే యిద్దరు ప్రసిద్ధ నృత్యకళాకారిణులు మురమండలో నున్నారని విని అక్కడికి వెళ్ళాను. వీరిలో సీతమ్మగారు చక్కగా పాడేవారు. సుబ్రహ్మణ్యంగారు చక్కని నృత్యాభినయాలు ప్రదర్శించే వారు. నా కోరికపైని శ్రీమతి సీతమ్మ పలివెల కొప్పేశ్వ రుని పైని రచింపబడిన భైరవి పెదవర్ణం పాడగా శ్రీమతి సుబ్రహ్మణ్యం అభినయించారు. ఆ పెదవర్ణం ఆటను నేను ఆనాడు మొదటిసారి చూశాను. అది గోవిందసామయ్య పెదవర్ణం అంత పెద్దది, చాలా కష్టమైనది. అందువల్ల ఈ వర్ణం కొందరికే అందుబాటులో ఉండేది. ఈ వర్ణాన్ని ప్రదర్శించడం వీరి ప్రత్యేకత. ఆ తర్వాత సుబ్రహ్మణ్యం గారు కొన్ని జావళీలు, పదాలు అభినయించి, చూపించారు. నేను వెళ్ళినన్నాడు ఆ వూరి కళాకారులలో చాలామంది కచ్చే రీలు చేయడానికి వెళ్ళి యుండినందున వీరిద్దర్ని మాత్రమే నేను కలుసుకోగలిగాను. వీరిలో ఒక్క సీతమ్మగారి ఛాయా చిత్రమే నాకు లభ్యమైంది.

# శ్రీమతి రంగపుష్ప చిత్ర

పశ్చిమ గోదావరి జిల్లాలోని కాలదరి గ్రామానికి చెందిన ఒక ప్రాచీన నృత్య సాంప్రదాయక కుటుంబంలో శ్రీమతి చిత్రాదేవి జన్మించారు. తమ కుటుంబంలో ఒక చక్కని సుందరి జన్మించినందుకు ఆ కుటుంబ పెద్దలు చాలా సంతసించి, ఆమెకు 5 వ ఏటనే శాస్త్రీయ నృత్యాన్ని నేర్పడం మొదలుపెట్టారు. అడవులు, ఉండీలు, జక్కీలు, సాము గరిడీలు, వాలు ముగ్గులు, గాలి ముగ్గులు మొదలైన వెన్నో ఈమె చాలా త్వరగా చిన్నతనంలో నేర్చుకొన్నారు. ఆ తర్వాత స్వర జతులు, జతి స్వరాలు, వర్ణాలు, పదాలు, జావళీలు మొదలైన శాస్త్రీయమైన అంశాలను శాస్త్రీయంగా నేర్చుకొన్నారు. వెనువెంటనే ప్రదర్శన లివ్వడం ప్రారంభించారు. సాటివారిలో మేటి నర్తకిగా పేరు సంపాదించుకొంటున్న సమయంలో దేవదాసీ చట్టం అమలులోనికి వచ్చింది. ఈమె కచ్చేరీలకు తెరపడింది. అందువల్ల ఈమె తన విద్యను వృధాగా పోనీయకూడదని తలచి, నాటకాలలో నటించడం ప్రారంభించింది. మేళాలు, మేజువానీలు నిషేధించబడ్డాయి గాని నాటకాలు ప్రోత్సహించబడ్డాయి.

నాటకంలో దృశ్యానికి దృశ్యానికి మధ్య కొంత వ్యవధి ఉండేది. ఆ సమయంలో ఈమె తన నృత్యాలను ప్రదర్శిస్తూండేది. ఈమె నృత్యాలు ప్రేక్షకుల్ని ఆకర్షించేవి. అందువల్ల ఈమె తన నృత్య ప్రదర్శనలలో నూతన పద్ధతుల్ని ప్రవేశపెట్టి ప్రేక్షకుల్ని మరింత ఆకర్షించడం మొదలుపెట్టింది. జనం ఈ నాటకాలకు తండోపతండాలుగా వచ్చేవారు. ఈ విధంగా ఈ మహా నర్తకి చిత్రాదేవి నాట్యరంగంలో ఒక విప్లవాన్ని తీసికొని వచ్చింది. ఈమె కీర్తి నలుదిశలా వ్యాపించింది. నైజాం నవాబుగారు కూడా ఈమె గురించి విన్నారు, ఈమె నాట్య ప్రదర్శనను ఏర్పాటు చేయించి, తిలకించారు, మెచ్చుకొన్నారు, బహుమతు లిచ్చారు, ఆమె పేరు శాశ్వతంగా ఉండిపోయేటట్టు "రంగపుష్ప" అనే బిరుదును కూడ ప్రదానం చేశారు. అనాటినుండి చిత్రాదేవి "రంగపుష్ప చిత్ర"గా పేరుపొందారు.



మన నాట్యంలో విప్లవం తెచ్చిన మహా నర్తకి
**శ్రీమతి రంగపుష్ప చిత్రాదేవి**

ఈమె గురించి నేను విన్నాను. ఈమెను చూడాలని మదరాసులోని వారింటికి వెళ్ళాను. ఆమె నన్ను ఆదరంగా ఆహ్వానించారు. ఆమె తమ నాట్యం గురించి ముచ్చటించారు తను బర్మా, సిలోన్ దేశాల పర్యటనల అనుభవాలను, విశేషాలను ఆమె నాకు చెప్పారు. ఆమెను తర్వాత హైదరాబాదుకు ఆహ్వానించాను. ఆమె నా ఆహ్వానాన్ని మన్నించి వచ్చి, నా అతిథిగా నా యింట్లో కొద్ది రోజు లున్నారు.

ఆమె తెనాలిలో స్థిరపడ్డారు. నేనేదో పనిమీద తెనాలి వెళ్ళినప్పుడు ఆమె నన్ను తమ యింటికి ఆహ్వానించారు. వెళ్ళాను. అది ఇల్లు కాదు, చిన్న కుటీరం. ఆ కుటీరం ప్రక్కనే ఒక పెద్ద మేడ ఉంది. ఆమె ఆ మేడను చూపించి, 'అది నాదే కాని, అప్పులు తీర్చడానికి అమ్మివేశా'నని చెప్పారు నా అద్దాల మేడ జ్ఞప్తికి వచ్చింది.



తలపై సోడాబుడ్డి నాట్యం

ఆమెను తన ఛాయా చిత్రాల లిమ్మని కోరాను. ఆమె మూడు ఫోటోలు పంపారు. అందులో రెండు ఆమె చిన్నప్పుడు నాట్యం చేస్తున్నవి. మూడోది ఆమె వృద్ధాప్యం లోనిది.

ఆమె కొన్నాళ్ళు మావద్ద ఉండాలని అభిలషించారు. కాని, అనారోగ్యం వల్ల వీలుపడలేదు. నన్నే రమ్మనమని కబురు చేశారు. వెళ్ళాలనుకొంటూండగా ఆమె మరణవార్త వచ్చింది. ఆ కళామూర్తి కన్నుమూసినందుకు నా కళ్ళు చెమర్చాయి. చాలా బాధపడ్డాను. కన్నీళ్ళవల్ల గతించిన వారు మళ్ళా రారు కదా!



శ్రీమతి రంగపుష్ప చిత్రాదేవి గారు
చనిపోయేముందు

ఆమె ఒక విశిష్టమైన కళాప్రపూర్ణ. అందుకు అన్ని రకాల నాట్యాలు చేసి ఒప్పించగలరని, మెప్పించగలరని ఆమె తన నాట్య ప్రదర్శనలతో రుజువు చేసింది. పళ్ళెంమీద నిలబడి, తల మీద చెంబు పెట్టుకొని నాట్యం చేయడం ఆమెతోనే ప్రారంభమైందేమో!



శ్రీమతి సుచేత జోషి

గ్వాలియర్ రెజిమెంటుకు చెందిన కల్నల్ జోషి గారి సతీమణి శ్రీమతి సుచేత. ఆమె బాగా చదువుకొన్నారు. పూనాలో కథక్ నృత్యం నేర్చుకొన్నారు. కొంతమంది విద్యార్థినులకు ఆమె కథక్ నృత్యం నేర్పి, చక్కని కళాకారులుగా తీర్చిదిద్దారు. ఆమెకు దక్షిణాది కర్నాటక నాట్యం నేర్చుకోవాలన్న అభిలాష కలిగి, మదరాసు వెళ్ళాలనుకొన్నారు. ఇంతలో ఏదో పనిమీద వారి బంధువులైన డాక్టర్ పాఠక్ దంపతులను కలుసుకొనడానికి హైదరాబాద్ వచ్చారు. ఈ దంపతులు నాకు చాలా సన్నిహితులు. మేము శ్రీ వేంకటేశ్వర కల్యాణం, కుమార సంభవం ప్రదర్శిస్తూండిన రోజులవి. ఉజ్జయినిలోని కాళిదాసు మహా సమారోహ్‌లో కుమారసంభవం ప్రదర్శించడానికి మేము తయారవుతున్న సమయమది. శ్రీమతి సుచేత జోషి గారిని ఆ దంపతులు మా నృత్యనికేతనానికి ఒకనాడు తీసికొని వచ్చారు. ఆమె ఆనాడు మా రిహార్సల్సు చూశారు. మా ప్రదర్శనా పద్ధతులు, మా క్రమశిక్షణ ఆమెకు బాగా నచ్చాయి. మా నృత్య బాణీ ఆమెను ఆకర్షించింది. మా అభినయ తీరుకు ఆమె ముగ్ధులయ్యారు.

అంతే. ఆమె నా వద్ద విద్య నేర్చుకుంటానన్నారు. సరే అన్నాను. పాఠక్ దంపతులు ఆమెకు వసతి ఏర్పాట్లు చేశారు. ఆమె నావద్ద నాట్యం నేర్చుకొనడం మొదలు పెట్టారు. అప్పుడు ఆమె వయస్సు సుమారు 50 సంవత్సరాలు. వయస్సులో నా కన్నా పెద్ద. అప్పటింకా ఆంధ్రుల లాస్య నర్తనానికి 'ఆంధ్ర నాట్యం' అన్న నామకరణం జరగలేదు. 'ఆంధ్ర భరత నాట్యం' అంటూ ఉండేవారు. ఆ పేరుతోనే శ్రీమతి సుచేత రవీంద్ర భారతిలో ఒక ప్రదర్శన ఇచ్చారు. ఆ కాలంలో బొబ్బిలి ఆస్థాన నాట్య విద్వాంసురాలు శ్రీమతి జీవరత్నమ్మగారు మా నృత్య నికేతనంలో ఉన్నారు. కనుక ఆమె వద్ద శ్రీమతి సుచేత కొన్ని పదాలు, వర్ణాలు అభ్యసించారు. అంతకు ముందే ఆమె శాస్త్రీయ సంగీతం, హార్మోనియం వాయించడం నేర్చుకొని ఉండినందువల్ల ఆమెకు మన ఆటా, పాటా రెండూ సులభంగా అబ్బాయి. తర్వాత ఆమె పూనా వెళ్ళిపోయారు. అక్కడ "ఆంధ్ర నాట్యం" సంస్థను నెలకొల్పి, అక్కడి పిల్లలకు మన ఆంధ్ర నాట్యం నేర్పుతున్నారు. ఆమె ఇపుడు సుమారు 80 సంవత్సరాల వృద్ధురాలు.

# భాగవత భరతం

ఆంధ్రుల భాగవత చరిత్రకు సంబంధించిన ముఖ్యమైన మూడు ఛాయాచిత్రాలను ఇక్కడ ప్రచురిస్తున్నాను. ఆంధ్ర నృత్యకళాకారులు మరువరానివి, మరువకూడనివి.

ఇవి: 1. భామవేషంలో శ్రీ దూర్వాసుల మాణిక్యంగారు, 2.తూర్పు భాగవతంలో భామగా శ్రీ వరదా ఆదినారాయణ, ప్రక్కన మార్దంగికుడు, 3. విశాఖ జిల్లాలో ప్రస్తుతమున్న ఒకే ఒక లేపాక్షి కృష్ణ నాటక భాగవత బృందం. ఈ మూడు ఛాయాచిత్రాలు చాలా అపురూపమైనవి.



భామ వేషంలో
శ్రీ దూర్వాసుల మాణిక్యం భాగవతారు

### శ్రీ దూర్వాసుల మాణిక్యం

ఈయన చరిత్ర కెక్కని ఒక చక్కని భాగవత కళాకారుడు. ఈయన గొప్ప సంగీతజ్ఞుడు, నాట్యశాస్త్రవేత్త. తాళ ప్రస్తారాన్ని సంపూర్ణంగా అధ్యయనం చేసి, అవగాహన చేసికొన్న ప్రజ్ఞాశాలి ఈయన. విద్యకు తగినంత కీర్తి ఈయనకు రాలేదు.

### శ్రీ వరదా ఆదినారాయణ

ఈతని మాట గంభీరం, పాట గంభీరం, మంచి కవి, గొప్ప శ్రీమంతుడు. కలాప ఆటలో తనని మించిన వారు లేరన్న ప్రఖ్యాతి పొందినవాడు. తిరుగులేని పద్ధతిలో ఒక గొప్ప కళాకారునిగా జీవించాడు. ఇతని విద్యను మెచ్చి, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఒక గురుకులాన్ని ఏర్పాటు చేసి ఈతనికి అప్పగించింది. తన విద్య ఇతరులకు నేర్పడానికి ఈయనకు దానివల్ల అవకాశం కలిగింది. విజయనగరం బాణీగా ఈతని విద్య దేశంలో శాశ్వతంగా నిలిచిపోయింది. ఈతని ప్రక్కన ఛాయాచిత్రంలో ఉన్న వాడు శ్రీ కోరుకొండ సత్యం. ఆదినారాయణగారి ఆటకు తగ్గ వాయిద్యం ఈతనిది. ఈతని మృదంగ వాయిద్యం తూర్పు భాగవత ధ్రుపద బాణీకి చెందినది. ఈతని వాయిద్యాన్ని వినవలసిందే కాని వర్ణించలేను. ఈ బాణీ[illegible] ఈతడు కడు ప్రసిద్ధుడు. నిజమైన కళాహృదయం గలవాడు, సహృదయుడు, ధర్మబుద్ధి గలవాడు. తన ఐశ్వర్యంతో పేదలకు దానం చేసిన త్యాగశీలి. వరదావారి ఆట, పాట, కోరుకొండవారి వాయిద్యం ఒకదానిని మించి ఒకటి ఉండేవి నభూతో నభవిష్యతి అన్నట్టు ఉండేవి అవి. ఇద్దరూ కీర్తిశేష[illegible] లయ్యారు. అప్పటికింకా వీడియోలు రాలేదు. వచ్చి ఉంటే వీరి విద్యలను రికార్డు చేయించేవాడ్ని. ఆ అదృష్టం ఆంధ్ర[illegible] లకు లేకపోయింది.



శ్రీ వరదా ఆదినారాయణ, కోరుకొండ సత్యం

**బ్రాహ్మణ భాగవత బృందం :**

ఉత్తర [illegible] జిల్లాలలో నున్న ఏకైక బ్రాహ్మణ భాగవత బృందం ఇది [illegible] కృష్ణనాటకాన్ని ప్రదర్శిస్తూ ఉంటారు. వీరంతా విద్యావేత్తలు, వేదాధ్యాయన పరాయణులు. మేలట్టూరు భాగవతుల్లాగే వీరు ఈ కళను దైవపరంగా ఆరాధిస్తూ ఉంటారు. వీరి కళాభివృద్ధికి ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఆర్థిక సహాయం చేయడానికి నేనెంతో శ్రమించాను.



తూర్పు భాగవత బ్రాహ్మణ బృందం

**పేరిణి శివతాండవం**

పేరిణీ శివ తాండవం గురించి నేను పరిశోధన చేస్తున్న కాలమది ప్రతి వారం లేకపోతే ప్రతి పక్షానికి ఒక సారి రామప్ప దేవాలయాన్ని సందర్శించడానికి నేను పాలంపేట వెళ్తూండేవాణ్ణి. ఆ రోజుల్లో పాలంపేట వెళ్ళాలంటే ఉదయమే వరంగల్ చేరుకొని, అక్కడ్నుంచి కారులో పాలంపేట వెళ్ళవలసి యుండేది. అక్కడ ఉండడానికి వసతి లేనందున తిరిగి సాయంత్రం వరంగల్ చేరుకోవలసి వచ్చేది. నేను ఈ విధంగా సుమారు 45 సార్లు పాలంపేట వెళ్ళాను. నేను తరచు పాలంపేట వెళ్తున్నట్టు శ్రీ హయగ్రీవాచారి గారికి తెలిసి ఒకనాడు నన్ను కలుసుకొని అడిగారు. "అక్కడికి ఎందుకు వెళ్తున్నా"రని. కారణం చెప్పాను. "ఆ యాలయంలో కొన్ని బ్రాకెట్ ఫిగర్స్ తప్ప మరేమున్నాయండి?" అన్నారు. "అక్కడ పేరిణి శివతాండవానికి ఉపయోగపడే కొన్ని బీజాక్షరాలు ఆ శిల్పాలలో ఉన్నాయండి. వాటిని జాగ్రత్తగా పరిశీలిస్తే పేరిణి శివతాండవాన్ని పునః సృష్టించవచ్చును." అని వారికి చెప్పాను. ఆయనకు నమ్మకం కలగలేదు "నేను పేరిణిని రూపొందించాక మీరు చూడండి. తర్వాత నన్ను ప్రోత్సహించండి" అన్నాను.



శ్రీ నటరాజ రామకృష్ణ, స్వర్గీయ హయగ్రీవాచారిగారితో—

మరికొన్నాళ్ళకు పేరిణి శివతాండవాన్ని పునః సృష్టించాను. హయగ్రీవాచారిగార్ని ప్రత్యేకంగా ఒకనాడు ఆహ్వానించి, పేరిణి ప్రదర్శనం చూపించాను. ఆయన ముగ్ధులయ్యారు. "తెలంగాణాలోని ప్రతి రాయి రప్పా మన జాతి చరిత్రను చాటుతుందన్నమాట!" అన్నారు ఆయన. ఆనాటి నుండి ఆయన పేరిణికి ప్రోత్సాహకులయ్యారు. ఆ కళను ఆయన ఆదరించారు. ఎన్నో ప్రదర్శనలను ఏర్పాటు చేశారు. వారి మనుమరాలు చిరంజీవి నాగలక్ష్మిని నాట్యం నేర్చుకొనడానికి నా వద్దకు పంపారు. ఆంధ్రుల విశిష్ట లాస్య నర్తనమైన 'ఆంధ్ర నాట్యం' ఆమె దీక్ష వహించగలదని ఆయన ఆశించారు. కాని, ఆ కోరిక తీరకుండానే ఆయన ఒక కిరాతకుని చేతిలో బలైపోయారు. సహృదయుడైన ఒక ఉత్తమ ప్రజానాయకుడు పోయినందుకు నేను చాలా దుఃఖించాను.

నిన్నటివరకు జరిగిన 'ఆంధ్రనాట్యం' చరిత్రను ఇక్కడితో ముగించదలచాను. ఇప్పుడు జరుగుతున్న చరిత్ర ఇక ముందు వ్రాయాలి. 2000 సంవత్సరాల 'ఆంధ్ర నాట్యం చరిత్ర ఎంత వ్రాసినా తరగదు నాకు తెలిసిన చారిత్రక విషయాలు అన్నీ వ్రాయడానికి ఈ గ్రంథం చాలదు. ఇంకా ఎంతో ఉండిపోతుంది. నా ప్రయత్నానికి ఈ గ్రంథం ఒక ప్రారంభం మాత్రమే.



'ఆంధ్రనాట్యం' చరిత్ర రచన

# ప్రస్తుతం జరుగుతున్న చరిత్ర

# Government of Andhra Pradesh

## ABSTRACT

CULTURAL AFFAIRS - Introduction of "Andhra Natyam" Dance Discipline in Sri Tyagaraya Government College of Music and Dance, Hyderabad - Orders Issued.

TOURISM CULTURE SPORTS AND YOUTH SERVICES (CA.II) DEPARTMENT

G.O.Ms. No. 7, Dt. : 23-1-1995

Read the following :-

1. From the D C A, Lr.No. B4/359/91-2, dt. 31-8-91.
2. From the D C.A., Lr.No. B3/359/91-5, dt 17-11-94

## ORDER :

Numerous representations have been received for introduction of "Andhra Natyam" the ancient temple dance in the Government Music and Dance Institutions. The Telugu Universsty has prepared and approved the Syllabus for "Andbra Natyam" and requested for permission to conduct examinations in that discipline along with other disciplines. The Telugu University had also requested for permission to allow private students to appear for examinations in that discipline through Government Music & Dance Institutions without any financial involvement for the Government.

2. The Director of Cultural Affairs, in his reference second read above sought for permission to introduce "Andhra Natyam" in S.T. Government College of Music & Dance, Hyderabad in the first instance and also requested for acceptance of the proposal of the Telugu University with regard to conduct of examinations.

3. After careful consideration, Government hereby accord permission for :-

a) introduction of "Andhra Natyam" discipline in Sri Tyagarava College of Music & Dance, Hyderabad.

b) conducting examinations by Telugu University in "Andhra Natyam" Dance discipline along with other disciplines of Music & Dance; and

c) Telugu University to allow private students to appear for examinations in "Andhra Natyam" through Government Music & Dance Institutions.

(By order and in the name of the Governor of Andhra Pradesh)

(Sd ) S. ANWAR,
Secretary to Government

To

The Director of Cultural Affairs,
A.P., Hyderabad.
The Registrar,
Telugu University, Hyderabad.
The Principal, S.T. Govt.
College of Music & Dance, Hyd.
Copy to Education Department,
A P. Secretariat, Hyd.
SF/SC.

Forwarded By Order

(Sd.) J. KUSUMA KUMARI
Section Officer.



శ్రీ కె.వి.రమణ ఐ.ఏ.ఎస్. ను సన్మానిస్తున్న డాక్టర్ నటరాజ రామకృష్ణ



ఆంధ్రనాట్యం సదస్సుకు వచ్చిన విద్వాంసులు, పండితులు:
I Row: Dr. Premalatha Sharma (Vice-Chairman, Central Sangeeta Nataka Academi), Smt. Usha Malik (Secretary, Central Sangeeta Nataka Academi), Prof. M. Nagabhushan Sarma and Dr. Sunil Kothari.



శ్రీమతి పువ్వుల లక్ష్మీకాంతమ్మ, 80 సంవత్సరాల ప్రసిద్ధ-నర్తకీమణిని సన్మానిస్తున్న డా. నటరాజ రామకృష్ణ శిష్యుడు సంచలన చలనచిత్ర దర్శకుడు యస్.వి. కృష్ణారెడ్డి. చిత్రంలో ఎడమనుండి శ్రీమతి జపమాల, పేరిణి రమేష్, శ్రీ జి. సూర్యనారాయణ, శ్రీ శ్రీను.




'పేరిణి' : సేంట్ డామినిక్ స్కూలు, పేరిణి చిన్నారుల వీరనాట్య ప్రదర్శన









అభినయం ఆంధ్రుల సొత్తు. కైశికీ వృత్తి ప్రధానంగా గల అభినయం ముప్పైమూడు సంచారీ భావాల వికాసంతో ముచ్చటగా ప్రదర్శించి ప్రేక్షకుల ఉల్లాన్ని కొల్లగొనేవారు ఆ తరం ఆంధ్ర లాస్య కళాకారిణులు. ఈ తరంలో సాత్వికం, శుద్ధ సాత్వికాలను ప్రదర్శించటంలో అనుపమ కళాకారుడుగా ప్రసిద్ధి కెక్కిన ఏకైక కళాకారుడు డా. నటరాజ రామకృష్ణ అభినయ చిత్రాలు

# ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు - 500004

## 16-9-82 న జరిగిన కార్యవర్గ సమావేశపు ప్రొసీడింగ్సు

హాజరైన సభ్యులు :

1 డా॥ నటరాజ రామకృష్ణ - అధ్యక్షులు
2 శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ - ఉపాధ్యక్షులు
3 శ్రీ సి. పార్థసారథి - కార్యదర్శి మరియు కోశాధికారి
4 శ్రీ [illegible] రామరాజు
5. శ్రీమతి సుమతి కౌశల్
6. శ్రీ కోరాడ నరసింహారావు
7 కుమారి [illegible] సీతాదేవి
8. శ్రీ [illegible] గోవిందు
9. శ్రీమతి చింతా [illegible]
10 శ్రీ గరిమెళ్ళ రామమూర్తి - ప్రత్యేక ఆహ్వానితులు.

**అంశం (1)** : భరతనాట్యము (ఆంధ్ర శాస్త్రీయ పద్ధతి)కు సిలబసు వ్రాయుట గురించి :

భరతనాట్యము (ఆంధ్ర శాస్త్రీయ పద్ధతి)కు సిలబసు వ్రాసే నిమిత్తమై కార్యవర్గము నియమించిన కమిటీయొక్క నివేదికను (అనుబంధములు - 4, 5, 6) కార్యవర్గం ఆమోదమునకై వుంచడమైనది.

**తీర్మానములు (1)** : కమిటీ సమర్పించిన సిలబసును, దానికి వివరణలతో తయారుచేసిన నోట్సును కార్యవర్గం ఆమోదించినది.

(2) ఆంధ్రదేశంలో స్త్రీలచే ప్రదర్శింపు లాస్య నర్తనమునకు "ఆంధ్ర నాట్యము"గా నామకరణము చేయుటకు కార్యవర్గము నిర్ణయించినది. కూచిపూడి సాంప్రదాయరీతి కాకుండా యీ ఆంధ్ర నాట్యము ప్రత్యేకమైన నృత్య ప్రక్రియగా కార్యవర్గము గుర్తించినది.

(3) "ఆంధ్ర నాట్యము"పై వివిధ అంశాలపైన చర్చించుటకుగాను ఒక సదస్సును ఏర్పాటు చేయుటకు నిర్ణయించడమైనది.

(4) పై నృత్య ప్రక్రియకు తయారుచేసిన సిలబసు ననుసరించి 10 మంది కళాకారులకు (కొంతవరకు భరత నాట్యములో, కూచిపూడి నాట్యములో ప్రావీణ్యము కలిగిన వారికి) నాలుగు నెలలపాటు ప్రత్యేక శిక్షణా తరగతులను ఏర్పాటు చేయుటకును యీ శిక్షణను- యీ సాంప్రదాయము ఎరిగిన వృద్ధ కళాకారులను రప్పించి, వారి యొక్క సహకారంతో తీర్చిదిద్దుటకును, అట్లు విద్య నభ్యసించిన విద్యార్థులతో ఆంధ్రదేశములోని ప్రముఖ పట్టణాలలోను, భారతదేశములోని వివిధ రాష్ట్రాలలోను అటుపై విదేశములలోను ప్రదర్శనలు ఇప్పించుటకుగాను నిర్ణయించడమైనది.

(5) పై నృత్య ప్రక్రియలో సహకార గానం చేయుటకు గాత్రంపాడే వారికి, మార్దంగికులకు శిక్షణఇచ్చి తయారు చేయుటకు నిర్ణయించడమైనది.

(6) ఈ నాట్యక్రమము ననుసరించి కొందరు కళాకారులకు ఉపాధ్యాయులుగా శిక్షణ యిచ్చుటకు కూడ నిర్ణయించడమైనది.

(7) ఈ నాట్యక్రమమును ప్రభుత్వ సంగీత, నృత్య కళాశాలలందు శిక్షణ యిప్పించుటకుగాను ప్రభుత్వమువారిని కోరుటకు నిర్ణయించడమైనది.

(8) ఈ నృత్య సాంప్రదాయము గురించి పత్రికల ద్వారా బహుళ ప్రచారం జరిపించుటకు నిర్ణయించడమైనది.

(9) కేంద్ర సంగీత, నాటక అకాడమీ, కేంద్ర ప్రభుత్వము ద్వారా ఈ ప్రాచీన శాస్త్రీయ నృత్యానికి తగు ప్రోత్సాహం లభించుటకు అకాడమీ కృషి చేయుటకుగాను నిర్ణయించడమైనది.

(10) భారత ప్రభుత్వంవారు ప్రతి సంవత్సరము కళాకారులకు యిచ్చే స్కాలర్‌షిప్‌లు ఈ సాంప్రదాయము నభ్యసించేవారికి కూడ యిప్పించె నిమిత్తమై అకాడమి కృషి చేయుటకుగాను నిర్ణయించడమైనది.

**సం॥ నటరాజ రామకృష్ణ**
గౌ॥ అధ్యక్షులు

**సం॥ సి. పార్థసారథి**
గౌ. కార్యదర్శి

# ఆంధ్ర నాట్యం

ఆంధ్రప్రదేశ్ 1956 లో అవతరించింది. తర్వాత ఆం.ప్ర. సంగీత నాటక అకాడమీ ఏర్పాటయింది. అకాడమీ తొలి అధ్యక్షులైన శ్రీ ఆర్. బి. రామకృష్ణ రాజుగారి హయాంలో కూచిపూడి సదస్సు జరిగింది. ఆనాటి నుండి ఆ కళ అభివృద్ధి చెంది, విశేష ప్రచారం పొందింది.

తర్వాత శ్రీ పసల సూర్యచంద్రరావుగారు అధ్యక్షులుగా ఉన్నప్పుడు అభినయ సదస్సు రాజమహేంద్రవరంలో జరిగింది. ఆ సదస్సులో ఆంధ్రుల ప్రాచీన లాస్యనర్తనానికి 'ఆంధ్రనాట్యం' అన్న పేరును ఆనాడు సమావేశమైన వృద్ధ స్త్రీ కళావేత్తలు పెట్టారు. ఆ తర్వాత ఆ నాట్యరీతికి ఒక సిలబసు వ్రాయబడింది. నృత్య అకాడమీ ప్రత్యేకంగా ఏర్పాటయిన నాటికి - ఆ సదస్సులో పాల్గొన్న వృద్ధ కళాకారులలో చాలామంది గతించారు. ఈ సదస్సుకు ప్రధాన కారకురాలైన భరత కళాప్రపూర్ణ శ్రీమతి అన్నాబత్తుల బులి వేంకటరత్నమ్మ గారు కూడా మరణించారు. భరతకళాప్రపూర్ణ శ్రీ కోరాడ నరసింహారావుగారి అధ్యక్షతన కొన్ని మార్పులతో ఒక సిలబసును ఆంధ్ర నాట్యానికి నృత్య అకాడమీవారు తయారుచేయించారు. ఆ సిలబసును తయారు చేయడంలో శ్రీమతి జంపా ముత్యం (విజయనగర సంస్థానం) శ్రీమతి దుగ్గిరాల జగదాంబ (మండపేట), శ్రీమతి సరిదె మాణిక్యం (బల్లిపాడు దేవాలయం) గార్లు సహకరించారు. వీరు ముగ్గురు ఆంధ్రనాట్యాన్ని మూడు పద్ధతుల్లో ఆరాధించారు. ఆ సిలబసును 1982 లో ఆం. ప్ర. నృత్య అకాడమీ వారు ఆమోదించారు. 1970 లో వృద్ధ కళాకారులు ఆంధ్రుల లాస్యనర్తనానికి పెట్టిన "ఆంధ్రనాట్యం" అన్న పేరును గూడ నృత్య అకాడమీ ఆమోదించింది. ఈ కళా ప్రచార నిమిత్తం నృత్య అకాడమీ కొన్ని ముఖ్య నిర్ణయాలు తీసికొంది.

ఈ యాంధ్రనాట్యం మూడు విధాలుగా అభివృద్ధి చెందింది: 1. ఆలయాలలోని దైవపూజలోని కొంత భాగం, 2. దేవుని కొలువులో, పండితుల సమక్షంలో, రాజుల ఆస్థానాలలో ప్రదర్శింపబడిన కేళికారీతి. 3. సామాన్య ప్రజలకోసం ఆలయం వెలుపల గదముఖంగా ప్రదర్శింపబడుచుండిన పాటకాలు, కళాపాలు. వస్తుతం ఈ మూడు భాగాలను కలిపి ఒకటిగా [illegible] రీతిలో మేము కూర్చి ప్రదర్శిస్తున్నాం. ఆరాధన రీతిలో ప్రదర్శనను ప్రారంభించి, పాటకాంత రీతితో ముగిస్తున్నాం. తర్వాత ప్రభుత్వం వారు అకాడమీని రద్దుచేసి, తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం చేశారు. ఆ తర్వాత డాక్టర్ సి. నారాయణ రెడ్డి గారు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్గా శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావుగారు డీన్‌గా ఉండినప్పుడు ఒక ప్రత్యేక సిలబస్ కమిటీ ఏర్పాటయింది. అందులో డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు, ప్రొఫెసర్ నాగభూషణశర్మ, డాక్టర్ నటరాజ రామకృష్ణ, ఉమారామారావు, కళాకృష్ణ, పేరిణి రమేష్ సభ్యులుగా ఉండి మరొక సిలబస్‌ను ఆంధ్ర నాట్యానికి తయారు చేసి ఇచ్చారు. ప్రభుత్వం ఆంధ్రనాట్యానికి గుర్తింపునిచ్చి, హైదరాబాదు సంగీత నృత్య కళాశాలలో ఈ సిలబస్ ప్రకారం తరగతులను నిర్వహించుటకు, ప్రైవేటుగా యువ కళాకారులు ఈ పరీక్షలకు వెళ్ళడానికి అనుమతిస్తూ ఉత్తరువును జారీ చేసింది. ఈ ఉత్తరువు మాకు 1995 రిపబ్లిక్ దేనాడు అందింది.

1970 నుండి మేము పిఠాపురం కాకినాడ, రాజమండ్రి, ఒంగోలు, గుంటూరు, సత్తెనపల్లి, పెమ్మపురం, దాచేపల్లి, విజయవాడలో (మూడు); గోదావరిఖని, కరీంనగర్, నిజామాబాద్, ఆర్మూర్, వేములవాడ, సిరిసిల్ల, బోధన్, సిద్ధిపేట, కర్నూలు, సూర్యాపేట, మిర్యాలగూడ, జహీరాబాద్, ముమ్మిడివరం, హైదరాబాద్‌లో (నాలుగు) సంస్థలు నెలకొల్పి, వందలాది బాలబాలికలకు ఆంధ్రనాట్యం నేర్పుతూ వస్తున్నాం. మలక్‌పేటలోని సెంట్ డోమినిక్ స్కూల్లో ఒక పెద్ద నృత్య సంస్థను ఏర్పాటు చేశాం. 1994 లో రెండు సదస్సులను 'ఆంధ్రనాట్యం' పైన విజయవాడలో శ్రీమతి శారదా రామకృష్ణ, హైదరాబాదు సెంటు డోమినిక్స్ నటరాజ రామకృష్ణ ఆంధ్రనాట్యం, పేరిణి రిసెర్చ్ ఫౌండేషను వారు నిర్వహించారు. ఔరంగాబాద్, పూనా నగరాలలోనేకాక అమెరికాలో మూడు ఆంధ్ర నాట్యసంస్థలను నిర్వహిస్తున్నాం.

# IN THE HIGH COURT OF JUDICATURE : ANDHRA PRADESH AT HYDERABAD

Thursday, of Firstday of June
One thousand nine hundred and ninty five

: PRESENT :

THE HON'BLE MR JUSTICE : B K SOMASEKHARA

W.P. MISC PETITION NO : 12808/1995

Between :

1. Smt. Sarode Manikyamma
2. Sri Ramesh
3. Sri B Kumar
4. Natrajanritvaniketan rep. by J Srikrishna.
5. Ramakrishna Nrityakalkshetram. rep. by its Director, Smt. Sarada Rama Krishna, R/o. Ashoknagar, Vijayawada-10.
6. Nataraja Nrityaniketan rep. by its Principal, Sappa Durga Prasad, Rajahmandry
7. Nataraja Nrityakalapeetam, rep. by its (Director), Haribabu R/o. Akulavari Veedhi, Guntur.
8. Sri Nataraja Rama Krishna Arts Academy, rep. by its Principal Sri Patrudu, R/o. Vijayawada.

....Petitioners (Petitioners)

and

(in wp 10399/95 on the file of the High Court).

1. Govt. of A P, rep by its Secretary, Tourism Culture, Sports & Youth Service (CA II) Department, Secretariat, Hyderabad.
2. M/s Telugu University, rep by its Vice-Chancellor, Hyderabad.
3. Secretary, Higher education, Govt. of A P., Hyderabad.
4. Secretary, Education Dept Govt of A P., Hyderabad.
5. Smt. Swapna Sundari.

....Respondents (Respondenta in do).

Petition U/s. 151 of CPC praying that in the circumstances stated in the affidavit filed in the W.P., the High Court will be pleased to pass an order directing the respondent herein to conduct the examinations for the acadamic year 1994-95 by fixing an early date pending W P. 10399/95 on the file of the High Court.

ORDER : The petition coming on for orders, upon perusing the petition and the affidavit filed in the W.P. and the order of the High Court dt. 30/31-5-95 and made herein and upon hearing the argument of Miss Venkateswari, Advocate for the petitioners and notice to respondents having been sent.

This Court while directing issue of notice to the respondents herein to show cause why this application should not be complied with and while directing issue of notice to the respondent No. 2 to show cause as to why serious action should not be taken against them if they do not comply with such a direction of this court.

The Court made the following Order :-

The main writ petition is for directions in the form of writ of mandamus to the respondents not to delete Andhra Natyam, the ancient temple dance of Andhra Pradesh, from the syllabus of Telugu University, which was recognised as a course under G.O. Ms. No. 7 Tourism Culture Sports and Youth Services (CA. II) Department dated 23.1-1995.

In this petition, an interim direction, as against the respondents, is sought to conduct the examination for such dance, according to syllabus, by fixing an early date for the academic year 1994 95 Because no standing counsel for the respondents appeared, when the case was called for more than one day, emergent notices of this petition were directed against the Registrar and V ce-chancellor of respondent No. 2 and the office has reported and produced the slips of acknowledgements for having served the notices on them on 31.5-1995 at 4-30 P.M., Inspite of it, no represntation is made for them today.

It is established, prima facie that having recognised Andhra Natyam as one of the dances and as faculty in the University, it was introduced as a discipline in Sri Tyagaraya College of Music & Dance, Hydera bad. directions were issued to conduct the examinations by Telugu University in "Andhra Natyam" dance discipline along with other disciplines of Music & Dance and further to allow private students to appear for the examination in "Andhra Natyam" through Government Music and Dance Institutions. This was done in G. O. Ms. No. 7 Tourism Culture Sports and Youth Services (CA II) Department Dt. 23-1.1995 Accordingly, as alleged, the faculty in Andhra Natyam was introduced in Telugu University, Hyderabad and steps were taken to implement the Government Order supra and consequently, it is alleged that examinations were scheduled to be held in the month of May, 1995 i.e., on 18.5.1995 along with other

disciplines of dance. It appears that number of candidates applied for such examination scheduled in accordance with the syllabus prescribed It appears that there was a paper report in Deccan Chronicle dated 17.5.1995 that the examinations for the faculty of Andhra Natyam was postponed due to unavoidable reasons although the examinations for other faculties were to be held as per shedule The grievance of the petitioner is that such a step taken by the respondent No. 2 - University, has been cryptic, intentional, and ulterior having been influenced by certain persons including one Smt. Swapna Sundari, respondent No 5, who appears to have failed in her attempts both on administrative level and in Writ Petition No. 9439 of 1995. The candidates applied for the examination who have come prepared to participate are put to lot of inconvenience and the very purpose for which the faculty was introduced in the University have been frustrated due to such an action on the part of the respondent No 2 - University. The learned advocate Miss M Venkateswari appearing for the petitioner has very strongly contended that the unavoidable circumstances mentioned in the press report. if read in between lines, show that it must be something beyond the really unavoidable circumstances but in fact by some extraneous considerations and by certain forces which are against the petitioner and such faculty of dance i e., Andhra Natyam. It is true that there are some serious allegations made in the petition which require serious probe while the main writ petition is disposed of on merits. But the manner in which the examination is postponed and the conduct of the Vice Chancellor and the Registrar of respondent No. 2 in not even opposing the petition inspite of emergent notices. exposes that such a step in postponing the examination was not really for unavoidable circumstances, but due to certain reasons which they are to explain to this Court. Therefore there appears to be merit in the miscellaneous petition to issue some interim orders. The interin order is given as follows :

The respondent No 3 shall take immediate steps to hold the examination for the faculty "Andhra Natyam" as per the syllabus, and as per schedule, within one month from today and permit all the candidates, who have already enrolled for such examination to participate subject to the Rules and Regulations of the University. Issue show cause notice to the respondent No 2 as to why serious action should not be taken against them, if they do not comply with such a direction of this Court.

Call this case after the expiry of one month from today.

Notice :

Note : The receipt of this order will be deemed to be the receipt of notice in the case The case will be taken up for hearing after three weeks from the date of this order.

Sd/- M.S K. Prabhu
Assistant Registrar.

# AFFIDAVIT

I, the undersigned person named Srimathi Kotipalli Hymavathi, Daughter of Smt. Kotipalli Manikyamba residing at Muramanda in Mandapeta Taluk of East Godavari District in Andhra Pradesh, do firmly swear and solemnly declare that :

1. The document enclosed herewith, bearing the signatures of artists from traditional dancing families and reposing confidence and trust in Smt. Swapnasundari, wife of Sri Anshu Prakash and Resident of DII/323 Vinay Marg New Delhi - 110 021, is the original Document - which has been signed in my presence.,

2. As the signaturies are old and suffering from weak health, they are not in position to present themselves in person before the Notary Public for attestation of the document.,

3. Hence, I am presenting myself before the Notary Public as the authorised representative and chief organiser of the meeting of the above said ageing artists, which took place at the place of my residence on 8th April, 1995.

4. As such, I am bound together with all the other signaturies of the enclosed document to all the Clauses and points contained therein.

5. In case of any dispute arising out of disparity between the signaturies and Smt. Swapnasundari at any point in future, I shall be bound by this affidavit, to undertake all such acts by which the dispute may be resolved and settled.

All the facts stated above are true and correct.

(Sd) కోటిపల్లి హైమవతి వ్రాలు

**Deponent**

Solemnly affirmed and signed before me at Rajahmundry on 11th day of April, 1995.

P. Seshavataram
Notary
Rajahmundry

## AFFIDAVIT / DECLARATION / REPRESENTATION

We the undersigned persons are artists who are direct descendents of the traditional dancing familes and who are related to the age-old female temple dancers who once served the Temples and Royal Courts of Telugu speaking areas of Southern India, where dancing art has passed down the

centuries into our hands have met together on 8.4.95 at the residence of Smt. Kotipalli Haimavathi at Muramanda in Mandapeta Taluk of East Godavari Dist in Andhra Pradesh and have together firmly resolved and solemnly declare that :.

a The dancing system practised by our predecessors and thereafter by us under various names in the past may hereafter be referred to as "VILASINI NATYAM" of Andhra Pradesh.

b The work being done by Smt Swapna Sundari and her associates towards the research reconstruction, revival and revitalisation of our traditional dancing system, has our full approval and support.

c) As such the codification of syllabus, teaching method performing format, Musical Score presentational format, costume and ornament design being adopted by Smt Swapna Sundari and her collegues, is to our full satisfaction and approval

d We are not in concurrence with the G O issued recently by the Government of Anhra Pradesh to recognise our dance system as 'ANDHRA NATYAM' or by any other name.

Further we are hereby submitting this representation to the Government of India and the Government of Andhra Pradesh with the requests that -

A The Government and quasi Government Departments Autonomous cultural bodies such as the National Akademis, Indian Council for Cultural Relations etc. as well as the Universities Colleges, Schools, and other Official Educational Institutions and all other departments dealing with the systematisation, dissemination, organisation and propagation of Culture and Education, may accord official and formal recognition to the Traditional female dancing system of Andhra (ANDHRA STHREE SAMPRADAYA NRUTHYAM) under the name "VILASINI NATYAM."

B) The dance discipline called "VILASINI NATYAM" be introduced in all Educational Institutions as a subject for study towards obtaining certificates, diplomas, degrees (under graduate and post graduate) and doctorates.

C) A panel of Experts of "VILASINI NATYAM" including some representatives from our traditional dancing families be constituted by the Goverment and invited to draw up suitable syllabus for each of the above said qualifications in VILASINI NATYAM.

D) The Government of Andhra Pradesh and the Government of India may kindly extend financial support for creating infrastructural facilities and to the teachers training camps and programmes which are being devised for VILASINI NATYAM, by means of which, members of our traditional families may avail the required training and qualify for teaching VILASINI NATYAM to future generations in a suitable manner.

E) That a minimum of 25% (Twenty five percent) of the total number of seats for admission into the courses of "VILASINI NATYAM" in Educational Institutions may be the reserved quota for applicants from our traditional families.

F) That a minimum of 25% (Twenty five per cent) out of the total number of

posts of Teachers/Lecturers/Professors, may be the reserved quota for qualified members hailing from our traditional families.

G) That the Government of India and Government of Andhra Pradesh may accord further recognition to "VILASINI NATYAM" by introducing it as a major dance discipline for availing scholarship/fellowships under such schemes which are already in existence or to create fresh schemes where this may be rendered possible.

H) That the Ministry of Information and Broadcasting may issue directives to Doordarshan, Film Division, Publicity and Information divisions to accord official recognition to our system of dance under the nomenclature of VILASINI NATYAM so that artists who accomplish themselves in this style, may propagate the art through National Programmes of Dance, Documentary films and other media.

I) That assisrance may be given to ageing artists of our Tradition, who are presently living in indigent circumstances by means of monthly pensions under the pension scheme.

(J) Financial assistance may also be given to old and ailling artists of our tradition by means of ad.hoc grants towards medical aid. We are making this declararion and representation through Smt. Swapna Sundari, the revivalist and protagonist of VILASINI NATYAM, in firm and full knowledge of all facts and we affirm hereby that no legal, moral or any kind of pressure or force has been brought upon us for doing so. Thereby, this representation and declaration may be deemed as officially acceptable for all such purposes as to enable the Government of the State of Andhra Pradesh and the Government of India to accede and act upon the requests made herein.

1. కోలా కొండలరావు వ్రాలు
2. కోటిపల్లి మాణిక్యాంబ వ్రాలు
3. కోలా సుబ్రహ్మణ్యం వ్రాలు
4. కోటిపల్లి పుష్పావతి వ్రాలు
5. కోటిపల్లి................వ్రాలు
6. కోలా సోమసుందరం వ్రాలు
7 కోటిపల్లి సత్యవతి వ్రాలు
8. కోటిపల్లి జేబి వ్రాలు
9 కోటిపల్లి హైమవతి వ్రాలు
10. ............ సుబ్బారావు వ్రాలు
11. సరిదే అనసూయ వ్రాలు
12. కె. పాప వ్రాలు
13. సరిదే రాణి వ్రాలు
14. కాలం పుష్పావతి వ్రాలు
15. సరిదే మైథిలి వ్రాలు
16. సరిదే లక్ష్మీదేవి వ్రాలు
17. సరిదే రత్నపాప వ్రాలు
18. పువ్వుల వెంకటలక్ష్మి వ్రాలు
19. పువ్వుల సూరేకాంతం వ్రాలు
20. సరిదే నారీమణి వ్రాలు
21. పువ్వుల సీతారత్నం వ్రాలు
22. సరిదే సీతామహాలక్ష్మి వ్రాలు
23. సరిదే వరహాలు వ్రాలు
24. సరిదే.......... వ్రాలు
25. పువ్వుల చిన సావిత్రి వ్రాలు
26. కోటిపల్లి మనోరంజని వ్రాలు
27. మద్దుల జానకమ్మ వ్రాలు
28. సరిదే నాగమణి వ్రాలు
29. ........... ................
30. యండమూరి సూర్యకాంతం వ్రాలు

Representative : కోటిపల్లి హైమవతి వ్రాలు.

# Name of Eminent Persons Who have selected the name "VILASINI NATYAM" for the Temple Dance of Andhra Pradesh

1. Dr. Arudra, (Eminent Poet, Historian & Author).
2. Shri B N. Shastri (Noted Historian).
3. Dr. C. Narayana Reddy (Advisor, Languages & Culture Government of Andhra Pradesh).
4. Shri B N. Sundaram (Musicologist)
5. Smt. Lakshmi Raghuramiah (Noted Social Worker, Writer & Philoanthropist).
6. Padma Bhushan Smt. Kalanidhi Narayana (Renowned Abhinaya Specialist).
7. Dr. K. Ramalakhsmi (Noted Writer & Feminist).
8. Sri Palagummi Viswantham (Senior Veena Vidwan & Music Composer).
9. Sri G. Ulaganathan (Journalist).
10. Raj Kumar Singhajit Singh (Renowned Dancer & Guru of Manipuri).
11. Dr. Pran Neville (Special Research Author on Devadasi Tradition).
12. Smt. Kumudini Lakhia (Akademi Awardee, Renowned Kathak Guru & Exponent).
13. Dr Jeevan Pani (Scholoar of Orissa Dance Traditions).
14. Shri M L Koser (Registrar, Pracheen Kala Kendra).
15. Smt. Vijaya Mehta (Akademi Awardee, Eminent Theatre Personality),
16. Dr. Kamlakur Sontakke (Eminent Theatre personality, Chief Executive Nehru Centre, Bombay).
17. Shri Goverdhan Panchaal (Foremost Authority on Sanskrit Theatre).
18. Manjusri Chaki Sircar (Akademi Awardee & Eminent Choreographer).
19. Sanjukta Panigrahi (Foremost Exponent of Orissa).
20. Dr. A.S Raman (Noted Journalist).

పైని పేర్కొన్న ఇరవై మంది ప్రముఖులు ఆంధ్రుల ఆరాధనా నాట్యమైన "ఆంధ్ర నాట్యాని"కి "విలాసినీ నాట్యం" అన్న పేరు ఎంపిక చేశారని శ్రీమతి స్వప్నసుందరి ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టులో ఒక అఫిడవిట్ దాఖలు చేశారు.

ఆంధ్రుల ఆలయ నృత్యమైన ఆంధ్ర నాట్యమెక్కడ? "విలాసినీ నాట్య''మెక్కడ? విలాసినీ నాట్యమంటే వేశ్యల నాట్యమన్నమాట! ఎంత అన్యాయం? ఎంత అపచారం? ఎంత ఘోరం?

తన పవిత్ర కళకు జరుగుతున్న ఇంత అన్యాయం, అపచారం, ఘోరం జరుగుతూంటే ఆంధ్ర నృత్య సరస్వతి చూస్తూ ఊరుకొంటుందా?

పశ్చిమ గోదావరి జిల్లాలోని బల్లిపాడు గ్రామంలో వెలిసిన శ్రీ మదన గోపాలస్వామికి అంకితమై, ఆ యాలయ మూర్తిని నృత్య పూజతో ఆరాధించిన కడు వృద్ధురాలు శ్రీమతి సరిదె మాణిక్యమ్మ—

ప్రసిద్ధ ఆచార్య పీఠమైన శ్రీమతి కందికట్టు మాణిక్యం గారి శిష్యురాలు, ప్రాచీన భరత శాస్త్ర రీతులను అధ్యయనం చేసిన భరతశాస్త్ర కోవిదురాలు, నాట్యకళలోనే గాక నాటక కళ యందు గూడ విశేష పాండిత్యం గల విద్వాంసురాలు, 200 పైగా చలన చిత్రాలలో నటించిన మేటి నటి, ఏలూరు వాస్తవ్యురాలు, ఎనభై ఏళ్ళ వృద్ధురాలు శ్రీమతి పువ్వుల లక్ష్మీకాంతమ్మ.

కోనసీమలో ప్రసిద్ధులైన, భరత శాస్త్రములో విఖ్యాతులైన అన్నాబత్తులవారి వంశంలో 2౦ వ శతాబ్ది ప్రారంభంలో జన్మించిన, తర్క, వేదాంత, మీమాంస, వ్యాకరణాది శాస్త్రాలలో, ఆంధ్ర గీర్వాణ భాషలలో మహా పండితురాలుగా "రెడ్డి శాస్త్రి" బిరుదాంకితురాలైన అన్నాబత్తుల రెడ్డమ్మగారి చెల్లెలు కుమార్తె, భరత కళాప్రపూర్ణ, స్వర్గీయ శ్రీమతి అన్నాబత్తుల బులి వేంకట రత్నమ్మగారి కుమార్తె, భరత విద్యా ప్రవీణురాలైన శ్రీమతి అన్నాబత్తుల సత్యభామ—

శ్రీమతి అన్నాబత్తుల సత్యభాను కుమార్తె, సాత్వికాభినయ విద్వాంసురాలు శ్రీమతి అన్నాబత్తుల లక్ష్మీమంగ తాయారు హైదరాబాదులో 1995 జూను 8 వ తేదీన సమావేశమై, 'విలాసినీ నాట్యము' అన్న పేరు విషయమై ఈ క్రింది విధంగా వారి అభిప్రాయాన్ని తెలియజేశారు:

"విలాసినీ నాట్యము" అన్న పేరును ఎంపిక చేసిన ఇరవై మందిలో ఆరుగురు ఆంధ్రులు ఉన్నారు. వీరిలో ఎవరికీ 'ఆంధ్ర నాట్యం' గురించి పూర్తిగా తెలియదు. "విలాసినీ నాట్యము" అని పేరు పెట్టడానికి సూత్రధారులైన డాక్టర్ అరుద్రగారు, వారి సతీమణి శ్రీమతి డాక్టర్ రామలక్ష్మిగారు ఈ పేరును ఎంపిక చేశారంటే ఆశ్చర్యపడనవసరం లేదు. స్త్రీల ఔన్నత్యానికి శ్రమిస్తున్న మాతృమూర్తి శ్రీమతి లక్ష్మీ రమణారావుగారు వీరిలో ఒకరు. స్త్రీ జాతికే కళంకమైన, ఆంధ్ర నారీలోకం తలవంపులు తెచ్చే "విలాసినీ నాట్యం" అన్న పేరును ఈ మాతృమూర్తి ఎలా ఎంపిక చేశారో ఆశ్చర్యంగా ఉంది. ఇందులో ఏదో మోసం జరిగి ఉండవచ్చును. ఆమె పొరపాటుపడియుండవచ్చును.

"విలాసినీ నాట్యం" అన్న పేరును ఎంపిక చేసిన మిగిలిన 14 మందిలో కొందరికి నాట్యం తెలిసియుండవచ్చును గాని, వారికి తెలుగుదేశం గురించి గాని, తెలుగు భాష గురించి గాని, తెలుగు సంస్కారం గురించి గాని, ఆచార వ్యవహారాల గురించి గాని, ఆలయాలు, ఆలయాలలోని ఆరాధనా విధానాల గురించి గాని సంపూర్ణంగా తెలిసియుండదు. అలాంటివారు ఈ "విలాసినీ నాట్యం" అన్న పేరును ఎంపిక చేసినందుకు మనం క్షమించవలసినదే కాని వారిని తప్పుపట్టలేము. [illegible] ఈ పేరును అంగీకరించియుండరు

ఈ "విలాసినీ నాట్యం" అన్న పేరును ఆమోదించినట్లు అఫిడవిట్‌లో సంతకాలు చేసినవారు మోసపోయినట్లు వారు తర్వాత [illegible] వ్రాసిన లేఖలబట్టి ఋజువు అవుతున్నది.

కోర్టులో ఈ విషయము విచారణకు వచ్చినప్పుడు గౌరవనీయులైన న్యాయమూర్తులు వీరిలో కొందరినైనా న్యాయస్థానమునకు పిలిపించి విచారించవలసినదిగా కోరుతున్నాము."

పైని పేర్కొనబడిన 20 మంది ప్రముఖులలో కొందరి చిరునామాలు నాకు తెలుసును. వారికి లేఖలు వ్రాయగా వారు నాకు వ్రాసిన సమాధాన లేఖలు ఇక్కడ ప్రచురిస్తున్నాను.

B. N. SASTRY
M.A.

Phone : 633967
3.4.245/1
Lingampally
Hyderabad - 500027.

9.6.1995

పూజ్యులు నటరాజ రామకృష్ణ గారికి హృదయపూర్వక నమస్కారములు.

ఆర్యా,

మీరు వ్రాసిన 8.6.95 నాటి లేఖ అందినది. విషయము గ్రహించినాను.

డా. ఆరుద్రగారు, శ్రీమతి స్వప్నసుందరిగారు నాకు వ్రాసిన లేఖలో—

1. కళావతి నాట్యము
2. భోగిని నాట్యము
3. విలాసిని నాట్యము

పేర్లలో నొకదానిని ఎన్నిక చేసి పంపవలసినదని కోరినారు. నేని మూడు పేర్లు ఆంధ్రులను కించపరచు విధముగా నున్నవని తెలుపుచు, మీ కంతగా కోరిక యున్న ఆంధ్ర విలాసిని నాట్యమను పేరు పెట్టుకొనవచ్చునని వ్రాసినాను. అందుకు డాక్టర్ ఆరుద్రగారి నుండి నాకు రెండు లేఖలందినవి. అందొకటి మూడు పేర్లను నే నంగీకరింపనందుకు చింతించుచున్నాననియు, రెండవది విలాసిని నాట్యము (ఆంధ్ర) కు సంతసించు చున్నాననియు వ్రాసినారు.

సహజముగ ఆంధ్ర నాట్యమను పదము పొందాగను, ఆంధ్రజాతి కీర్తి ప్రతిష్ఠల నినుమడింప జేయునదిగను వున్నదని నా భావన.

విలాసినులు లోగా నుండెడివారు. కాకతి గణపతిదేవ చక్రవర్తి గురువు విశ్వేశ్వర శివదేశికుడు మందడ అగ్రహార దాన శాసనమున విలాసినులకు భూదానము ప్రకటించినాడు కాని, వారు దేవాలయములందు నాట్యము చేయువారు కారు. గుడి సానులు (సాని మున్నూర్వురు, చిన్న మున్నూరు, పెద్ద మున్నూరు సానులు) అను పదములు నాట్యము చేయు సానుల సంస్థగా ప్రసిద్ధి గాంచినవి. ఆంధ్ర దేశమున దేవదాసి పదముగూడ ప్రచారములో లేదు. నేను చదివిన సుమారు నాలుగు వేల శాసనములందు దేవదాసి పదము గాని, దేవాలయములందు నాట్యము చేయు విలాసినులు గాని పేర్కొనబడలేదు.

దేవగణికలు, గుడిసానులు ఆంధ్రదేశమందున్న ప్రసిద్ధమైన దేవాలయములందు రంగమంటపములు నిర్వహణ బాధ్యత వహించియుండిరి. విలాసిని నాట్యమను పేరు మన ఆంధ్రుల నాట్య శాస్త్రమునకే ఒక మచ్చ వంటిదని తెలుపుచు విరమించుచున్నాను

ఇట్లు
(సం.) బి. ఎన్. శాస్త్రి
9.6.95.

Dr. Manjusri Chaki Sircar,
M.A. Bengali (Calcutta University)
M.A. Ph.D. Anthropology
(Columbia University)

Nibbani,
EC-49, Salt Lake City,
Section-1, Calcutta-700 064.
Phone : 37-098?.
Date : 17-06 1995.

Dear Dr. Nataraja Ramakrishna,

I received your letter of 8-06-1995 just yesterday. I am sorry to say that I did not recommend the name "Vilasini Natyam" for the temple dancing of Andhra Pradesh. My choice was "Kalavanti Natyam" Perhaps the proposed name was given by the majority and it is expected that the name 'Vilasini' will be introduced.

The decision of the majority really intrigues me since the very term 'Vilasini' is indicative of a class of frivolous entertainer (female). This is definitely contradictory to women's role in the present dance world.

With regards,

Sd/- MANJUSRI CHAKI SIRCAR
Artistic Director,
Dancer's Guild.

# కళావంతుల లేఖలు

30.5.95

మా॥ శ్రీ [illegible] N. T రామారావు గారికి [illegible]:

[illegible] శ్రీ [illegible] దాసు [illegible] [illegible] పంపిన అహ్వానం [illegible] అహ్వానం [illegible] గలరు.

[illegible] 1994 ఆగస్టు 29 వ తేదీన రాజమండ్రి [illegible] కోరుకొండ దేవాలయంలో శ్రీమతి మద్దుల లక్ష్మీనారాయణ [illegible] ద్వారా సూత్రధారణ [illegible]. ఇది శాస్త్ర విరుద్ధం. దీనిని ఆ దేవాలయ [illegible] ఎలా అనుమతించారో తెలియదు.

విలాసిని అంటే వేశ్య అని అర్థం. ఈ స్వప్న విలాసిని రాజమహేంద్రవరంలో తొలి పని చేసింది. తర్వాత ఆమె తన నాట్య సంప్రదాయానికి విలాసినీ నాట్యం అని తన గురువుగారి సలహా మేరకు పేరు పెట్టింది. పూర్వం మేము నాట్యం చేసేవారము మా కులం పేరును మేమే పెట్టుకొనదంలేదు. కులాల ప్రసక్తిని ప్రభుత్వమే నిషేధించింది. అలాంటిది ఇప్పుడు ఈ విలాసినీ నర్తనమేమిటి? మన తెలుగు జాతికే తలవంపులు, అప్రతిష్ఠ.

ఈ విలాసినికి శ్రీ [illegible]గారు గురువు అట. ఈ స్వప్న విలాసిని గురువుకు అసలు నాట్యం తెలుసా? ఎప్పుడైనా నాలుగు అడవులు గాని అడుగులు గాని వేశారా? అసలు అడవులకు అడుగులకు భేదం తెలుసా? ఈయన తల్లిగాని, అమ్మమ్మగాని ఎప్పుడైనా నాట్యం చేశారా? ఈయన ఈనాడు డబ్బుకు కక్కుర్తిపడి ఈమెకు గురువు ననిపించుకుంటూ తప్పుడు పనులు చేస్తూ, శాస్త్ర విరుద్ధమైన ప్రచారం చేస్తున్నారు.

ఈ విలాసినీ నాట్య కళాకారిణి అయిన శ్రీమతి స్వప్న సుందరి కూచిపూడి నాట్యకర్తె. ఈమె కోనసీమ శ్రీ సాంప్రదాయ నృతం మీద పరిశోధన చేస్తానని చెప్పి, ఢిల్లీ మునిసిపాలిటిలో పనిచేస్తున్న తన భర్తద్వారా హ్యూమన్ రిసర్చివారినుండి గ్రాంటు తీసుకుని విచ్చలవిడిగా ఖర్చు పెడుతూ తెలగింటి కన్యలను మభ్య పెట్టి,వారిని విలాసినులను చేయాలని ప్రయత్నిస్తున్నది.

ఈమెకు సూత్రధారణ చేసిన శ్రీమతి మద్దుల లక్ష్మి నారాయణ కన్యగా సూత్రధారణ పొందిందా లేక ఒకరిని పెళ్ళి చేసుకొన్న తర్వాత సూత్రధారణ పొందిందా? దేవునికి అంకితమై సూత్రధారణ పొందడానికి కన్యలే అర్హులు. వారు మరి మామూలు వివాహం చేసుకొనే వారు కాదు.

శ్రీ కోరుకొండ నరసింహమూర్తి ఈ సూత్రధారణను ఎలా అంగీకరించారు?

ఈ విషయాన్ని తమరు విచారించి తెలుసుకొనగలరు.

30.5.95 — ఇట్లు

భీమవరం — సరిదే నర్సమ్మ వ్రాలు

దీని నకలు సింహాద్రి సత్యనారాయణ
దేవాదాయ, ధర్మాదాయ శాఖమాత్యుల
వార్కి సమర్పించుకోవడమైనది.

మహారాజశ్రీ గౌరవనీయులైన ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి శ్రీ నందమూరి తారక రామారావు గార్కి—

అయ్యా, నమస్కారములు.

ఈ మధ్య స్వప్నసుందరి అనే ఒక నర్తకి మా గ్రామము వచ్చి మా విద్యలు గురించి తెలుసుకొన్నది. ఆమె నాట్యాన్ని మేము విలాసిని నృత్యముగా అంగీకరించ లేదు. ఆ విషయములు అనగా ఆంధ్ర నాట్యము గురించి గాని, విలాసిని నాట్యము గురించిగాని ఆమె ఏమి చెప్పలేదు. కేవలం వృద్ధ కళాకారులకు పెన్షన్ ఇప్పిస్తానని తెల్లకాగితముపై మా సంతకములు తీసుకొన్నది. ఎలాంటి స్టాంపుడు పేపరు మీద మేము సంతకము చేయలేదు. మేము కోటిపల్లి హైమవతి ఇంటి దగ్గర సమావేశము కాలేదు. దువ్వలోనే కలిశాము.

దువ్వ,
పశ్చిమగోదావరి జిల్లా,
ఆంధ్రప్రదేశ్,
3-6-1995.

ఇట్లు
సరిదే అనసూయ వ్రాలు
సరిదే మైథిలి వ్రాలు

దువ్వ,
3-6-95

మహారాజశ్రీ నందమూరి తారక రామారావు ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రివర్యులకు నమస్కారములు.

అయ్యా

ఈ మధ్య మా గ్రామము స్వప్నసుందరి అనే నర్తకిమణి వచ్చి మాకు వచ్చిన విద్యలు గురించి తెలుసుకొన్నది. ఆమె విలాసిని నృత్యం గురించి మాతో సెప్పలేదు. ఆ నాట్యము అంగీకరించనూ లేదు. మాకు వృద్ధాప్యపు ఫించనులు యిప్పిస్తానని మాత్రం మావద్ద నుంచి సంతకాలు తీసుకున్నారు. అదియు వట్టి తెల్లకాగితం మాత్రమే. ఆ పేపరుపై ఎటువంటి మేటరు వ్రాయలేదు. మా సంతకాలు అన్నియు ఆమె ఒక కోర్టు విషయంలో ఉపయోగించనున్నట్లు తెలిసినది. ఆమె విలాసినీ నాట్యంతో మాకు సంబంధం లేదు. మేము మురమండ వద్ద సమావేశము కాలేదు దువ్వలోనే మా యింటి వద్దనే సంతకం చేసినాము.

ఇట్లు
సరిదే రత్నపాప వ్రాలు
పువ్వల చిన్న సావిత్రి వ్రాలు
పువ్వల సీతారత్నం వ్రాలు

మహారాజశ్రీ పూజ్యులైన ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు గారి దివ్య సముఖమునకు.

అయ్యా,

ఢిల్లీ నివాసి అయిన శ్రీ స్వప్నసుందరి అనే నాట్యాధారిణి కోనసీమ నృత్య సాంప్రదాయము పేరిట రీసెర్చి చేస్తు మా గ్రామము దువ్వ వచ్చి మా నృత్య సాంప్రదాయాన్ని రికార్డు చేసుకొని మాకు సంబంధించిన నాట్యమునకు విలాసిని నాట్యము అని పేరు పెట్టినట్లు తెలుపుటకు వచ్చినది. అలా విలాశిని నాట్యము అని పేరుపెట్టుటకు మాకు అభ్యంతరకరము మాకు తెలియవచ్చిన అభిప్రాయములో ఆలయ సాంప్రదాయము ప్రకారము వివాహము చేసుకొన్నట్లు తెలిసినది. అలా జరుగుట చట్ట విరుద్ధము. అది కూడా మాకు అభ్యంతరకరము. కావున విలాసిని నాట్యము అని పేరు పెట్టుట మాకు పూర్తిగా అభ్యంతరకరము కావున అలా జరుగకుండా చూసి మా కులమునకు న్యాయము చేకూర్చునట్లు చేయవలసినదిగా కోరుచున్నాము.

ఇట్లు
తమ విధేయులు
సరిదే రాణి వ్రాలు
పువ్వల నూరేకాంతం వ్రాలు

దీని నకలు శ్రీ దేవదాయశాఖ మంత్రి సింహాద్రి సత్యనారాయణ వార్కి సమర్పించుకొనడమైనది.

# దువ్వ కళావంతుల సంఘం

రిజిష్టర్డు నెం. 308/88

## దువ్వ తణుకు మండలం, ప॥ గో॥ జిల్లా

| ప్రెసిడెంటు : | గౌరవ అధ్యక్షులు : | సెక్రటరీ : |
|---|---|---|
| సరిదే శేషగిరిరావు | సరిదే శివన్నారాయణ | సరిదే నరసింహారావు |

30-5-95

మహారాజశ్రీ గౌరవనీయులైన ముఖ్యమంత్రి N. T. రామారావుగారి దివ్య సముఖమునకు పై సంఘము వారు వ్రాసుకొను విన్నపము.

అయ్యా!

ఒకనొక ఢిల్లీ విప్రవిలాసిని మదరాసు వాసియైన ఒక విప్రవిలాసిని నాట్యాచార్యునితో కలసి మాకు పంపిన ఆహ్వానాన్ని దీనితో జతపరచి మీకు పంపుచున్నాము. ఈ ఆహ్వానము యొక్క ఉచితానుచితానులను తమరు యోచించగలరు. కన్యలకు సూత్రధారణ అనేది దేవ గణికలుగా దేవాలయాలలో పూర్వము జరిగేది. కాని ఒక భర్తకు విడాకులు ఇచ్చి రెండవసారి వివాహము చేసుకున్నవారికి ఇలా జరిగేది కాదు. స్వప్న సుందరి అనే ఈ విప్ర విలాసిని విజయకుమార్ అనే భర్తనున్న వివాహమాడి విడాకులిచ్చి వేరొకరితో కాపురము చేయుచున్నట్లు తెలిసింది 1994 ఆగష్టు 29వ తేదీన రాజమండ్రి దగ్గరలోని కోరుకొండ నరశింహస్వామి దేవాలయంలో శ్రీమతి మద్దుల లక్ష్మీనారాయణ అనే మేజావాని నర్తకి ద్వారా సూత్రధారణ చేసుకొన్నది ఇది శాస్త్ర విరుద్ధము. దీనిని ఆ దేవాలయ ధర్మకర్తలు ఏలా అనుమతించారో తెలియదు. విలాసిని అంటే వేశ్య అని అర్థము. ఈ విప్ర విలాసిని రాజమహేంద్రవరంలో తాలివినికి చేసినది. ఆ తరువాత ఆమె నాట్య సంప్రదాయానికి విలాసినీ నాట్యమని నామకరణం చేసింది. పూర్వము మేము నాట్యము చేసేవారము. మా కులం పేరును మేము పెట్టుకోవడంలేదు. కులాల ప్రసక్తి ప్రభుత్వమే నిషేదించింది. అలాంటిది ఇప్పుడు విలాసిని నాట్యమని నామకరణం చేసింది. అలాంటిది ఇప్పుడు విలాసినీ నర్తనమేమిటి? తెలుగు జాతికి తలవంపు. ఈ విలాసినీ, వేశ్యా అనే పదములు మా సంఘమునకు అప్రదిష్ట కలిగించుచున్నవి. ఏనాడో మా కులమునకు సంస్కరణ దృష్ట్యా పై సంఘమువారు చాలా కాలము నుండి ప్రభుత్వముతో పోరాడి, చివరకు మొన్న ఈ మధ్యనే సూర్య బలిజ అనే పేరుతో మా కులమునకు నామకరణం చేసియున్నాము అది గెజిట్ పబ్లికేషన్ కూడా జరిగింది. ఇప్పుడు స్వప్న సుందరి, ఆమె గురువుగారైన అరుద్రగారు ఈ విప్ర విలాసినీ అనే నాట్యంతో మా కులస్తులను మరియు నాట్యాభిమానులను తప్పు త్రోవను పట్టించి శాస్త్ర విరుద్ధమైన ప్రచారం చేయుచున్నారు. ఈ విలాసిని నాట్యకళాకారిణి శ్రీమతి స్వప్న సుందరి కోనసీమ సంప్రదాయ నృత్యము మీద పరిశోధన చేస్తానని చెప్పి ఢిల్లీ మున్సిపాలిటీలో పని చేయుచున్న తన భర్తద్వారా హ్యూమన్ రిసర్చి వారినుండి గ్రాంట్ తీసికొని విచ్చల విడిగా ఖర్చుపెడుతూ తెలుగింటి

కన్యలను మభ్యపెట్టి వారిని విలాసినీలుగా తయారు చేయాలని ప్రయత్నిస్తుంది. ఈమెకు సూత్రధారణ చేసిన శ్రీమతి మద్దుల లక్ష్మినారాయణ ఆమె కన్యగా ఉండగా సూత్రధారణ పొందిందా? లేక ఎవరినైనా పెళ్ళి చేసుకున్న తరువాత పొందిందా? కేవలం దేవునికి అంకితమై సూత్రధారణ పొందటానికి కన్యలే అర్హులు. ఇతరులు అర్హులు కాదు. పై విషయములన్నియూ ప్రభుత్వమువారు పూర్తిగా విచారించి మా కులస్తులకు అప్రదిష్ట కలుగని రీతిలో మాకు న్యాయము చేకూర్చి ఈ విలాసినీ నాట్యమును రద్దుపరచవలసినదిగా కోరుచున్నాము.

ఇట్లు
సంమాధ్యక్షులు
**సరిదే శేషగిరిరావు**

కార్యదర్శి
**సరిదే నరసింహారావు**
30-5-95

## సభ్యులు

1. సరిదే గణేష్ ప్రాలు
2. సరిదే పద్మావతి ప్రాలు
3. సరిదే సత్యవతి ప్రాలు
4. సరిదే వల్లిదేవి ప్రాలు
5. సరిదే కృష్ణవేణి ప్రాలు
6. సరిదే వెంకట సుబ్బారావు ప్రాలు
7. సరిదే రాణి ప్రాలు
8. సరిదే సూరిబాబు ప్రాలు
9. సరిదే గణపతిరావు ప్రాలు
10 పువ్వల సూరేకాంతం ప్రాలు
11. సరిదే త్రిమూర్తులు ప్రాలు
12. సరిదే రాజారావు ప్రాలు
13. సరిదే శ్రీనువాసు ప్రాలు
14. సరిదే వేంకటేశ్వరరావు ప్రాలు
15. సరిదే శ్రీనివాసు ప్రాలు
16. సరిదే జయలక్ష్మి ప్రాలు
17. సరిదే రత్తమ్మ ప్రాలు
18. సరిదే రాజేశ్వరరావు ప్రాలు
19 పువ్వల సీత ప్రాలు
20. యింవమూరి మాణిక్యంబ ప్రాలు
21. సరిదే రాధాకృష్ణ ప్రాలు

# ఆంధ్ర నాట్యంపై టి.వి. కార్యక్రమాలు : గాడ్గిల్ హామీ

(ఆంధ్రపత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, డిసెంబరు 21: కార్యక్రమ అవసరాలనుబట్టి ఆంధ్రప్రదేశ్‌లో ప్రఖ్యాతిగాంచిన ఆంధ్ర నాట్యం, పేరిణి తాండవం కార్యక్రమాలను ఢిల్లీ దూరదర్శన్ కేంద్రంద్వారా ప్రసారం చేస్తారు. ఈ మేరకు రేడియో, సమాచారశాఖామంత్రి శ్రీ వి.ఎన్. గాడ్గిల్ లోకసభలో హామీ యిచ్చారు. హైదరాబాద్ దూరదర్శన్ కేంద్రం ఈ కార్యక్రమాలను ప్రసారం చేస్తున్నదని ఆయన తెలిపారు.

ఆంధ్రప్రదేశ్‌లో ఆంధ్ర నాట్యం, పేరిణి తాండవం అనే రెండు ప్రాచీన నృత్య పాఠశాలలు వున్న విషయం ప్రభుత్వానికి తెలుసునని కూడా మంత్రి వివరించారు.

(విజయవాడ, ఆంధ్రపత్రిక - ఆదివారం డిసెంబరు 22, 1985)

# నర్తన వివాదం

తిరుపతి దేవుడి 'నామాలు' (తిరుమణికాపు) ఇలా ఉండాలి అంటే, కాదు ఇలా ఉండాలి అని వివాదం రేగి కోర్టుకు వెళితే భక్తుల సహా దృష్టినంతా తీర్పుపై కేంద్రీకరించినట్టే, ఆలయ సంబంధమైన స్త్రీ సంప్రదాయ లాస్య నర్తనానికి 'ఆంధ్రనాట్యం' అనే 'నామం' సరైంది కాదని నర్తకులు ఒక కళాప్రక్రియ సాధికారాన్ని ప్రశ్నిస్తూ ఇటీవల కోర్టుకు వెళ్ళడంతో కళా హృదయులందరి దృష్టి ఎంతో ఉత్సుకతతో అటువైపు మళ్ళింది.

దీన్ని మించి - 'ఆంధ్రనాట్యం'లో డిప్లొమా సర్టిఫికెట్ కోర్సుల పరీక్షలను నిర్వహించవలసిన తెలుగు విశ్వవిద్యాలయం ఒకరోజు గడువుతో అర్ధాంతరంగా వాటిని వాయిదా వేయడంతో పరీక్షకు హాజరుకావలసిన సుమారు నలభై ఏడు మంది విద్యార్థులు దిక్కుతోచని స్థితికి లోనయ్యారు. ఈ బాణీ నృత్యం నేర్చుకుంటున్న నర్తకులంతా ఆందోళనకు గురయ్యారు. అయితే - నెల రోజులలో 'ఆంధ్రనాట్యం' పరీక్షలను నిర్వహించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని హైకోర్టు న్యాయమూర్తి బి. కె. సోమశేఖర మధ్యంతర ఆదేశాలు జారీ చేయడంతో 'ఆంధ్రనాట్యం' సాధన చేస్తున్న విద్యార్థి లోకం ఊరడిల్లింది.

కూచిపూడి, భరతనాట్యం రీతులలో విశేష కృషిచేసి ఢిల్లీలో స్థిరపడిన ప్రముఖ నర్తకి శ్రీమతి స్వప్నసుందరి ఇటీవలి కాలంలో మరుగునపడిన తెలుగువారి దేవాలయ నృత్య సంప్రదాయాన్ని పరిశోధించి పునరుద్ధరించేందుకు రంగంలోకి దిగారు. కోనసీమ బాణీలో గోదావరి మండలానికి ఖ్యాతి సంపాదించిన శ్రీమతి మద్దుల లక్ష్మీనారాయణ వద్ద స్వప్నసుందరి ఈ విద్య అభ్యసించారు. ఈ సంప్రదాయంలో మానేపల్లి బాణీతోపాటు ఇతర బాణీలను సైతం ఆమె అధ్యయనం చేసింది. కూచిపూడి, భరతనాట్యం నాట్యాలకంటే మౌలికంగా విభిన్నమైన ఈ నృత్య బాణీకి 'విలాసిని నృత్యం' అని నామకరణం చేశారు.

ఈ నేపథ్యంలో శ్రీమతి స్వప్నసుందరి 'ఆంధ్ర నాట్యం' అన్న పేరును శ్రీ నటరాజ రామకృష్ణ పునరుద్ధరించిన నృత్య విశేషానికి పెట్టడం వల్ల పక్తు ఆంధ్రదేశానికి చెందిన కూచిపూడి తదితర నృత్యాలేవీ ఆంధ్రుల నాట్యాలు కావని, కేవలం ఈ 'ఆంధ్రనాట్య'మే ఆంధ్రుల నాట్యమనే దురభిప్రాయం ముందు తరాల్లో ఏర్పడగలదనే వాదనకు దిగారు. ఆంధ్రప్రదేశ్‌లో పురుష సంప్రదాయమైన కూచిపూడి నృత్యం, స్త్రీ సంప్రదాయమైన 'ఆంధ్ర నాట్యం' రెండూ రెండు కళ్ళలాంటివి. వాటిలో దేని విశిష్టతకు భంగం కలగకూడదు.

పోతే - శ్రీ నటరాజ రామకృష్ణ పునరుద్ధరించిన 'ఆంధ్రనాట్యం'లో ఆంధ్ర స్త్రీ సంప్రదాయ లాస్యబాణీ ప్రతిబింబించడం లేదని శ్రీమతి స్వప్నసుందరి పేర్కొన్నారు. ప్రస్తుతం నటరాజ రామకృష్ణ శిక్షణ ఇస్తున్న ఆంధ్రనాట్యం స్వేచ్ఛగా ఆయన పునరుద్ధరించిన బాణీగా ఆమె పేర్కొన్నారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం గత జనవరి 23న ఆంధ్రనాట్యాన్ని ప్రాచీన ఆలయ నృత్యంగా గుర్తించింది. హైదరాబాద్ సంగీత నృత్య కళాశాలలో ఈ తరగతులు నిర్వహించడానికి అనుమతి ఇస్తూ, ప్రైవేట్‌గా యువ కళాకారులు ఈ పరీక్ష యివ్వడానికి అనుమతి ఇస్తూ జి.వో. జారీచేసింది. ఈ 'ఆంధ్రనాట్యం' పాఠ్య ప్రణాళికను సైతం

తెలుగు విశ్వవిద్యాలయం ఆమోదించింది. 1995 మార్చిలో ప్రచురించింది. పాఠ్య ప్రణాళిక ప్రకారం - ఆంధ్రనాట్యం సర్టిఫికెట్ కోర్సు నాలుగు సంవత్సరాలు చదవవలసి వుండగా, డిప్లొమా రెండేళ్ళు చదవాలి. పైగా, ప్రస్తుతం ఏ ప్రభుత్వ కళాశాలలో, తెలుగు విశ్వవిద్యాలయంలో ఆంధ్రనాట్యం ఫాకల్టీ లేనప్పుడు 1995 మే 18 తర్వాత పరీక్షలు నిర్వహిస్తున్నట్టు నోటిఫికేషన్ జారీ చేయడం అన్యాయమని, పక్షపాతంతో కూడిన చర్య అని స్వప్న సుందరి, ఆమెతోపాటు మరో ముప్పైమంది వృద్ధ నర్తకులు వేసిన రిట్‌లో పేర్కొన్నారు. పైగా, ప్రాచీన ఆలయ సంబంధమైన స్త్రీ సంప్రదాయి ఆలయ లాస్య నర్తనాన్ని "విలాసిని నృత్యం"గా తీర్చిదిద్దినట్టు, దీనికి మాత్రమే అసలుసిసలు ప్రాచీన ఆలయ నృత్యంగా గుర్తింపు ఇవ్వాలని ఆమె విజ్ఞప్తి చేశారు. విజ్ఞులైన ఇరవైమంది నాట్యాచార్యులు, డాక్టర్ ఆరుద్రలాంటి పరిశోధకులు 'విలాసిని' నాట్యమే అసలుసిసలు ఆంధ్ర ఆలయ లాస్య నర్తనమని పేర్కొన్నట్టు ఆమె వివరించారు.

ఆంధ్ర ఆలయ లాస్య సంప్రదాయ పరిరక్షణకు నడుంకట్టిన ఇతర నర్తకులను ఎంత మాత్రం పట్టించుకోకుండా కేవలం 'ఆంధ్రనాట్యం' విద్యార్థులకు సహకరించాలనే పక్షపాత దృష్టితో ఈ నోటిఫికేషన్ జారీ చేశారని, అందుచేత జి.వో.ను నిలిపివేసి ఈ అంశాన్ని పునఃపరిశీలించాలని ఆమె కోరారు. ఈ జి.వో. వల్ల, పరీక్షల నోటిఫికేషన్ వల్ల ఆలయ నర్తకులకు చెందిన సంప్రదాయ శైలీ నర్తనం చేసే అనేకులు ఇతర నర్తకులు సైతం నేరుగా ఈ పరీక్షలకు వెళ్ళే అవకాశం లేకుండాపోయిందని, తిరిగి వారు సైతం 'ఆంధ్రనాట్యం' నేర్చుకోవలసిన పరిస్థితి ఎదురైందని ఆమె వాదించారు. 'విలాసిని నృత్యం' లాంటి ఆలయ లాస్య నర్తనాలు నేర్చుకునే విద్యార్థులు అవకాశాలు కోల్పోతారని ఆమె వాదించారు.

'ఆంధ్రనాట్యం' అని కాకుండా స్త్రీ సంప్రదాయ ఆలయ నృత్యంలో పరీక్షలు నిర్వహించడానికి కొత్తగా ఉత్తర్వులు జారీ చేయాలని, ఈ స్త్రీ సంప్రదాయ ఆలయ నృత్యానికి సిలబస్ రూపొందించడానికి సంప్రదాయంగా ఆలయాల్లో నృత్యం చేసే కుటుంబాలకు చెందినవారు, ఇతర నృత్య సంస్థల ఆచార్యులు, ఈ నృత్య సంప్రదాయ పునరుద్ధరణకు పాటుపడుతున్నవారితో కమిటీ వేయాలని కూడా ఆమె సూచించారు. నోటిఫికేషన్ మేరకు పరీక్షలు నిర్వహిస్తే- ప్రభుత్వ పాఠశాలలు, కళాశాలలు, ప్రభుత్వ గుర్తింపు పొందిన సంస్థలలోని బోధనావరమైన పోస్టులలో కేవలం 'ఆంధ్రనాట్యం' విద్యార్థులే నియామకమై స్థిరపడే ప్రమాదం వుందని కూడా ఆమె రిట్‌లో పేర్కొన్నారు.

స్వప్నసుందరి వాదంతో విద్యాశాఖ ఉన్నతాధికార వర్గాలవారు విశ్వవిద్యాలయ యాజమాన్యంపై తీవ్రమైన ఒత్తిడి తేవడంతో కోర్టు నుంచి ఎలాంటి ఉత్తర్వు లేదా సూచన లేకుండానే మరునాడు పరీక్షలు జరుగనుండగా అనాలోచితంగా నిరవధికంగా 'ఆంధ్రనాట్యం' పరీక్షలను వాయిదా వేశారు. ఇదిలా వుండగా - ఆంధ్ర ఆలయ నర్తకి మణి, అధ్యాత్మ రామాయణ కీర్తనల అభినయంలో తనకు తానే సాటి అయిన ఎనభై సంవత్సరాల లాస్యమూర్తి సరిదె మాణిక్యమ్మ, తదితరులు విశ్వవిద్యాలయం అర్ధాంతరంగా పరీక్షలు వాయిదా వేస్తూ తీసుకున్న నిర్ణయాన్ని సవాల్ చేస్తూ రిట్ దాఖలు చేయడం జరిగింది. దీనిపై పరీక్షలు నెల రోజుల్లో నిర్వహించవలసిందిగా మధ్యంతర ఆదేశాలు న్యాయమూర్తి ఇవ్వడమే కాకుండా - పాఠ్యాంశాలలో ఎటువంటి మార్పులు చేర్పులు లేకుండా 'ఆంధ్రనాట్యం' పరీక్షలు నిర్వహించాలని, ఇప్పటికే పరీక్షకు హాజరు కావడానికి నమోదు చేసుకున్న విద్యార్థులందరినీ అనుమతించాలని ఆదేశించారు. అంతేకాకుండా, పరీక్షలను అర్ధాంతరంగా వాయిదా వేసిన తెలుగు విశ్వవిద్యాలయం వైఖరిని కూడా న్యాయమూర్తి అభిశంసించారు. ఇందుకు విశ్వవిద్యాలయ అధికారులపై కఠిన చర్యలు తీసుకోవడానికి ఒక షోకాజ్ నోటీసు ఎందుకు జారీ చేయరాదని న్యాయమూర్తి ప్రశ్నించారు.

ఇదిలా వుండగా - సుమారు పాతిక, ముప్పై సంవత్సరాలుగా 'ఆంధ్రనాట్య' పునరుద్ధరణకు, ప్రచారానికి అవిరళ కృషి చేస్తున్న నాట్యాచార్యుడు, పరిశోధకుడు శ్రీ నటరాజ రామకృష్ణ "ఆంధ్రనాట్యం"గురించి అనవసర వివాదాలు

లేవనెత్తేవారు ఆ నాట్యం పూర్వాపరాలు తెలుసుకోవలసి వుంటుం"దని 'ఆంధ్రజ్యోతి' ప్రతినిధితో అన్నారు. 'పేరిణి తాండవం' లాంటి ఉద్ధత నృత్యాన్ని సైతం పునరుద్ధరించిన కళాతపస్వి ఆయన.

స్త్రీల లాస్య నర్తనాన్ని పూర్వం కేళిక, కర్నాటకం, కచేరీ ఆట, దర్బారు ఆట, సట్టువమేళం, చిన్న మేళం లేక మేజువాని అనేవారు. తమిళ దేశంలో కూడా ఈ పేర్లు ప్రచారంలో వుండేవి కాని, ప్రత్యేకంగా తమిళులు పూర్వం దీనిని సాదిర్, దాసి ఆట లేక చిన్నమేళం అని సామాన్యంగా వ్యవహరించేవారు. అయితే, ప్రచారం నిమిత్తమై తమ లాస్య నర్తనానికి 'భరతనాట్యం' అన్న పేరును శ్రీమతి రుక్మిణీ దేవి అరండేల్ కృషితో పెట్టుకోగలిగారు. ఇలాగే ఆంధ్ర దేశ నృత్య కళాకారులు, కళావేత్తలు, పండితులు, విద్వాంసులు, వృద్ధ నాట్య కళామూర్తులు రాజమండ్రిలో 1970 లో నిర్వహించిన అభినయ సదస్సులో లాస్య నర్తనానికి 'ఆంధ్ర నాట్యం' అనే పేరును ఖరారు చేశారు. ఇది ఒక వ్యక్తి పెట్టిన పేరు కాదు. బౌద్ధ ఆరామాల్లో, జైన మందిరాల్లో, శైవ, వీరశైవ, వైష్ణవ, వీరవైష్ణవ, గోపదేవ ఆలయాల్లో, ద్రైవ పూజల్లో నర్తనమాడి తరించిన ఆంధ్ర లాస్య రీతిని, ఆ కళా వికాసానికి, ప్రకాశానికి ప్రతిక్షణం తపించిన భారత కళాప్రపూర్ణ అన్నాబత్తుల బులివెంకటరత్నం ఇచ్చిన స్ఫూర్తితో కళాకారులంతా సమష్టిగా ఆలోచించి నిర్ణయించిన పేరు ఆంధ్రనాట్యం' అని శ్రీ నటరాజ రామకృష్ణ చెప్పారు.

ఆంధ్రుల నాట్యంలో సశాస్త్రీయమైన నాట్యాలు, జానపద నృత్యాలు, గిరిజన నర్తనలు మొదలైనవన్నీ వుంటాయి. కాని 'ఆంధ్రనాట్యం' అంటే ఆంధ్రదేశంలోని స్త్రీల లాస్య నర్తనం మాత్రమే అన్న భావంతో ఆనాటి సమావేశం ఎంపిక చేసి, నిర్ణయించిన పేరుగా ఆయన పేర్కొన్నారు 'ఆంధ్రనాట్యం' అన్న పదం జాతి వాచకం కాదు, గుణవాచకంగా గుర్తించాలన్నారు.

ఆంధ్రుల లాస్య నర్తనం పూర్వం మూడు రీతుల్లో విలసిల్లింది: 1) ఆలయ నృత్య సంప్రదాయం. ఆగమ శాస్త్రాలైన శైవం, వైఖానసం, పాంచరాత్రా లనుసారంగ దేవునికి నృత్య పూజ చేసే సంప్రదాయం ఇది. 2) ఆస్థాన నృత్య సంప్రదాయం. దేవుని ఆస్థానంలోను, రాజుల ఆస్థానాలలోను చేసే కేళిక సంప్రదాయం ఇది. 3) ప్రాచీన సంప్రదాయం. సామాన్య ప్రజల కోసం పారిజాతాలు మొదలైనవాటిని ప్రదర్శించే సంప్రదాయం. ఈ మూడు సంప్రదాయాల సమ్మేళనమే నేటి 'ఆంధ్రనాట్యం' అని శ్రీ నటరాజ రామకృష్ణ వివరించారు. 'పూర్వం ఈ మూడు రీతుల్నీ వేర్వేరుగా కొన్ని గంటల సేపు ప్రదర్శించేవారు. నేటి కాలమాన పరిస్థితులనుబట్టి ఈ మూడింటిని మూడు గంటల లోపున ప్రదర్శించాలి గనుక అందుకు తగినట్టుగా మేము రూపొందించి ప్రదర్శిస్తున్నాము, ప్రచారం చేస్తున్నాము, నేర్పుతున్నాము' అని అన్నారు.

'ఆగమాది శాస్త్రానుసారం ఆలయ నృత్యాలను కీర్తిశేషులు నాయుడుపేట రాజమ్మగారి వద్ద శ్రీకాళహస్తిలో నేర్చుకున్నాను. ఆమె శ్రీకాళహస్తీశ్వరాలయంలో నృత్య పూజ చేసేవారు. ఆమె వద్దనే ఆస్థాన కేళికను సైతం అభ్యసించాను. కీర్తిశేషులు పెండ్యాల సత్యభామ వద్ద స్త్రీలు ప్రదర్శించే నవజనార్దన పారిజాత ప్రబంధ నాట్యాన్ని నేర్చుకున్నాను' అన్నారు. 'ఈ మూడు రీతులు నాకు క్షుణ్ణంగా వచ్చును కనుకనే ఈ మూడురీతులు గల 'ఆంధ్రనాట్యా'నికి ఒక సంక్షిప్త రూపాన్ని ఇవ్వగలిగాను. ఆంధ్రనాట్యాన్ని ఈవిధంగా రూపొందించేముందు అనేకమంది నర్తకీమణులతో సంప్రదించాను' అని పేర్కొన్నారు.

పోతే - రాజమండ్రిలో 'అభినయ సదస్సు' జరిగినప్పుడే సుమారు పదిమంది కళాకారులు గల కమిటీ ఆంధ్ర నాట్యానికి ఒక సిలబస్ తయారు చేసిందన్నారు. అయితే, వారిలో చాలామంది గతించినందున ఈ సిలబస్‌కు తుదిరూపం ఇవ్వడానికి తాను ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ అధ్యక్షునిగా ఉన్న కాలంలో భరత కళాప్రపూర్ణ కోరాడ నరసింహారావు ఆధ్వర్యంలో ఒక కమిటీ వేసినట్టు చెప్పారు. శ్రీమతి సరిదె మాణిక్యమ్మ (బల్లిపాడు, దేవాలయం ఆలయనృత్యం), శ్రీమతి దుగ్గిరాల జగదాంబ (మండపేట, అభినయం), శ్రీమతి జంపా ముత్యం (విజయనగర సంస్థానం ఆస్థాన

నర్తనం), చింతా నచిగణిరాజు (కలాపం) ఈ సిలబస్ తయారీలో సహకరించారని చెప్పారు. ఈ సిలబస్‌ను 1982 లో ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ ఆమోదించింది. 1970 లో వృద్ధ కళాకారులు ఆంధ్రుల నాట్య నర్తనానికి పెట్టిన 'ఆంధ్ర నాట్యం' అన్న పేరును కూడా నృత్య అకాడమీ ఆమోదించిందన్నారు. తర్వాత రాష్ట్ర ప్రభుత్వం అకాడమీని తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం చేసింది. పిదప - డాక్టర్ సి. నారాయణరెడ్డి విశ్వవిద్యాలయం వైస్. ఛాన్సలర్‌గా, శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు డీన్‌గా వుండగా - ఒక ప్రత్యేక సిలబస్ కమిటీ ఏర్పాటు చేశారు. అందులో తనతోపాటు డాక్టర్ పి.ఎస్.ఆర్. అప్పారావు, ప్రొఫెసర్ నాగభూషణ శర్మ, శ్రీమతి ఉమా రామారావు, కళాకృష్ణ, పేరిణి రమేష్‌లు సభ్యులుగా వుండి మరొక సిలబస్‌ను ఆంధ్ర నాట్యానికి తయారుచేసి ఇచ్చామన్నారు. ఈ సిలబస్‌ను 1993 జులై 24వ తేదీన జరిగిన స్టాండింగ్ కమిటీకి నివేదించడం జరిగింది. స్టాండింగ్ కమిటీ ఈ సిలబస్‌పై నిపుణుల అభిప్రాయాలు తెప్పించాలని సూచించింది. స్టాండింగ్ కమిటీ తీర్మానం మేరకు వైస్ ఛాన్సలర్ అనుమతితో ముగ్గురు నిపుణులకు అభిప్రాయం కోసం పంపించగా, సిలబస్ బాగున్నదని, ప్రభుత్వ సంగీత, నృత్య పాఠశాలలు, కళాశాలలద్వారా పబ్లిక్ పరీక్షలకు హాజరయ్యే ప్రైవేటు విద్యార్థులకు ఈ సిలబస్ అమలు పరచవచ్చునని ఆ ముగ్గురు నిపుణులు తెలిపారన్నారు. ఈ మేరకు 1994 మార్చి 24 న జరిగిన అకడమిక్ సెనేట్‌లో ఆంధ్ర నాట్యం సర్టిఫికెట్, డిప్లొమా కోర్సుల సిలబస్ ఆమోదించడం జరిగిందన్నారు.

అంచెలంచెలుగా పాతిక సంవత్సరాల కాలంలో 'ఆంధ్రనాట్యా'న్ని గుర్తించడానికి తీసుకున్న చర్యలపై ఈ మధ్య కొందరు దుష్ప్రచారం చేయడం ఎంతమాత్రం తగదన్నారు. ఇదేదో తాను రూపొందించిన ఆంధ్రనాట్య మనే భ్రమతో 'విలాసిని' నాట్య ప్రచారకురాలు వుండడం భావ్యం కాదు, అనాదిగా ఆంధ్రదేశంలో ప్రచారంలో వున్న లాస్య నర్తన సంక్షిప్త రూపమే ఈ 'ఆంధ్రనాట్యం' అని గమనించాలని శ్రీ నటరాజ రామకృష్ణ నొక్కిచెప్పారు. అనవసర వివాదాలను లేవనెత్తి ఆంధ్రనాట్య వికాసానికి భంగం కలిగించకూడదని ఆయన విజ్ఞప్తి చేశారు. అసలు విషయం తెలుసుకోకుండా మిడిమిడి జ్ఞానంతో తొందరపడి చేసే ప్రకటనలు 'ఆంధ్రనాట్య' కళకు మేలుకన్నా కీడు చేస్తాయని ఆయన హెచ్చరించారు.

మానేపల్లి, మురమండ, దువ్వ, ఇరగవరం, ముమ్మిడివరం, తాటిపాక ఇత్యాది చోట్ల ఈనాటికీమిగిలి, ఆర్థికంగా దెబ్బతిన్న వృద్ధ కళాకారులకు కేంద్ర అకాడమీ నుంచి పెన్షన్ ఇప్పిస్తానని నమ్మించి శ్రీమతి స్వప్నసుందరి వారి సంతకాలు తీసుకుని, తాను వేసిన రిట్‌లో జత చేసిందని ఆయన ఆరోపించారు తాము ఇటీవల స్వప్నసుందరి 'విలాసిని నర్తనాన్ని' వారు బలపరచిన అంశం వారి దృష్టికి తెచ్చినప్పుడు వారు ఈ విషయం చెప్పారన్నారు. బల్లిపాడు దేవుని ఆరాధనలో మూడు తరాలు పాల్గొని తన జన్మ సార్థకం చేసుకున్న వృద్ధ నర్తకి 'ఆంధ్రనాట్యం' పరీక్షలను వెంటనే నిర్వహించాలని రిట్ వేసిన - సరిదె మాణిక్యమ్మ - అంతరించిపోయిన దేవదాసి వ్యవస్థను గుర్తుకు తెచ్చేవిధంగా ఆలయ లాస్య నర్తన బాణీకి తిరిగి 'విలాసిని నృత్యం' అని నామకరణం చేయడంపట్ల తీవ్రంగా అభ్యంతరం తెలిపారు.

—టి.యు.

(ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం- 18-6-95)

